# కావ్యాలహరి

ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి

## ఉపన్యాసములు

ప్ర చు ర ణ :




రిజిష్టర్డు సంఖ్య : 1/64

# యువభారతి

ఆంధ్ర సారస్వత పరిషత్, తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.

# KAVYALAHARI

A Collection of Lectures Delivered by
Prof. **DIVAKARLA VENKATAVADHANI,** Retired
Head. Department of Telugu, Osmania University
On Seven of the most Popular Telugu Classics.



**యువభారతి**

ప్రచురణ: 6

ప్రథమ ముద్రణ :
**11,500 ప్రతులు (సెప్టెంబరు, 02, 1971)**

ద్వితీయ ముద్రణ :
**2,200 ప్రతులు (డిసెంబరు, 12, 1981)**

తృతీయ ముద్రణ :
**500 ప్రతులు (ఆగస్టు,16, 2014)**

ముఖపత్ర రచన మరియు అక్షరాలంకరణ :
**శ్రీ శీలా వీర్రాజు**

ముద్రణ :
**ధరణీ ప్రింటర్స్, ఖైరతాబాద్, హైదరాబాద్.**
ఫోన్: 040-23302327

ప్రతులకు :
**యువభారతి**
ఆంధ్రసారస్వత పరిషత్, తిలక్‌రోడ్డు,
హైదరాబాదు-500 001.

**వెల : రూ.150/-**

## యువభారతి స్వర్ణోత్సవ ప్రచురణ

# కావ్యలహరి

## విషయానుక్రమణిక

# మా మాట

మాతృభాషాభిమానం కలగాలంటే మాతృభాషా సాహిత్యపఠనమే ప్రథమకర్తవ్యం. తెలుగు ఎదలో తెలుగుదనం వెల్లువలా పారాలని, తెలుగింటిలో తెలుగుదీపం అఖండంగా వెలగాలని, ఈ జాతి నిద్రలేచి మహోన్నత మానవాదర్శంవైపు నిరంతర కృషితో పయనం సాగించాలనే ధ్యేయంతో కృషిచేస్తున్నది **యువభారతి**.

తెలుగుజాతికి చెప్పుకోదగ్గ చరిత్ర, సంస్కృతి, సాహిత్యం ఉంది. తెలుగులోనున్న ప్రాచీన అర్వాచీన సాహిత్యాలను పరిచయం చేస్తూ, వాటిపై సమగ్ర అవగాహన కలిగించడానికి ఉడుతాభక్తిగా కార్యక్రమాలను నిర్వహిస్తోంది **యువభారతి**.

"చుట్టూరా ఆవరించుకునివున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోడంకంటే ప్రయత్నించి ఎంత చిన్నదీపాన్నైనా వెలిగించడం మంచిది". అన్న సూక్తి ఆలంబనగా 1963లో విజయదశమినాడు **యువభారతి** ఆవిర్భవించింది. ఇప్పటికి 50 సంవత్సరాలు పూర్తిచేసుకొని 51 వ వసంతంలోకి ప్రవేశించింది. ఇప్పటివరకు శ్రీ అనుముల కృష్ణమూర్తిగారి "**సరస్వతీ సాక్షాత్కారం**" మొదలుకొని "**ప్రభావం**" వరకు 181 పుస్తకాలను ప్రచురించింది.

పూజ్యులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు తెలుగు సాహిత్య సముద్రాన్ని ఆపోశన పట్టిన అపరకుంభసంభవులు వారి ధారణాశక్తి అపారమైనది. పండితులు, ఆచార్యులు, వక్త, వ్యాఖ్యాకర్త, సాహితీద్రష్ట, స్రష్ట, పరిశోధకులు, భాషాభిమాని, గురువులు, మహాత్ములు, వినయసంపన్నులు, సంస్కృతిపరులు, సమీక్షకులు, పీఠికాకారులు, కార్యకర్త అయిన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారిచే తెలుగు పంచకావ్యాలపై 1971లో ఉపన్యాసాలిప్పించి **కావ్యలహరి** గా ప్రచురించాము. తిరిగి 1981లో మరో రెండు ప్రబంధాలపై ఉపన్యాసాలిప్పించి **కావ్యలహరి** ని పునర్ముద్రించాము. ఆ ప్రతులు మొత్తం అనతి కాలంలోనే పాఠకులను చేరుకున్నాయి. పలువురు విద్యార్థులు, అధ్యాపకులు, సాహిత్యాభిమానులు, **కావ్యలహరి** ని పునర్ముద్రించవలసిందిగా పలు సందర్భాలలో కోరడంతో **యువభారతి** స్వర్ణోత్సవాల సందర్భంగా దీనిని పునర్ముద్రించి సాహిత్యాభిమానులకు అందుబాటులో ఉంచుతున్నాము. తెలుగు పాఠక లోకం దీనిని ఆదరిస్తుందని ఆశిస్తూ . . . . .

హైదరాబాద్.
16-08-2014

సదా మీ సేవలో
**మాడభూషి అనంతాచార్యులు**
అధ్యక్షుడు, యువభారతి,
సెల్ : 9290702328

# మరల ఇదేల.....

ఇంట్లో తెలుగే మాట్లాడుకుంటున్నా, మరి ఒకప్పుడు **'చదువు'** అంటే–తెలుగులోనే వేదపురాణ కావ్యఛందోలంకార కావ్య శాస్త్రాదులను నేర్చుకోవడంగా వుండేది. **'గ్రాంథిక భాష పరిజ్ఞానం'** వ్యవహారిక భాష వినిమయానికి దోహదపడింది. పల్లెటూరివాడయినా, **'పల్లెటూరిగబ్బిలాయ్'** గానే వుండిపోవాలని కోరుకోడు. తాను ఎదగడం అంటే, జీవనవికాసం పొందడం అంటే, భాషను అభివృద్ధి పరుచుకోవడం, భాష అభివ్యక్తిలో సంస్కారాన్నీ, ఉన్నతినీ సాధించడం అని నాడు భావించేవారు. వ్యావహారిక భాషావికాసానికి కృషిచేసిన పండితులైనా గ్రాంథికం **'పట్టు'**లు తెలియనివారేమీ కాదు!. భాష ప్రధానలక్ష్యం **'భాష వినిమయం'** కనుక, ఎక్కువమంది మాట్లాడుకునే భాషకే ప్రాముఖ్యం ఇవ్వడం ద్వారా, వివిధశాస్త్ర గత అంశాలను సైతం ఆ వ్యవహారభాషలోనే గ్రంథస్థం చేయడం వల్ల, అధికసంఖ్యాకులకు ఆ విషయపరిజ్ఞానం అందుబాటులోకి రాగలదనీ వారి భావన.

ఇవాళ **'తెలుగు'** – అంతరించిపోతున్న భాషల్లో చేరిపోతోందన్న ఆర్తి విస్తరిస్తోంది. నిజానికి భాష ఎన్నటికీ చావదు. ఆదానప్రదానాలతో పరిపుష్టం అవుతుంది. అయితే ఆ క్రమంలో తన మౌలికతను కోల్పోరాదన్నదే ప్రధానంగా గుర్తించవలసిన విషయం. ఆంగ్లేయుల రాకతో ఇంగ్లీషు భాష అనేదే **'చదువు'** గా, విద్యాధికులంటే ఆంగ్లం నేర్చినవారేననే ఒక స్థితి వారి పరిపాలనలో కల్పించారు. వారి దగ్గర పనిచేసే గుమస్తా ఉద్యోగాల పరికల్పనచేసి, ఆంగ్లవిద్యను అనివార్యంగా మార్చారు. నిజానికి మన భాషాసంపదలలోని గొప్పతనాన్ని వారు గ్రహించి, అవి వారికి అనుగుణంగా కొల్లగొన్నారు. దేశానికి స్వతంత్రంవచ్చి అరవైఏళ్ళయినా ఇంగ్లీషు భాష ప్రభావం తగ్గలేదు సరికదా, మరింతగా విస్తరించింది. ***"ఇంగ్లీష్ చదువుంటే తప్ప జీవనోపాధి లేదు. ఉద్యోగాలు దొరకవు"*** అన్న స్థితిని చేజేతులా మనమే పెంచిపోషించుకున్నాం. విదేశాల్లోనే కాదు, స్వదేశంలోనూ మనుగడకు ఆంగ్లం అనివార్యంగా మారిందంటే, దానికి స్వాతంత్ర్యానంతర మన **'విద్యావిధానాలే'** కారణం ! ఆంగ్లం అవసరమే. కానీ **'మాతృభాష'** ను పణంగా పెట్టే స్థితిని మనం కల్పించుకున్నట్లుగా, మరేదేశం వారూ వారి దేశాల్లో కల్పించుకున్నట్లుగా తోచదు. మనదేశం అతిపెద్ద ప్రజాస్వామ్యదేశమే కాదు, భిన్నభాషల సంగమం కూడాను. పాతికపైగా భాషలను రాజ్యాంగం గుర్తించింది. కానీ దేశంలో హిందీ తరువాత అత్యధికులు మాట్లాడే తెలుగుభాషకు కేంద్రస్థాయిలో ఆదరణ తక్కువ అంటే, సొంతరాష్ట్రంలో మనకు మనమే తెచ్చుకుంటున్న దుస్థితులే హేతువు. తెలుగు ఒక పాఠ్యాంశంగా తీసుకోకుండానే పాఠశాల విద్య, ఉన్నతవిద్య కూడా నిర్వర్తించుకునే స్థితి తెచ్చిపెట్టుకున్నాం. వివిధరంగాలలో జాతీయస్థాయిలో పేరొందిన తెలుగువారు కేవలం ఆ తెలుగు మాధ్యమం వల్లే ఖ్యాతి గడించినవారై కానరావడం తగ్గిపోయింది. కేంద్రసాహిత్య అకాడమీగానీ, జాతీయ చలనచిత్ర అవార్డుల సంఘంగానీ తెలుగుపట్ల కొంత **'శీతకన్ను'** వేసినట్లు

ద్యోతకమవుతుంది. తెలుగులో మాట్లాడడం ఈ తరంలో వున్నా-అందులో ఆంగ్లపదప్రయోగాలే ఎక్కువ. తెలుగువారిలో ఈ తరంలో చాలామంది తెలుగు వ్రాయనూ, చదవనూ రానివారిగా తయారైపోయారు. భాష అభివృద్ధి అంటే కేవలం వ్యవహారంలో, అంటే మాట్లాడడంలో వుండడం మాత్రమే కాజాలదు. మాట్లాడడం, చదవడం, వ్రాయడం, ఆలోచించడం, ఆచరణలో పెట్టడం అనే అయిదు విధాలుగానూ భాష విస్తరించాలి. తెలుగు మాట్లాడడం, తెలుగు చదవడం, తెలుగు వ్రాయడం, తెలుగులోనే ఆలోచించడం, తెలుగును ఆచరణలో పెట్టడం వచ్చినప్పుడే తెలుగు సజీవంగా వున్నట్లు. వీటిల్లో ఏ పార్శ్వంలోపించినా అది సమగ్రత కాదు. విద్యావిధానంలో ఈ అయిదింటిని గురించి శ్రద్ధవుండితీరాలి. అప్పుడే మాతృభాషగా తెలుగు నిలచి విస్తరించేది. ఉన్న తెలుగు పాఠ్యగ్రంథాలు కూడా పలుకుబడి, సిఫార్సులు, రిజర్వేషన్లు, రాజకీయాలపేరిట అందులోని పాఠ్యాంశాలు నిర్ణయించబడి, బోధనకు నిర్దేశితం అవుతున్నప్పుడు, క్రమంగా భాష స్థాయికూడా పలచబడుతున్న మాట వాస్తవం !

ఏ గ్రంథాలు చదివి, ప్రేరణపొంది, ఏ భాష మీద పట్టుసాధించి, తమ సృజనాత్మకతను వెల్లడించిన కవులూ, రచయితలూ వున్నారో వారి గ్రంథాలను పాఠ్యాంశాలుగా పెట్టవద్దనడం లేదు. కానీ వారి ఆ ప్రతిభాప్రాభవాలకు మూలాధారనాడి అయిన భాషాగ్రంథాలను ఇప్పటి వారు చదవనవసరం లేదనీ, ప్రాచీనసాహిత్య పఠనం అనవసరం అనీ కొందరు పెద్దలే అనడం సరికాదు. భాష పరిణామం చెందుతుంటుంది. అది సహజం. ***ఒక విశ్వనాథను, ఒక శ్రీశ్రీని, ఒక దాశరథిని, ఒక కాళోజీని*** ఇవాళ చదువుకుంటే చాలుననీ, వారు చదివిన **'చదువు'** ఇవాళ ఉపయుక్తం కాదనీ, ప్రవచించడం సరికాదు. ***విశ్వనాథవల్లనో, శ్రీశ్రీవల్లనో, దాశరథివల్లనో, కాళోజీవల్లనో*** ప్రభావితం అయి రాస్తున్న వారి స్థాయి రచనలూ, ఆ రచనలు మాత్రమే చదివి నేడు రాస్తున్న వారి స్థాయి రచనలూ పాఠ్యాంశాలుగా రూపొందుతూ మునుపటి రచయితలూ, వారి రచనలూ పనికిరాని పాత సరుకుగా త్రోసిరాజంటూ వుండడం వల్లనే, భాషస్థాయి క్రమేపి పలచబారుతోంది. భాషలో అభివ్యక్తి స్థాయి మందగిస్తోంది.

సగం అనర్థాలకు అసలు కారణం అపార్థాలు. ఆ అపార్థాలకు హేతువు-అనుకున్నది అనుకున్నట్లుగా అవతలివారికి అర్థమయ్యేలా చెప్పకపోవడం. ఆ అభివ్యక్తిలోపానికి ప్రధానకారణం భాషమీద సామర్థ్యం లేకపోవడమే. తెలుగుమాట్లాడేటప్పుడు భాషపై పట్టు, అభివ్యక్తి సామర్థ్యం వుండాలి. మాట్లాడడం వల్లే మనుషులు పరస్పరం కలసిజీవించడం అనే మనుగడ మౌలికంగా వుంటుంది. ఇప్పటికే ఉమ్మడికుటుంబాలు అంతరించిపోయి, **'కురచకుటుంబాలు'** వచ్చేసాయి. భార్యాభర్తలు ఇద్దరూ ఉద్యోగస్తులు కావడం, పిల్లలపట్ల వారి అవసరాలు తీర్చడమే తప్ప, సమష్టిగా అంతాకలిసి గడపగలిగే సమయాలు కుంచించుకోవడం వంటి పరిస్థితులు, కుటుంబసభ్యుల మధ్య సంభాషణలనూ తగ్గించేస్తున్నాయి. భావవినిమయం తగ్గి భాష అవసరమూ పరిసీమితమూ, కృతకమూ, యాంత్రికమూ అవుతోంది. ఇది మనం కల్పించుకుంటున్న స్థితియే. **'పుస్తకపఠనం'**

అంటే పిల్లలకు క్లాసు పుస్తకాలుగా మాత్రమే వుంటూ, పెద్దలకు అసలు గ్రంథపఠనమే అక్కర్లేదన్నట్లుగా **'టి.వి'** అనేది ఇళ్ళల్లో తిష్టవేశాక, పరిణామాలు మరింత **'ఆర్తి'** కలిగించేవిగా మారుతున్నాయి! అయితే భాష అంతరించిపోతుందన్న భయాలకు ఈ స్థితులే కారణం. వీటిని అధిగమించగలగడం మనకు కష్టమేమీకాదు. ఆ సంకల్పంవుండాలి అంతే ! మన భాషను, సాహిత్యాన్ని, మన సంస్కృతిని మనం ఇవాళ మరింతగా పరిరక్షించు కోవాల్సిన అవసరం ఏర్పడింది. ఆధునిక విద్యాభ్యాసాలు వేళ్ళకు బంగారు ఉంగరాలు సమకూరుస్తున్నాయి. కానీ, మణికట్టువద్ద నరాలనే బలహీనం చేస్తున్నాయి అంటాడు ఒక రచయిత. పునాదులను విస్మరించి, బహుళ అంతస్థుల భవనాలను నిర్మించడం అవివేకం ! సహజ ప్రకృతులను విస్మరించి, నాశనం చేసుకుని, కృత్రిమ సదుపాయాలతో సంపన్నమయ్యా మనుకోవడం మూర్ఖత్వం. స్వచ్ఛమైన గాలీ, నీరు పోగొట్టుకుని, కలుషితం చేసుకుని, ఏ.సీలు, మినరల్‌వాటర్ గొప్పస్థాయిగల జీవితం అనుకోవడం ఎంత విజ్ఞత? భాష, సాహిత్యాల విషయం కూడా అంతే !

ప్రాచీనసాహిత్యం పఠించనవసరంలే దనుకోవడం సరికాదు. అయితే అందులోని అన్ని అంశాలూ యథాతథంగా ఇవాళ స్వీకారయోగ్యాలు కావు. కానీ భాషపై పట్టు సాధించడానికీ, అభివ్యక్తిసామర్థ్యం పెంచుకోవడానికీ అవి ఎప్పటికీ ఉపయుక్తాలే. మూలాలను విస్మరించకూడదు. గతం నుండి అవగతం చేసుకోవాల్సింది ఎంతయినా వుంటుంది. ఆ అనుభవం మీదే వర్తమానంలో నిలబడి, భవిష్యత్తును రూపుదిద్దుకోగలుగుతాం. **'యువభారతి'** సమ్యక్‌దృష్టి కలిగిన సంస్థ. ***"పాతకొత్తల మేలుకలయిక క్రొమ్మెరుంగులు చిమ్మగా"...*** ఒక విలువల గల వ్యవస్థను. ఆశించి పురోగమిస్తున్న సంస్థ. అందుకై తనవంతు కర్తవ్యం అది ఎంత చిన్నదైనా, బాధ్యతగా, నిజాయితీతో, చిత్తశుద్ధితో అమలు పరుస్తున్న సంస్థ. ఒక సంస్థ యాభైసంవత్సరాలు మనగలగడం సామాన్యమైన సంగతేమీ కాదు. 1971లో ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారితో **'కావ్యలహరి'** ఉపన్యాసాలను ఇప్పించి, వాటిని గ్రంథస్థం చేసిన కాలంలో సంస్థ వైభవప్రాభవాలు తెలుగునేలంతటికీ తెలుసు. అప్పుడుగానీ ఇప్పుడుగానీ సంస్థ ఆర్థికంగా **'పుష్టి'** కలిగినది కాదు. ఆనాటికీ ఈ నాటికీ మార్పు అందరికీ తెలిసిందే ! **'మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలే'** అన్నభావన ఈ కాలంలో విస్తృతమవుతున్న సంగతీ తెలుసు. అయినా యువభారతి తన ఆశయసాధనలో వెనుకడుగువేయడం లేదు. ఏ విలువల కోసం, మానవజీవనవికాసం కోసం, సువ్యవస్థకోసం ఆరాటపడుతూ వచ్చిందో–అదే కర్తవ్యతాదీక్షతో, వనరులు తక్కువైనా, ప్రచారార్భటులు లేకుండానే **'యువభారతి'** ముందుకెడు తోంది. దానికి సహృదయుల ఆదరణే కారణం.

యువభారతి స్వర్ణోత్సవాల సందర్భంగా **'కావ్యలహరి'** పునర్ముద్రణను చేపట్టడం జరిగింది. కావ్యలహరి పరంపరలోనూ, ఆ తరువాత అవధానిగారు చేసిన మొత్తం ఏడు ఉపన్యాసాలు ఈ సంపుటిగా రూపొందాయి. ***శృంగారనైషధం, మనుచరిత్ర, పారిజాతాపహరణం, వసుచరిత్ర,***

***విజయవిలాసము, ఆముక్తమాల్యద, పాండురంగమాహాత్మ్యము*** అనే ప్రాచీనాంధ్ర అనర్ఘరత్నాలన దగిన ఏడుకావ్యాలను ఈ తరంవారికి అందించాలనే సంకల్పంతోనే ఈ ప్రచురణ. తెలుగు చదవనూ, వ్రాయనూ వచ్చిన ఈ తరం పాఠకులు, ఇవాళ ప్రధానంగా తెలుగు భాషాభిమానులైన ప్రవాస, విదేశాంధ్రులు కూడా సమ్యక్‌దృష్టితో గతవైభవాలను అందిపుచ్చుకోవాలనీ, మన భాషా సాహిత్యాలలోని ఆలోచనామృతమైన మధురమైన అంశాలను అందిపుచ్చుకోవాలనీ ఆకాంక్షిస్తు న్నారు. తెలుగుభాష, సాహిత్యాలు అజరామరమని మా విశ్వాసం, మునుపటివలె కాకపోవచ్చు, కానీ నేటితరం తెలుగు భాషాసాహిత్యాభిమానులకు కొదవేమీ లేదు. సంప్రదాయసారాన్నీ, సమకాలీన అవసరాల్నీ సమన్వయించి భవిష్యత్ రూపకల్పనకు వారికి ప్రాధేయంగా ఈ ప్రచురణ ఉపయుక్తం కాగలదన్న విశ్వాసం మాకుంది.  కావ్యలహరి వంటి ప్రచురణతో యువభారతి పొందేదేమిటి? అని ప్రశ్నించేవాళ్ళుంటే వుండవచ్చు. వాళ్ళకు భాస్కర శతకకారుని ఈ పద్యమే విన్నవించి నమస్కరిస్తాం....

**పండితులైన వారు దిగువం దగ నుండఁగ నల్పుఁడొక్కఁడు**
**దండతఁ బీఠమెక్కిన బుధప్రకరంబుల కేమి యెగ్గగున్**
**కొండొకకోఁతి చెట్టుకొన కొమ్మలనుండఁగ గ్రింద గండ భే**
**రుండ మదేభ సింహ నికురుంబము లుండవె చేరి భాస్కరా !**

హైదరాబాద్.
16-08-2014

సదా మీ
**సుధామ**
ప్రధానసంపాదకులు, యువభారతి

**"చుట్టూరా ఆవరించుకుని వున్న**
**చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం**
**కంటే ప్రయత్నించి ఎంత చిన్న**
**దీపాన్నయినా వెలిగించడం మంచిది"**

**అన్న వాక్యమే మా యువభారతికి ఊపిరిపోసింది.**

# అభివందనం

యువభారతి **'లహరి'** ఉపన్యాసమంజరి కార్యక్రమాలలో ప్రప్రథమమైనది కావ్యలహరి. యువభారతి తన అష్టమ వార్షికోత్సవాల సందర్భముగా 1971లో **'కావ్యలహరి'** పేరిట తెలుగులో పంచకావ్యాలుగా ప్రసిద్ధి చెందిన **'శృంగార నైషథం', 'మనుచరిత్ర', 'వసుచరిత్ర', 'పారిజాతాపహరణం', 'విజయవిలాసం'** కావ్యాలపై అలనాటి ఉస్మానియావిశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు, సుప్రసిద్ధకవి, విమర్శకుడు, మహావక్త అయిన ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారిచేత ఉపన్యాసాలనిప్పించి, ఆ ఉపన్యాసాలను గ్రంథస్థం చేసి ప్రచురణ పూర్వవిరాళంగా రూ॥2-00 అందించిన సాహిత్యాభిమానులందరికి అందచేసింది.

ఆ ఉపన్యాస పరంపరతో వచ్చిన స్ఫూర్తితో, ప్రోత్సాహంతో, ఇంతవరకూ దాదాపు ఇరవై **'లహరి'** ఉపన్యాసమంజరీ కార్యక్రమాలనేర్పాటు చేసి వాటిని గ్రంథాలుగా ప్రకటించింది. ఈ లహరీ పరంపరలో ప్రాచీన, అర్వాచీన కవుల వ్యక్తిత్వాలు, కావ్యాలు వివిధసాహితీ ప్రక్రియలు, ***రామాయణం, మహాభారతం, వేదాలు, ఉపనిషత్తులు*** వంటి అనేకానేక విషయాలు చోటుచేసుకున్నాయి. **'కావ్యలహరి'** ప్రచురించిన ఒక దశాబ్దం తరువాత అంటే 1981లో ఇదివరకటి పంచకావ్యాలకు తోడు **'పాండురంగమాహాత్మ్యం', 'ఆముక్త మాల్యద'** కావ్యాలపై ఉపన్యాసాలిప్పించి ఆ వ్యాసాలతో విస్తృతమైన 'కావ్యలహరి' ఉపన్యాసమంజరి గ్రంథాన్ని ప్రచురించడం జరిగింది.

ముఖపత్రాన్ని అందంగా అలంకరించిన మా గౌరవసభ్యులు **శ్రీ శీలా వీర్రాజు** గారికి మా కృతజ్ఞతలు. ఈ పుస్తకానికి ***డి.టి.పి.*** చేసిన మా సహాసమావేశకర్త **శ్రీ జీడిగుంట వెంకట్రావు** గారికి, తప్పుల సరిచేయుటలో సహకరించిన **ఆచార్య ఆర్.వసునందన్** మరియు ***డా॥ చిర్రావూరి శివరామకృష్ణ శర్మ*** గార్లకు మా ధన్యవాదములు. ఈ పుస్తక ముద్రణలో అన్ని విధాలుగా మాకు సహాకరించిన మిత్రులకు శ్రేయోభిలాషులకు మా హార్ధికాభివందనములు. అనతి కాలంలోనే పుస్తకాన్ని అందంగా అచ్చువేసి అందించిన ***'ధరణి ప్రింటర్స్'*** వారికి ప్రత్యేకించి అధినేత **శ్రీ ఎన్.వి.కుమార్** గారికి మా అభివాదాలు. యువభారతి కార్యక్రమాలను ప్రోత్సహిస్తూ పాలుపంచు కుంటున్న, సహకరిస్తున్న సహృదయులందరికి మా అభివందనాలు. మా ఈ ప్రయత్నాన్ని హర్షించి, ఇది వరలో వలెనే ఈ గ్రంథాన్ని ఆదరించి, ఆశీర్వదిస్తారని ఆశిస్తూ.....

హైదరాబాద్.
16-08-2014

భవదీయుడు
***అయల సోమయాజుల నాగేశ్వరరావు***
కార్యదర్శి, యువభారతి

# కావ్యలహరి - ప్రేరణ

## (మొదటి ముద్రణ)

చెమ్మగిలే కనులు బ్రతుకులోని కమ్మదనాలను చవిచూపిస్తాయి; చాటి చెప్పుతాయి. చెమ్మగిలటం అంటే స్పందించగలగటం. స్పందించటమంటే సజీవమైన చైతన్యాన్ని కలిగివుండటమన్నమాట. స్పందించగల చైతన్యం సహృదయమున్నప్పుడే ఉండగలుగుతంది; మనగలుగుతుంది. సహృదయం, సంస్కారం లేనిదేరాదు. చక్కని సంస్కారం అలవడటానికి వున్న అనేక మార్గాలలో సాహిత్య పఠనం ఒకటి.

సాహిత్యం మనస్సునాహ్లాదపరచేది మాత్రమేకాక విజ్ఞానపరిధులను విస్తృతపరచి, కొత్త ఆలోచనలను రేకెత్తించగలదిగా వుండాలి. ఒక తృప్తినిచ్చిన స్థితిలో నూతనసృష్టికి దోహదకారి కాగలిగినదై ఉండాలి. రకరకాల రచనలు ఉత్పత్తి అవుతున్న నేటికాలంలో, వాటి తారతమ్యాలను విచక్షణతో పరిశీలించి చక్కని సాహిత్యాన్ని స్వీకరించగల నేర్పు, ఓర్పు, తరిగిపోతున్న ఈతరుణంలో, అశాంతి, ఆందోళనల మధ్య, మనిషిలోని మానసిక బలహీనతలను రచ్చకీడ్చినట్లు రెచ్చగొట్టే రచనలకే, ఆదరణ, ప్రాచుర్యం, లభిస్తున్న ఈ రోజులలో, ఏది చదువదగ్గ రచనో, ఏది ప్రోత్సహించదగని రచనో, వివరించి చెప్పటం, నచ్చచెప్పటం కష్టమవుతుంది.

తెలుగుజాతికి చెప్పుకోదగ్గ చరిత్ర, సాహిత్యం, సంస్కృతి ఉన్నవి. నేటి యువతరానికి తీరిక తక్కువ. వారి ఆకర్షణను ఆకట్టుకునే వ్యాపకాలువేరు. తెలుసుకుందామన్న ఆరాటం లేక కావచ్చు, లేక ఒక నీరసభావం ఏర్పడి ఏ ప్రయత్నానికీ నాంది పలకలేని స్తబ్ధత ఆవరించుకొని ఉండడం కావచ్చు. గతం గురించి ఒక పరిచయంకానీ, సమగ్రావగాహన కానీ వారిలో అంతగా కనపడటం లేదు.

గతం గురించి సమగ్రావగాహన ఏర్పడిన తరువాతనే వర్తమానంలో సమ్యక్ దృష్టి అలవడుతుంది. ఈ సమ్యక్‌దృష్టి లోపిస్తే, భవిష్యత్తును సందర్శించడంగానీ తీర్చిదిద్దడానికి ప్రయత్నించడంగానీ సాధ్యం కానిపని. అనాదిగా మన్నన పొందిన విలువలు, తారుమారు కావడం వలన ఒక విచిత్రమైన అయోమయస్థితి కనపడుతున్నది. పాతనంతా విస్మరించడం రివాజయింది.

విచక్షణా శూన్యతతో పాతనంతా విస్మరించాలి అనడం తొందరపాటే అనక తప్పదు అలా తొందరపడి పాతనంతా విస్మరించడం రివాజుగా ఉన్న నేటి కాలంలో కొత్తగా ఏర్పడ్డ ఈ శూన్యంలో ఒక అయోమయస్థితి అవతరించడం వలన పునాదులు లేని నిర్మాణాలు, సమ్యక్‌దృష్టి లోపించిన ఆలోచనలు తరచు కానవస్తాయి.

ఈ ధోరణి ముఖ్యంగా సాహిత్య రంగంలో కనపడుతున్నది. భావప్రకటనకు భాష సాధనము. మరి ఆ సాధనము స్పష్టంగా, సుందరంగా, నిర్దుష్టంగా ఉండగల్గినపుడే భావాలు సజీవంగా హృదయాలను చూరగొంటాయి. కదలిన మనస్సులు మనుష్యులను కార్యోన్ముఖుల్ని చేస్తాయి. ఏ భాషైనా అమాంతంగా పుట్టదు; ఎక్కడినుండో ఊడిపడదు. మూగబాసలలోని మధురిమలను

పుణికి పుచ్చుకొన్న తొలి తరుణంనుండి, తరతరాల అనుభవాలు తనలో సంతరించుకొని, కొత్త భావాలు రంగరించుకొని, భాష ఎప్పటికప్పుడు మార్పులు చెందుతూ, తన సొగసులను పెంచుకొంటూ వుంటుంది. నిరంతరంగా సాగే ఈ మార్పులలోని మర్మాన్ని, తర్కాన్ని, అవగాహన చేసుకోవటానికి పరంపరాగతంగా మనకు అందుతూవున్న సారస్వతాన్ని తరచి చూడవలసిన అవసరం ఎంతైనా వున్నది. ఈ అవసరం రచనా వ్యాసంగంతో ప్రమేయం ఉన్న మేధావి వర్గానికే కాక, సామాన్య జనావళికి సైతం కలదు. మంచి ఎక్కడున్నా స్వీకరించాలనీ, ప్రక్రియ ఏదైనా మనస్సుకు హత్తుకునేట్లు చెప్పగలగటం దాని ప్రధాన లక్షణమని గమనించటం అవసరం.

జాతి దురదృష్టంకొద్దీ అవకాశవాదానికి ఆటపట్టుగా తయారైన కలుషిత రాజకీయ రంగంలోని కాలుష్యం సమాజంలోని ప్రతిరంగంలోకీ పాకింది. అరిచే నినాదాలకూ, అనుసరించే విధానాలకూ ఎక్కడా పొంతన కనపడదు. నిజాన్ని చూడనొల్లనివారితో ఏం వాదించినా లాభముండదు. చరిత్ర నేర్పిన పాఠాలనుండి గుణపాఠాలు నేర్చుకోనంతవరకూ ప్రగతి మార్గంలో ప్రయాణం శూన్యం. కేవలం విలువలను తారుమారు చేయటమే అభ్యుదయమని భావించే భ్రాంతిలోనున్న వారి సంఖ్య నానాటికీ పెరుగుతున్నప్పుడు జనం ఇకనైనా మేల్కొనాలి. మగతనిద్రమాని, మత్తుని వదలి, బాధ్యతలను స్వీకరించాలి.

ఒకరిని ప్రేమించటమంటే, తప్పనిసరిగా మరొకరిని ద్వేషించాలనే అభిప్రాయం,సామాన్య తర్కం ముందుసైతం నిలువదు. ఛందస్సు నడుం విరగ్గొట్టి, సర్పపరిష్వంగాలనుండి వెలువడి, అంతకు పదింతలు పసందుగా, వచనంలో కవనం చెప్పి, మనస్సుల్ని ఆకట్టుకుంటే–అది నిజంగా, మనఃస్ఫూర్తిగా, ఆహ్వానించదగ్గ పరిణామమే. ఆనందపూరితమైన ఈ ఆహ్వానాన్ని, ప్రాచీన పద్ధతులను నేలమట్టం చేయడానికి ప్రోత్సాహంగా భావించకూడదు. పద్యం వ్రాయనని ఒట్టు పెట్టుకుంటే బాధలేదు. కానీ, పద్యం చదవననీ, పద్యమున్న పుస్తకం పాతిపెడతాననీ–అనే వివేకం నశించిన ఆవేశపూరిత సంరంభం కొత్తదారికాదు. "అది తప్పుదారి" అనక తప్పదు.

ఒక చిత్రమైన పరిస్థితి ఏమిటంటే–భాషతో, భాషకు పునాదులనదగిన ప్రాచీన సాహిత్యంతో సన్నిహిత పరిచయ భాగ్యమున్న కొందరు పెద్దలే, ఈ తొందరపాటు తప్పుదారికి తాళం వేస్తూ, ప్రోత్సహిస్తూ, అనర్థదాయకమైన ఒక పరిణామాన్ని అరికట్టే బదులు, అదే నాగరికత అనుకొని ప్రేరేపిస్తున్నారు. పరమతసహనం సాధించమని ఒక ప్రక్క బోధిస్తూ, ఒక భాషలోని ప్రాచీన సాహిత్యాన్ని ద్వేషించమనటం సమర్థనీయమెలా అవుతుంది?

అనుదినం రూపొందుతున్న పరిణామాలను అవగాహన చేసుకునే శక్తి, ఆసక్తి, ప్రజాబాహుళ్యానికి లోపిస్తున్నదేమో అనిపిస్తున్నది. ఆఖరికి ఆశ్చర్యపడే శక్తికూడా పోగొట్టుకొని తారుమారైన విలువలను సృష్టిస్తున్న అసహజ పరిణామాలన్నీ అతిసహజ పరిణామాలని అంగీకరించే ఒక నీరస స్థితికి, అసహాయపరిస్థితికి, యువతకూడా దిగజారటం విచారించదగ్గ విషయం. ఏ వ్యవస్థనూ ఖాతరు చెయ్యక, అస్తవ్యస్త పరిస్థితే అతిసహజమైన స్థితి అనే ఆలోచన, జనుల ఆకర్షణను ఆకట్టుకుంటోంది. కనీసపు విలువల్ని సైతం ఖాతరు చెయ్యని ఆవేశం, ఉద్రేకం, చోటుచేసుకుంటున్న మనఃస్థితిలో, సమగ్రావగాహన లోపించటంవల్ల సమ్యక్దృష్టి లోపించిన

ఆలోచనలు కానవస్తాయి. చెడుని విస్మరించి, మంచిని స్మరించి సంరక్షించుకోవటం యోగ్యతకు లక్షణం. ద్వేషం పునాదిగాగల ఆలోచనలు నిర్మాణాత్మక కార్యక్రమాలకు పునాదులుగా పనికిరావు. మార్పు, ప్రగతికోసం కాక, మార్పుకోసమే అయితే అలాంటి మార్పు అవాంఛనీయమే కాదు అనర్థదాయకం కూడా అవుతుంది. కాలం సంతరించి పెట్టిన అనుభవాన్ని తన జీవితపుటను భవాలతో రంగరించగా ఏర్పడిన విలువల సమగ్రావగాహన ద్వారా ఏర్పడిన సమ్యక్‌దృష్టి, నేడు అత్యంతావశ్యకము. కాలం సంపాదించిన సాహిత్యాన్ని 'నిధి' వలె, 'పెన్నిధి' వలె సంరక్షించుకొని, ఆధునికావసరాల సిద్ధికి వినియోగించుకొనే నేర్పు, ఓర్పు అలవర్చుకోవాలి.

విలువలు వడివడిగా మారుతున్న ఈ రోజుల్లో, జాతిని ప్రగతిమార్గంలో పయనించేటట్లు చేయవలసిన మేధావివర్గానికీ, యువతకీ కూడా హక్కులు గుర్తున్నంతగా బాధ్యతలు గుర్తుకురాని ఈ రోజుల్లో, ఒక అంచనా కడదామనీ, కాస్తయినా కనువిప్పు కలిగించాలనీ, మేము గత సంవత్సరం నిర్వహించిన "విలువలు-బాధ్యతలు-దృక్పథాలు" అన్న గోష్ఠి, మాకిచ్చిన ప్రేరణ "జీవితంపట్ల సమ్యక్‌దృష్టి ఏర్పడటానికి ప్రాతిపదికగా సాహిత్యంపట్ల సహనం అవసరం" అని. ప్రాచీన కావ్యాలతో పరిచయం కలిగించే ఉద్దేశ్యంతో, మంచి ఎక్కడున్నా-మనసారా స్వీకరించేందుకు సంసిద్ధులమై వుండటమే "ప్రగతికి మొదటి పునాదిరాయి" అన్న వూహతో ఈ కార్యక్రమాన్ని స్వీకరించాము.

"మన చుట్టూరా ఆవరించుకొనివున్న చీకటిని వూరికే తిట్టుకుంటూ కూర్చోవటం కంటే, ప్రయత్నించి ఎంత చిన్నదీపాన్నయినా వెలిగించటం మంచిది" అన్న వాక్యంలోని వాస్తవమే మా యువభారతికి పోసిన ఊపిరితో, ఉడుతాభక్తిగా ఈ కార్యక్రమాన్ని తలపెట్టాము.

యువభారతి అష్టమవార్షికోత్సవ కార్యక్రమంగా 'కావ్యలహరి' ప్రణాళికను రూపొందించాము. అధికులచే అవుననిపించుకొన్న అయిదు ప్రాచీన కావ్యాలపై పక్షంరోజులకొక సమావేశం ఏర్పాటు చేశాం. "శృంగార నైషధము, మనుచరిత్రము, పారాజాతాపహరణము, వసుచరిత్రము, విజయవిలాసము" కావ్యాలను ఎన్నిక చేశాం.కేవలం ఉపన్యాసాలు ఏర్పాటు చెయ్యటమేగాక ఆ ఉపన్యాసాలు పుస్తక రూపంలో అవతరించినప్పుడే, మాకృషికి ఒక నిదర్శనం, సాఫల్యం, చేకూరుతాయని నిశ్చయించాము. "ఈ కావ్యంలోని ఈ పద్యం, ప్రతి తెలుగువాడికీ తెలిసిఉండాలి" అనిపించే పద్యాలు, రసవత్తర సన్నివేశాల కూర్పుగా, సాధారణ పరిచయం వున్న సామాన్యుడిని దృష్టిలో పెట్టుకొని ప్రత్యేకంగా వ్రాయబడినప్పుడే, తీరిక తక్కువగా వున్న తరానికి, సాహిత్య పఠనాభిలాష ఏర్పడుతుందని భావించాం.

అంటే... అటు జనాన్ని ఆకట్టుకునే అనర్గళవాక్చాతుర్యంతోపాటు, ఏ భావమూ జారిపోకుండా ప్రతి అందాన్నీ పొదివి పుచ్చుకునే పద్ధతిలో కలం నడుపగల్గిన పాండిత్యమూ, ఈ రెంటికీ మించి, కార్యక్రమంలోని సదుద్దేశ్యాన్ని గ్రహించి తోడ్పడగలిగే సహృదయమూ కల ఒక వ్యక్తి మాకవసరమయ్యారు. అరుదుగా లభించే ఈ ప్రత్యేక ప్రతిభలు మాకు కావలసిన పాళ్ళలో కల వ్యక్తికై మేము అన్వేషణ జరిపి, యువభారతి మిత్రుల అభిప్రాయాన్ని కూడా స్వీకరించి, ఏకగ్రీవంగా తీర్మానించాము ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు దీనికి తగినవారని, వారిని మేం అభ్యర్థించిన వెంటనే వారు అంగీకరించటం మా యువభారతి భాగ్యంగా భావిస్తున్నాము.

వీలున్నంత ఎక్కువ మందికి, వీలైనంత తక్కువ వెలకు ఈ పుస్తకాన్ని అందించగల్గితే మా ఉద్దేశ్యం కొంతయినా నెరవేరుతుందని, ప్రచురణకు పూర్వం విరాళాలు సేకరించే పద్ధతినను సరించి, 11,500 ప్రతులను ప్రచురిస్తున్నాము. అటు కాగితం ధరా, ఇటు అచ్చుఖర్చు ధరా పోటీ పడ్డట్టు ఆకాశమంటుతున్న ఈ రోజులలో దాదాపు 240 పేజీల పుస్తకాన్ని 2 రూపాయల కందించబూనటం, సాహసంతోకూడుకొన్నపని' అని సన్నిహితులు హెచ్చరించినా సాహసించాము. సామాన్యుడిలో సాహిత్యపఠనాశక్తి కల్పించడం ధ్యేయంగా గల ఈ ప్రణాళిక క్రింద చేపట్టిన ఈ పుస్తకం వెల కూడా సామాన్యుడి కందుబాటులో వుండి తీరాలని రెండు రూపాయల విరాళమే నిర్ణయించాము. సహృదయుల సహకారం సమృద్ధిగా లభిస్తుందన్న మా నమ్మకమే మా పెట్టుబడి. అందరి అండదండలూ లభిస్తే "మంచిపనులు చవకగానే చేయవచ్చు" అని నిరూపించే భాగ్యం మా యువభారతికి లభిస్తుంది. ఈ గ్రంథావిష్కరణ నాటికి నాలుగు కావ్యాలపై ఉపన్యాసాలు జరిగినవి. ఆంధ్రసారస్వత పరిషత్ప్రాంగణ మంతా వేలమందిజనంతో కళకళలాడుతూ కనుపించింది. జంటనగరాలలో ఇలా వేలమంది సాహిత్య సమావేశాలకు హాజరై, గంటలతరబడి ప్రశాంతంగా ఉపన్యాసాన్ని వినటం అపూర్వమైన విషయంగా జనం చెప్పుకొన్నారు, పత్రికలు ఒప్పుకొన్నాయి. జనంలో నిద్రాణమైయున్న సాహిత్యాసక్తిని మేల్కొలుపటానికి యువభారతి కారణభూతకాగలగటం మా భాగ్యంగా భావిస్తున్నాం.

ఈ సమావేశాలు ఇంకా ముగియకముందే "మరి మిగిలిన కావ్యాల మాటేమిటి? వాటిపై ఉపన్యాసా లెప్పుడారంభిస్తున్నారు" అంటూ ప్రశ్నించిన సాహితీప్రియులూ, "మంచిపని చేస్తున్నారు. మీకు తప్పక విజయం కలుగుతుంది." అని వెన్నుతట్టిన సహృదయులూ, 'ఈ మంచి పనికి మనమూ చేతనైనంతగా సహకరిద్దా'మనుకొని, తమపనిగా భావించి, తమ సహాయ సహకారాల నందించిన కొందరు విశాల హృదయులూ మాకు తారసిల్లారు. యువభారతికిది అపూర్వానుభవం. ***ప్రథమ ముద్రణలో 11,500 ప్రతులు*** అచ్చు వేయగల్గుతున్నామని మేము గర్వపడటం లేదు. 'నాలుగున్నర కోట్ల పై చిలుకు తెలుగువారుండగా అందులో లక్షలాది ఆర్జనాపరులైన అక్షరాస్యులుండగా 11,500 ప్రతులేనా అచ్చువేయగల్గుతున్నదని సిగ్గుపడుతున్నాము. మెచ్చుకున్న వారితో పాటు తప్పు పట్టిన వారూ ఉన్నారు. జనాన్ని వెనక్కు నడిపిస్తున్నామనీ, చచ్చి, పుచ్చిపోయిన ప్రబంధాలను పలుకరిస్తున్నామనీ, జనం నుండి కళాత్మకంగా డబ్బు వసూలు చేసి మోసపుచ్చు తున్నామనీ, జాతికీ అభ్యుదయానికీ ద్రోహం తలపెట్టామనీ, ప్రగతికి ప్రతిబంధకంగా అయ్యామనీ, హెచ్చరించిన వారూ ఉన్నారు. మాకు సహృదయమూ, సహనమూ ఉన్నాయి. ఆ వర్గం మిత్రులకు దూరం నుండి సమస్కరించటం మినహా మరింకేమి చేయగలం?తెలుగుతల్లికి ఒక దివ్యమైన, నూత్నమణిహారాన్ని సమర్పించాలన్న మా యీ ప్రయత్నానికి అందరి ఆదరణా, మనఃపూర్వక సహకారమూ అందగలవన్న ఆశతో, నిరీక్షతో.

హైదరాబాద్.
05-09-1971

భవదీయుడు
**వంగపల్లి విశ్వనాథం**
సమావేశకర్త, యువభారతి

# మా గురించి

## (మొదటి ముద్రణ)

**"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకంటె ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది."** అన్న సూక్తిలోని యాథార్థ్యం మా ఊపిరి. మా ప్రయత్నం ఉడుతాభక్తి. ఒడ్డున ఉండి సముద్రాన్ని దాటలేమని అనుకుంటూ ఊరికే గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవడం కన్న మనస్సును దిటవుపరచుకొని మేధకు పదునుపెట్టి ఉద్యమించడం మేలు. అదే మా ధ్యేయం.నేటి యువతరం నిర్మాణాత్మకంగా ఆలోచించి తన భవిష్యత్తును ఉజ్జ్వలంగా తీర్చిదిద్దుకోవడానికి అనువైన వాతావరణం కల్పించాలనే మహత్వకాంక్షతో **'యువభారతి'** రూపొందింది. పందొమ్మిదివందల అరవైమూడు విజయదశమినాడు సాహితీప్రియులైన కొందఱు స్నేహితులు ఒక బృందంగా యేర్పడి **'యువభారతి'**ని అవతరింపజేశారు. సాహితీ స్నేహమే **'యువభారతి'**కి ప్రాణం, ధ్యేయం.

ప్రతి వ్యక్తిలోను అంతర్లీనంగా ఏదో ఒక ప్రతిభ ఉంది. ఆదరణ, అవకాశం, ప్రోత్సాహం లేక అది వెలికి రాక అవరోధాల తాకిడికి అణగారిపోవచ్చు. ఆ అవరోధాలను తొలగించి అతని పార్థక్యంలోని వైశిష్ట్యాన్ని వెలికి దీసి అతని ప్రతిభా సామర్థ్యాలు సామాజికోన్నతికి దోహదమయ్యే విధంగా తీర్చిదిద్దడం అవసరం. ఒక వ్యక్తి తన తీరిక సమయాన్ని వినియోగించుకునే తీరును బట్టి ఆ వ్యక్తి సంస్కారాన్ని అర్థం చేసుకోవచ్చు. **'యువభారతి'** యువతరంలో ఉత్తమ సాహిత్య పఠనాభిలాషను, సువచోరీతిని, రచనాసామర్థ్యాన్ని పెంపొందింపజేయడానికి గత ఎనిమిదేండ్లుగా యథోచితమైన కృషి చేస్తున్నది.

ప్రతి నెలలో మొదటి ఆదివారం, మూడో ఆదివారం మధ్యాహ్నం 2-30 గంటలకు హైదరాబాదు సుల్తాన్‌బజారులో శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషానిలయంలో యువభారతి నిర్వహిస్తున్న సాహిత్య సమావేశాలు పెద్ద ఎత్తులో కాకపోయినా పరిమితంగానైనా సాహిత్యాభిరుచిని ఉద్దీపింపచేయడానికి ప్రయత్నం చేస్తున్నవి.ప్రతి నెల మొదటి ఆదివారం ఉదయం 10 గం॥లకు ఆ గ్రంథాలయంలోనే యువభారతి వనితా విభాగం సాహిత్య సమావేశాలు నిర్వహిస్తున్నది.

## మా సాహిత్య కార్యక్రమాల సంక్షిప్త వివరణ

**పుస్తక చర్చ :** సాధారణంగా మనం చదివే పుస్తకాలు మనలను ప్రభావితం చేస్తూ ఉంటాయి. పుస్తకాలలోని ఔచిత్యాన్ని గ్రహించ గలిగే పాఠకులున్నప్పుడే ఉత్తమ సాహితీ సృష్టికి సరియైన అవకాశాలు లభిస్తాయి. ఈ పుస్తక చర్చ ఉత్తమ సాహిత్యాధ్యయనానికి మార్గదర్శకమౌతుందని మా ఆశయం. ఈ చర్చ ప్రతిమాసం జరుగుతుంది. చర్చకు ఎన్నుకున్న పుస్తకం ఒక నెల ముందుగా సభ్యులకు ఉచితంగా అందజేయబడుతుంది. సాహిత్యపఠనంలో ఉత్తమాభిరుచులను పెంపొందించి ప్రామాణికమైన విమర్శనాదృష్టిని అలవరింపజేయడం మా **'పుస్తకచర్చ'** ప్రధానలక్ష్యం.

**క్లుప్తగోష్ఠి :** భాష ఏదైనా భావవ్యక్తీకరణకు తోడ్పడాలి. కనీసం మన మాతృభాషలోనైనా మనం అందంగా, క్లుప్తంగా, స్పష్టంగా, నిర్భయంగా, ప్రయోజనాత్మకంగా మాట్లాడగలగాలి. అందుకే మా యీ క్లుప్తగోష్టి కార్యక్రమం–ఇచ్చిన విషయంపై రెండు నిముషాలలో సద్యఃస్ఫూర్తితో సమయనియమాన్ని అనుసరించి సమగ్రంగా సదస్యుల హృదయాలలో ముద్రితమయ్యేట్లు మాట్లాడడం అలవరచుకోవాలి. సభాకంపాన్ని పోగొట్టుకోవడానికి ఏర్పరచిన క్లుప్తగోష్ఠిలో అందరికీ తెలిసి అందుబాటులో వుండే విషయాలే వక్తవ్యాంశాలుగా ఉంటవి– ఈ కార్యక్రమం ఆలోచనాశక్తిని ప్రేరేపించి సముచిత వచోరీతిని పెంపొందించాలని మా అభిమతం. ఈ **'క్లుప్తగోష్ఠి'**లో సభాసదులకు నచ్చిన ఉత్తమవక్తకు ప్రోత్సాహ బహుమతి పుస్తకము రూపేణా ఇవ్వబడుతుంది.

**వక్తృత్వం :** ఉపన్యసించడం ఒక కళ. చక్కగా ఉపన్యసించగల్గడం వ్యక్తిత్వానికి విశిష్టత సంపాదించుకోవడమే. మొదలు తుది లేక లక్ష్యశుద్ధి లేక అస్తవ్యస్తముగా మాట్లాడటం ఉపన్యాసం అనిపించుకోదు. సభ్యులలో సముచిత వక్తృత్వ శక్తిని పెంపొందించడానికి ఒక కార్యక్రమం యువభారతి రూపొందించింది. సభ్యుడు తన కిష్టమైన విషయాన్ని గురించి సమగ్రంగా ఆలోచించి, ఐదు నిమిషాలపాటు ప్రసంగించవలసి ఉంటుంది. ఒక పక్షంరోజులముందే ప్రసంగించవలసిన సభ్యులు నిర్ణయింపబడుతారు. నాటక ప్రయోగం సామాజికులు లేనిదే సమగ్రంకానట్టు శ్రోతలు లేనిదే వక్తృత్వం సమగ్రం కాదు. శ్రోతలంటే కేవలం వినేవాళ్ళే కాదు. ప్రసంగాన్ని మనఃస్ఫూర్తిగా, సావధానంగా, సతర్కంగా వినగల్గేవాళ్ళు శ్రోతలు, వక్తలు పరస్పరాశ్రితులై వున్నప్పుడే ప్రసంగంలోని ఔచిత్య అనౌచిత్యాలను విశ్లేషించుకోగల్గుతారు. మా యీ వక్తృత్వ కార్యక్రమము ఈ ఆశయానికను గుణంగా వుండేట్లు ఉపన్యాసకళకు సంబంధించిన కొన్ని శాస్త్రీయమైన పద్ధతులను రూపొందిం చటానికి మా యువభారతి కృషి చేస్తున్నది.

**నా ఊహాపథంలో :** దైనందిన జీవితంలో తారసిల్లే సంఘటనలను గురించి గాని అప్పుడప్పుడు హృదయాన్ని కదలించిన భావాలకు గాని రచనారూపం కల్పించడమే ఈ కార్యక్రమలక్ష్యం. వాన, పూలు, ఫోటోలు, నిద్ర, అబద్దాలు, సంఘాలు, వెన్నెల, ఇంటర్వ్యూల వంటి విషయాలను ముందే ఎన్నుకొని సభ్యులకు ఒక పక్షంరోజులకు ముందే తెలియజేస్తాము. మూడు నిమిషాలకు మించకుండా, ప్రతి సభ్యుడు ఆ విషయాలపై పద్యమో, గద్యమో, గల్పికో, గేయమో, లేక తనకు నచ్చిన రీతిలో వ్రాసుకొని వచ్చి వినిపించవలసి ఉంటుంది. మనస్సుకుతట్టిన తలపులకు అక్షరరూపం కల్పించడానికి సభ్యులు ప్రయత్నం చేయాలి. రచనాకంపం వంటిది కొంతైనా తగ్గాలని సంస్థ ఆశయం.

**చర్చలు :** సారస్వత, సామాజిక, సాంస్కృతిక సమస్యలపై సభ్యులు అప్పుడప్పుడు చర్చిస్తారు. చర్చనీయాంశం ఒక పక్షం రోజులకు ముందుగానే ప్రకటింపబడుతుంది. సభ్యులు ఆయా సమస్యలకు వివరాలను సమీకరించుకునే అవకాశం కలిగించి, చర్చల వల్ల విషయపరిజ్ఞానం సమ్యక్‌దృష్టి అలవరచడం ఈ చర్చల లక్ష్యం.

**స్వీయరచనా పఠనం :** ప్రతి సమావేశంలో తమ తమ రచనలను సభ్యులు వినిపించి ప్రోత్సాహం పొందేందుకు ఈ కార్యక్రమం రూపొందించబడింది. సాధారణంగా జరుపబడే ఈ కార్యక్రమాలేకాక యువభారతి, కవితాగోష్ఠులను, నాటక ప్రయోగములను, చిత్రలేఖనా ప్రదర్శనాలను, విజ్ఞుల, సాహితీమర్మజ్ఞుల, కళాకోవిదుల ఉపన్యాసాలను; సాంస్కృతిక యాత్రలను, పుస్తక ప్రచురణలను, గోష్ఠులను నిర్వహిస్తున్నది.

## 'కావ్యలహరి' కార్యక్రమం ఈ వరుసలోనిదే.

**కొన్ని వివరాలు : 'యువభారతి'** తొలిదశలో **'యువభారతి'** అనే పేరున ఒక సైక్లోస్టైల్డ్ మాసపత్రికను ఒక సంవత్సరంపాటు 12 సంచికలు వెలువరించి సుమారు 1000 ప్రతుల దాకా సాహిత్యాభిమానులకు అందించింది. ధనాభావం వల్ల దానిని కొనసాగించలేక ఇటీవల కొందరికైనా అందాలని చిన్న యెత్తున లిఖితసమాస పత్రికను నిర్వహించింది.

ఉత్సాహవంతులైన నటులెందరో నాటక కళతో యువభారతి నారాధించారు. సాహిత్యాసక్తిని ఇతోధికంగా ఇనుమడింప జేయడానికి ప్రచురణకు పూర్వమే విరాళాలు స్వీకరించి శ్రీ అనుముల కృష్ణమూర్తిగారి **'సరస్వతీ సాక్షాత్కారం'** అనే కావ్యాన్ని, శ్రీకాళోజి తెనిగించిన ఖలీల్ జిబ్రాన్ The prophet (జీవనగీత)ను యువభారతి ప్రచురించింది. అయిదవ వార్షికోత్సవ సందర్భాన్ని పురస్కరించుకొని నలుగురు యువభారతి సభ్యుల కవితా సంకలనం **'వీచికలు'** ప్రచురణ జరిగినది. ఈ మధ్య కాలంలో వెలువడిన కవితా సంకలనాలలో అత్యధిక సమీక్షకులచే ఔననిపించుకొన్న మా యీ ప్రచురణ మాకు గర్వకారణం.

**పుస్తకపథకం :** మనలో పలువురికి పుస్తకాలు కొని చదివే అలవాటు తక్కువ. తక్కువ పెట్టుబడితో ఎక్కువ పుస్తకాలను న్యాయంగా ఆర్జించి పెట్టగలిగే పద్ధతిలో మేము పుస్తక పథకాన్ని రూపొందించి ఒక్క సంవత్సరం పాటు నిర్వహించినాము. తగిన ఆదరణ, సహకారం, లభించకపోవటం వల్ల ప్రస్తుతానికీ పథకం నిలిపివేసినాము. ఈ పుస్తక పథకం సభ్యులకు ప్రత్యేక ప్రచురణగా అయిదుగురు ప్రఖ్యాత కథకుల కథాసంపుటి **'పంచవటి'** ప్రచురించాం. పుస్తక పథకం నిర్వహణ నిమిత్తమై సోదరసంస్థ **'స్పందనసాహితి'** వారితో కలిసి శ్రీమతి డి. కామేశ్వరిగారి **"వానచినుకులు"** వెలువరించాం.

**విద్యార్థి రచయితలకు కథా రచనపోటీ (1970) :** విద్యార్థులలో సృజనాత్మక రచనాశక్తిని పెంపొందించే నిమిత్తం ప్రఖ్యాత ప్రచురణకర్తలు శ్రీ యం. శేషాచలం అండ్ కంపెనీవారితో అఖిలభారత స్థాయిలో తెలుగు విద్యార్థులందరికీ తెలుగులో కథా రచన పోటీ నిర్వహించాము. ప్రవేశరుసుము లేని ఈ పోటీకి నగదు పారితోషికాలే కాక పుస్తకరూపంలో ఉత్తమకథలకు బహుమతులనిచ్చి 1970 విజయదశమి (యువభారతి సప్తమ వార్షికోత్సవం నాడు) పదిహేను మన్నికయిన కథల సంపుటిగా "విద్యార్థి సాహితి-2"గా ఎమెస్కో పాకెట్‌బుక్‌గా వెలువరించాం.

సప్తమ వార్షికోత్సవ (1970) సందర్భంగా మా కార్యక్రమాల్లో ముఖ్యమయినదిగా **"మారుతున్న విలువలు-రచయితల బాధ్యతలు"** అనే విషయంపై ఒక గోష్ఠిని నిర్వహించాం. వడివడిగా

మారుతున్న ఈ కాలంలో మేధావివర్గానికి కూడా హక్కులు గుర్తున్నంతగా బాధ్యతలు గుర్తురాని ఈ రోజులలో, ఒక బేరీజు వేద్దామని, జాగ్రత్తగా అంచనా కడదామనీ కనీసం రానున్న తరానికైనా కాస్తయినా కనువిప్పు కలిగిద్దామనే అభిప్రాయంతో మేమీ గోష్ఠికి ఉద్యమించాం. ముప్పది ఏడుగురు ప్రముఖ సాహితీ స్రష్టల వ్యాసాలను ముందుగానే సేకరించి, **"రచన"** అనే పేరుతో ఒక సంపుటిగా ప్రచురించి గోష్ఠికి వచ్చే వారికి ఒక వారంరోజుల ముందే అందజేశాం. జంట నగరాల ఇరవై కళాశాలల నుంచి ప్రతినిధులు పాల్గొన్నారు. దాదాపు 400 మంది కళాశాలాధ్యాపకులు, విద్యార్థులు, రచయితలు, వివిధ రంగాలకు సంబంధించిన యువకులు ప్రతినిధులుగా పాల్గొన్న ఈ సదస్సు ఒక రోజంతా మూడు సమావేశాలుగా జరిగింది. విభిన్న దృక్కోణాలతో **"మారుతున్న విలువలు రచయితల బాధ్యతలు"** అనే విషయంపై వ్యాసాలను అందించి, చదివి, చర్చించిన వారిలో ప్రాచీనార్వాచీన సాహితీ సిద్ధాంతాలకు ప్రతినిధులైన రచయితలు పలువురు పాల్గొనడం ఈ గోష్ఠిలోని ఒక విశేషం. ప్రముఖ సాహిత్య మాసపత్రిక **'భారతి'** 70 అక్టోబర్‌లో, ప్రతి సాహితీ పరుడూ తప్పక చదువవలసిన వ్యాససంకలనం ఇదనీ, ఈ పుస్తకాన్ని చదవటం ఒక గుణమని చెప్పటమే కాదనీ, చదవకపోవడం ఒక లోపమనికూడా చెప్పవచ్చుననీ **"రచన"**ను సమీక్షిస్తూ పేర్కొన్నారు.

యువభారతి కృషి, కార్యక్రమాలు, సాహిత్య సాంస్కృతిక రంగాలకు పరిమితమైనవి. మానవుడి సంస్కారానికి గీటురాయి సంస్కృతీ ప్రియత్వమే కదా! సంస్కృతి నిగ్రహాన్ని నేర్పుతుంది. సృజనాత్మకశక్తికి దోహదమిస్తుంది. మానవుడు సంఘజీవి. సమాజవికాసానికి సామూహిక కృషి అవసరం. సామూహిక కృషికి మొదటి అవసరం సహృదయత. అది లేనినాడు అపస్వరాలు వినిపిస్తాయి.

ఇది యువభారతి కృషి స్థూలంగా వివరించాము. చైతన్యపూరితమైన ఆశయసాధనా సంరంభాన్ని జడమైన అచ్చుసిరా ద్వారా అందించగలగడం కష్టం. మాకృషి వెనుకనున్న చైతన్య స్రవంతిని సహృదయులు పోల్చుకోగలరని ఆశిస్తున్నాము.

హైదరాబాద్.
05-09-1971

**ఇరివెంటి కృష్ణమూర్తి**
అధ్యక్షుడు, యువభారతి

# ఎందరో మహానుభావులు ...

## (మొదటి ముద్రణ)

ఎంతచెప్పినా ఇంకేదో మిగిలిపోయినట్లు, ఎలా చెప్పుకున్నా అది ఆశించినట్లు కుదరక కృతజ్ఞతాభారంతో నిండిన ఎదపొరలనుండి ఆవిష్కరింపబడిన పదాలు నమ్రతతో రూపుదిద్దు కుంటున్నాయి.

కదలిన ప్రతిజల అలలాగా అందం ఒలికిస్తుంది. తన ఒంపు సొంపులతో లోన దాక్కున్న చైతన్యాన్ని కనబరుస్తుంది. మెదలిన ప్రతి ఆలోచనా మేధలో దాగివున్న చైతన్యాన్ని వెలువరిస్తుంది. కదిలే అలా, ఆలోచనాసరళి రెండూ అనంతం. కదలిన జలకు తక్షణమే రూపు సంతరించుకునే భాగ్యం వుంది. కానీ మెదలిన ప్రతి ఆలోచనా అక్షర రూపంలో సాక్షాత్కరించడానికి ఎక్కువ సమయం తీసుకుంటుంది. చల్ల చిలికితే వెన్న. మెదలిన ఆలోచన రూపుదాల్చితే వెలుగు. ఆ వెలుగు కార్యాచరణగా ప్రసరిస్తే మిన్న. అన్ని ఆలోచనలూ అక్షరాలకు అందవు. అలా అందినా అందంగా కార్యరూపం దాల్చవు. కార్యరూపం దాల్చిన కొన్ని శ్రీకారం దగ్గరే కుంటుపడుతాయి. చివరికంటా వెలుగును మిన్నగా నిలుపుకోగల్గిన ఆలోచన నిజంగా ధన్యం. ఆలోచనాలత బీజాకృతి దాల్చే అదృష్టమే అరుదు. అరుదైన అది తీగెగా సాగడమే మొదటి కష్టం. తీగెగా సాగిన తరువాత నిర్దుష్టమైన ప్రణాళికగా అల్లుకుపోవడం మరింత కష్టం. ఎంతటి తావివెదజల్లే తీగయైనా తన సుగంధాలు నలువైపులా వ్యాపింపజేయడానికి మలయమారుతంలాంటి సహృదయులు లభించడం అసలు కష్టం. ఇవన్నీలభించి తీగ పుష్పించిననాడు ఇవన్నీ ఫలించి పూలు విరగబూసిననాడు విత్తనం నాటిన తొలిక్షణాన మనస్సున మెదలిన ఆలోచనలకు లభించిన పూర్ణఫలం నేడు విరబూసినపూవు. కార్యరూపం దాల్చిన ఆలోచన శుభారంభపు అదృష్టాన్ని నోచుకొని సహృదయుల మనస్సులను దోచుకొని సఫలీకృతమవ్వడం ఎన్నో ఇబ్బందులతో కూడుకున్నపని. ఎందరి మనఃస్ఫూర్తి సహకారమో లభించకపోతే ఆ కదలిన జలకు అలరూపం వచ్చేది కాదు. బీజాకృతిలోని చైతన్యం పువ్వులు విరబూసి వుండేది కాదు. సకృత్తుగా ఎందరో సహృదయుల సహకారం లభించడం వల్లనే ఈ కార్యక్రమం సఫలీకృతమయింది. మనఃస్ఫూర్తిగా ధన్యవాదాలు తెల్పుకుందామని ఎదబరువులు దింపుకుందామని కృతజ్ఞతా భావవీచికలకు రూపాన్నిస్తున్నాము.

కార్యక్రమం ఇంకా ఆలోచనలస్థాయి దాటకముందు **"మంచిపనులకు సహాయ ప్రోత్సాహా లుంటాయి"** అని, మాట ఇచ్చి, మాట నిలుపుకున్న మాన్యులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార శాఖామాత్యులు, గౌరవనీయులు శ్రీ అక్కిరాజు వాసుదేవరావు గారికి మా హార్దిక కృతజ్ఞతాంజలులు.

**"కావ్యలహరి"** ఉపన్యాస మంజరికై ఆంధ్రసారస్వత పరిషత్ ఆవరణల నొసగుటయేకాక, తమ ఆవరణలో తాత్కాలిక కార్యాలయం ఏర్పరచడానికి అనుమతించి, మాకు నీడను, ప్రోత్సాహాన్ని ఇచ్చిన పెద్దలు, ఆంధ్రసారస్వత పరిషత్ ఉపాధ్యక్షులు, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఉత్తమ సాహిత్య పఠనాభిలాషను పెంపొందించడానికి మేము ఉద్యమించిన ఈ కార్యక్రమాన్ని సహృదయంతో అభిమానించి, **"సారసౌరభము"**ను అందించి, కావ్యలహరిని సురభిళితం చేసిన సుకవి మిత్రులు డా॥ సి. నారాయణరెడ్డి గారికి మా నమోవాకములు. కావ్యలహరి ఉపన్యాసమంజరి జయప్రదమయ్యేందుకు ప్రత్యక్షంగా పాలుపంచుకున్న పెద్దలు. ఆయా రోజుల్లో ఐదు సమావేశాలకూ, అధ్యక్షులుగానూ, ముఖ్యఅతిథులుగానూ విచ్చేసి, సభను సమర్థవంతంగా నిర్వహించిన సాహితీవేత్తలకు, మా మనఃపూర్వక కృతజ్ఞతాంజలులు. సాహిత్య సంబంధమైన అవసర మేర్పడినప్పుడు తగు సాహాయాన్నంద చేసిన పూజ్యులు డా॥ పాటిబండ మాధవశర్మ గారికి, డా॥ జి.వి.సుబ్రహ్మణ్యం గారికి మనఃపూర్వకాభి వందనములు.

సాహిత్యోపన్యాసాలకు హాజరయ్యే జనం అధికమవుతున్నకొద్దీ, అధికమవుతున్న ఖర్చుల భారాన్ని మోయడం ఎలా?అని జంకు గలిగిన స్థితిలో **"పదండిముందుకు"**అన్న ధైర్య వచనాలతో ఊపిరినిచ్చి, ఆర్థికవనరుల సేకరణ కార్యంలో అత్యధిక ప్రాధాన్యాన్ని వహించిన మా సన్నిహితులు డా॥ఎ.నాగరాజు గారికి ఋణపడి వుంటాము. ఈ కార్యక్రమంలో తమ మనః స్ఫూర్తి సహకారాన్ని అందించిన మా ఇతర మిత్రులు, శ్రీ బి.పద్మనాభరావుగారు, డా॥ఆర్.వి.రావుగారు, డా॥గోపాలకృష్ణ గారు, శ్రీమతి వసుమతి రెడ్డిగారు, శ్రీ ధర్మారెడ్డిగారు, శ్రీ జె.బాపురెడ్డిగారు, శ్రీ యమ్‌నారాయణగారు, డా॥ భీమసేన్ జోస్యులుగారు, శ్రీ ఎస్.పి. చారిగార్లకు హృదయ పూర్వక వందనములు. అచ్చుకు కావలసిన కాగితం, కొద్దిపాటి తక్కువ ధరకు లభింపచేయడంతో తమ ఔదార్యాన్ని ప్రదర్శించిన మా మిత్రులు శ్రీ జి.ఎల్. సంఘిగారికి, సిర్‌పూర్ పేపర్‌మిల్స్ స్థానిక ప్రతినిధులు శ్రీ పి.ఎల్.భండారిగారికి, ఆ సంస్థ పంపిణీదారులు, శ్రీ అమలుక్‌చంద్ *(కుషాల్‌చంద్ అండ్ కం.)* గారికి మా వందనములు. అవసరమైనప్పుడు అండనిలిచి, ఆర్థికంగా ఆదుకున్న శ్రీ వి. రామకృష్ణయ్య, శ్రీ ఎస్.పి.చారి, శ్రీ సూర్యకాంత్, శ్రీ పి. శ్రీరామశర్మగార్లకు మా కృతజ్ఞతలు. హృదయపూర్వక సహకారాన్ని అందించిన ఆంధ్రసారస్వత పరిషత్ అధికారులకు, ముఖ్యంగా శ్రీ హరికిషన్‌రావు గారికి, కృతజ్ఞతాంజలులు.

కావ్యలహరి కార్యక్రమానికి, ఆది నుండి తగిన ప్రోత్సాహాన్నిచ్చిన పాత్రికేయులకు ముఖ్యంగా శ్రీ డి. ఆంజనేయులుగారికి, శ్రీ పి.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి గారికి వందనములు.సహాయం చేసిన వారిని తలుస్తున్న ఈ సందర్భంలో మరో సహృదయులు, బుక్ లింక్స్ సంస్థ యజమానులు శ్రీ సత్యనారాయణ గారిని ఎలా మరువగలం?

అటు కలాన్ని, ఇటు కుంచెను సవ్యసాచిప్రతిభతో కదిలించి, మనస్సుల కదిలించగలిగిన మా సన్నిహితులు, కావ్యలహరికి అందాలను సమకూర్చి పెట్టిన సహృదయులు శ్రీ శీలావీర్రాజు గారికి మా వందనములు.

11,500 ప్రతులు 240 కు పై చిలుకు పుటలు, రెండు వారాల వ్యవధి, కావ్యలహరి అచ్చు భాగ్యం నోచుకోవడానికి పుణ్యం కట్టుకున్న **శ్రీపాద ఆర్ట్ ప్రింటర్స్** వారికి, కృతజ్ఞతలు చెప్పుకోడానికి పదాలు చాలడం లేదు. ప్రెస్ యజమానులు శ్రీ శ్రీపాద సోమేశ్వరరావుగారికి మా కృతజ్ఞతలు.

అచ్చుపనిని, తమ స్వంత పనిగా భావించి, మంచితనం నిండిన ఔదార్యంతో, మనఃస్ఫూర్తి సహకారాన్ని, ధైర్యాన్నిచ్చిన మాకు ఆప్తులైన శ్రీపాద ఆర్ట్ ప్రింటర్స్ మేనేజరు శ్రీ తెన్నేటి అచ్యుతరామయ్యగారికి మనఃస్ఫూర్తి కృతజ్ఞతలు.

కావ్యలహరి కార్యక్రమానికి అవసరమైన ఇతర అచ్చుపనంతా బాధ్యతతో నిర్వహించిన దీక్షాప్రెస్ మేనేజరు, శ్రీ పుండరీకాక్షయ్య గారికి నమస్సులు. అట్టను అచ్చులో సింగారించిన విస్టాస్ ప్రింటర్స్ శ్రీ నారాయణ్ గారికి, పుస్తకంలోని కొంతభాగాన్ని రంగులతో ముద్రించి ఇచ్చిన విజయశ్రీ ప్రింటర్స్ వారి శ్రీ నరసింహారావు గారికీ మా కృతజ్ఞతలు. సకాలంలో బ్లాకులను తయారుచేసి సహకరించిన శ్రీ మోహన్ ప్రోసెస్ వారికి ధన్యవాదాలు. సమావేశాల దృశ్యాలను మా నేత్రాల ముందు కలకాలం నిలచేలా ఛాయా చిత్రాలను అందంగా తీసిన శ్రీ గణేశన్ గారికి కృతజ్ఞతలు.

యువభారతి పెట్టుబడి పెట్టి పుస్తకాలు అచ్చువేసే వ్యాపార సంస్థ కాదు. సహృదయుల సహకారము, సాహితీ ప్రియుల ఆదరణ మాత్రమే పెట్టుబడిగా రూపొందించిన ఈ ప్రణాళికలో, వీలైనంత ఎక్కువ మందికి, వీలున్నంత తక్కువ ధరకు కావ్యలహరిని అందించాలన్న మా తలంపు పురస్కరించుకొని మా మిత్రులను, ప్రచురణకు పూర్వం విరాళాలు సేకరించమని విన్నవించాము. ఎందరో మనఃస్ఫూర్తి సహకారాన్ని అందజేసారు. వాళ్ళందరికీ పేరుపేరునా కృతజ్ఞతలు చెప్పాలనే వుందిగానీ, స్థలాభావం దృష్ట్యా ఆ ఆలోచనను ఆపుకొంటున్నాం. కావ్యలహరికై విరాళాలు సేకరించిన వందలాది మిత్రులకు, విరాళాలు అందించిన వేలాది సహృదయులైన సాహితీ ప్రియులకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు. అందుకే.....

**ఎందరో మహానుభావులు అందరికీ మా వందనములు.**

హైదరాబాద్.
05-09-1971

**సింగంపల్లి వేంకటేశ్వరరావు**
కార్యదర్శి, యువభారతి

'కావ్యలహరి' ముద్రణకు తమ పూర్తి సహాయసహకారాలు అందించిన

వాసవీ కళాశాల (ఐ.ఐ.ఎమ్.సి) ప్రధానాచార్యులు

**శ్రీ.కె.రఘువీర్ గారికి**

**– యువభారతి**

# కావ్యలహరి - ఉపన్యాసమంజరి

## కార్యక్రమాల వివరణ

ఉపన్యాసకులు : ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షులు,
**ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు**

సభాస్థలి : ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు

సమయం : సాయంత్రం 5-30 నుండి 8-30 వరకు

### మొదటి సమావేశం 18-07-1971 ఆదివారం

***సకలవిద్యాసనాథ కవిసార్వభౌమ శ్రీనాథుని 'శృంగారనైషధము'.***

ముఖ్య అతిథి : ఆంధ్రప్రదేశ్ సమాచారశాఖామాత్యులు
**గౌ. శ్రీ అక్కిరాజు వాసుదేవరావు గారు.**

అధ్యక్షులు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ కార్యదర్శులు
**శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు**

### రెండవ సమావేశం 01-08-1971 ఆదివారం

***శిరీషకుసుమపేశలసుధామయోక్తుల అల్లసాని 'పెద్దనామాత్యుని మనుచరిత్రము'.***

ముఖ్య అతిథి : ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు
**శ్రీ వల్లూరి పార్థసారథి గారు.**

అధ్యక్షులు : **ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్య గారు.**

### మూడవ సమావేశం 15-08-1971 ఆదివారం

***ముక్కుతిమ్మనార్యుని ముద్దుపలుకు 'పారిజాతాపహరణము'.***

ముఖ్య అతిథి : ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు
**శ్రీ ఆవుల సాంబశివరావు గారు.**

అధ్యక్షులు : **డా॥సి.నారాయణ రెడ్డి గారు**
రీడర్, తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్.

## నాల్గవ సమావేశం 29-08-1971 ఆదివారం

సాహిత్యరసపోషణ రామరాజభూషణుని 'వసుచరిత్రము'.

అధ్యక్షులు : **ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం గారు.**

## ఐదవ సమావేశం 12-09-1971 ఆదివారం

ప్రతిపద్యచమత్కృతి చేమకూర వేంకటకవి 'విజయవిలాసము'.

ముఖ్యఅతిథి : ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు
**గౌ. శ్రీ పి.వి. నరసింహారావు గారు.**

అధ్యక్షులు : 'ఆంధ్రజ్యోతి' సంపాదకులు
**శ్రీ నార్ల వేంకటేశ్వరరావు గారు.**

'కావ్యలహరి' ఆవిష్కర్త : 'అభినవపోతన' **శ్రీ వానమామలై వరదాచార్యులు** గారు.

## ఆరవ సమావేశం 11-12-1981 ఆదివారం

"సాహితీసమరాంగణ సార్వభౌముడు" శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద.

అధ్యక్షులు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులు
**శ్రీదేవులపల్లి రామానుజరావు గారు**

ముఖ్యఅతిథి : కమిషనర్ ఆఫ్ ఇన్‌కంటాక్స్ (రిటైర్డు) హైదరాబాద్.
**శ్రీ టి.యస్.ఆర్. నరసింహం గారు**

## ఏడవ సమావేశం 12-12-1981 శనివారం

"మహాంధ్రకవితావిద్యాబలప్రౌఢి" తెనాలిరామకృష్ణుని పాండురంగమాహాత్మ్యం.

అధ్యక్షులు : ఆంధ్రశాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం.
**డా.కె.గోపాలకృష్ణారావు గారు**

ముఖ్య అతిథి : ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు
**శ్రీ కోదాటి నారాయణ రావు గారు**



# 'కావ్యలహరి' పై ప్రముఖుల అభిప్రాయాలు

☞ యువభారతి సభలకు వస్తున్న జనాన్ని చూస్తుంటే క్రమబద్ధంగా, క్రమశిక్షణతో జరిగే ఇటువంటి సభలు ఇకమీదట ఫతేమైదాన్ స్టేడియంలో ఏర్పాటుచేస్తే తప్ప స్థలంచాలదేమో.

**- పి.వి.నరసింహారావు గారు**

☞ దివాకర్లవారి ఉపన్యాసం ఒడిదుడుకు లేక ఒడ్లనంటి ప్రవహించు నిండైన నిర్మల గంగాప్రవాహము. వారి కొన్ని ఉపన్యాసముల సారమే ఈ కావ్యలహరి దీనినఖిలాంధ్ర జనమున కాస్వాదనీయముగా పంచిపోసిన యువభారతి వారి అపారకృషి నెట్లుపొగడవలెనో మాటలు చాలవు వారి కృషికి అఖిలాంధ్ర రసికహృదయములు ఋణపడియున్నవి.

**- వానమామలై వరదాచార్యులు గారు**

☞ సంప్రదాయంలోని సారాన్ని గ్రహించి సమకాలీన భావాధ్వంలో ప్రస్థానించి భవిష్యత్కాంతితీరాలను సందర్శించడానికి ఈ ఉపన్యాస సంపుటి సహకరిస్తుందని ఆశిస్తున్నాను.

**- డా॥ సి.నారాయణ రెడ్డి గారు**

☞ యువభారతి సంస్థ కార్యకర్తలలో సభ్యత, సంస్కారం, వివేచన ఉన్నాయి. ఉత్తమ కార్యక్రమాలు నిర్వహించగల దీక్ష, దక్షతలు గల సంస్థగా చిరకాలం పెంపొందాలి.

**- నార్ల వెంకటేశ్వరరావు గారు**

☞ ఈ సాహిత్యసభలు ఒక చరిత్రనే సృష్టించాయి. సాహిత్యానుశీలనంతో నూతనాధ్యాయాన్నే తెరిచాయి చోటు దొరకదనే భయంతో కార్యక్రమానికి రెండు గంటల ముందుగానే ప్రేక్షకులు వచ్చి కూర్చునేట్లుగా చేశాయి. ఈ రకంగా సాహిత్యవాదులలో అభినూతన చైతన్యాన్ని కలిగించాయి.

**- పి.ఎస్.ఆర్.ఆంజనేయ శాస్త్రి గారు**

☞ ప్రాచీనకావ్యాలోకనం ద్వారా సాహిత్యాభిరుచి, ఉత్తమ సాహిత్యవివేచన, కవితాహృదయం, అన్నిటికిమించి సాహిత్యసహనం పెంపొందించడానికి క్రమశిక్షణాత్మకంగా యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమం పెడదారులు త్రొక్కుతున్న అరాజక వాదంనుంచి యువతరానికి మంచి మార్గం చూపగలదన్న ఆశాభావాన్ని సభకు హాజరైన పలువురు పరిశీలకులు వెల్లడించారు.

**- 'ఆంధ్రజనత' దినపత్రిక (13/09/1971)**

☞ యువభారతి వారి అష్టమ వార్షికోత్సవాల సందర్భముగా చేపట్టిన కావ్యలహరి ఉపన్యాసాల కార్యక్రమం అందరిచే ఔననిపించుకున్నది. కొన్ని ప్రమాణాలను రూపొందించింది. కార్యక్రమ నిర్వహణలో క్రొత్తబాటలు చూపించింది. సాహితీసమావేశాలకు వేలసంఖ్యలో తెలుగువారు వస్తారని గంటల తరబడి ప్రశాంతంగా ఉపన్యాసాలు వింటారని నిరూపించింది.

**- 'ఆంధ్రజ్యోతి' పత్రిక (24/10/1971)**

## ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారికి

# అక్షర ప్రసూనార్చన

**ఆంధ్రవాఙ్మయ దివాకరా!**

ప్రాగ్దిశాకాంత ఉదయభానునిలా ఈ శతాబ్దం తొలి యౌవనంలో చంకనెత్తిన దొడ్డ బిడ్డలు మీరు. అలనాటి జంటకవుల అవధానాన్ని వచోవిధానంలో ఛందస్సంవిధానంలో సంగమింపజేసిన సార్థక నామధేయులు మీరు! ప్రాఙ్నన్నయ వాఙ్మయవార్నిధిని బుద్ధిబాహువులతో తరించిన బృహస్పతులు మీరు. నన్నయ భారతం నుండి చిన్నయ వ్యాకరణం వరకు మార్గపద్ధతికి దుర్గంగా నిలిచిన దిగ్గజసదృశులు మీరు ! కవిత్రయంవారి ప్రౌఢభారతి నుండి కవికుమారుల యువభారతి వరకు వెలసిన కావ్య నిక్వణాలను మీ ధారణలో తోరణపంక్తిగా మీ వాక్కులలో వారిదనినదంగా మెరయించి మొరయించిన మోహనమూర్తులు మీరు! వెన్నలాంటి మనస్సు, వెన్నెలలాంటి మందహాసం, వేణువులాంటి గాత్రం, వేదంలాంటి విజ్ఞానం, వేలుపులాంటి రూపువిలసిల్లిన విద్యాగురువులు మీరు!

**ఆంధ్రసాహితీసాగర కుంభసంభవా!**

నన్నయనుండి నేటివరకు వెల్లివిరిసిన సాహిత్యామృతాన్ని పుడిసిటబట్టిన అపరాగస్త్యులు మీరు. అనర్గళమైన మీ ఉపన్యాసధారలో అనర్ఘములైన పద్య రత్నములెన్నో వెలువడుతుంటాయి. సాహిత్య క్షీరసాగరమథనమున ఆవిర్భవించిన కాలకూటమును కంఠమున నిల్పిన పరమేశ్వరులు మీరు! అమృతమును పంచిన ఆదివిష్ణువులు మీరు!

**వాగ్మివతంసమా!**

పురాణాల్లో పరమేశ్వర జటావినిర్గత మందాకినీతరంగ డోలికామాలికల తూగు వినియున్నాము; భారతంలో భాగీరథీ ప్రసన్న ప్రవాహగంభీర గమనాన్ని గమనించాము; తెలుగునాట కృష్ణా గోదావరీ పయఃపరీవాహ ప్రాగల్భ్యాన్ని పరికిస్తున్నాము; వీటికి తోడుగా నేడు గీర్వాణాంధ్ర సరస్వతీ స్రోతస్విని ధారామధురంగా, సుధాపూరంగా, సర్వజనసులభంగా, సహృదయతీర్థంగా రసనాగ్రంలో పొంగులు వారిన వాగ్విలాసం మీ యందే చూస్తున్నాము. పాఠశాల వెలసిన గ్రామం, కళాశాల వెలసినపట్నం, పరిషత్తులు నిలిచిన వేదిక, నవకావ్యం నవ్విన పండుగ, పరిశోధన పండిన పర్వం, పరమాత్ముని కొలిచిన బృందం, మీ వాక్కుల వలపులనింపును. మీ మేధకు శిరసులు వంచును. తెలుగునాట మీ వాఙ్మయ సూర్యుడు చల్లని వెన్నెల కురిసే చంద్రుడు!

**విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షా!**

విశ్వవిద్యాలయమునకే వన్నె తెచ్చిన విజ్ఞులు మీరు. సారస్వత భాండారం సవినయంగా మీలో ఒదిగిపోయింది. విషయవివేకానికీ సూక్ష్మాంశవిశ్లేషణానికీ, రసవత్ప్రపంచానికీ మీ అధ్యాపనం ఒక లక్షణ గ్రంథాధ్యాయం. ఆచార్యవర్యులై ఆచార్యులను సృష్టించుటయే కాక ఆంధ్రభాషాభిమానులందరిని అభ్యుదయ పథాన నడిపిస్తున్న సాహిత్యాభిమానులు! ప్రాచ్యవిద్యా ప్రణాళిక మీ మాతృభాషా పక్షపాతానికి మచ్చుతునక! మీరు కావ్యాలు వ్రాసినారు, వాఙ్మయచరిత్రను నిర్మించినారు, విజ్ఞానసర్వస్వ సంపుటాలను సంపాదించినారు, భాషా కృషి చేసినారు, భారతిని మురిపించినారు. సాహిత్య సేవలో కృతావగాహులు మీరు!

**భాషాసేవాపరాయణా!**

ఈ నాడు తెలుగువారమంతా ఒక గొడుగు నీడన ఉన్నాము. ప్రామాణికాంధ్ర భాష మనకెంతో అవసరంగా ఉన్నది. దాన్ని సమాజాభ్యుదయానికి సన్నిహితం చేసే సమగ్ర రూపాన్ని తీర్చి దిద్దే బాధ్యత మీమీద పరోక్షంగా ఉన్నది. ప్రజ, ప్రభుత్వం మీ ప్రతిభావ్యుత్పత్తుల మీద, మీ వివేక విచక్షణాశక్తుల మీద విశ్వాసం ఉంచి భావిభాషాధ్యయన విధానసారథ్యాన్ని సమర్థంగా సాగింపగోరుతున్నవి; ఆ మార్గంలో మీ ప్రసంగాలు, వ్యాసాలు, వ్యాసంగాలు సాగాలనీ మీ నుండి ఒక మహాకావ్యం పొందాలనీ ఆకాంక్షిస్తున్నవి.

**స్నేహార్ద్రమూర్తీ!**

చుట్టూ ఉన్న చిమ్మచీకటిని చిమ్మివేయటానికి చిన్న చిన్న దీపాలు వెలిగిస్తున్న 'యువభారతి'కి సుజనసులభులైన దివాకరులు మీరు ప్రసన్నులైనారు! ఈ కాంతి మీది! దీని వలన పొందే క్రాంతి మాది! అంటే మా తరానిది!

**'యువభారతి' 'కావ్యలహరి'** కార్యక్రమాలలో తెలుగు బిడ్డలకు ఉపన్యాస మంజరిని ఉపాయనంగా ఇచ్చిన వదాన్యులు మీరు! ప్రతికృతిగా మేమేమి ఇవ్వగలము?

మా యీ అక్షర ప్రసూనాంజలులను స్వీకరించి మాకు ఆశీరమృతమును ప్రసాదించండి.

**– యువభారతి**



# సార సౌరభం

## డా॥ సి.నారాయణరెడ్డి

**"అంత కడివెడు పాలపై ఒ**
**క్కింత మీగడ పేరినట్లుగ**
**మనకు మిగులును గతము లోపలి**
**మంచి; అదియే సంప్రదాయము."**

సంప్రదాయానికి నా నిర్వచనమిది. గతమంతా సంప్రదాయంకాదు. గతం లోని మంచి మాత్రమే సంప్రదాయం. **"సమ్యక్ ప్రదానం సంప్రదాయం"** అని కదా వ్యుత్పత్తి.

ఆంధ్రసాహిత్యం వెయ్యేళ్ల పంట. ఆ వెయ్యేళ్లలో వేనవేల కావ్యాలు పుట్టినవి. చాలా భాగం నడుమంత్రాన గిట్టినవి. నేటికీ, రకరకాల రాజకీయ సాంఘిక పరిస్థితులధాటికీ మిగిలినవి ఒక కొన్ని మాత్రమే. కాలం విధించిన అగ్ని పరీక్షలకు ఆగి, సలసల కాగి ఈనాటికీ శేషించిన పాలు బహుళ ప్రచారంలో ఉన్న ఉత్తమశ్రేణికి చెందిన కొన్ని ప్రాచీన కావ్యాలు. వాటిలో మీగడతరకల వంటివి కొన్నే కొన్నిఘట్టాలు. ఆ ఘట్టాల్లో తెలుగుజాతి బాగా జీర్ణించుకున్నవీ, రక్తవృద్ధికి తోడ్పడుతున్నవీ కొన్నే కొన్ని పద్యాలు[1].

ఆ కొన్ని ఘట్టాల కోసమైనా; ఆ ఎన్నికైన కొన్ని పద్యాల కోసమైనా మనం ప్రాచీన కృతులను పఠించవలసి ఉంది. ఆ సంప్రదాయాల పునాదుల మీదనే సరికొత్త ప్రయోగాల వజ్రసౌధాలు నిర్మించుకోవలసి వుంది. వర్తమానంలో కీర్తిశిఖరం అందుకున్న ఏ అభినవ కావ్యమూ సంప్రదాయాన్ని సంపూర్ణంగా ఛేదించిందికాదు. నేలవిడిచి సాము చేసిందీ కాదు. అయితే అలా చేయాలని దుస్సాహసంచేసిన చిల్లర కృతులు కొన్ని లేకపోలేదు. ఏమి లాభం? ఎగిరిన మరుక్షణంలోనే చతికిల బడ్డాయి పాపం!

యుగయుగాల సాహిత్య చరిత్రను హేతుదృష్టితో, పక్షపాత రహిత హేతిదృష్టితో పరిశీలిస్తే తెలుస్తుంది. ఈ నాటికీ ఉత్తమ కృతులుగా కోటి కెక్కిన వాటి వెనక ఎంతటి సంప్రదాయబలం అండగా వుందో.

వేదబుక్కులలోని ప్రకృతి రామణీయకాన్ని పుడిసిలించనిదే ఆదికవి వాల్మీకి శ్రీమద్రామా యణాన్ని రచించగలిగే వాడుకాడు. వాల్మీకి ఆత్మను ఆకళించుకోనిదే కాళిదాసు కమనీయ కవితా సృష్టి చేయగలిగేవాడు కాడు. తెలుగులో వ్యాసుడులేక నన్నయ్యలేడు. కాళిదాసాదులు లేకపోతే శ్రీనాథాదులు లేరు. పాశ్చాత్య సాహిత్యం పట్లకూడా ఇదే వర్తిస్తుంది. మిల్టన్‌పై వర్జిల్ ప్రభావం, ఆ వర్జిల్ పై హోమర్ ప్రభావం, షేక్సిపియర్‌పై మార్లో ప్రభావం, ఆ మార్లోపై చాసర్ ప్రభావం, కోటిగొంతుకలతో ఘోషిస్తున్నాయి. అన్ని యుగాల్లోనూ సాహితీ స్రష్టలందరిపైననూ సంప్రదాయ

ముద్ర కంఠదఘ్నంగా ఉంటుందని, శ్రీశ్రీవంటి ప్రయోగశీలి గేయరచనపై మనుచరిత్ర వసుచరిత్రల ఆశ్వాసాంత పద్యాల ప్రభావం ఎంత పటిష్టంగా వుందో అభిజ్ఞులకు తెలిసిందే. ఒక వాణివెనుక ఎందరి అనుభవమో నిబిడీకృతంగా ఉంటుందన్న వర్జీనియావుల్ఫ్ అభిప్రాయం ఈ సందర్భంలో గమనించదగింది[2].

అయితే రాకెట్ వేగంతో పురోగమిస్తున్న వర్తమాన చరిత్ర దృష్ట్యా, అనుక్షణం పరివర్తనం చెందుతున్న విలువల దృష్ట్యా ప్రాచీన కావ్యాలను పఠించవలసిన అవసరం ఎంతవరకుంది? ఎంతవరకా? గుండెలోనుంచి చిమ్ముకొనివచ్చే నగ్నభావాలకు సముచిత సశక్తిక శబ్దాలను తొడగడంలో సహకరించేటంతవరకు, విజ్ఞాన సీమలనూ, ఆలోచనా వలయాలనూ మరింతగా విస్తృత పరిచేటంతవరకు, చిక్కని ఊహలకు రెక్కలిచ్చి అనంత వియత్పథాలలో ఎగరగలిగే మొక్కవోని ఓజస్సు అందించేటంతవరకు, చెప్పదలచుకున్నది సూటిగానే కాకుండా సుందరంగా చెప్పే సవ్యసాచిత్వం సంతరింపజేసేటంతవరకు. అంతవరకే.

అంతేకాని ప్రాచీనులు చెప్పిన ప్రతి అభిప్రాయం నేడు శిరోధార్యమనికాదు. ప్రబంధాల్లో మన మహాకవులు మేడలనూ, ఎత్తైన గోడలనూ వర్ణించడానికి చేసిన సాము గరిడీలతో ఆధునికునికి నిమిత్తం లేదు. శృంగార ఘట్టాల్లో అడుగడుగునా కథకూ, కొంతవరకు సభ్యతకూ అడ్డుతగిలే కచకుచ వర్ణనలతో, నాభీత్రివళుల చిత్రణలతో వర్తమాన భావుకునికి ప్రమేయం లేదు[3]. అలాగే ప్రాచీనులు కరుడుగట్టిన వర్ణవ్యవస్థపై కట్టుకున్న అభిప్రాయాల కట్టడాలతో, గతకాలమే భావికాలంకంటె గొప్పదని ప్రకరణవశాన చేసిన ప్రసంగాలతో ఆధునికుడు ఏకీభవించడు. 'జరాతుర'ను 'మూడుకాళ్లముసలిది' అన్నప్పుడు ఆంధ్రనైషధకారుని తెలుగు నుడికారపు నిగారానికి తలవూపుతాడు. 'చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్' అన్నప్పుడు మనుచరిత్రకారుని ధర్మసాక్షికతకు జోతలర్పిస్తాడు. 'మనమెరియదె ప్రాణమైన మగడిట్లయినన్' అన్నప్పుడు, 'మగడింతులకున్ చనవిచ్చి పుచ్చుకొన్నను మనవచ్చునే' అన్నప్పుడూ పారిజాతాపహరణ కర్త మానినీ మనస్తత్వ విశ్లేషణశక్తికి పరవశిస్తాడు. కొన్నిసందర్భాల్లో వర్ణ్య వస్తువుతో ఏకీభావం పొందలేకున్నా, ఆ మహాకవుల ఊహల ఉడ్డీనానికి, కుశాగ్రధిషణకూ, బహువిషయపరిజ్ఞానానికీ బరాబరులు చేస్తాడు.

వైజ్ఞానికంగా ఎంతగా పురోగమిస్తున్నా మన ఆలోచనాపరిధిపై పురాణసంప్రదాయాల ప్రభావం ఏదో ఒకరకంగా భాసిస్తూనే వున్నది. పురాణాల్లోని కొన్ని ఘట్టాలు, కొందరివ్యక్తిత్వాలు ఆధునిక జీవితంలో ప్రతీకలు (Symbols) గా మారిపోయినవి. నేటికీ విలువల వలువలను ఊడ్చివేసేవాడు దుశ్శాసనుడు, కుతంత్రాల పద్మవ్యూహాలను చీల్చే కుమార వీరుడు అభిమన్యుడు. ఋజువాక్కు రామబాణం. సహనపరీక్ష అగ్నిపరీక్ష. ఇంకా ఆ కబంధహస్తాలు, ఆ హిరణ్యాక్షవరాలు, ఆ విలయతాండవాలు, ఆ బలిపీఠాలు, ఆ గొంతెమ్మ (కుంతి) కోరికలు, ఆ 'సుప్పనాతి' చేష్టలూ ఇప్పటికీ దైనందిన జీవితంలో ఆధునిక భావప్రకటనకు ఆలంబనాలుగా ఉన్నాయి. నవకవులుకూడా త్రేతాగ్నులనూ, హోమజ్వాలలనూ, రుద్రవీణలనూ, ధ్రువతారలనూ ఆధునిక

యుగచైతన్యాన్ని ప్రతిబింబించడానికి కవితా ప్రతీకలుగా స్వీకరిస్తూనే వున్నారు. గతాన్ని గతందృష్టితో కాకుండా వర్తమానస్ఫూర్తిగా అనుగుణంగా మలచుకునేధోరణి ఇది[4].

ఈ సమ్యక్ దృష్టివున్న **'యువభారతి'** ప్రాచీనాంధ్ర ప్రౌఢభారతిని ఈ తరంవారికి పరిచయం చేయాలని సంకల్పించింది. మచ్చుకు ఆణిముత్యాల వంటి అయిదు కావ్యాలను ఎన్నుకుంది. ఆ అయిదుగురు కవులూ అచుంబితప్రతిభ, అపారవ్యుత్పత్తి వున్న మహాకవులే. ప్రౌఢ వాగ్గుంభనానికి శృంగారనైషధం, శ్లేషయమకాది కవితా కామనీయకానికి వసుచరిత్ర విజయవిలాసాలు, సుకుమార భావుకతకూ, సునిశిత మానవమనఃపరిశీలనచణతకూ మనుచరిత్ర పారిజాతాపహరణాలు ప్రతినిధికృతులు. ఆంధ్ర భాషాయోషకు అక్షరాలంకృతులు. భావనామృదులత, కల్పనా చతురుత, పదప్రయోగ నిపుణత, పద్య నిర్మాణ కుశలత సమర్థంగా అల్లుకున్న రసవద్రచనలు. వీటి ఆత్మను ఆవిష్కరించి, ఆ యా ఘట్టాల అందచందాలనూ, ఆయా పద్యాల మధురగ్రంధాలనూ తెలుగునాట ప్రసరింపజేసే గురుతర బాధ్యతను యువభారతి అభ్యర్థనపై స్వీకరించారు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు.

ఆచార్య దివాకర్లవారు బహుకావ్యమర్మజ్ఞులు. రసదృష్టి వీసరవోని నిశిత విమర్శనాభిజ్ఞులు. ధారాధారణా శక్తులను గంగాయమునలవలె సంగమింపజేసుకొని అంతఃస్యూతంగా సరస్వతిని గర్భీకరించుకున్న వైదుషీధునులు; వాగ్మిశిరోమణులు. వారు తరంగాయమానంగా అయిదు ఘట్టాలలో పొంగించిన ఉపన్యాస పరంపరలకిది నిబద్ధాకృతి. ప్రాచీనాంధ్ర కావ్య సౌరభాలను సంతరించుకున్న సుమనస్సంపుటి.

సంప్రదాయంలోని సారాన్ని గ్రహించి, సమకాలీన భావాధ్వంలో ప్రస్థావించి భవిష్యత్ కాంతితీరాలను సందర్శించడానికి ఈ ఉపన్యాస సంపుటి సహకరిస్తుందని ఆశిస్తున్నాను. 'యువభారతి' సాధించిన ఈ కృషిఫలితం సాహితీయాత్రికులకుపాథేయంగా ఉపకరిస్తుందని విశ్వసిస్తున్నాను.

1. మనుచరిత్రలో వరూధినీప్రవరుల ఘట్టం, పారిజాతాపహరణంలో సత్యభామ అలుక, పాండురంగమహాత్మ్యంలో నిగమశర్మకథ ప్రబంధారణ్యాల్లో పూచిన పచ్చని పొదరిళ్లు.
2. 'The experience of the mass is behind a single voice'.
3. ఆధునికుల పరిశోధనశాల అంగంకాదు అంతరంగం. నేటికవి చిత్రించేది ఒంటిపొరల వెనకాల ఉద్వేగంతో కొట్టుకునే గుండెల చప్పుళ్లనూ; భావసంఘర్షణల నెగళ్లనూ.
4. 'Not only the pastness of the past, but of its presence' - టి.యస్. ఇలియట్.





# యువభారతి గౌరవసభ్యులు

1. డా॥సి.నారాయణరెడ్డి గారు
2. శ్రీ శీలా వీర్రాజు గారు
3. శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారు
4. డా॥ కె.వి.రమణాచారి గారు
5. డా॥ అక్కిరాజు రమాపతిరావు గారు
6. డా॥ పోరంకి దక్షిణామూర్తి గారు
7. డా॥ కె.ఐ.వరప్రసాదరెడ్డి గారు
8. డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు గారు
9. డా॥ రవ్వా శ్రీహరి గారు

***

## యువభారతి గౌరవ సభ్యులుగా ఉండి గతంలో అమూల్యమైన సేవలు అందించిన సహృదయులు,సాహితీవేత్తలు

1. కీ॥ శే॥ ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు
2. కీ॥ శే॥ ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం గారు
3. కీ॥ శే॥ ఆచార్య పాటిబండ మాధవశర్మ గారు
4. కీ॥ శే॥ డా॥ దేవులపల్లి రామానుజరావు గారు
5. కీ॥ శే॥ డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారు
6. కీ॥ శే॥ అక్కిరాజు వాసుదేవరావు గారు
7. కీ॥ శే॥ వానమామలై వరదాచార్యులు గారు
8. కీ॥ శే॥ అనుముల కృష్ణమూర్తి గారు
9. కీ॥ శే॥ ఆచార్య బిరుదురాజు రామరాజు గారు




# యువభారతి కార్యవర్గం

| | |
|---|---|
| గౌరవాధ్యక్షులు | డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు గారు |
| అధ్యక్షులు | శ్రీ మాడభూషి అనంతాచార్యులు గారు |
| ప్రధాన సంపాదకులు | శ్రీ సుధామ గారు |
| ఉపాధ్యక్షులు | 1. శ్రీ రెడ్డి రాఘవయ్య గారు |
| | 2. డా॥ బి.జయరాములు గారు |
| | 3. డా॥ శ్రీమతి. జి.ఎల్.కె. దుర్గ గారు |
| కార్యదర్శి | శ్రీ అయలసోమయాజుల నాగేశ్వరరావు గారు |
| సహాకార్యదర్శులు | 1. శ్రీ పోరూరి మారుతీకిరణ్ గారు |
| | 2. శ్రీ భట్టిప్రోలు శ్రీనివాసరావు గారు |
| | 3. శ్రీ గంగిశెట్టి లక్ష్మీనారాయణ గారు |
| కోశాధికారి | శ్రీ ఆమాతి రవీంద్ర గారు |
| కార్యవర్గ సభ్యులు | 1. శ్రీ కె.వి.బలరామమూర్తి గారు |
| | 2. శ్రీ ఎం.వి.రామవరప్రసాదు గారు |
| | 3. శ్రీ టి.సాంబశివ శర్మ గారు |
| | 4. శ్రీ రామచంద్ర కుమార్ గారు |
| | 5. శ్రీ జి.ఆదినారాయణ గారు |
| | 6. శ్రీ మల్లెగోడ గంగాప్రసాద్ గారు |
| | 7. శ్రీ ఎస్.గంగాకుమార్ గారు |
| | 8. శ్రీమతి కె.రాధారాణి గారు |
| సమావేశకర్త | ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారు |
| సహసమావేశకర్తలు | 1. శ్రీ మలపాక పూర్ణచంద్ర రావు గారు |
| | 2. శ్రీ పి.జవహర్‌లాల్‌నెహ్రూ గారు |
| | 3. శ్రీ జీడిగుంట వేంకట్రావు గారు |

# సకలవిద్యాసనాథ కవిసార్వభౌమ శ్రీనాథుని

# శృంగారనైషధము

సంస్కృత పంచకావ్యములలో చివరిదియు నాంధ్రపంచకావ్యములలో మొదటిదియునై ప్రసిద్ధికెక్కినది నైషధమహాకావ్యము. దీనిని సంస్కృతమున రచించిన మహాకవి శ్రీహర్షుడు. ఇతఁడు కాశ్మీరదేశమందలి శారదాపీఠమున శేషాహియంశమున జనించిన శ్రీహీరపండితునకు మామల్లదేవి యను భార్యయందు చింతామణీమంత్ర చింతనఫలముగా పుట్టిన కుమార రత్నము. కాన్యకుబ్జ రాజాస్థాన రంగమంగళాభరణము; గౌడవిజయాది కావ్యకర్త; కవికులా దృష్టాధ్వపాంథుఁడు; ఖండనగ్రంథకారుడు; వైతండిక కమల షండవేదండము; సతర్క మర్మైక చక్రవర్తి. ఇతని కాశ్రయుఁడైన కాన్యకుబ్జేశ్వరుఁడు జయంత చంద్రుఁడని చెప్పుదురు. ఇతడే రాణీ సంయుక్తకు తండ్రియు, పృథ్వీరాజునకు విరోధియునైన జయచంద్రుఁడని (1170-1195) విమర్శకుల యభిప్రాయము. శ్రీహర్షుఁడు పృథ్వీరాజు గుణగణములను సంయుక్తాస్వయంవరమును మనసునందుంచుకొనియే నైషధ కావ్యమున నలుని గుణగణములను దమయంతీస్వయంవరమును రచించెనని విమర్శకులు తలంచుటలో నసంభావ్యమేమియులేదు. అతఁడు నలదమయంతుల చరిత్రనంతను అఱువదియో నూఱో సర్గములుగల మహాకావ్యముగా రచించెననియు నందు  ఇరువది రెండు సర్గములతోఁగూడిన పూర్వభాగము మాత్రము లభించుచున్నదనియు చెప్పుదురు. కాని కావ్యాంతశ్లోకములను పరికింప లభించినది సమగ్రకావ్యమనియే తోఁచుచున్నది. సంస్కృతవాఙ్మయమున నైషధమహాకావ్యమునకున్న ప్రశస్తి అప్రతిమానమైనది. కవితాభావవర్ణనాప్రౌఢియందు దానికదే సాటి. శ్రీనాథుఁడన్నట్లు కవిరాజరాజశేఖర హీరముకుటము కదా శ్రీహర్షమహాకవి!

అట్టి నైషధ మహాకావ్యమును శ్రీనాథమహాకవి చంపూరూపమున నాంధ్రీకరించి పెదకోమటి వేమారెడ్డి మంత్రియును, సోమసిద్ధాంత వ్యాఖ్యాతగా పేరొందినవాఁడునైన మామిడి సింగనామాత్యున కంకిత మొనర్చెను. శ్రీనాథుని తల్లిదండ్రులు భీమాంబా మారయామాత్యులు. కనకక్ష్మాధరధీరుఁడును, కాల్పట్టణాధీశ్వరుడును, పద్మపురాణ సంగ్రహ కళాకావ్య ప్రబంధాధి పుడును వినమత్కాకతి సార్వభౌముఁడును, కవితావిద్యాధరుఁడునైన కమలనాభా మాత్యుఁ డాతని తాత. వారు పాకనాటి నియోగి బ్రాహ్మణులు, భారద్వాజ గోత్రులు, ఆపస్తంబ సూత్రులు. శ్రీనాథుని జన్మస్థానమేదో నిశ్చితముగా చెప్పుట కవకాశములేకున్నది. అతని తాత కాల్పట్టణాధీశ్వరుఁడని చెప్పఁబడియుండుటచే నా కాల్పట్టణమేదో నిర్ణయించుటకు పలువురు విమర్శకులు ప్రయత్నించియుండిరి. అది నెల్లూరు మండలమందలి క్రొత్త పట్టణమని

కొందఱును, కృష్ణా మండలమందలి కాళీపట్టణమని కొందఱును, కలపట గ్రామమని కొందఱును, నెల్లూరే యని కొందఱును అభిప్రాయపడియున్నారు. అది యేదైనను పాకనాటియందు సముద్రతీరమందుండిన పట్టణమో గ్రామమో యైయుండవలయును. శ్రీనాథుడు 14వ శతాబ్ది చివరిపాదమున జన్మించి 15వ శతాబ్దిపూర్వార్థము నంతమువరకు సుమారు డెబ్బది సంవత్సరములు జీవించియుండెనని చెప్పవచ్చును. అతఁడు 1360 ప్రాంతముననే జన్మించె ననువారును, 1475 వఱకును జీవించెననువారును గొందఱు గలరు. అతఁడు విద్యాధికారి పదవిని నిర్వహించి, కనకాభిషేకాది ఘనసత్కారములంది, కవిసార్వభౌముడై రాజోచిత భోగముల ననుభవించినవాఁడైనను చరమజీవితమున దారిద్ర్యమున కగ్గమై దీనస్థితిలో మరణించెనని తెలియుచున్నది. అతఁడప్పుడు కృష్ణాతీరమందలి బొడ్డుపల్లి గ్రామమును గుత్తకు తీసికొనెననియు, చేసిన వ్యవసాయమంతయు గంగపాలగుటచే నేడునూర్లటంకముల సుంకము నిచ్చుకొనలేక యాతఁడు శిక్షకు పాలయ్యెననియు, నవసానకాలమున నాతఁడు రచించిన “కవిరాజు కంఠంబు కౌఁగిలించెనుగదా పురవీధి నెదురెండ బొగడదండ” “కాశికా విశ్వేశుఁ గలసె వీరారెడ్డి రత్నాంబరంబు లేరాయఁడిచ్చు” నిత్యాది సీసపద్యముల వలనఁ దెలియుచున్నది. అతఁడు రెడ్డి రాజ్యము పతనమైన పిమ్మట పలువురు రాజులను సంపన్నులను దర్శించుచు దేశమంతట సంచరించి యుండెను. అప్పుడాతఁడాయా ప్రదేశములను గూర్చియు, వస్తువులను గూర్చియు, వ్యక్తులను గూర్చియు చెప్పిన హృద్యములైన చాటువులనేకములు లభ్యములగుచున్నవి. బహుశః పూర్వాంధ్రకవులలో నాతఁడు చెప్పినన్ని చాటువులను మఱియెవ్వరును చెప్పియుండరు. “చిన్నారి పొన్నారి చిఱుత కూకటి నాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర” అను సీసమున నాతఁడు రచించిన గ్రంథములు పేర్కొనఁబడినవి. అందు మరుత్తరాట్చరిత్ర, శాలివాహనసప్తశతి అనునవి యిప్పుడు లభించుటలేదు. అందు పేర్కొనఁబడని గ్రంథములు కూడ కొన్ని యున్నవి. అందు హరవిలాసము, శివరాత్రి మాహాత్మ్యము, పండితారాధ్య చరిత్రము, ధనంజయ విజయము, మానసోల్లాసము, నందనందన చరిత్రము ముఖ్యములైనవి. శ్రీనాథకృతములని ప్రసిద్ధిపొందిన క్రీడాభిరామ పల్నాటి వీరచరిత్రల కర్తృత్వము వివాదాస్పదమైయున్నది. శ్రీనాథుఁడు మహాపండితుఁడు. విద్యాధికారి పదవిని నిర్వహించుటయు డిండిమపండితునోడించి కవిసార్వభౌమ బిరుదమును గడించుటయు నాతని పాండితీశౌండీర్యమునకు నిదర్శనములు. అతని బావమఱఁదియు శిష్యప్రాయుఁడునైన దగ్గుపల్లి దుగ్గన నాసికేతోపాఖ్యానమున చెప్పిన “సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్యభాషాపరిజ్ఞానపాటవంబు” అను పద్యమాతని పాండితీపాటవమును చాటు చున్నది. హరవిలాసమున నవచితిప్పయ యతనిని “అధ్వర్యు వేదశాఖాధీతి నిష్ణాతు” నని వర్ణించి యుండుటచే నతనికి లౌకిక విద్యలయందేకాక వేదమునందును శ్రౌతము నందునుగూడ పాండిత్యము కలదని తెలియుచున్నది. నైషధమున కృతిభర్త యతని వైదుష్యమును

> బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడ వురుప్రజ్ఞా విశేషోదయా
> జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చనకళాశీలుండ వభ్యర్థిత
> బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థనిర్ధారిత
> బ్రహ్మజ్ఞానకళానిధానమవు నీ భాగ్యంబు సామాన్యమే

యని వర్ణించియున్నాఁడు. ఏనుగు లక్ష్మణకవి నైషధ మూలకర్తవలె శ్రీనాథుఁడు కూడ "మహితచింతామణీదివ్యమంత్రసిద్ధుఁడ"ని తలంచెను. అందుకాతని అప్రతిమాన పాండితీకవితాప్రతిభలే కారణము.

పాండితీప్రకర్షచేకాక కవితాకౌశలముచే కూడ శ్రీనాథరచిత కావ్యములందెల్ల తలమానికమని చెప్పఁదగినది నైషధకావ్యము. "ఆంధ్రభాషా నైషధాబ్జభవుని" "ఆంధ్రభాషా మహాకావ్యము" అను ప్రయోగములను బట్టి శ్రీనాథునికికూడ నదే ఎక్కువ అభిమానపాత్రమైన గ్రంథముగా తోఁచుచున్నది.. "సంతరించితి నిండు జవ్వనంబునయందు హర్షనైషధకావ్య మాంధ్రభాష" అను సీసపాదమునుబట్టి యాతఁడు దానిని నిండుజవ్వనమున రచించినట్లు తెలియుచున్నది. నూనూగుమీసాల నూత్నయౌవన మనఁగా నిరువది యేండ్ల ప్రాయమనియు, నిండు జవ్వనమనగా నిరువదియైదు ముప్పది యైదేండ్ల నడిమి ప్రాయమనియు నిర్ణయింప వచ్చును. దీనిని బట్టి యాతఁడు క్రీ.శ. 1400 ఇంచుక ముందో వెనుకనో నైషధాంధ్రీకరణము నారంభించియుండును. అతఁడు నైషధమును ముగింపకముందే కొన్ని రాజకీయ కారణములచే అవచి తిప్పయసెట్టిని మెప్పించుటకై హరవిలాసమును రచించి, యాతనికి కృతియిచ్చి, తరువాత నైషధమునందలి చివరి యాశ్వాసములను రచించియుండునని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు (మనుమడు) భావించుచున్నారు. మామిడి సింగన శ్రీనాథుని నైషధకావ్యమునే ఆంధ్రీకరింపుమని కోరుటకు అనన్య సాధారణమైన దాని ప్రశస్తి మాత్రమేకాక మరొక కారణముకూడ నూహింపవీలగుచున్నది. ఆ కాలమున వెలమరాజులకును రెడ్డిరాజులకును రాజకీయముగనేకాక సారస్వతముగా కూడ విశేషమైన స్పర్ధకానవచ్చుచున్నది. సర్వజ్ఞ సింగభూపాలుని యాస్థానము నందుండిన మల్లినాథసూరి నైషధకావ్యమునకు సంజీవనీ వ్యాఖ్య రచించియుండెను. అట్లే విజయనగర ప్రాంతమునకుఁ జెందిన నరహరి పండితుఁ డును దాని కొక వ్యాఖ్యానము వెలయించి యుండెను. ఆ రెండిటికిని పోటీగా సింగనామాత్యుఁ డు విద్వత్కవిశేఖరుఁడును, తమ వంశమువారి కాశ్రితుఁడునైన శ్రీనాథుని నైషధాంధ్రీ కరణమునకు ప్రేరేచియుండును. నైషధవ్యాఖ్యాతలలో శ్రీనాథనామధేయుఁడు కూడ నొకఁడు కలఁడు. కాని యాతఁడు కవిసార్వభౌముని కంటె భిన్నుఁడు. స్వయముగా పండితుఁడైన సింగనకు నైషధకావ్యమన్న నభిమానము మెండు. శ్రీనాథుఁడాతని

**శ్రీహర్ష సుకవి కవితా**
**వ్యాహార కథా సుధారసాస్వాద సుఖ**
**శ్రీహర్షోదయ నిత్య స**
**మాహిత మహితాంతరంగ మామిడి సింగా !** 3-1

అని వర్ణించియుండెను. ప్రౌఢబంధురమైన నైషధమహాకావ్యము నిరాఘాట కవితానైపుణీ ధురీణుండైన శ్రీనాథునిచేతఁబడుట ఆంధ్రభాషాప్రియుల యదృష్టవిశేషమని చెప్పుటలో నతిశయోక్తి లేదు.

షట్చక్రవర్తులలో నొకడైన నలమహారాజు కథ వేదమునందలి వాజసనేయ సంహితయందును, భారతారణ్యపర్వమునందును, కథాసరిత్సాగరమునందును గలదు. శ్రీహర్షుడు భారతకథాసరిత్సాగరములందుండి కథ గ్రహించి చిఱుమార్పు లొనరించియు, వర్ణనాదులచే పెంచియు, సమకాలిక ప్రవృత్తుల నందందు చొప్పించియు దాని నొక మహాకావ్యముగా వెలయించెను. ఇది నలుని వర్ణనముతో నారంభించి తద్వంశ మూలపురుషుఁడైన చంద్రుని వర్ణనతో ముగియుచున్నది. నిషధాధిపతియైన నలుఁడును కుండినపురేశ్వరుఁడైన భీమరాజు కూఁతురు దమయంతియు నొండొరుల గుణ రూపసౌందర్యము లాలించి పరస్పరానురక్తచిత్తులై యుండిరి. నలుఁడొకప్పుడు వనమున విహరించుచు నందలి తటాక తీరమున కాంచనపక్షమగు నొక రాయంచను గాంచి పట్టుకొనెను. అది యార్తిచెంది తనతల్లిని భార్యను బిడ్డలను దలంచుకొని విలపింప నలుఁడు కృపాళుఁడై దానిని విడిచిపుచ్చెను. అది యానందించి, దమయంతి గుణరూపము లాతనికి వర్ణించిచెప్పి, యామె నిన్నుఁదప్ప నన్యు పరిగ్రహింపకుండునట్లుగా భవద్గుణములు ప్రశంసించి వచ్చెదను, నన్నుఁ బంపుమని యర్థించెను. నలుఁడు నీవు వచ్చునంతవఱకిచ్చటనే యుండెదను. పోయి కార్యము సాధించుకొని రమ్మని పంపెను. హంస కుండినపురమునకరిగి సఖులతో దమయంతి విహరించుచుండిన శృంగార వనమున వ్రాలెను. దమయంతి దానిని పట్టుకొనుటకై ప్రయత్నించుచు సఖులకు దూరముగా నరిగెను. అంత నా హంస ఆమెను జూచి మనుష్య భాషణములతో "నేను భూలోకమునందలి రాజులతో స్నేహము కలిగి వర్తించుచుందును. అందు నిషధాధీశుఁడగు నలుఁనందు నాకు పక్షపాతము మెండు. నేనాతనికడ చనవుకలిగి వర్తింతును. అతఁడుతప్ప నన్యుఁడు నిన్ను వరింప పాత్రుడు కాఁడు. నేను నిన్నాతనితోఁ గూర్పనేర్తును. నీ యభిమత మెఱింగింపు" మని పలికెను. దమయంతి తనకు నలునియందుఁ గల వలపెఱిఁగించి "తన్నాతనితోఁ గూర్చి ప్రాణములు నిలుపు" మని ప్రార్థించెను. హంస నలుఁడామెకై విరహవేదన ననుభవించుచున్నాఁడని పలికి యామె యనుజ్ఞ గొని నలునికడ కరుదెంచి జరిగిన వృత్తాంతమంతయు నాతనికి తెలిపెను. నలుఁడు దాని పరోపకారపరాయణతను, కార్యఘటనాచాతుర్యమును ప్రశంసించెను. హంస యతని వీడుకోలు

వడసి బ్రహ్మలోకమున కరిగెను. నలుడు దమయంతీ వియోగ విహ్వలుఁడై కాలము పుచ్చుచుండెను. దమయంతియు నలవియోగ దోదూయమాన మానసయై యొకరాత్రి సఖీజనులు పరివేష్టించియుండ చంద్రమన్మథోపాలంభన మాచరించి మూర్ఛిల్లెను. సఖులు శిశిరోపచారము లొనరించుచు కోలాహలము కావింప భీమరాజు దేవీసహితుఁడై యచ్చటి కరిగి, యావద్వృత్తాంతమువిని, దమయంతీస్వయంవరము చాటఁబంచెను.

ఆ సందర్భమున నింద్రుఁడు తన సభ కరుదెంచిన నారదపర్వతుల నుచితరీతి గౌరవించి పూర్వమువలె రాకుమారులు తనపురమునకు రాకుండుటకు కారణమేమని యడిగెను. నారదుఁడు దమయంతీస్వయంవరవృత్తాంత మెఱింగించి తద్గమనపరాయణులై భూలోక రాజకుమారులు యుద్ధములు మాని యున్నారనియు, అదియే వారమరలోకమునకు రాకుండుటకుఁ గారణమనియుఁ దెల్పెను. అది విని యింద్రుఁడు కూడ నా స్వయంవరమున కరుగ నిశ్చయించెను. అతనితోఁగూడ నగ్నివరుణులు కూడ ప్రయాణమైరి. వారు ముందుగా దేవకాంతలచే దమయంతికి కానుకలుగా మందార కుసుమ గుచ్ఛము లాదిగాఁగల దివ్యవస్తువులు పంపిరి. పిమ్మట వారు విమానారూఢులై భూలోకమున కరుదెంచి దమయంతీ స్వయంవరమున కేగుచుండి నలునిగాంచిరి. నలుఁడును దివ్య విమానారూఢులైన వారిని జూచి అద్భుత రసాక్రాంతచిత్తుఁడై రథము డిగి వారికడ కరుదెంచెను. వారొండొరులను గూర్చి యెఱింగిన పిమ్మట నింద్రుఁడు నలునిగాంచి యర్థులై వచ్చిన మమ్మాదరింపుమని పలికెను. నలుఁడించుకసేపాలోచించి ప్రాణమైనను ప్రాణాధికమైనను మీరడిగినది యిచ్చెదనని నిర్విశంకముగా నుత్తరమిచ్చెను. ఇంద్రుడంతఁ దాము దమయంతిని కాంక్షించి వచ్చుట తెల్పి యా విషయమున దూత కృత్యము కావింపవలెనని నలునడిగెను. నలుండు తానుకూడ నా కోరిక తోడనే యేగుచుండుట యెఱింగించి యెంత వేడుకొన్నను వారు వినరైరి. నలుఁడు చేయునదిలేక తద్దౌత్యభారము వహించెను. దేవతలతనికంతఃపుర ప్రవేశమున కనువుగా తిరస్కరణీవిద్య నుపదేశించిరి. నలుడు కుండినపురము చేరి అమాత్యులను రథమును ఒక్కచోనిల్పి, తానొక్కరుఁడును పాదచారియై రాజమందిరము డాసి, యేనుంగు మొగసాల గడచి, కక్ష్యాంతరములు ప్రవేశించి యంతిపురము చొత్తెంచెను. తరువాత నాతఁడు దమయంతీ సభాభవనముచేరి యొక పార్శ్వమున వేచియుండెను. దమయంతియు సఖీజనులతో నచ్చటి కరుదెంచి యొక్క బంగారుపీఠము నధివసించెను. అప్పుడు దేవతలు పంపిన దూతికలువచ్చి, దమయంతికి కానుక లర్పించి వారిని వరింప వేడుకొనిరి. దమయంతి తనమనసు నలమహారాజున లగ్నమైయుండుటెఱింగించి వారిని పంపివైచెను. నలుఁడు చికురాదిపదనఖాంతముగా దమయంతి సౌందర్యమును వర్ణించి తానామెకుఁ గనఁబడుటకై దేవతాపరికల్పితమైన శాంబరిని వీడెను. దమయంతి యాతనిగాంచి, యాతిథ్యసత్కారప్రధానపూర్వకముగా కూర్చుండ నియోగించి, నీవెవ్వర వెందుండి యెట్లువచ్చితి

వెఱిఁగింపుమని యడిగెను. నలుడు దిక్పతుల యాస్థానమునుండి యామెకతిథిగా వచ్చినవాడనని తెల్పి, యింద్రాగ్నివరుణులామెకై పడుచున్న విరహబాధను వారు తన ముఖమున బంపిన వాచికమును వివరించి, వారిలో నొకరిని వరింపుమని వేడుకొనెను. దమయంతి తాను మానవియు, దిక్పాలురు దివ్యులునగుట తాను వారికిఁ దగననియు, నలునే తాను వలచితిననియు, నతడు తన్నొల్లనిచో నేదోవిధమున మరణింతుననియుఁ బలికెను. నలుఁ డెట్లుమరణించినను ఆమె దిక్పాలుర వశమగుట తప్పదని హేతువాదపూర్వకముగా నిరూపింపఁ జేయునది లేక యామె రోదించెను. నలుఁడదిచూచి విభ్రాంతుఁడై తన్ను తనువచ్చిన కార్యమును మఱచి, తన పేరెఱిఁగించి మన్మథోన్మాదము ప్రకటించెను. తరువాత నతఁడు ప్రాప్త సంస్కారుఁడై పేరుతెల్పి దౌత్యభంగమొనరించినందుకు వగచుచుండ దమయంతి యాతని నలునిగా నెఱిఁగి గద్దెడిగి యవనికాంతరమున కేగెను. చెలికత్తె మన్మథుని బారినుండి దమయంతిని రక్షింపుమని ప్రార్థించెను. నలుఁడు గాంభీర్యము వహించి, ఆ పలుకు వినఁడయ్యెను. దమయంతి నిక్కపు దూతకాని నలునిముందు తానాడిన మాటను తలంచి దురపిల్లుచుండఁ దొల్తటి కనకహంసమరుదెంచి నలదమయంతుల నూఱడించి చనెను. నలుఁడు దిక్పాలుర నుద్దేశించి తన తప్పు మన్నింప వేడుకొనెను. దమయంతి దిక్పాలురును అన్యరాజులును చూచుచుండ నలుని వరింతునని పలికెను. నిగూఢాకృతితో నంతయుఁ బరికించుచున్న దేవతలు నలుని మనశ్శుద్ధికి మెచ్చుకొనియు దమయంతికి తమయెడఁగల వైముఖ్యమునకు వెతనొందుచు వంచనారూపమున నలరూపము ధరించి స్వయంవరకాలము ప్రతీక్షించుచుండిరి. నలుఁడును అంతఃపురమునుండి యరిగి తనకై నిర్దేశింపఁబడిన రమ్యప్రదేశంబున సపరివారముగా విడిసియుండెను.

దమయంతి స్వయంవరమునకు ముల్లోకముల రాజులు నరుదెంచి తమతమ యాసనములందు కూర్చుండిరి. వారివారి గుణశీలములు దమయంతి కేర్పఱిచి తెలుప భీమరాజు సరస్వతీదేవిని వేడుకొనెను. సరస్వతి యా సభాస్థానమున ప్రత్యక్షమయ్యెను. సభాసదులందఱు నామెకు నమస్కరించిరి. దమయంతి యలంకృతయై స్వయంవరాస్థానమున కరుదెంచెను. సభాసదులైన రాజులెల్లరు నాశ్చర్యచకితులై యామె సౌందర్యము వీక్షించిరి. దమయంతి పల్లకి దిగి సరస్వతికి నమస్కరింప నామె యాశీర్వదించి స్వయంవరాగతులైన ముప్పదిమూడుకోట్ల దేవతలను, వాసుకిని, నవదీపాధిపతులను, ఉజ్జయినీ మధురాయోధ్యా కాశీరాజులను, పాండ్యనేపాళ కాళింగ కీకటోత్కళాధినాథులను వేర్వేర నెఱింగింప దమయంతి వారియెడ ననాదరము ప్రదర్శించెను. తరువాత సరస్వతి సమానాకారులైన నలుర నేవురను దమయంతికిఁ జూపి నలునికిని ఇంద్రాదులకు నన్వయించునట్లుగా గూఢశబ్దార్థ సంశ్లేషరూఢి మెఱయ వారి గుణరూపములు వర్ణించెను. దమయంతి వారిలో నలుఁడెవ్వరో యేర్పఱుపలేక విభ్రాంతయై నేలబొందని పాదములచేతను, కందని పూదండలచేతను, అనిమిషనేత్రముల

చేతను దిక్పాలురను గుర్తించి, భక్తిపూర్వకముగా వారిని స్తుతించి, నలునివైపున కెడయాడు దృష్టినెట్లో మగిడించి, సరస్వతిని దిలకింప నామె దమయంతి ననుగ్రహింపవలెనని దేవతల వేడుకొనెను. ఇంద్రాదులు నలాకారములు విడిచి సహజరూపముల ధరించిరి. అప్పుడు సరస్వతి "వీరింద్రాదులు, ఇతఁడు నలుఁడు" అని తెలుప దమయంతి తనచేతనున్న మధూకదామమును నలుని కంఠమునచేర్చి, యాతని వరించెను. ఇంద్రాదులా నవదంపతులకు వరము లొసంగిరి. సరస్వతి నలునికి చింతామణీ మంత్రము నుపదేశించి దాని మహిమ యెఱింగించెను. పిమ్మట నామెయు దేవతలును విమానారూఢులై తమతమ నెలవుల కరిగిరి. దమయంతి సఖీజనపరివృతయై యాత్మమందిరమున కేగెను. నలుఁడర్థికోటిపై బంగారువర్షము కురియించుచు తన శిబిరము ప్రవేశించెను.

విదర్భరాజునానతిచే కార్తాంతికులు వివాహముహూర్తము నిర్ణయించిరి. ప్రౌఢాంగనలు నలదమయంతులను వివాహోచితముగ నలంకరించిరి. తరువాత దముఁడు శిబిరమునకరిగి నలుని వివాహమంటపమునకుఁ గొనివచ్చెను. యథావిధిగా పాణిగ్రహణమహోత్సవము జరిగెను. బువ్వపుబంతియైనపిమ్మట పెండ్లిదొరలు నిజనివాసముల కరిగిరి. నాల్గురోజుల యనంతరము నలుఁడు దమయంతితోఁగూడ తన రాజధానికి పయనమై పురప్రవేశము కావించెను. సురలు పూలవాన కురియించిరి. ఇంద్రాది దిక్పాలు రూర్ధ్వలోకమున కరుగుచుండఁగా దొలుత రతీసహితుఁడైన మన్మథుడును, తరువాత క్రోధుఁడును, పిమ్మట లోభుఁడును, అనంతరము మోహుఁడును వారి కెదురుపడిరి. పిదప వారికి కలిరాజెదురుపడి నమస్కార పూర్వకముగా కుశల ప్రశ్నలు కావించి "నేను దమయంతీ స్వయంవరమున కరుగుచున్నాఁ డను, నా కోరిక సఫలమగునట్లుగా ననుగ్రహింపుఁ"డని ప్రార్థించెను. ఇంద్రాదులాశ్చర్యచకితులై "దమయంతీ స్వయంవరము జరిగిపోయెను. అచ్చటినుండియే మేమరుదెంచుచున్నాము. ఆమె వేల్పులను, నాగులను, అన్యరాజులను ఉజ్జగించి నలుఁ డనువాని వరించెను. ఇప్పుడడుగుటవలన నేమి లాభము. మరలిర"మ్మని పలికిరి. అంత కలి క్రుద్ధుఁడై "దమయంతి మిమ్మందఱవిడిచి నలుని వరింప మీరెట్లు సైచిరి. నేనారాజును మోసపుచ్చి ఆ మచ్చెకంటి నెత్తుకొని మింటిమీదికిఁ దెచ్చెదను. మీరు నలుగురును నేనును పాండవులు పాంచాలినివలె నామెను పెండ్లిచేసికొందమని పలికెను. ఇంద్రాదులాతని మాటలకు రోసి, నలుని మహానుభావత్వమెఱింగించి, భూలోకమున కరుగవలదని నిషేధించిరి. కలివారి యుపదేశమును పెడచెవినిబెట్టి "ఏదో యొక దోషము నెపముగా చేసికొని నేనా నలునిబట్టి దమయంతిమీఁది వలపుడిగింతు"నని ప్రతినగావించెను. దేవతలు బ్రహ్మ నియోగమట్లున్నది కాఁబోలునని తలంచి తమదారి నరిగిరి. కలియు కామక్రోధలోభమోహ పరివార పరివృతుఁడై నిషధదేశము సమీపమున భూమండలమునకు దిగెను. అతఁడు పాషండ జైన కపట ధార్మికమిత్రుఁడై నిషధదేశమున కొన్ని దినములుండి యెందును బాపము

రూపింపనేరక, ద్వాపరకామక్రోధలోభమోహుల నాయా పనులందు నియోగించి, శుద్ధాంతలీలా వనమునందలి తాఁడిమ్రాని కోటరమున రంధ్రాన్వేషణ తత్పరుఁడై వసించెను.

నలదమయంతులు యథావిధిగా గృహప్రవేశము కావించి శిల్పిజనులలంకరించిన విహారసౌధము ప్రవేశించిరి. అందు నలుఁడు దమయంతితోఁ గూడి వివిధ విహారము లొనరించెను. వారు నిధువనక్రీడా పరాధీనులై యానందజలధి నోలలాడుచుండ రాత్రి తెల్లవారెను. అప్పుడు నలుఁడు వైతాళికగీతములచే మేల్కని భీమరాజు కన్యాప్రదానవేళనిచ్చిన దివ్యరథముపై నెక్కి సురనదిలో స్నానమాచరించి వచ్చెను. అతఁడింటికి రాఁగనే తన్నెదుర్కొన్న దమయంతికి తానాకాశగంగనుండి తెచ్చిన కనకారవిందమును గానుకగానిచ్చెను. తరువాత నతఁడగ్నిహోత్రగృహమునకేగి ప్రాహ్ణకృత్యము లొనరించి కొంతవడి దమయంతితోడను నర్మసాక్షిణియగు కళావతి తోడను సరససల్లాపములు కావించెను. అంతలో మధ్యాహ్నము కాఁగా నతఁడు జలకమాడి శివుని పూజించెను. పిమ్మట హరిపూజ యొనర్చి దశావతార వర్ణనపూర్వకముగా హరిని స్తుతించెను. దేవతార్చనానంతరమతఁడు భోజనకార్యము తీర్చి కేళీసౌధమున దమయంతితోఁగూడ సాయంకాలము వఱకు శృంగారక్రీడలతో ప్రొద్దుపుచ్చెను. పిమ్మట నక్షత్రము లుదయించెను. అంధకారము వ్యాపించెను. నలుఁడు సంధ్యోచిత క్రియలాచరించి క్రీడాసౌధము నేడవనిలువునకు దమయంతీ సమేతముగా నరిగి, యచ్చట నంతఃపురకాంతలు పరివేష్టింప గొలువుండెను. అప్పుడు చంద్రుఁడుదయించెను. నలుఁడు దమయంతికి నిజవంశ మకుటమాణిక్యమైన యాతని వర్ణించిచెప్పి రమణీ సమేతముగా నతనికి పుష్పాంజలి సమర్పించెను. ఈ విధముగా నా దంపతులు ప్రాజ్యములగు రాజసుఖములనుభవించిరి. మేఘములు కాలము తప్పక వర్షించెను. దేశము ధనధాన్యసమృద్ధమయ్యెను. సకలజనులు పరమానందము నొందిరి.

శ్రీహర్షుఁడు తన కావ్యమునకు నైషధీయచరితమను పేరు పెట్టెను. నైషధమనునది దాని సంగ్రహనామము, అందు నలదమయంతుల హృదయములందు ప్రణయ మంకురించి వికాసము నొందుటయు వారి వివాహమును తరువాత వారు శృంగార లీలల నొనరించుటయు వర్ణింపఁబడి యున్నవి. చివరి యాశ్వాసమును సప్తమాశ్వాసమందలి యుత్తరార్ధమును శృంగార రసమయములు. అందుచేతనే కావ్యము యొక్క శృంగార ప్రధానత్వమును సూచించుచు శ్రీనాథుఁడు దానికి శృంగార నైషధమను సార్థకమైన నామమొసంగెను. కావ్యోపసంహారమున నాతఁడు "నైషధ శృంగార కావ్య ప్రబంధంబున"నని మూలకావ్యమును గూడ శృంగార కావ్యప్రబంధమనియే పేర్కొనియుండెను. అందుకు శృంగారవర్ణన ప్రధానమైన కావ్యస్వభావమే కారణము.

ఆంధ్రవాఙ్మయము సంస్కృతానువాదములతోడనే యారంభమైనది. కవిత్రయమువారు పంచమవేదమైన మహాభారతమును, మారన కేతనలు మార్కండేయ పురాణ దశకుమార చరిత్రములను, భాస్కరాదులు శ్రీమద్రామాయణమును ఆంధ్రీకరించిరి. ఆ కాలమును, అప్పటి

అవసరములను పురస్కరించుకొని వారాపురాణాదులను చేపట్టియుండిరి. ధర్మనీతితత్త్వ ప్రధానములైన పురాణములనుకాక, రసవర్ణనప్రధానములైన సంస్కృత కావ్యముల ఆంధ్రీకరణమునకు శ్రీకారముచుట్టినవాఁడు శ్రీనాథుఁడే. ఆంధ్రవాఙ్మయమునందలి ఆంధ్రీకరణవిధానమును మూఁడు రకములుగా వింగడింపవచ్చును. కవిత్రయమువారిది కథానువాదపద్ధతి. వారు మూలమునందలి కథాసూత్రమును మాత్రము విడువక వర్ణనాదుల ననవసరమని తోఁచినచోట్ల తగ్గించియు, నవసరమని తోఁచినచోట్ల పెంచియు, ననుచితమని తోఁచిన కొన్ని భాగముల నన్యథాకరించియు ననువాదము కూడ స్వతంత్ర కావ్యముగా భాసించునట్లొనరించియుండిరి. వారవలంబించిన విధానమత్యంత స్వతంత్రమైనది. ఆధునికుల అనువాదపద్ధతిని పదానువాదమని చెప్పవచ్చును. వీరు మూలమునందలి కథాభావములనేకాక పదముల నన్నింటినిగూడ ననువదించుటయందు శ్రద్ధవహింతురు. కొన్నిచోట్ల మూల సాహాయ్యము లేకుండ వీరి యనువాదముల నర్థము చేసికొనుట క్లేశకరముగానుండును. వీరి దత్యంత మూలవిధేయకమైన పద్ధతి. శ్రీనాథుని అనువాదవిధానము కవిత్రయమువారి అనువాదమువలె నత్యంత స్వతంత్రమైనదియు కాదు. ఆధునికుల దానివలె నత్యంత మూలవిధేయమునుగాదు. అతఁడు మూలము ననుసరించుచునే భావముల నెక్కడను విడిచిపెట్టక యెడనెడ స్వాతంత్ర్యము ప్రకటించుచుండును. ఈ పద్ధతిని భావానువాదపద్ధతియని చెప్పవచ్చును. అనువాదమై యుండియు పఠితల నలరింపఁజాలు నీ పద్ధతి మిగిలిన రెండింటికంటె ప్రశస్తతరమై పరిఢవిల్లునని వేఱుగా చెప్పనక్కఱలేదు.

సంస్కృతనైషధము నారికేళపాకమున రచింపఁబడిన ప్రౌఢకావ్యము. దాని నర్థము చేసికొని యానందించుటకు కొంత ప్రయత్నమును పాండిత్యమును గూఁడ గావలయును. కృతిపతి తన్ను నైషధము నాంధ్రీకరింపుమని కోరు సందర్భమున శ్రీనాథుఁడు

**పనివడి నారికేళఫల పాకమునం జవియైన భట్టహ**
**ర్షుని కవితానుగుంభములు సోమరిపోతులు కొందఱయ్యలౌ**
**నని కొనియాడనేర రదియట్టిద లేజవరాలు చెక్కుగీ**
**టిన వసవల్చు బాలకుఁడు దెందమునం గలఁగంగ నేర్చునే**

యను పద్యమున నీ విషయమును వ్యక్తము చేసియున్నాఁడు. అతని యాంధ్రీకరణము పాకమునందును ప్రౌఢతయందును సర్వవిధముల మూలముతో తులతూఁగుచుండును. కావ్యోపసంహారమున నతఁడు "శబ్దంబనుసరించియు, నభిప్రాయంబు గుఱించియు, భావంబుపలక్షించియు, రసంబు పోషించియు నలంకారంబు భూషించియు, నౌచిత్యంబాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు, మాతృకానుసారంబున నశేష మనీషి హృదయంగమముగా" ననువాదము సాగించినట్లు చెప్పుకొనియున్నాఁడు. ఈ లక్షణము లన్నియు నాతని యనువాదమున కనిపించును. మూలగౌరవమునకును అర్థభావములకును

ఎందును భంగము కలుగకుండ నౌచిత్యభాసురముగా ననువాదమును నిర్వహించుట కత్తిమీఁది సాముపలె కష్టైకసాధ్యమైన కార్యము. శ్రీనాథుఁడాకార్యము నత్యంత హృద్యముగను అవలీలగను కావించి శృంగారనైషధమును తన ప్రతిభా పాండిత్యములకు పట్టుఁగొమ్మగను ఆంధ్రసరస్వతి యఱితి కమూల్యాలంకారముగను పరిష్కరించియున్నాడు.

శ్రీనాథుఁడు సాధారణముగా మూలమునందలి యొక్కొక్కశ్లోకమునకొకొక్క పద్యము చొప్పున వ్రాయుచుండును. సీసములందు మూఁడు నాలుగు శ్లోకముల యొక్కయు భావము నాత డిముడ్చుచుండును. మూలమునందలి యొక్క శ్లోకములోని భావము నాతఁడు రెండు మూఁడు పద్యములలో వివరించిన పట్లును కొన్ని లేకపోలేదు. కాని యట్టివాని సంఖ్య చాల తక్కువ. మూలశ్లోకభావము తెలుఁగు పద్యమునకు చాలనప్పుడాతఁడు దాని నించుక పెంపొందించుటయో పద్యమును పూర్తి చేయుటకై కొంతభాగమును కల్పించుటయో యెడనెడ కానవచ్చుచుండును. మూలమునందలి పదముల నన్నిటినిగాక భావములను స్పష్టముగా వివరించుటకే యాతఁడు యత్నించినట్లు కన్పించును. కొన్ని చోట్ల నాతఁడు మూలభావమును సంగ్రహించును; కొన్నిచోట్ల నౌచిత్యదృష్టితో నించుక మార్పు చేయును. అతఁడనువదింపక విడిచివైచిన శ్లోకములును పెక్కుకలవు. అనౌచిత్యమును, పునరుక్తులను, క్లిష్టములైన శ్లేషలను, అనావశ్యక వివరణమును పరిహరింప నెంచుటయే యందుకు కారణము.

శ్రీనాథుఁడు వ్యభిచారియను ప్రతీతి లోకమునందున్నది. అది యెంతవఱకు సత్యమో మనము చెప్పఁజాలము. కాని శృంగార రసపోషణమున నాతని కభినివేశము మెండని చెప్పుటలో మాత్రమతిశయోక్తిలేదు. రచనలలో శృంగారరసమునుచక్కఁగా పోషించువారందఱును జీవితములోఁ గూడ శృంగార క్రియాలాలసులై యుందురని భావించుట యుక్తము కాదు. శృంగార రసపోషణాసక్తి కలవాఁడయ్యును నైషధమున శ్రీనాథుఁడౌచిత్య దృష్టితో కావించిన మార్పులావిషయమున నాతనికిఁగల నిగ్రహమును ప్రదర్శించును. హంస దమయంతికి నలుని సౌందర్యమును వర్ణించిచెప్పునప్పుడు మూలకర్త రంభాద్యప్సరసలనేకాక యింద్రాణియు త్రిమూర్తుల భార్యలైన సరస్వతీ లక్ష్మీపార్వతులనుగూడ నాతని యతిలోక సౌందర్యమును గూర్చి విని చిత్తవిభ్రాంతికి లోనైరని వర్ణించియుండెను. లోకమాతలైన ఆ సతీమ తల్లుల కట్టి చిత్త వికారము కలిగెనని యూహించుట యసంభావ్యమును అనుచితమును అగుటచే శ్రీనాథుఁడా శ్లోకము లనువదింపక విడిచివైచెను. దేవవేశ్య యగుటచే రంభయందట్టి వికార మసంగతముకాదని తలంచుటచే కాఁబోలు నా శ్లోకమును మాత్రమనువదించెను. ఆ శ్లోకమిది.

**అస్మత్కిల శ్రోత్ర సుధాం విధాయ**
**రంభా చిరం భామతులాం నలస్య**
**తత్రానురక్తా తమనాప్య భేజే**
**తన్నామగంధా న్నలకూబరం సా.** 3-26

(రంభ నలుని సాటిలేని కాంతిని గూర్చి చిరకాలము నా వలన విని శ్రవణామృతమును బొంది, యతనియందనురక్తయై యతని బొందలేక తన్నామ వాసన యుండుటచే కుబేర సుతుడైన నలకూబరుని పొందెను.) దీనిని శ్రీనాథుఁడు

**విను కలిఁ గూర్మిఁజిక్కి పృథివీ భువనంబునకుం డిగంగ నే**
**యనువునులేక రంభయను నచ్చరలేమ, నలున్ వరింపఁబూ**
**నిన తనకోర్కి నొక్కమెయి నిండఁగఁ జేయుటకై భజించె దాఁ**
**గొనకొని వేల్పులందు నలకూబరుఁ దచ్ఛుభనామ వాసనన్.** 2-54

అని యథామాతృకముగా ననువదించెను. మూలమునందలి 'అనాప్య' అను పదము నాతఁడు "పృథివీ భువనంబునకున్ డిగంగ నేయనువునులేక" యని కారణసూచన పూర్వకముగా చక్కగా వివరించెను.

నలుఁడుద్యానవనమున హంసనుగాంచి దానినిబట్టుకొన సంకల్పించినప్పుడు రతిక్లమాలసమైన యది క్షణకాలమొంటికాలిపై నిలిచి,యడ్డముగా మెడవంచి, ఱెక్కచే శిరమును కప్పికొని పల్వలసమీపమున నిద్రించెనని శ్రీహర్షుఁడీ క్రిందిశ్లోకమున వర్ణించియున్నాఁడు.

**అథావలంబ్య క్షణమేకపాదికాం**
**తదానిదద్రా వుపపల్వలం ఖగః**
**స తిర్యగా వర్జిత కంధర ః శిరః**
**పిధాయ పక్షేణ రతి క్లమాలసః** 1-121

నలుఁడు తన్ను బట్టుకొన్న పిమ్మట నాతనికి దయ కలిగించుటకై హంస తన తల్లిని ప్రియురాలిని తలంచుచు విధిని గూర్చి యిట్లు పల్కినదని మూలమందున్నది.

**మదేకపుత్రా జననీ జరాతురా**
**నవప్రసూతిర్వరటా తపస్వినీ**
**గతి స్తయోరేష జన స్తమర్దయ**
**న్నహోవిధేత్వాం కరుణారుణద్ధినో** 1-134

(నా తల్లికి నేనొక్కండనే పుత్రుఁడను. ఆమె ముసలిది. క్రొత్తగా ప్రసవించిన నా భార్య దీనురాలు. వారిరువురికిని దిక్కు నేనే. అట్టి నన్ను పీడించు నో విధీ! నిన్ను దయ అడ్డగించుటలేదా.) పై శ్లోకమున హంస రతిక్లమాలసమని వర్ణింపఁబడినది. ఈశ్లోకమున హంసభార్య నవప్రసూతి యని చెప్పఁబడినది. భార్య నవప్రసూతియై యుండ భర్త రతిక్లమాలసుఁ డగుట విరుద్ధముగా తోఁచి కాఁబోలు శ్రీనాథుఁడనువాదమున నా రెండు విశేషణములను విడిచివైచి రెండవ శ్లోకము నిట్లనువదించి యున్నాఁడు.

**తల్లి మదేకపుత్రక, పెద్ద, కన్నులు**
**గానవిప్పుడు మూడుకాళ్ళముసలి**
**ఇల్లాలు కదు సాధ్వి యేమియు నెఱుఁగదు**
**పరమ పాతివ్రత్య భవ్యచరిత**
**వెనుకముందరలేరు నెవరైన చుట్టాలు**
**లేవడి యెంతేని జీవనంబు**
**గానక కన్నసంతానంబు నిసువులు**
**జీవన స్థితికేన తావలంబ**

**కృపఁ దలంపఁగదయ్య యో నృపవరేణ్య**
**యభయ మీవయ్య యో తుహినాంశువంశ**
**కావఁగదవయ్య యర్థార్థి కల్పశాఖి**
**నిగ్రహింపకుమయ్య యో నిషధరాజ.** 1-109

మూలమున హంస తన తల్లి ముదుసలితనమును తన భార్య దీనత్వమును బేర్కొని తన్నట్లు నలునిచేతికి పట్టువడునట్లొనరించి పీడించుచున్న విధి నిర్దయత్వమును నిందించినట్లున్నది. శ్రీనాథుఁడు తన తల్లి యిల్లాండ్ర స్థితితోపాటు తమ లేవడి జీవమును, సంతానము వృత్తాంతమును, తానే జీవనస్థితికి తావలమై యుండుటనుగూడ తెల్పి తన్ను నిగ్రహింపక యభయ మొసఁగి కాపాడుమని నలుని దీనముగా వేడుకొన్నట్లు వర్ణించెను. పై సీస పద్యమున మొదటి రెండు పాదములకును కొంత మూలాధారమున్నది. మిగిలిన భాగమంతయు సందర్భానుకూలముగా నాతఁడు కల్పించి వ్రాసినదే. దైన్యసూచకమైన యిందలి హంస ప్రార్థనమెంతో యౌచిత్యశోభితమై నలునికే కాక పాఠకులకును జాలి పుట్టించుచున్నది.

హంస దమయంతికి నలుని గుణగణములను వర్ణించి చెప్పుటకు ముందతనికిని తనకును గల పరిచయము నెఱింగించు సందర్భమున శ్రీహర్షుఁడు

**సువర్ణశైలా దవతీర్య తూర్ణం**
**స్వర్వాహినీ వారికణావకీర్ణైః**
**తం వీజయామః స్మరకేళికాలే**
**పక్షై ర్నృపం చామరబద్ధ సఖ్యైః** 3-22

అను శ్లోకమును రచించెను. "మేము మేరు పర్వతము నుండి శీఘ్రముగ దిగి ఆకాశగంగాజలకణములచే వ్యాప్తము లైనవియు వింజామరలతో సాదృశ్యము గలవియునైన మా ఱెక్కలచే సురతకాలమందు నలునికి వీచుచుందు" మని దీని యర్థము. హంస యీ వాక్యముల నాగర్భ శ్రీమంతురాలును యౌవనవతియైన దమయంతితో నలుని

వివాహమాడుమని ప్రోత్సహించుటకై చెప్పుచున్నది. స్మరకేళికాలే యనుటవలన నలుఁ డప్పుడప్పు డన్యస్త్రీ రతాసక్తుఁడౌ కాలము పుచ్చుచుండునని వ్యక్తమగుచున్నది. ఈ విషయము దమయంతికి నలునియెడ వైముఖ్యము పుట్టించుట కవకాశమున్నది. ఈ యనౌచిత్యమును తొలగించి శ్రీనాథుఁ డీశ్లోకమును–

**కనకశైలంబు డిగ్గి యాకాశసింధు**
**సలిలములఁ దోగి మిగులంగఁ జల్లనైన**
**చారుహాటకమయ గరుచ్చామరముల**
**వీతు నతనికి వైశాఖవేళయందు** 2–51

అని యనువదించెను. స్మరకేళీకాలమునకు బదులుగా వైశాఖవేళ నిచ్చుట చొప్పించుట శ్రీనాథుని యౌచిత్యదృష్టి యెంత గాఢమైనదో వెల్లడి చేయుచున్నది.

నలదమయంతుల వివాహమైన పిమ్మట బువ్వపుబంతిని వర్ణించు సందర్భమున మూలము ననుసరించియే శ్రీనాథుఁ డీక్రింది పద్యములను రచించెను.

**లలన యొకర్తు వగ్గు కృకలాసముఁ జేరఁగఁ దెచ్చి వంచనన్**
**నలునకుఁ గుంచెవట్టు నెలనాగ పదద్వయ మధ్యమంబునన్**
**నిలిపినఁ, గాలుప్రాఁకనది నీవియసీమకుఁ, దోడి భామినుల్**
**గలకల నవ్వ నూడ్చెనది గట్టిన పుట్టము పాయ శూన్యతన్** 6–111

**అవ్వలిదిక్కు మోమయి ప్రియంబున నొందులతోడ ముచ్చటల్**
**ద్రవ్వుచు నొక్కకోమలి పరాకున నుండఁగ ధూర్తుఁడొక్కరుం**
**డివ్వలవచ్చి వంచనమెయిన్ నునుమించు మెఱుంగుటద్దమున్**
**నవ్వుచుఁ బట్టె దానిచరణంబులకున్ నడుమైన మేదినిన్** 6–113

ఇట్లే నిషధమున కలిపురుషుని వర్తనమును వర్ణించు సందర్భమున

**యజమాన ప్రమదా వికస్వర భగన్యస్తాశ్వ దీర్ఘ స్మర**
**ధ్వజదండంబగు నశ్వమేధ మఖతంత్రంబు న్నిరీక్షించి యి**
**క్కుజనుం డొత్తిలినవ్వె వేదవిదులం గుత్సించి పుష్పాస్త్రుచే**
**నిజహస్తంబునవ్రేసి యశ్రుకణముల్ నిండార నేత్రంబునన్** 7–133

అను పద్యము కానవచ్చుచున్నది. మొదటి రెండు పద్యములందును శృంగారమును మూఁడవపద్యమున జుగుప్సయు మితిమీఱి గోచరించుచు ననౌచిత్యశంక కలిగించుచున్నవి. ఔచిత్య దృష్టిగల శ్రీనాథుఁడు వీని నేలపరిహరింపలేదని యెవ్వరైన ప్రశ్నింపవచ్చును. బువ్వపుబంతివేళ జరుగు పరిహాసాస్పదములైన వికారచేష్టలను, కలిపురుషుని వర్తనమునందలి

జుగుప్సను ప్రకటించు నుద్దేశముతోడనే శ్రీనాథుఁడు వీనిని విడువక యనువదించెనని కొందఱు విమర్శకులు భావించియుండిరి. కాని వీనిని యిట్టిభావమునే ప్రకటించు (6–132) మఱికొన్ని పద్యములను శ్రీనాథుఁడు పరిహరించియుండవలసినది.

సంస్కృత నైషధము నలకీర్తి తేజో వర్ణనాత్మకములైన యీ క్రింది రెండు శ్లోకములతో నారంభించుచున్నది.

**నిపీయ యస్య క్షితి రక్షిణః కథా**
**స్తథా ద్రియంతే న బుధా స్సుధామపి**
**నల స్సితచ్ఛత్రిత కీర్తిమండల**
**స్స రాశి రాసీన్మహసాం మహోజ్జ్వలః** 1–1

**రసైః కథాయస్య సుధా వధీరిణీ**
**నల స్సభూజానిరభూద్గుణాద్భుతః**
**సువర్ణ దండైక సితాత పత్రిత**
**జ్వలత్ప్రతాపావళి కీర్తిమండలః** 1–2

(ఏ మహారాజు కథల నాస్వాదించి దేవతలమృతమునుగూడ నాదరింపరో, అట్టి నలుఁడు వెల్లగొడుగుగాఁ జేయఁబడిన కీర్తిమండలము కలవాఁడై తేజోరాశియగు సూర్యునివలె ప్రతాపశాలియై యుత్సవములతో నొప్పారు చుండెను. ఏ రాజుకథ రుచులచే నమృతమును ధిక్కరించుచున్నదో అట్టి నలమహారాజు గుణములచే లోకోత్తరుఁడై బంగారు దండముగను ఏక శ్వేతచ్ఛత్రముగను చేయఁబడిన ప్రకాశించు ప్రతాపావళియు యశస్సమూహమును గలవాడై యుండెను.)

ఈ రెండు శ్లోకములందును గల భావము కొంచెమించుమించుగా సమానమే. రెండవశ్లోకమున ప్రతాపావళియందు సువర్ణ దండత్వ మారోపింపఁబడుట మాత్రము విశేషము. శ్రీనాథుఁ డిందలి పునరుక్తి నూహించి రెండవ శ్లోకమునందలి యుత్తరభాగమును మాత్రము “తపనీయ దండైక ధవళాతపత్రితోద్దండతేజఃకీర్తిమండలుం” డని సీసపద్య ప్రథమపాదముగా ననువదించెను. ఇట్లిచ్చట రెండు శ్లోకముల నొక్కపాదముగా ననువదించుట వలన మూలకర్త భావమునకు చెప్పఁదగిన భంగమేమియు కలిగియుండలేదు.

నలుఁడు దిక్పాలురనుభవించు దమయంతీ విరహవేదనను వివరించి, వారి సందేశమును గూడ నామెకెఱింగించి, వారిలో నొక్కరిని వరింపుమని యామెను ప్రార్థించెను. ఆ సందర్భమున దమయంతి నలుని వాక్నైపుణ్యమును ప్రశంసించి తనకా దూతవృత్తాంతము నెఱుంగుటయందే యెక్కువ కుతూహలము కలదనియు, నుదకపానముచే శాంతించు దప్పి మధుదుగ్ధాదు లధికముగా సేవించినను శాంతింపదనియుఁ బల్కినట్లు శ్రీహర్షుడీ క్రింది శ్లోకమును రచించెను.

**గిరశ్శృతా ఏవ తవ శ్రవస్సుధాః**
**శ్లథా భవాన్నా మ్నిచ తే శ్రుతిస్పృహా**
**పిపాసుతా శాంతి ముపైతి వారిణా**
**నజాతు దుగ్ధా న్మధునోఽ_ధికాదపి** 9-5

దప్పి నీరుత్రాగినచో పూర్తిగా తొలcగి పోవుట సత్యమే. కాని పాలు తేనె మున్నగువానివలన కూడా కొంతవఱకుపశమించుటలో సందేహములేదు. ఇచ్చట దమయంతితో ప్రసంగించుచున్న దూత (నలుని) వృత్తాంతముదకము. దిక్పాలుర యుదంతము మధుదుగ్ధసదృశము. అందుచే పై శ్లోకమునందలి భావమును బట్టి దిక్పాలకోదంత శ్రవణముచే దమయంతి శ్రుతిస్పృహ కొంత వఱకైన తగ్గెననుట కవకాశమున్నది. కాని అది సత్యము కాదు. దిక్పాలుర యుదంత మెంత వినినను దూతవంశ నామాదికము వినవలెనను కుతూహలమామెకు తగ్గలేదు సరికదా కొంతయతిశయించుటయు జరిగెను. ఈ విషయమును వ్యక్తము చేయుటకై శ్రీనాథుcడు మూలమునందలి భావమునించుక మార్చి యాశ్లోకము నిట్లనువదించెను.

**అధిక తరులైనc గాని దిశాధిపతులు**
**కౌతుకము నాకు నీ వంశ కథలయందె**
**దప్పిగొన్నట్టి వారికా దప్పితీఱ**
**సలలిలపూరంబు హితవొ యాజ్యంబు హితవొ.** 4-52

శ్రీనాథుcడిందు మధుదుగ్ధముల స్థానమున నాజ్యమును ప్రవేశపెట్టెను. నేతి నెక్కువగా గ్రహించినచో దాహమధికమగుట లోక ప్రసిద్ధము. అందుచే నాజ్యశబ్దప్రయోగము. దిక్పాలుర యుదంతము వినినకొలది దమయంతికి దూతవంశ నామాధికములను వినవలెనను కోరిక యుపశమింపకపోవుటయేకాక వృద్ధికూడ నందినదని సూచించుచు మూలమునకు వన్నెచేకూర్చుచున్నది.

మఱియు నధికతరులు, వంశకథలు అను శబ్దములందలి అర్థద్వయమును పురస్కరించుకొని యిచ్చట శ్రీనాథుcడమూలకమైన చమత్కారమును కల్పించియున్నాడు. అధికముగా తరులనగా మిక్కిలి యధికులని యొక యర్థము. గొప్ప వృక్షములని మఱొక యర్థము. అట్లే వంశకథలనcగా వంశము యొక్క వృత్తాంతములు, వెదురుగడల యుదంతములు అను రెండర్థములున్నవి. “దిక్పాలురు మహావృక్షముల వంటి వారును నీవు వెదురుగడ వంటి వాcడవును కావచ్చును. నాకావృక్షముల వృత్తాంతముకంటె వెదురుగడ యుదంతము వినుటయందే యెక్కువ కుతూహల ముప్పతిల్లుచున్నది” అని దమయంతి భావము. అమూలకమైన యీ చమత్కారమిచ్చటి యర్థ భావములకు మఱింత వన్నెయు సౌందర్యమును ఆపాదించుచున్నది.

శ్రీహర్షుడు మహాపండితుడు. అతఁడు తన కావ్యమున నపూర్వములును ప్రౌఢ సుందరములు నైనకొన్ని ప్రయోగములను కావించియున్నాఁడు. అవి అనువాదమున కతీతములైనట్టివి. అన్యపదములచే నేదోవిధమున వాని నాంధ్రీకరించినచో నా ప్రౌఢతయు సౌందర్యమును కొఱవడును. అందుచే శ్రీనాథుఁడా ప్రయోగములను అనువాదమున యథాతథముగా వాడియున్నాఁడు. అట్లువాడుట యాతని ప్రౌఢతాప్రీతికే తార్కాణము కాని అసామర్థ్యమునకుఁగాదు. హంస దమయంతిని గూర్చి నలునికి చెప్పుసందర్భమున శ్రీహర్షుడు

**సరసీః పరిశీలితుంమయా**
**గమికర్మీకృతనైక నీవృతా**
**అతిథిత్వమనాయి సాదృశోః**
**సదసత్సంశయ గోచరోదరీ** 2-40

అను శ్లోకమును వ్రాసియుండెను. ఇందు "గమికర్మీకృతనైక నీవృతా" (గమ్ ధాతువునకు కర్మగా చేయబడిన పెక్కు రాజ్యములుగల) "సదసత్సంశయ గోచరోదరీ" (ఉన్నదా లేదా యను సందేహమునకు గుఱియైన యుదరముకలది) అను ప్రయోగములు రెండును మిక్కిలి ప్రౌఢములును అర్థవంతములునై యలరారుచున్నవి. తెలుఁగున వెళ్ళుధాతువకర్మకము. దానికి కర్మయుండుటకే అవకాశము లేదు. దానిని "అనేక దేశములకు వెళ్ళినవాఁడునైన" అని తెనిగింపవచ్చునుకాని మూలమందలి ప్రౌఢికాని చమత్కారముకాని రానేరావు. అట్లే "సదసత్సంశయగోచరోదరీ" యను సమాసముకూడ చమత్కార స్ఫోరకమై మనోజ్ఞముగానున్నది. శ్రీనాథుఁడీ శ్లోకమును రెండు విధములుగా ననువదించుచు రెండు పద్యములను వ్రాసియున్నాడు.

**మృదురీతిం బ్రతివాసరంబు గమికర్మీభూత నానానదీ**
**నదకాంతారపురీ శిలోచ్చయుఁడనై నై కాద్భుత శ్రీజిత**
**త్రిదివంబైన విదర్భదేశమున నారీరత్నముంగాంచితిన్**
**సదసత్సంశయ గోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్** 2-20

ఇందొక సమాసమును యథాతథముగాఁ జొప్పించుటకవకాశము చిక్కినది కాని రెండవదాని నించుక మార్చి వ్రాయవలసి వచ్చినది. దానియందలి మక్కువ విడువలేక దాని నిముడ్చుచు శ్రీనాథుఁడీ రెండవ పద్యము వ్రాసి యున్నాఁడు.

**కమలేందీవరషండమండిత లసత్కాసార సేవారతిన్**
**గమికర్మీకృతనైక నీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్**
**రమణిం బల్లవపాణిఁబద్మనయనన్ రాకేందుబింబాననన్**
**సమపీనస్తని నస్తినాస్తివిచికిత్సాహేతు శాతోదరిన్** 2-21

ఇందు సదసత్సంశయ గోచరోదరీ అను సమాసమును మార్చి వ్రాయవలసి వచ్చినది. ఈ పద్యములు ప్రౌఢప్రయోగములయందు శ్రీనాథునికిఁగల యతిమాత్రమైన ప్రీతిని సూచించును. వీనిని మనసునందుంచుకొనియే యతఁడు కాశీఖండమున "తథ్యామిథ్యా మధ్యస్థిత మధ్య"లనియు, భీమఖండమున "గమికర్మీభూతకైవల్యమున్" అనియు ప్రయోగించియున్నాఁడు. ఇది యాతని ప్రౌఢ ప్రయోగాసక్తిగా గ్రహింపక కొందఱు శ్రీనాథుఁడు మూలమునందలి సమాసములనే తెలుఁగు విభక్తి ప్రత్యయములైన దుమువులను తగిలించి యథాతథముగా వాడియున్నాఁడని విమర్శించుట కలదు. కాని యట్లు తలంచుట పొఱపాటు, వానినట్లు వాడక యనువాదముచేసి యుండినచో నిప్పటి ప్రౌఢతయు సౌందర్యమును తప్పక లోపించియుండును. హంస నలునివిడిచి దమయంతికడకు దూత్యమేగు సందర్భమున కుండినపురమును వర్ణించుచు శ్రీహర్షుఁడు

**అశ్రాంతశ్రుతిపాఠపూతరస నావిర్భూత భూరి స్తవా**
**జిహ్మబ్రహ్మముఖౌఘ విఘ్నిత నవస్వర్గ క్రియాకేళినా**
**పూర్వం గాధిసుతేన సామిఘటితా ముక్తాను మందాకినీ**
**యత్ప్రాసాదదుకూలవల్లి రనిలాందోళై రఖేలద్దివీ** 2-102

అనుశ్లోకమును వ్రాసియుండెను. ఇందు పూర్వార్ధమునంగల సమాసరచన గంభీరమును శ్రవణ సుభగమునై యున్నది. ఇట్టి సమాసమును స్వయముగా కూర్చుటకై శ్రీనాథుఁడేమియు శ్రమపడవలసిన యవసరములేదు. అతఁడింతకన్న ప్రౌఢతరములైన సమాసములనెన్నిటినో తన కావ్యములందు కూర్చియున్నాఁడు. కాని శ్రీహర్షుని యందలి గౌరవముచేతను ఆ సమాస రచనయందలి ప్రీతిచేతను అతఁడు యతిప్రాసల కనుగుణముగా నించుక మార్చి దానినే పద్యమున నిట్లు పొదిగియున్నాఁడు.

**వేదాభ్యాసవిశేషపూతరసనావిర్భూతభూరి స్తవా**
**సాదబ్రహ్మముఖౌఘవిఘ్నిత నవస్వర్గక్రియాకేళిచే**
**నాదిన్ గాధి తనూజుచే సగము సేయంబడ్డమిన్నేఱు ప్రా**
**సాదస్వచ్ఛదుకూల కైతవమునం జాలంగ నొప్పుంబురిన్** 2-41

ఇట్లాతఁడు మూలమునందలి భావములతో పాటు పదములను సమాసములను గూడ ప్రౌఢతాప్రీతిచే గ్రహించినట్లు పెక్కు కానిపించును. మూలమున కవి వ్యాకరణ వైదుష్యమును ప్రయోగ వైచిత్రిని ప్రకటించు పద్యము లచ్చటచ్చట గోచరించును. శ్రీనాథుఁడుకూడ మూలకర్తవలెనే బహుశాస్త్ర నిష్ణాతుఁడగుటచే నాసందర్భములందు తాను సైతము పాండిత్య ప్రకర్షను ప్రకటించుచునే యుండును. సప్తమాశ్వాసమున నలదమయంతుల రతమును వర్ణించు సీసపద్యమునందలి గీతమున

**అస్తివామ్యభార మస్తి కౌతూహలం**
**బస్తి ఘర్మసలిల మస్తి కంప**
**మస్తి భీతి యస్తిహర్ష మస్తివ్యథం**
**బ స్తివాంఛ మయ్యే నపుడు రతము** 7-177

అని అస్తి పూర్వపదములైన సమాసములను వాడుట యిందుకు నిదర్శనము. ఇట్లే అతఁడు అష్టమాశ్వాసమున వైతాళిక గీతములలో ప్రాతః కాలమందలి కాకకోకిలముల కూతలను కౌకౌ, తు హి అను పదప్రత్యయములను వాడుచు సంస్కృత వ్యాకరణ పాండిత్య స్ఫోరకముగను, యథామూలముగను ఈ క్రింది పద్యమున వర్ణించి యున్నాఁడు.

**ప్రాతఃకాలము వాయసంబు పణినాపత్యోక్త శాస్త్రంబులోఁ**
**దాతఙ్స్థానులు చెప్పుఁడెవ్వియను చందంబొప్ప గౌకౌయనం**
**జాతుర్యం బలరార నుత్తరము విస్పష్టంబుగాఁ గోకిల**
**వ్రాతంబిచ్చె తుహీ తుహీ యని గృహారామ ప్రదేశంబులన్**

సంస్కృతమున లోట్టునందు ప్రథమ మధ్యమ పురుషైక వచనములలో తు, హి అను ప్రత్యయములకు వైకల్పికముగా తాత్ అనునది ఆదేశముగా వచ్చునని 'తుహ్యోస్తాతఙ్ఙాశిష్యన్యతరస్యామ్' అను పాణినిసూత్రము చెప్పుచున్నది. దానిని పురస్కరించుకొని మూలకర్త ప్రాతఃకాలమున కాకి తాతఙ్గాదేశమునకు స్థానులేవని యడుగుచున్నట్లుగా కౌ కౌ అని అఱచె ననియు, నా ప్రశ్నమునకు కోకిల తుహి అని ప్రత్యుత్తరమిచ్చెననియు చమత్కారముతోఁ గూడిన కల్పనము కావించి శ్లోకము వ్రాసియున్నాడు. శ్రీనాథుఁడు దానిని యథామాతృకముగా ననువదించి తన ప్రగల్భతను ప్రకటించియున్నాఁడు. ఈ విధముగా మూలకారుఁడెడనెడ ప్రదర్శించిన బహుశాస్త్ర పాండిత్యమున కనుగుణముగా శ్రీనాథుఁ డనువాదమును సాగించి యాంధ్ర కావ్యమునకు మూలతుల్యగౌరవము నాపాదింపఁజాలినాఁడు.

మూలమునందలి భావముల కెట్టి లోపమునుఁ గలుగకుండ శ్రీనాథుఁడు తెలుగు పలుకు బడుల సొగసుట్టిపడునట్లవలీలగా రచించిన పద్యములనేకములున్నవి. అట్టి వాని కొండు రెండుదాహరణములు మాత్రమొసంగెదను. హంస దమయంతితో నలుడు తప్ప నన్యుఁడామెను వర్ణించుటకు పాత్రుఁడుకాఁడని చెప్పుచు బ్రహ్మనిర్ణయముకూడ నట్లేయున్నదని సూచించు సందర్భమున శ్రీహర్షుఁడు

**విధిం వధూసృష్టి మపృచ్ఛమేవ**
**తద్యాన యుగ్యో నలకేళి యోగ్యాం**
**త్వన్నామ వర్ణా ఇవకర్ణ పీతా**
**మయాస్య సంక్రీడతి చక్ర చక్రే** 3-50

అను శ్లోకము రచించెను. శ్రీనాథుఁడు దీనిని,

**అడిగితి నొక్కనాడు కమలాసను తేరికి వారువంబనై**
**నడచుచు నుర్విలో నిషధనాథుని కెవ్వతె యొక్కొ భార్యయ**
**య్యెడునని చక్రఘోషమున నించుక యించుక గాని యంతయే**
**ర్పడ విననైతి, నీవనుచు బల్కిన చందముదోచె మానినీ.** 2–58

అని యెంతో సులభముగను సహజముగను అనువదించెను. ఇందలి "యించుక యించుకగాని యంత యేర్పడ విననైతి" అను దానికి సరియైన పదములు మూలమున లేకున్నను అచ్చటి అభిప్రాయమంతే. 'కర్ణపీతాఇవ' అను మూలము నందలి 'ఇవ' శబ్దస్వారస్యమిందు మనోహరముగా వివరింపఁబడినది.

సప్తమాశ్వాసమున నలదమయంతుల విహారమును వర్ణించు సందర్భమున శ్రీహర్షుడు రచించిన,

**యౌకురంగ మదకుంకుమాంచితౌ**
**నీలలోహితరుచే వధూకుచే**
**సప్రియో రసితయోః స్వయంభువో**
**రాచిచార నఖకింశుకార్చనమ్** 18–96

అను శ్లోకమును శ్రీనాథుఁడీ క్రింది పద్యమున హృద్యముగా ననువదించెను.

**కుతుకమునం గురంగ మదకుంకుమచర్చ వహించి నీలలో**
**హితరుచులై స్వయంభులయి యీహితసౌఖ్య విధాయులైన య**
**య్యతివ పయోధరంబులకు నర్ధనిశాసమయంబునన్సమం**
**చిత నఖకింశుకార్చనముచేసె మహీపతి భక్తియేర్పడన్** 7–178

ఇందు నీల లోహితరుచులు, స్వయంభులు అనుపదములు కుచములకు శివునికి కూడ నన్వయించు చున్నవి. భక్తి ఈహితసౌఖ్య విధాయులు అనుపదములను శ్రీనాథుఁడు స్వయముగాఁ జేర్చినను వానికిఁ గూడ రెండర్థములు స్ఫురించునట్లొనరించి భావమునకు పుష్టి కలిగించెను.

ఆంధ్రనైషధమున శ్రీనాథుఁడు స్వయముగా రచించి సందర్భాను గుణముగా నందందుఁ జొప్పించిన పద్యములు కూడ కొన్ని యున్నవి. వివాహానంతరము దమయంతి నలునితో నిషధరాజధానికరుగు సమయమున భీమరాజు కూఁతును గౌఁగిలించుకొని గద్గదస్వరంబునఁ గొంతహితోపదేశము కావించెను. మూలమున నీసందర్భమున నొక్కటేశ్లోకమున్నది. (16–118) శ్రీనాథుఁడిచ్చట నభిజ్ఞానశాకుంతలమునందలి "శుశ్రూషస్వగురూన్" అను శ్లోకము నందలి భావము ననుకరించుచు నొక చక్కని సీసమును రచించెను. (7–9) తరువాత దమ దమనులు సోదరికి సుగంధ ద్రవ్యములను, అమూల్యా

భరణములును, పసుపున్నకై నూఱు గ్రామములు నొసంగినట్లు తెల్పు పద్యములు కూడ (7-11,12) శ్రీనాథుఁడు కల్పించినవే. స్వయంవరానంతర మింద్రాదులు నలదమ యంతులకు వరములిచ్చిన పిమ్మట సరస్వతీదేవి నలునికి చింతామణిమంత్రము నుపదేశించెను. ఈ సందర్భమున శ్రీనాథుఁడు స్వయముగా రచించి చేర్చిన పద్యములు మూఁడున్నవి. వీనిని సరస్వతి నలునికి దెల్పియుండెను. అందొకటి చింతామణీ దివ్యమంత్రమూర్తియైన సరస్వతిని దలఁచినచో నయత్నముగా సారస్వతము గలుగుననియు, మఱొకటి యుషఃకాలమున నలదమయంతీకర్కోటకఋతుపర్ణులను దలంచు వారిని కలికల్మషములు పొందవనియుఁ దెల్పుచున్నవి. మూడవదీ క్రింది సీసపద్యము.

**కలియుగంబున యందుఁగాశ్మీరభూమిలో**
**మత్పీఠమున ధరామరుఁడు పుట్టు**
**శ్రీహీరుఁడనగ శేషాహియంశంబున**
**నతఁడు మామల్ల దేవ్యాఖ్యయైన**
**తనభార్యయందుఁజింతామణీ మంత్ర చిం**
**తన ఫలంబుగ నొక్కతనయుఁగాంచు**
**గల్పించు నతని కాకాశవాగ్దేవి తా**
**శ్రీహర్షుఁడనియెడు చిహ్నానంబు**

**వానికీరేఁడు విద్యలు వచ్చియుండు**
**వాఁడు ఖండనకారుఁడు, వాఁడుసుకవి**
**కావ్యముఖమున వానిచేఁ గలుగునీకు**
**నిర్మలంబైన సత్కీర్తి నిషధరాజ!** 6-25

ఇది శ్రీహర్షుఁడను మహాకవిజనించి కావ్యముద్వారా నలునికఖండ కీర్తి కలిగించునని వర్ణించు చున్నది. ఈ ఘట్టము చదువునప్పుడు శ్రీనాథుఁడు కూడ శ్రీహర్షునివలె చింతామణీమంత్రోపాసకుఁడేమోయను ననుమానముదయించుటేకాక యతఁడు తన కావ్యము ద్వారమున సైతము నలునికీర్తి లోకమున వ్యాపించునని యన్యాపదేశముగ చెప్పుచున్నాఁ డేమోయని స్ఫురింపక మానదు. నైషధీయ చరితము ద్వారా శ్రీహర్షుఁడు యావద్భారత మందేకాక ఖండాంతరములయందును, శృంగార నైషధము ద్వారా శ్రీనాథుఁడాంధ్ర దేశమందును, నలుని కీర్తిని వ్యాపింప జేసిరనుటలో నతిశయోక్తిలేదు. నైషధకావ్యమునందే, తద్రచనకు సంబంధించిన యీ కల్పనయెంతో చమత్కారముతోఁగూడి శ్రీనాథునికి శ్రీహర్షుని యెడఁగల యపారమైన గౌరవభావమును వెల్లడి చేయుచున్నది.

శ్రీనాథుఁడు నైషధీయ చరితమునందలి పెక్కుశ్లోకములననువదింపకుండ విడిచివైచెను. నవమసర్గమున దిక్పాలురెట్లైన నిన్ను పొందక మానరని నలుఁడు చెప్పినప్పుడు ప్రతివిధానమైన ప్రియావ్యాప్తి విఘాతమునకు కలగి దమయంతి వెక్కివెక్కి యేడ్చెను. ఆ సందర్భమున తనకింక మరణము తప్పదని తలంచియు నలునుద్దేశించియు నామెకావించిన పరిదేవనమును వర్ణించు పదుమూఁడు శ్లోకముల కాంధ్రమున ననువాదము కానరాదు. ఇట్లే త్రయోదశ చతుర్దశ సర్గములందు స్వయంవరసమయమున దిక్పాలురకును నలునకును సమముగా నన్వయించు శ్లేషార్థసముపేతములైన శ్లోకములు పెక్కనువాదమున విడువఁబడినవి. త్రయోదశ సర్గమునందలి 33వ శ్లోకము (దేవఃపతి ర్విదుషి నైషధరాజగత్యా) ఒక పక్షమున నలుని పరముగను ఇంకొక పక్షమున నలువురు దిక్పాలురలో నొక్కొక్కరి పరముగను ప్రత్యేక పద విభాగ పూర్వకముగా నర్థము చెప్పుటకు వీలుగానున్నది. శ్రీనాథుఁడు దీనిని గూడ ననువదించియుండలేదు. నిజమునకు దీని నేభాషలోనికైన ననువదించుట యతికష్టసాధ్యము. ఈ శ్లోకములు పెక్కు పాండితీప్రకర్షను ప్రదర్శించునవే కాని కథాగమనమునకుఁగాని రసపోషణమునకుఁగాని పనికివచ్చునట్టివికావు. అందుచేతనే శ్రీనాథుఁడు వానిని విసర్జించి యుండెను కాఁబోలును.

నైషధము వర్ణన ప్రధానమైన మహాకావ్యము. ఆయాసందర్భములందాయా వర్ణనములను కావించుటలో కవి ప్రదర్శించిన భావనాశక్తియు పాండితీ శౌండీర్యమును, లోకశాస్త్రాద్యవేక్షణ పాటవమును అప్రతిమానములై పఠిత నాశ్చర్యచకితులను గావించును. శ్రీనాథుఁడు శ్రీహర్షునికి వాడిన "కవికులాదృష్టాధ్వగమనాధ్వనీనుఁ"డను విశేషమాతని వర్ణనముల విషయమున సార్థక్యము వహించును. నలుఁడు, దమయంతి, కుండినపురము, విరహచంద్రమన్మథోపాలంభములు, శాంబరీనిగూఢుఁడైన నలునియంతఃపుర ప్రవేశము, దూతికావాక్యములు, దిక్పాలురవిరహము, స్వయంవరాగతులు, వివాహము, బువ్వపుబంతి, కామక్రోధలోభమోహకలిరాజులు, కలిరాజు వందుల కైవారములు, విహారసౌధము, నలదమయంతుల విహారములు, వైతాళికగీతములు, నలదమయంతులగోష్ఠి, శివవిష్ణుపూజ, దశావతారములు, సంధ్య, నక్షత్రములు, చంద్రుఁడు మున్నగు వ్యక్తివస్తుభావస్థితి సన్నివేశముల వర్ణనము లిందు ముఖ్యములైనవి. నాయికానాయకులైన నలదమయంతులీ కావ్యమున సందర్భమునుబట్టి రెండుమూడు చోట్ల వర్ణింపఁబడి యున్నారు. కావ్యము కవికావించిన నలవర్ణనముతో నారంభించుచున్నది. హంస దమయంతి యెదుట నాతని గుణగణములను పరాక్రమవిశేషమును ఉగ్గడించినది. స్వయంవరమున సరస్వతి నలునికిని దిక్పాలురకును అర్థద్వయ మేర్పడునట్లుగా నాతని గుణగణములను రూపురేఖలను వివరించినది. నలుఁడు వివాహమంటపమున కేగుతరి పురయువతులును, కలియెట్లైన నలుని మోసపుచ్చెదనని పల్కినపుడు దిక్పాలురును అతని సౌందర్యమహనీయతా విశేషములను వర్ణించియుండిరి.

**అర్థమెవ్వనిరూపమంగ సంభవరాజ్య**
**రుక్మసింహాసనారోహమునకుఁ**
**గడువునెవ్వనికీర్తి కార్తికీతిథి నిశా**
**నాథబింబంబు నెన్నడిమికందు**
**భవన మెవ్వని ప్రతాపప్రదీపమునకుఁ**
**బుండరీక భవాండ మండలంబు**
**చుట్టమెవ్వని కేలు సురభిచింతారత్న**
**రోహణాచలవారి వాహములకుఁ**

**గలుష మెవ్వానిఁదలఁచిన గ్రాఁగిపోవు**
**బుణ్యమెవ్వానిఁగీర్తింపఁబొడవువడయు**
**వాడు నిషధేశ్వరుండు మా వరుసవాఁడు**
**కలిమహారాజ మన్నింతుగాక వాని.** 7-105

అని దిక్పాలురు నలుని సౌందర్యమును, కీర్తిని, ప్రతాపమును, వదాన్యతను, మహానుభావతను కలియెదుట వర్ణించు పైసీసము "ఎవ్వానివాకిట నిభమదపంకంబు రాజభూషణ రజోరాజినడఁగు" ననుతిక్కనగారి ధర్మజవర్ణనమును దలఁపించుచు నలుని సమగ్రమూర్తిని పతితలయెదుటఁ బెట్టుచున్నది. హంస దమయంతికి నలుని పరాక్రమ కీర్తుల నీ విధముగా వర్ణించినది.

**రణకండూభరదుస్సహంబయిన యారాజన్య దేవేంద్రు ద**
**క్షిణబాహాగ్రమునం జనించిన మహాకీర్తి ప్రవాహంబు కా**
**రణ సంక్రాంత గుణానుషంగముననో ప్రస్ఫీతదిజ్మత్త వా**
**రణగండస్థలకుంభకూలములతో రాయున్‌దివారాత్రముల్** 2-52

నలుని దక్షిణ బాహువు యుద్ధమునకై తీటగొని విజయలాభముచే నఖండమైన కీర్తి నార్జించినది. కారణగుణములు కార్యమునందును సంక్రమించునను న్యాయముచే కారణమైన బాహువునందలి తీట కార్యమైన కీర్తియందును సంక్రమించినది. కీర్తియందిట ప్రవాహత్వమారోపింపఁబడినది.

అది నిత్యమును దిగ్గజములగండస్థలములు కుంభములు అనునొడ్డులతో రాసికొనుచున్నదని దీని యర్థము. మూలమున నతనికీర్తి దిక్కులనెడి నదులగట్టు నొరయుచున్నదని చెప్పఁబడినది. ఈ పద్యము మూలమునకు మెఱుగుపెట్టుచు నలునికీర్తి దిగంతవ్యాపిత్వమును దెల్పుచున్నది.

హంస నలునిముందు కేశపాశముల నుండి యూరువులవఱకును దమయంతి సర్వావయవములను సంగ్రహముగా వర్ణించెను. నలుఁడు దూతగా నేగినప్పుడు దమయంతి

నిజూచి "చికురాదియుం బదనఖాంతముగా" నామె సౌందర్యమును దనివితీర వర్ణించెను. ఈ వర్ణన మాలంకారికమై తరువాతి యాంధ్రప్రబంధములందలి నాయికావర్ణనమున కొజ్జబంతియైనది. ఇందు కవిప్రదర్శించిన భావనాశక్తి యనన్య సాధారణమైనది. విస్తరభీతిచే నొక్క పద్యమును మాత్ర ముదాహరింతును.

**శ్రవణపుటకూప వినిపాత సాధ్వసమున**
**నిగిడియవ్వలికటుపోక నిల్చెఁగాక**
**యధిక చపల స్వభావంబులైన యట్టి**
**దాని కన్నులు తలచుట్టుతిరిగి రావె** 3–167

కన్నుల చాపల్యమును, సోగతనమును ఇంతకంటె నతిశయముగా వర్ణించుట యసాధ్యము. దమయంతి స్వయంవరాస్థానమున కరుదెంచునప్పుడు మరల దమయంతీ సౌందర్యము వర్ణితమైనది. అది స్వయంవరాగతులైన రాజులందఱిచే నాసాశిఖాగ్రముగ తర్జనిమోపించి మూర్ధములూపించి వారినాశ్చర్య చకితులఁగావించినది.

నలదమయంతీ వివాహనేపథ్యములను, మధుపర్కపారణమును, కౌతుకరక్షా బంధనమును, లాజహోమమును కవి వివరముగా వర్ణించెను. హోమ సమయమున నగ్నిజిహ్వాసముత్థితమైన ధూమము దమయంతి చెక్కుటద్దములపై చెఱలాడునప్పుడు కస్తూరికాపత్రములవలెను, శ్రవణపాశములలోఁజాగి పాఱెడునప్పుడు లలితతమాలపల్ల వములవలెను, కన్నులలో చొప్పారునప్పుడు నీలాంజనమువలెను, ఫాలభాగముపై పఱతెంచు నప్పుడు చూర్ణాలకములవలెను ప్రకాశించెనని (6–103) వర్ణించు పద్యము కవి భావనాశక్తిని ఉచితోపమాన రచనా పాటవమును వేయి విధముల చాటుచున్నది. బువ్వపుబంతివేళ సాగిన పరిహాసములను, ప్రేమప్రకటనములను కవి మిక్కిలి అభినివేశముతో వర్ణించెను. అప్పటి చతుర్విధాహారములను వర్ణించునప్పుడు శ్రీనాథుఁడు మూలకర్త యొసంగిన వివరములతో తృప్తిపడక తనకభిమతములైన కొన్ని క్రొత్త పిండివంటకములనుగూడ చేర్చెను (6–120). అతఁడు విహార సౌధమును, అందలి చిత్రములను, నలదమయంతుల విహారసమయము నందలి శృంగార చేష్టలను, వివిధ క్రీడా విశేషములను రసబంధురముగా వర్ణించెను.

**ప్రాణేశు నొసలి లాక్షాంకమ్ము పొడగాంచి**
**ముసిముసి నగవుతో మొగము మలఁచు**
**నేలనవ్వితి చెప్పుమిప్పుడం చడిగిన**
**నధిపు చేతికిమించుటద్దమిచ్చు**
**మఱుపెట్టి చనుదోయిమదనాంకములు సూచుఁ**
**దనునవ్వు విభుజూపులన యదల్చు**
**రాజుచేఁజికురభారము సెజ్జమోవంగ**
**మ్రొక్కించుకొనుఁబాదములకు నలిగి**

**రుద్రమూర్తి జిగీషానురూపకలన**
**అతనుఁడేకాదశాకృతియైన భంగిఁ**
**జరణనఖదర్పణములందు ధరణివిభుఁడు**
**లీలఁబ్రతిబింబితుండుగా లోలనయన** 7–19

అనుపద్యము వారి శృంగార విలాసములను వ్యంగ్యముగా సూచించు చున్నది. నలుని నొసట లాక్షాచిహ్నములు తోఁచుటకాతఁడు ప్రణయకుపితయైన దమయంతి ననునయించుటకై యామెపాదములఁబడుటయే కారణము, ఆ చిహ్నములనుబట్టి జరిగిన కార్యము నితరులూహింతురని యామె హసించెను. ఎట్టయెదుటనవ్వుట యగౌరవము కావున మొగము మలంచెను. ఏల నవ్వితివని రాజడుగ నోటితోఁజెప్పుట హేళనగా నుండును గావున మీరే చూచుకొండని యతని చేతికద్దమిచ్చెను. చెలికత్తెలు నఖక్షతాదులను జూచి గేలిచేయుదరని యామె చాటుగా తిరిగి వానిని దుడిచివేయుటకై యవి యెక్కడెక్కడ నున్నవో పరికించెను. నీలాక్షాంకము నా నొసటనున్నట్లే నా నఖక్షతము నీపక్షమున నున్నదను భావము సూచించుచు రాజెగతాళిగా నవ్వెను. దమయంతి మాటలచేఁగాక చూపులచేతనే యాతని నదలించి కోపము ప్రదర్శించెను. రాజు వినయమున మ్రొక్కెను. అప్పుడు దమయంతి నఖదర్పణములందతని ప్రతిబింబములు తోఁచెను. ఆ ప్రతిబింబములు పది, రాజుమూర్తి ఒకటి, అతనుడైన మన్మథుని మూర్తులు పదొకండయ్యెను. రతి సమయమున నలుఁడు మన్మథునివలె నుండెనని భావము. ఆ పదొకండా కృతులు ఏకాదశాకృతియైన రుద్రుని జయించుటకై మదనుఁడు తానును ఏకాదశాకృతి యయ్యెనా యనునట్లుండెను. నలుఁడు శివపూజ యొనర్చినపిమ్మట హరిపూజ కావించి యాదేవుని దశావతారములను వర్ణించెను. తరువాతి ప్రబంధ కవుల కొజ్జబంతియైన యీ దశావతార వర్ణనమద్భుతముగా నున్నది.

**కామసమ్మోహిత క్రౌంచఘాతమునకు**
**వగచి నీ చాటుకవి చెంచువానిఁగినిసెఁ**
**గామ మోహితయగు నింతిఁగ స్తి పఱుప**
**ననుజుఁబురికొల్పితిది నీకుఁజనునె రామ** 8–130

అను పద్యమున హృద్యమైన కించిదుపాలంభమున్నది. కామమోహితమైన క్రౌంచపక్షుల జంటలో నొకదానిఁగొట్టినందుకుఁ (వాల్మీకి వ్యాధుని శపించెను. వాల్మీకి శ్రీరాముని చాటుకవియఁట!) కామమోహితయై వలచి తన కడకు వచ్చిన శూర్పణఖ ముక్కుచెవులు కోసి శిక్షించుటకై రాముఁడు తమ్ముఁడైన లక్ష్మణుని బంపెను. ఈ వ్యత్యాసము తగునాయని నలుఁడు రాముని ప్రశ్నించు చున్నాఁడు.

కావ్యాంతమున సంధ్యానక్షత్రాంధకారచంద్రవర్ణనమున్నది. ఇది యుత్ప్రేక్షాతిశయోక్త్యా ద్యలంకారములతోఁగూడి కవి యపూర్వమైన భావనాశక్తిని జాటుచున్నది. చంద్రునియందలిమచ్చను, కిరణములను, చంద్రికను అతడుత్ప్రేక్షించిన తెఱంగద్భుతముగా నున్నది.

**బాలిక! యీ సుధాకరుఁడు పంకజనాభుని వామభాగదృ**
**గ్గోళకమైననాడు నవకోమల బాలతమాలకందళీ**
**కాళిమ గేలిసేయునదుకందిది తన్నయనాంతరంబున**
**న్నీలకనీనికా మఘవనీలమణిత్వము నొందకుండునే** 8–180

అనుపద్యము చంద్రుఁడు నారాయణుని యెడమకన్నునియు తన్మధ్యస్థమైన మచ్చకంటి యందలి నల్లగ్రుడ్డనియు తెల్పుచున్నది. సూర్యచంద్రులు విష్ణువు దక్షిణ వామనేత్రములను పురాణప్రసిద్ధ సంప్రదాయముపై నాధారపడిన కల్పనమిది. నిజవంశమకుటమాణిక్యమైన చంద్రుఁడు విశ్వమునకు కళ్యాణపరంపరాభివృద్ధి గావించుఁగాతమని యాకాంక్షించుచు నలుఁ డు రమణీసమేతముగా నతనికి మోడ్పుఁగేలు సంధించుటతోఁ గవి కావ్యమును ముగించుట యత్యంతౌచిత్యభాసురముగా నున్నది.

దిక్పాలురు కల్పవృక్ష కామధేనువులనో సప్తతంతువాతాపితాపసులనో యర్థించి నిన్ను బొందిన నేమిచేయుదువని నలుఁడు పలికినప్పుడప్రతి విధానమైన ప్రియావాప్తివిఘాతమునకు కలఁతనొంది దమయంతి యేడ్చెనని కవి యీ క్రింది పద్యమున వర్ణించి యున్నాఁడు.

**ప్రవిమలాక్షినభోనభస్యాంబుదములకు**
**నవవృష్టిధార లై యవతరిల్లి**
**యాకర్ణదీర్ఘ నేత్రాంభోరుహములకుఁ**
**గమనీయనాళభావము భజించి**
**లలిత వక్షోజ కుట్మలచుంబనమ్మున**
**మధుపదంపతుల సామ్యంబువడసి**
**కలిత కజ్జలత ముక్తాహారలతలలో**
**హరినీలరత్ననాయకతఁ దాల్చి**

**వేఁడియశ్రులు నిగుడంగ వెక్కివెక్కి**
**యేడ్వఁదొడఁగె లతాంగి పృథ్వీశుమ్రోల**
**మృదుల పరివేద నాక్షరోన్మిశ్రమధుర**
**కంఠ కాకువికార కాకలిక గదుర.** 4–87

దమయంతి కాటుకకన్నులు శ్రావణభాద్రపదములందలి నీలమేఘమువలె నుండెను. అందుండి తొలకరి వానధారలవలె నవతరిల్లిన కన్నీటిధారలు వక్షముపైఁబడునప్పుడు నేత్రాంభోజముల తూండ్లవలెను నొప్పారెను. వక్షోజకుట్మలములపైఁబడియవి మధుప దంపతులతో సామ్యము వహించెను. ముక్తాహారలతలతోనవి యింద్రనీలమణి నాయకత్వము భజించెను. రమ్యములైన యుపమానములతోఁగూడిన యిచ్చటికన్నీటిధారల వర్ణనమ పూర్వభావనా విరాజమానమై యేడ్చుచున్న దమయంతి మూర్తిని పఠితల కన్నుల యెదుట సాక్షాత్కరింపఁజేయుచున్నది. మూలమునించుక మార్చి శ్రీనాథుఁడు రచించిన యీ సీసమతని యప్రతిమానవర్ణనా పాటవమునకు తార్కాణమై యలరారుచున్నది.

కలిరాజును, కామక్రోధలోభమోహులను, స్వయంవరాగత రాజకుమారులను వర్ణించు సందర్భమున శ్రీనాథుడుఁ వారి యాకృతులను, వేషములను, పరివారమును విశదముగా వివరించి తనవ్యక్తి రూపచిత్రణ చాకచక్యమును చక్కగా ప్రదర్శించి యున్నాఁడు.

**కఱకులై పెరిఁగిన కుఱువెండ్రుకల తోడ**
**బట్టి యౌదలఁ గావి పాగయమర**
**నిగిడిపూతేకు బాగుగఁ గత్తిరించిన**
**గడ్డంబుకొన ఱొమ్ము గమ్మిరింప**
**బండికందెన తోడఁ బ్రతివచ్చు మైచాయ**
**నీలిపచ్చడముతో మేలవింప**
**నవర క్తచందన ద్రవ కల్పితంబైన**
**నూత్న త్రిపుండ్రంబు నొసలనొప్పఁ**
**గోరమీసలు మిడిగ్రుడ్లు కుఱుచపొడవు**
**డొప్పచెవులును గొగ్గి పండులును గలిగి**
**యున్నమద్గీవుఁడై వచ్చు చున్నవానిఁ**
**గలి మహారాజుఁ గనిరి దిక్పాలవరులు** 7-93

అనుసీసము కలిరాజు నాకారమును చిత్రమునవోలె సాక్షాత్కరింపఁ జేయుచున్నది. కలిరాజు సైన్యభటులను (7-61) కలిని బొగడు పట్లను (7-63) వర్ణించు పద్యములు కూడ నిట్లే వారి వికారాకారములను చక్కగా వెల్లడి చేయుచున్నవి. స్వయంవరాగతులైన రాజులను సరస్వతి వర్ణించిచెప్పు పట్ల నాయాదేశములను, సౌఖ్యహేతువులైన యందలి విశేషములను, వారి పరాక్రమ విజయవైభవములను వివరించి కవి తన భూగోళ పరిజ్ఞానమును ప్రపంచానుభవమును వ్యక్తము చేసి యున్నాడు.

కలిరాజు వందులు త్రైలోక్యవాసులు విన వాచాటులై వేదమప్రమాణమనియు, స్వచ్ఛందమే ధర్మమనియు, కామదేవుఁడే దైవమనియు, మరణమె యపవర్గమనియు,

దేహమనలదగ్ధమైపోవును గావున నింక పాపమనున దందుండదనియు, జనులు సౌఖ్యదములైన పరదార సంగమాది దోషములను యథేచ్ఛముగా నాచరింప వచ్చుననియు పల్కినపల్కులు వింత హేతువాదపద్ధతితో గూడి యాస్తికులైన వారికి జుగుప్సావిషాదములను గలిగించును. వారు విగ్రహపూజ నపహసించిన యీ క్రింది పద్యమపూర్వమైన హేతువాదముతోగూడి వారు చెప్పునది సత్యమేమోయను భ్రాంతి కలిగించుచున్నది.

**మలిచిన రాలయందుఁ గుసుమంబులువోయుచు మీఁదనెన్నఁడే**
**ఫలమొకనాఁడు గల్గునను పల్కది యెవ్వఁడు నమ్మినాడు, కో**
**మలవనరాజిలోనఁ గుసుమంబులు గోయుట యెప్పు డప్పుడే**
**ఫలములు వోవొ వోవునొ యుపాసకులార! తలంచిచూడుఁడా!** 7–70

విగ్రహములను పూవులతో పూజించుటవలననెప్పుడో ఫలముకలుగునను మాట సందిగ్ధముకాని యొక పువ్వుకోయఁగనే యొక ఫలము పోవుట మాత్రము నిశ్చయమని యందలి హేళన. వారిమాటలువిని యింద్రాదులు కోపించినప్పుడు వారే "పరతంత్రులము మా యబద్ధవాక్యములకుఁ దప్పుపట్టకు"డని ప్రార్థించుట పాఠకు లవిచదివి పెడత్రోవఁ బట్టకుండుటకు తోడ్పడుచున్నది.

ఈ కావ్యమున శృంగారరసమును పోషించుటలో శ్రీనాథుఁడు చూపిన నేర్పనన్య సామాన్యమైనట్టిది. ఇందు వియోగ సంయోగ శృంగారములు రెండును వర్ణింపఁబడినవి. నలదమయంతులిరువురు నొండొరుల గుణగణముల నన్యులవలన విని అనురక్తులై వియోగము ననుభవించిరి. ఇది వినుకలిచేఁగలిగిన వియోగము. "జాగరోద్భూత దృగ్రాగంబు మాణిక్యకర్ణకుండల దీప్తిఁ గప్పిపుచ్చు" (1–86) అనుసీసము నలుని వియోగస్థితిని "అతివ సమ్ముఖ వాస్తువగువస్తువును గానదాత్మయంతర్ముఖంబౌటఁజేసి" (2–113) అను సీసము దమయంతి వియోగావస్థను జక్కగా వర్ణించుచున్నవి. "దశలంతంతకు నెక్కఁగా విరహసంతాపాతిరేకంబున" దమయంతి కృశించి విరహబాధ సైపఁజాలక చంద్రమన్మథుల నుపాలంభించినది. తరువాత వెలువడిన ప్రబంధములందలి చంద్రమన్మథాద్యు పాలంభనములకిదియే యొజ్జబంతి. ఆమె చంద్రు నీవిధముగానుపాలంభించినది.

**హాలహల ద్వయంబు కలశాంబుధిఁబుట్టె వినీలపాండుర**
**జ్వాలలతోడ నందొక విషంబొక వేలుపుమ్రింగె నెందతో**
**వేలుపులోలియై ననుభవించిన రెండవయీవిషంబు ని**
**ర్మూలముగాక యున్నయది ముద్దియ! పాంథులపాపమెట్టిదో** 2–121

పాలసముద్రమున రెండు విషములు జనించెను. అందొకటి నల్లనిది, రెండవది తెల్లనిది. నల్లనివిషమును లోక రక్షణార్థమై శివుఁడు భక్షించెను. వేల్పులందఱు ననుభవించు

చుండినను తెల్లని రెండవ విషము నిర్మ్మలము కాకున్నది.. అదియే చంద్ర రూపమైనది. దమయంతికి విరహోద్దీపకుఁడైన చంద్రుఁడు విషమువలె పొడగట్టెను. అవస్థానుగుణముగా జీవులకు ప్రకృతి యందలి వస్తువులు సుఖమునో దుఃఖమునో కలిగించుచుండుట సహజమే. మన్మథుఁడు పుష్పబాణుఁడు. ఆ పుష్పములైనను లెక్కకైదే. బ్రహ్మయట్లు కల్పించుటకు మన్మథుని మనఃక్రౌర్యమే హేతువని దమయంతి భావించుచున్నది.

**కామ! పరమేష్ఠి నీమనః క్రౌర్య మెఱిఁగి**
**పుష్పములు నీకు నాయుధమ్ములుగఁజేసె**
**నవియు బహుళముగాఁ జేయదైదె చేసె**
**నింతకైనను బ్రతుకునే యిజ్జగంబు** 2-136

మన్మథునిబాణము లయోమయములు బహుళములు నైనచో నింక వియోగులు బ్రదుకుటయే దుర్లభమని యామె భావము. నలుఁడింద్రాదుల విరహబాధను దమయంతికి విపులముగా వివరించి వారిలో నెవరినైన వరింపుమని యామెను బహువిధముల ప్రార్థించెను. అచ్చటి భావములు హృదయంగమములుగా నున్నవి. మున్ను ముక్కంటితో మోహరించి మదనుఁడతనుఁడై పోయెను. వేయికన్నులుగల యింద్రునితో విగ్రహించి యింకేమికానున్న వాఁడో యని నలుఁడు దమయంతితో తెల్పుచున్నాఁడు.

**మూఁడు కన్నుల వేల్పుతో మోహరించి**
**నేఁడు దేహంబు లేక యున్నాఁడు తాను**
**వేయికన్నుల వేల్పుతో విగ్రహించి**
**వనిత యింకేమి కానున్నవాఁడొ మరుఁడు** 4-23

పద్యము చిన్నదైనను భావ మతిగంభీరముగా నున్నది. ఇంద్రుఁడు చిలుకలు పలికి కలఁగించునేమోయని నందనవనమునకరుగ మానినాఁడనియుఁశిరసున చంద్రరేఖ యుండుటచే తద్భయమున శివునిపూజించుట మానినాఁడనియు తెల్పి నలుఁడింద్రుని వియోగార్తిని లెస్సగా వివరించియున్నాడు.

**చిలుకలు వల్కునో చెవులు చిల్లులు వోవఁగనంచు నెన్నఁడున్**
**వెడలడు నందనోపవన వీథులకై, యటుమౌళిభాగ ని**
**ర్మల శశిరేఖచేయు నపరాధమునన్ గజదైత్య శాసనుం**
**గొలువఁడు పాకశాసనుఁడు కోమలి! నీ దెసకూర్మి యెట్టిదో** 4-24

ఇట్లే నలుఁడగ్నియమవరుణుల విరాళిని కూడ విశదముగా వర్ణించి తన దూత్యవిధిని జక్కగా నిర్వహించెను. అగ్నిముక్కంటి కంటిమంటల దాపున నుండి తన ప్రాణముల నపహరించి యుండుటచే నాపగతీర్చుకొనుటకై మన్మథుఁడిప్పుడు దమయంతి దృక్కోణము

ప్రాపునకోల్కొని తనయైదు బాణములచే నతని యభిమానమును గొల్లపుచ్చుచున్నాఁడని నలుడగ్ని దీనావస్థను వివరించుచున్నాడు.

**స్థాణుని లోచనాంచలము దాపుగఁ దీవ్రతరార్చులన్ నిజ**
**ప్రాణము గొన్ననాఁటి పగయాత్మఁ దలంచియొ నీకటాక్షదృ**
**క్కోణము ప్రాపునన్మరుఁడు గోల్కొని పంతమెలర్పఁగాఁ గొనెన్**
**బాణదశార్థ పాతమునఁ బావకు భూరిమనోఽభిమానమున్** 4-31

దమయంతి యేడ్చినప్పు డంతర్గత విప్రలంభ వేదనాభర ముద్దీపితమగుటచే నొడలు మఱచి నలుఁడు దమయంతితో నాడిన పలుకులు శృంగార రసకళికలై యింపుమీఱుచున్నవి. సప్తమాశ్వాసమునందలి నలదమయంతుల విహారముల వర్ణనము సంభోగ శృంగారమున కాలవాలమై యున్నది. ఈ సందర్భమున దమయంతి లజ్జాముగ్ధతలను నలుని శృంగారచేష్టలను శ్రీనాథుఁడు మనోహరముగా వర్ణించియున్నాఁడు. అట్లే అష్టమాశ్వాసము నందలి నలదమయంతులగోష్ఠి యత్యంత సరసముగా వర్ణింపఁబడినది.

**దాస్యము నిన్నరే కుసుమ ధన్వుఁ డొకండును సాక్షిగా సరో**
**జాస్య వహించినాఁడ వినుమప్పుడ మ్రొక్కుటలేదు నీకు వి**
**శ్వాస్యుఁడఁ గాన మ్రొక్కుగొను స్వస్తటినీ సలిలాభిషేకసా**
**రస్య పవిత్రమస్తకము వ్రాల్చెద నీపద యుగ్మకంబుపై** 8-44

అని నలుఁడు పల్కుట శృంగార రసానుకూలమై యాతని నిర్మలమైన యనురాగమును జాటుచున్నది. ఈ సందర్భమున దమయంతి ప్రణయకోపము నుపశమింపఁ జేయుటకై నలుఁడు పల్కిన పల్కులన్నియు నిట్లే రసభరితములై యింపునింపుచున్నవి. బువ్వపుబంతి వర్ణించు సందర్భమున శ్రీనాథుఁడు శృంగారమునేకాక హాస్యమును కూడ నెడనెడ చొప్పించి యున్నాఁడు.

**కలికి వరాటరాజపుడు గప్పురవీడెము వెట్టె నవ్వుచు**
**న్నలునడపంబు వానికి ఫణాధరవల్లి దళాంతరంబునన్**
**బలితపుఁ దేలు మైనమునఁబన్నియతండది సూచి భీతిఁద**
**మ్ముల మిలవైచిన న్నగిరి మూఁగిన రాజకుమారు లందఱున్** 6-141

ఇందు పరిహాసజనితమైన హాస్యము వెల్లడియగుచున్నది. చతుర్థాశ్వాసమున దమయంతి యేడ్చు సందర్భమున కరుణమును, కలిపురుషుఁడు నిషధలో వర్తించిన తెఱంగు వర్ణించు సందర్భమున బీభత్సమును, సరస్వతి నలునికి చింతామణీ మంత్రమునుపదేశించు సందర్భమున శాంతమును స్ఫురించుచున్నవి.

కవి యిందు నాయికానాయకులైన నలదమయంతులయు హంస యొక్కయు, దిక్పాలురయు, కలిరాజాదుల యొక్కయు శీలస్వభావములను జక్కగా చిత్రించియున్నాఁడు. నలుఁడు సౌజన్య సౌందర్య సారస్యములకు నెలవైనవాఁడు. ఆడినమాట తప్పనివాఁడు. ఇంద్రుఁడర్థించినప్పుడైన నిచ్చెదనని మొదట వాగ్దానమొసంగి యుండుటచే నతఁడు దమయంతి కడకు దూతగా నరుగవలెనని దేవతలు నిజాభిలాషమునకు విఘాతకరముగా కోరినను వెనుదీయక వియోగభారముతో దూత్యభారమును గూడ వహించినాఁడు. అతఁడు తన పేరు చెప్పకయే దిక్పాలురలో నెవరినైన వరింపవలెనని పలువిధముల దమయంతిని ప్రార్థించి తన విధినెంతో మనశ్శుద్ధితో నిర్వహించినాఁడు. తరువాతనైన తనపేరు చెప్పియాతఁడు దూత్యభంగ మొనరింపలేదాయను సందేహమును కవి చక్కగా నివారించి యున్నాఁడు. దమయంతి వెక్కివెక్కి యేడ్చినప్పుడతఁడు "దివిజోపకారకార్యప్రయోజన సంస్తంభితంబైన విప్రలంభ వేదనాభరంబప్పుడుద్దీపితంబై భరింపం గొలందిగాక... తన్నును తన వచ్చిన కార్యంబును దన్నుఁబు త్తెంచిన వేల్పులను మఱచి యవస్థావశంబున నుచితానుచిత వివేకంబు దప్పుటయు భావనా నిరూఢంబులైన ప్రియా విలాపంబులుగా వితర్కించుచు" తన నామధేయమెఱింగించెను. అది యతఁడు వివశుఁడై చేసిన పనియే కాని యుద్దేశపూర్వకముగా చేసినదికాదని కవి సమర్థించి యున్నాఁడు. మఱియు సంప్రాప్త సంస్కారుఁడై నలుఁడు పశ్చాత్తాపము పొందిన తెఱంగుకూడ నతని మనః పారిశుద్ధ్యమును వెల్లడిచేయు చున్నది.

**ఆదిఁబరోపకార పరులై చరించిన యట్టి యాంజనే**
**యాదులఁబోలనైతి నిపుడక్కట! దైవతకార్య సిద్ధివి**
**చ్ఛేదమునొందె నేమియని చెప్పుదునింక నమర్త్య పంక్తికు**
**న్మాదులు సంఘటింపఁగ సమర్థులె యెందును రాయబారముల్**

అని పశ్చాత్తప్తుఁడై యతఁడు "చేతనాహానిఁగార్యంబు చిన్నవోయెఁజేతనా హాని దైవంబుచేతవచ్చె" నని సరిపుచ్చుకొనెను. తరువాత దమయంతి చెలిపల్కిన పల్కులనాతఁడు వినకపోవుటయేకాక "అక్కటదైవకార్యమిటు లాఱడిపోవునెయంచు" నాత్మలో విచారించెను. అప్పుడు హంసయరుదెంచి

**నీయంతఃకరణమ్ము నిర్మలము వర్ణింపంగ శక్యంబె నీ**
**భూయస్త్వంబు జగత్ప్ర సిద్ధములు నీపుణ్య ప్రభావంబులే**
**లా యీలాగునఁ జింతనొందెదవు కార్యావ్యాప్తి యౌగాదటే**
**యా యింద్రాదులు నీ నిజంబెఱుఁగరే యబ్జారివంశాగ్రణీ !** 4-107

అని యాతని యంతఃకరణ నైర్మల్యము నుగ్గడించి యోదార్చెను. దేవతలు కూడఁ "దన్మనశ్శుద్ధి" కాత్మల ముదంబందిరి. అందుచేతనే స్వయంవరానంతరము వారతనికి

వరములు ప్రసాదించుటేకాక కలి దురుద్దేశము నెఱింగి యాతని వారించియుండిరి. కావ్యాంతమున నలుని నైష్ఠికతయు శివ విష్ణు భక్తియు వ్యక్తము చేయఁబడినవి. అందుచేతనే యతఁడు పుణ్యశ్లోకుఁడని కీర్తింపఁబడియున్నాఁడు. దమయంతి యనురాగము నిర్మలము నచంచలమునైనది. ఆమె నలుని గుణగణములు విని యతనినే త్రికరణశుద్ధిగా వరింప నిశ్చయించినది. దేవతలలో నెవరినైన వరింపుమని నలుఁడెన్ని విధముల ప్రోత్సహించినను ఆమె తన నిశ్చయమును సడలించుకొనలేదు. "అనలసంబంధ వాంఛనాకగునయేని అనల సంబంధవాంఛనాకగును జూవె" యనుటయే యామెస్థిర సంకల్పము శుద్ధియు పాతివ్రత్యమునే సరస్వతికిని దేవతలకును ఆమెపై దయపుట్టుటకుఁగారణములు. దేవతలామెను "ఆదిమశక్తియైన తుహినాచలరాజతనూజవోలె ముత్తైదువవై నిజేశ్వరుని యర్ధశరీరము పాలు గొమ్మని దీవించిరి. సరస్వతి "నీదుపాతివ్రత్య నియమంబునకుందప్పు ఖలుఁడు భస్మంబవుఁ గాతమపుడ" "నిక్కమిదియాదిగాఁగ నోనీరజాక్షి కామరూపిణివగుము మాకరుణఁజేసి" యని యామె నాశీర్వదించెను. దూతగా వచ్చినవాడు నలుఁడని యెఱుంగక ముందామె ప్రదర్శించిన ప్రగల్భతను ఎఱింగినపిమ్మట ప్రకటించిన లజ్జా వినయములను, స్వయంవరానంతరము విహారాదులందు చూపిన పత్యనురక్తిని కవి చక్కగా వ్యక్తీకరించి యున్నాఁడు. దిక్పాలురకు దమయంతిని వరింపవలెనను వాంఛ జనింపకుండవలసినది. జనించిన పిమ్మట వారు నలునే దూతగాఁ బంపుట యాతని శీలమునకు వన్నె కల్గించుటకేయని తోఁచును. అట్లేవారు స్వయంవరమునందు పాల్గొనుటయు దమయంతీ పాతివ్రత్యమును బయల్పఱచుటకే. స్వయంవరమున దమయంతి తమ్ము వరింపమికి వాఁరుఖిన్నులయ్యును ఆపుణ్య దంపతులకు వరము లొసంగుటయు కలిని నలవంచనాకార్యము నుండి నివారించుటయు వారి సహజ సౌజన్యమును చాటుచున్నవి. తమమనోరథము విఫలమైనను వారు నలుని మనశ్శుద్ధిని ప్రశంసించుట వారి దివ్యత్వమునకు నిదర్శనము. కవి కలి వికృతరూపమునేకాక మౌర్ఖ్యమును దౌర్జన్యమును విశదముగా వర్ణించెను. కలి నిషధరాజ ధర్షణార్థము శుద్ధాంతలీలా వనమందలి తోడి మ్రానికోటరంబున వసించి రంధ్రాన్వేషణ తత్పరుఁడై యుండుటయు, సరస్వతి "నీదు పాతివ్రత్యమునకుఁ దప్పుఖలుఁడు భస్మమగు"నని వర మొసఁగుటయు నుత్తరకథా సూచకములై శ్రీహర్షుఁడుత్తర భాగమునుకూడ రచించెనేమోయను ననుమానము నావహించుచున్నవి. నల దమయంతుల కొండొరులపై ననురాగము కలిగించి దౌత్యము నెఱపిన హంస వాక్చాతుర్యమును మహానుభావతను కవి చక్కగా ప్రకటించెను. నలుఁడు హంసను

**సరసత్వంబు నిగూఢ కార్యఘటనా చాతుర్య సంపత్తియుం**
**బురుషార్థైక పరాయణత్వమును నభ్యుత్థాన లీలాధురం**
**ధరతా ప్రౌఢియునుం గృతజ్ఞతయు వాత్సల్యంబు సద్భావమున్**
**సరసీజాసన వాహనాన్వయవతంసా! హంస నీ కందముల్**

అని ప్రశంసించుటలో స్వార్థముకంటె సత్యమే యెక్కువ.

నైషధము వర్ణన ప్రధానమైన కావ్యమని ముందే చెప్పితిని. అయ్యును కవి యిందు రెండుమూఁడు సందర్భములందు చక్కని సంభాషణరచనా చాతుర్యమును, నాటకీయతను, బ్రదర్శించి యున్నాఁడు. నలదమయంతులకును హంసకును జరిగిన సంభాషణములను, చతుర్థాశ్వాసమందలి నలదమయంతుల సంభాషణమును, కలి దిక్పాల సంభాషణమును ఇందుకు నిదర్శనములు. నలదమయంతుల యుక్తి ప్రత్యుక్తులును ప్రతిబందీరచనా చాతుర్యమును ప్రశంసాపాత్రములై యొప్పారుచున్నవి. దూత నలుఁడని తెలిసినపిమ్మట దమయంతి "యవని కాంతరమున నోలమాసగొనుట" నాటకీయముగానున్నది. అష్టమాశ్వాస మందు నలునికిని దమయంతి చెలియైన కళావతికిని జరిగిన శృంగారసంభాషణము చమత్కారగర్భితమై సహృదయ హృదయావర్జకమై యలరారుచున్నది.

**మదగజరాజ కుంభముల మచ్చరికించు నురోజకుంభముల్**
**గదిసి కలంత మేరయును గైకొని యున్నవి యెల్లవారికిన్**
**విదితముగాఁగ నిట్టితటి నీ చెలిడెందమునందు నేమియుం**
**గదలక మాకు నుండ నవకాశము లేదుగదే కళావతీ!** 8-65

అని నలుఁడు పలుక కళావతి

**రమణిహృదయంబునను మహారాజవీవు**
**గరిమ విచ్చేసి యుండిన కారణమున**
**దీని వక్షోరుహంబు లాలోననుండ**
**నెడము లేకున్న మతికదా వెడలె వెలికి** 8-66

అని సమాధానమొసంగెను. ఇట్లే యీ సంభాషణమంతయు చక్కనియుక్తి ప్రత్యుక్తులతోఁ గూడి సరసమై యొప్పారుచున్నది. బువ్వపుబంతి వర్ణనము నందలి

**ఉష్ణశీతాన్న కబళంబు లొకఁడు సూపఁ**
**బవలొ రాత్రియొ గెడ గూడ నవసరమని**
**దానికుత్తర మొకలతా తన్వియిచ్చె**
**నధర బింబంబు విఱిచి సంధ్యాగమమని** 6-237

మున్నగు పద్యములు సమయోచితములును సరసవ్యంగ్యపూరితములునై హృద్యములుగా నున్నవి.

నిజమునకు శృంగారనైషధము శ్రీహర్షుని సంస్కృత కావ్యమున కనువాదమే యయ్యును అది యెచ్చటను అనువాదమువలె కనిపింపదు. శ్రీనాథుఁడు సంస్కృత కావ్యమును బాగుగా పఠించి స్వాయత్తము కావించుకొని యందలి భావములను స్వేచ్ఛగా వివరించెను. అందుచేతనే యతని రచనయందు కుంఠితగమనముగల పద్యమొక్కటియును గానరాదు.

పద్యమును నిరాఘాటముగను ధారాళముగను నడపించుట యతనికి వెన్నతో నలవడినవిద్య. ఆతఁడు సంస్కృతపదములనే వాడెను. అయినను ఎడనెడ నాతఁడు వాడుచుండు రమ్యములైన తెలుఁగు జాతీయములును నుడికారములును తెలుఁగుపై నాతనికిఁగల యధికారమును ఆసక్తిని వెల్లడించుచు చదువరుల హృదయముల కపారమైన యానందము నావహించు చుండును. అతని సీసపద్యముల నడక మత్తేభగమనమునకెనయై, వైవిధ్యశోభితమై చదివిన కొలంది చదువవలయునను నుత్కంఠరేకెత్తించుచుండును. "కాలకంఠ కఠోరకంఠహుంకారంబు చెవులు సోకనినాఁటి చిత్తభవుఁడు" వంటి పద్యములు ధ్వనిగాంభీర్యమున కాలవాలమై వినువారి వీనులకు విందొనగూర్చుచుండును. అతని రచన యర్థ, శబ్దాలంకార పూరితమై మిక్కిలి ప్రౌఢముగా నుండును. నైషధమున శ్లేషయును, అనుప్రాసాది శబ్దాలంకారములును అక్కడక్కడ కనిపించును. సరస్వతి పంచనళిని వర్ణించునప్పుడు శ్లేషవాడఁబడినది. అచ్చటి పద్యములందొక యర్థము నలునికిని వేఱొకయర్థము దిక్పాలురలో నొకటికిని అన్వయించును.

**తామరసపత్రనేత్ర! యీతండ నలుఁడు**
**లావుగలవాఁడు లోకపాలకులలోన**
**బహుతర స్నేహరుచి మహాబలసహాయ**
**సంపదుద్దాముఁ డితని వీక్షింపుమబల** 5-167

ఈతండు+అనలుఁడు ఈతఁడగ్ని ఈతఁడు+అ+నలుఁడు-ఈతఁడేనలుఁడు; లోక పాలకులు-దిక్పాలకులు; దేవతలు; రాజులు స్నేహము-మైత్రి-నూనె; మహాబలము-గొప్పసేన; వాయువు అనునవి యీ పద్యమునందలి రెండర్థములుగల పదములు-ఉపమోత్ప్రేక్షా రూపకాతిశయోక్తి అర్థాంతరన్యాసములనతఁడు విరివిగా వాడియున్నాడు.

**ఇరులగెలిచిన యంతఃపురేందు ముఖుల**
**కురులు మరుఁడును వేటకాఁడురులుచేసి**
**మరులు గొలుపంగ లేఁడయ్యె మనుజవిభుని**
**సరులు లేని దృక్కంజనశాబకముల** 3-90

**అది కులబలాచార సహాసనాస**
**హాతి సాహసకౌతూహలావసదము** 4-50

**లలితకలాపికోమల కలాపకలాపపే**
**శల మృదుకేశ మంజరులు** 6-51

మున్నగునవి యాతని కనుప్రాసయమకాది శబ్దాలంకార ప్రయోగమునఁగల కౌశలమును ప్రదర్శించును.

**కాంతయశ్రు బిందుచ్యుతి కైతవమునఁ**
**దివిరి బింద్యుచ్యుతక కేళిఁ దవిలెదీవు**
**సారె సారెకునాదు సంసారమును స**
**సారముగఁజేయుచు మసార సారనయన** 4–90

అనునదాతని చిత్రకవితారచనా పాటవమునకు తార్కాణము. శ్రీనాథుఁడు నైషధమునం దచ్చటచ్చట మనోహరములైన వచనములను రచించి యుండెను. "అక్కటకటా! దైవంబనీకంటికిం బేలగింజయుం బెద్దయయ్యెనే జననీ! ముదిముప్పుగాలంబున సుతశోక సాగరం బెబ్బంగినీఁదఁగలదానవు" (1–110) మున్నగు వచనములలఁతి యలఁతి వాక్యములతోడను జాతీయములతోడను గూడి సరసములును రమణీయములునై యొప్పారుచున్నవి. నైషధమున ఛందో వైవిధ్యమంతగాఁ గానరాదు. స్వయంవరాగతులను వర్ణించుటకై భీమరాజు సరస్వతిని ప్రార్థించు సందర్భమున సంస్కృతభాషాదండకమున్నది. ఈ విధముగా మూలమున కెందును దీసిపోని భంగి శ్రీనాథుఁడు నైషధము నాంధ్రీకరించి యాంధ్రభారతి యఱితి కపూర్వాలంకారమును సమకూర్చినాఁడు.

**ఇమ్మహా కృతిఁ బఠియించు నెవ్వఁడేని**
**యాతఁ డపగత కలిదోషుఁడగుచుఁగాంచు**
**నాయురారోగ్య విమల విద్యావివేక**
**భాగ్య సౌభాగ్య వైభవ ప్రాభవములు.** 8–203



# శిరీషకుసుమపేశల సుధామయోక్తుల పెద్దనార్యుని

# మనుచరిత్రము

ఆంధ్ర ప్రబంధముల కాద్యముగను ఆదర్శప్రాయముగను పరిగణింపఁబడు మహాకావ్యము మనుచరిత్రము. కొందఱి యభిప్రాయము ననుసరించి ఆంధ్ర పంచకావ్యములలో కూడ మొదటిదిదే. భారత భాగవతముల తరువాత నాంధ్రదేశమున దీనితో సమానమైన ప్రచారము పొందిన మహాకావ్యము మఱియొకటి లేదు. దీనిని రచించినవాఁ డల్లసాని పెద్దన. ఇతఁడు చొక్కయా మాత్యుని పుత్రుడు. అన్నూరు శాసనమును బట్టి యితఁడు ఋగ్వేద శాఖీయుఁడని, ఆశ్వలాయన సూత్రుఁడనియు, వశిష్ఠగోత్రుఁడనియు తెలియుచున్నది. ఆశ్వాసాంతగద్యలలో నితఁడు "నందవరపుర వంశోత్తంసుఁడ" నని చెప్పుకొనెను. నందవరీకులు నియోగి బ్రాహ్మణశాఖకు చెందినవారని చెప్పుదురు. ఇతని గురువు అహోబలమఠస్థాపకుఁడైన శఠకోపయతి.

**కొలుతున్ మద్గురు విద్యా**
**నిలయున్ గరుణా కటాక్ష నిబిడ జ్యోత్స్నా**
**దళితాశ్రిత జన దురి త**
**చ్ఛల గాఢధ్వాంత సమితి శఠకోపయతిన్** 1-6

అని మనుచరిత్రావతారికలో నితఁడు స్తుతింపబడి యున్నాఁడు. ఇతఁడు 1437వ సంవత్సరము ప్రాంతమున జన్మించి 1515వ సంవత్సరము వఱకు జీవించెనని తిరుపతి దేవస్థానము వారు ప్రకటించిన శిలా శాసనకర్తల వంశావళులయం దున్నది. పెద్దన జన్మచే నద్వైతి యయ్యును రాయలవారి ప్రభావమువలననో గురువుగారి ప్రోత్సాహము వలననో వైష్ణవమతము నవలంబించెను. మనుచరిత్ర గద్యములో నితఁడు పంకజాక్ష పాదాంబుజాధీన మానసేందిందిరుఁడనని వ్రాసికొనెను. మనుచరిత్రమునకు ముందితఁడు హరికథాసారమను నొక ప్రబంధమును రచించినట్లు లాక్షణి కోదాహృతములైన పద్యములనుబట్టి తెలియుచున్నది.. అందలి షష్ఠ్యంతములతోఁ గూడిన యొక పద్యమును బట్టి అది శఠకోపయతికే అంకితము చేయఁబడెనని యూహింపవచ్చును. ఈ గ్రంథమిప్పుడు లభించుట లేదు. లబ్ధములైన ఏడెనిమిది పద్యములను బట్టి యందు శ్రీహరి యవతారముల కథలు వర్ణింపబడి యుండునట్లు తోఁచుచున్నది. రాయలవారి కొలువునందలి కవులలో వయసు చేతను ప్రతిభాసంపద చేతను పెద్దయై పెద్దన రాయలవారిచే నపార గౌరవ సత్కారములు పొందియుండెను. రాయలు గండపెండేరమును స్వయముగా నతని కాలికి తొడుగుటయు, అతని కాంధ్రకవితాపితామహ

బిరుదము నొసంగుటయు, మనుచరిత్ర మందుకొనువేళ పల్లకి తాను చేతఁబట్టి యెత్తుటయు నిందుకు నిదర్శనములు.

పెద్దన బళ్ళారి ప్రాంతమందలి దూపాడు పరగణాలోని దోరాల గ్రామమున జన్మించియుండెనని కవిచరిత్రయందున్నది. అతని జన్మస్థలము కడప మండలాంతర్గతమైన కమలాపురము తాలూకాలోని కోకటగ్రామమో తత్సమీపమందలి పెద్దనపాడో యైయుండునని కొందఱు విమర్శకుల యభిప్రాయము. పెద్దనపాడు గ్రామమున నిప్పటికిని పెద్దనపేర ప్రథమ తాంబూలమిచ్చు సంప్రదాయ మున్నదఁట! మఱియు నాగ్రామ సమీపమందే కల పెద్దనచెఱువు పుణ్యసముపార్జనమునకై పెద్దనయే త్రవ్వించెనని యచ్చటివారు చెప్పుదురు. పెద్దన 1470 సంవత్సరము ప్రాంతమున జన్మించి నలువది యేండ్ల ప్రాయమున రాయల యాస్థానము ప్రవేశించి 1533వ సంవత్సరము ప్రాంతమున మరణించియుండునని విమర్శకుల యభిప్రాయము. రాయలవారి మరణానంతరముకూడ నాతఁడు కొంతకాలము జీవించెననుట కతఁడు రాయలవారిని గూర్చి రచించిన "ఎదురైనచో దనమదకరీంద్రము డిగ్గి కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె" నిత్యాది సీసపద్యమును, రాయల మరణానంతరము గజపతి విజయనగరముపై దండెత్తి రాగా పెద్దన యతనికి పంపెనని విశ్వసింపఁబడుచున్న "రాయరావుతుగండ రాచయేనుఁగు వచ్చి యారట్లకోట గోరాడునాఁడు" ఇత్యాది సీసపద్యమును తార్కాణములు. పెద్దన రాయలకు బాల్యమున గురువై యుండెనను ప్రతీతిగూడ నున్నది.

"కోకట గ్రామాద్య నేకాగ్రహారము లడిగిన సీమలయందు నిచ్చె" నను పాదమును బట్టి రాయలు పెద్దనకొక్క కోకట గ్రామమునే కాక మఱికొన్ని గ్రామములనుగూడ నగ్రహారములుగా నిచ్చినట్లు తెలియుచున్నది. చిత్తూరు మండలమునందలి మేల్పాడు గ్రామమునకు సంబంధించిన రికార్డులో రాయలు పెద్దనకు తానెంపూడి యను గ్రామము నగ్రహారముగా నిచ్చినట్లు తెలుపఁబడి యున్నది. రాయలగ్రహారముగా నిచ్చిన యితర గ్రామములేవో తెలియుటలేదు. ఈ అగ్రహారముల నిచ్చుటయే కాక రాయలవారు పెద్దనకు కటకాదిసీమ నాయఁకరముకూడ నిచ్చి గౌరవించినట్లు తెలియుచున్నది. నాయఁకరమనఁ గా ఆధిపత్యము (ఇప్పటి గవర్నరు పదవివంటిది). "నిరుపహతిస్థలంబు రమణీప్రియ దూతిక తెచ్చియిచ్చు కప్పురవిడె" అను చాటువును బట్టి పెద్దన భోగపరాయణుఁడని భావించుట కవకాశమున్నది. అతఁడు రాజోచితభోగము లనుభవించినను ఔదార్య సంపన్నుఁడనియు, వైష్ణవమతము నవలంబించినను శివునియందుకూడ భక్తి కలిగియుండెననియు నాతఁడు వేయించిన దానశాసనములవలన విశదమగుచున్నది. అతఁడు కోకట గ్రామమునందలి కొంత భాగము నా గ్రామమందలి సకలేశ్వర దేవునికి ధూపదీపనైవేద్యములకై దానము చేసినట్లొక శాసనమును (1518), ఆ గ్రామమునందే కల మఱికొంత భూమి నచ్చటఁగల చెన్న కేశవస్వామివారి దీపారాధనమునకై దానము చేసినట్టింకొక శాసనమును (1518)

తెల్పుచున్నవి. అతఁడు కోకట గ్రామమును వైష్ణవుల కగ్రహారముగా నిచ్చి గురుస్మృత్యర్థము దానికి శఠకోపపురమని పేరు పెట్టినట్లు చెప్పుదురు. అతఁడున్నూరునందలి కొంతభూమి నా గ్రామమందలి వరదరాజస్వామి వారికిని, అమ్మవారికిని, అంగరంగ వైభవములకును, ధూపదీప నైవేద్యాదులకును దానము చేసినట్లున్నూరు శాసనమువలన (1519) తెలియుచున్నది. కోకట గ్రామమునకు సంబంధించిన కైఫియతులో నతఁడు పినాకిని నుండి కోకటమున కొక కాలువ త్రవ్వించినట్లు చెప్పఁబడియున్నది. కోకట గ్రామ దానశాసనములలో లేని ఆంధ్రకవితాపితామహ బిరుద మున్నూరు శాసనమున కానవచ్చుచుండుటచే రాయలా బిరుదము నాతనికి 1518-1519 సంవత్సరముల నడుమ నిచ్చియుండునని భావింపవచ్చును. ఆ బిరుదము మనుచరిత్రావతారికయందును గద్యములందును గూడ గోచరించుటచే 1519వ సంవత్సరము తరువాతనే యతఁడు మనుచరిత్రమును రచించి యుండునని నిశ్చయింపవచ్చును. పితామహుఁడనగా బ్రహ్మ, ఆంధ్రకవితా పితామహుడనగా నాంధ్ర కవిత్వమునకు బ్రహ్మయని యర్థము. ఆంధ్ర కవిత్వమును సృష్టించిన వాఁడతఁడు కాకపోయినను అందలి విశిష్ట ప్రక్రియయైన ప్రబంధమునకు రూపుదిద్ది దానిని ప్రచారమునకుఁ దెచ్చినవాఁడగుటచే రాయలాతనికా బిరుదము నొసంగెనని భావించవచ్చును.

పెద్దన తన మనుచరిత్ర ప్రబంధమును రాయలవారికే యంకితము చేసెను. అతఁడు రాయలు తన్ను మనుచరిత్రమును వ్రాయుమని యడిగిన పరిస్థితులను మనుచరిత్రావతారికలో వర్ణించియుండెను. ఒకప్పుడు రాయల వారు భువన విజయ సభాస్థిత సింహాసనమునఁ గూర్చుండి ప్రాజ్ఞులతోఁ గవితా గోష్ఠి యొనరించుచు పెద్దనను జూచి,

**"సప్తసంతానములలోఁ బ్రశ స్తిఁగాంచి**
**ఖిలముగాకుండునది ధాత్రిఁగృతియకాన**
**కృతిరచింపుము మాకు శిరీషకుసుమ**
**పేశల సుధామయోక్తులఁ బెద్దనార్య!**

**హితుఁడవు, చతురవచోనిధి**
**వతులపురాణాగమేతిహాసకథార్థ**
**స్మృతియుతుఁడ వాంధ్రకవితా**
**పితామహుఁడ వెవ్వరీడు పేర్కొననీకున్**

**మనువులలో స్వారోచిష**
**మనుసంభవ మరయ రససమంచిత కథలన్**
**విననింపు, కలిధ్వంసక,**
**మనఘ! భవచ్చతుర రచన కనుకూలంబున్** 1-14,15,16

కావున మార్కండేయోక్త ప్రకారంబునం జెప్పు” మని యడిగి కర్పూర తాంబూల మొసంగెను. పెద్దనయు మహాప్రసాదమని యామహాప్రబంధము రచించుటకా రంభించెను. అతఁడు గద్యములందు తన కావ్యమును స్వారోచిషమనుసంభవమనియే పేర్కొనెను. కాని దానికి లోకమున మనుచరిత్రమను పేరే బహుళ వ్యాప్తియందున్నది. నిజమునకందు స్వారోచిషమనువు జననవృత్తాంతమేకాని యతని చరిత్రయేమియు లేదు. అందుచే దానిని స్వారోచిషమను సంభవమనుటయే యుచితముకాని “మనుచరిత్రం” బందు కొనువేళ అని పెద్దనయే దానిని మనుచరిత్రయని పేర్కొనియుండుటచేత నా సంక్షిప్త నామమే లోకమున నెక్కువ ప్రచారము పొందినది.

మను చరిత్రమందలి కథయిది. ఆర్యావర్తదేశమున వరణానదీతీరమందు అరుణాస్పదమను పురమొకటి కలదు. అందు ప్రవరుఁడను పేరుగల విప్రకుమారుఁడొకఁ డుండెను. అతఁడు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి, భాషాపరశేషభోగి; కర్మఠుఁడు; నిరంతరాధ్యాపనతత్పరుఁడు. అతఁడనుకూలవతియైన భార్యతోడను, తల్లిదండ్రులతోడను గూడి అతిథులకు నభ్యాగతులకు నుచితవిధమున సేవచేయుచు కాలము గడుపుచుండ నొకనాఁ డౌషధ సిద్ధుఁడొకఁడాతని యింటికరుదెంచెను. ప్రవరుఁడాతని కర్ఘ్యపాద్యాదులొసంగి, యిష్టమృష్టాన్న కలన సంతృప్తుని గావించి “స్వామీ! మీరెందుండి యెందేగుచు నిచ్చటికరు దెంచినారు? ఏయే దేశములను జూచినారు. ఏయే తీర్థములందుఁ గ్రుంకిడితిరి? ఏయేగిరి ద్వీపవనసముద్రములను దర్శించితిరి తెల్పు”డనియడిగెను. సిద్ధుఁడు “నేను కేదారేశ్వరుని భజించితిని. హింగుళాశక్తి నారాధించితిని, ప్రయాగనిలయుఁడైన పద్మాక్షుని సేవించితిని. బదరీ నారాయణుని గంటిని. ఈ యా దేశములననేల సమస్తాశావకాశములను జూచితి” నని పలికెను. ప్రవరుఁడంత “మిమ్ముచూడఁగా చిన్న ప్రాయము వారుగాఁగన్పించుచున్నారు. ఇన్ని ప్రదేశములు స్వల్పకాలములో నెట్లుచూడజాలినా” రనియాశ్చర్యమున ప్రశ్నింప నతఁ డు తనకీశ్వరకృపచే పాదలేపమను దివ్యౌషధరసము లభించెననియుఁ దత్ప్రభావముచేఁ దాను మనోవాయువేగముల మించువేగముతో సంచరింపఁ జాలుదు ననియు బదులు చెప్పెను. ప్రవరుఁడంత తన్నుగూడ తీర్థయాత్ర వలన ధన్యాత్ముని గావింపవలెనని వేడుకొనెను. సిద్ధుఁ డప్పుడొక దంతపు బరణినిదీసి యందలి యొకరసమిది యదియని చెప్పక యాతని పాదములకు పూసివెడలిపోయెను. ప్రవరుఁడు దానిప్రభావమున హిమవత్పర్వతమును జూడనేగెను.

అతఁడాపర్వతమందలి వింతలన్నియు మధ్యాహ్నమువఱకును జూచి యింకనింటికిఁ దిరిగి పోవఁదలచుచుండఁగా మంచువలన సిద్ధుఁడు పూసిన పాదలేపముకరఁగిపోవుట వలన నట్లుచేయఁజాలక చింతాసాగరమున మునిఁగి తన్నిల్లు చేర్చువారెవరైన కనఁబడుదురేమోయని వెదకుచు నొక్కచోగారుడోత్కీర్ణమైన భవనమున వీణవాయించుచున్న యొక దేవతాకాంతను

జూచెను. ఆమెయు నతనిగాంచి, లేచి మదనబాణభిన్నహృదయయైవచ్చి యాతని త్రోవకడ్డముగా నిలబడెను. అతఁడామెకు దనపేరును వృత్తాంతమును నెఱింగించి తనపురమునకు పోవు మార్గము తెలుపుమని యడిగెను. ఆమె తన పేరు వరూధిని యనియు, ఘృతాచీతిలోత్తమాదులు తన చెలికత్తెలనియుఁ దెలిపి

**"నిక్కము దాపనేల ధరణీసురనందన! యింక నీపయిం**
**జిక్కె మనంబు నాకు, ననుఁ జిత్తజు బారికి నప్పగించెదో**
**చొక్కి మరంద మద్యముల చూఱలఁ బాటలుపాడు తేంట్ల సొం**
**పెక్కినయట్టి పూవుఁ బొదరిండ్లను గౌఁగిట గారవించెదో** 2-51

అని తన మనోరథ మెఱిఁగించెను. ప్రవరుఁడు తానప్పుడిల్లు చేరనిచో కర్మభంగమగున నియు, జననీజనకు లాఁకటసోలుచుఁ దనకొఱకెదురు చూచుచుందురనియు, బ్రాహ్మణుఁ డింద్రియవశుఁడై చరించినచో బ్రహ్మానందమునకు దూరుఁడై చెడుననియుఁ బలికి యెఱిఁ గినచో నగర మార్గము తెలిపి పుణ్యముకట్టుకొమ్మని ప్రార్థించెను. వరూధిని వలపునిలుపఁ జాలక యాతని గౌఁగిలించుకొని యధరమిమ్మని యాశించెను. ప్రవరుఁడు "హా శ్రీహరీ" యనుచు నోరమోమిడి యామెను పొమ్మని త్రోసివేసెను. త్రోయునప్పుడు నఖాంకురము సోకెనని చూపియామె వేదన నెపముననేడ్చెను. పిమ్మట నామె తనకోరిక కనుకూలమైన హేతువాద మొనరించుచు నేమేమోపలుకుచుండ నాతఁడు వినిపించు కొనక యామెమేని జవ్వాదిపస కదంబించు నొడలు కడిగికొని తానుపాసించుగార్హపత్యాగ్నిని దన్నిల్లు చేర్పుమని ప్రార్థించెను. పిమ్మటనతఁడాయగ్ని ప్రసాదముచే లభించిన పవన జవమున నిజమందిరమున కరిగి నిత్యకర్మకలాపము యథావిధిగా నొనరించెను.

ప్రవరుఁడరిగిన పిమ్మటవరూధిని యాతనికై వెదకి యెచ్చటనుగాంచక వివిధ మన్మథ దశాంతరములొంది వేగుచుండెను. అంత సంధ్యాకాలమయ్యెను. క్రమముగా నంధకారము దెసలవ్యాపించెను. చంద్రుఁడుదయించెను. వెన్నెల కురిసెను, వరూధిని వియోగవేదన భరింపజాలక సఖులతో కేళీవనమునకరిగెను. అచ్చట వియోగబాధ మఱింత అగ్గలమగుటచే నామెగృహమునకుం దిరిగి వచ్చి చంద్రుని, మన్మథుని మలయవాయువును ఉపాలంభించి మూర్ఛిల్ల సఖులు శీతలోపచారము లాచరించిరి. ప్రభాతమయ్యెను. చెలికత్తెలామె నుచితోక్తుల ననునయించి యంతికోద్యానమునకుఁ గొనివచ్చిరి.

అంతకు ముందే వరూధినిని వలచి విఫలుఁడై మన్మథవేదనచే వేగుచున్న గంధర్వ కుమారుఁ డొకఁడామె ప్రవరునివలచుటయు నతఁడామెను దిరస్కరించి వెడలి పోవుటయు నెఱింగి, శాంబరీ మహిమచే తాను ప్రవరునివేషమునే కాక దేహకాంతినిగూడ గ్రహించి, యా యుద్యానవనముఁజేరి, దేవపూజకై పూవులు కోయుచున్నట్లు నటించుచుండెను.

వరూధిని చెలికత్తెలుద్యానవనసౌందర్యము వర్ణించుచుండ వినుచు నచ్చటి కరుదెంచి వారితో కొంతతడువు పుష్పాపచయము కావించెను. తరువాత చెలులు జలక్రీడ సల్పుచుండ నామె యటునిటు తిరుగుచు పూలుకోయు నా కపట భూసురుని గాంచి చెంతకేగి.

**ఏలర యీచలంబుడిగి యేలర! బాలరసాల మాలతీ**
**జాలములో, శశాంకకరజాలములో వలవంత నశ్రువుల్**
**జాలుగ నాల్గు జాలు నిఁకఁ జాలు భవంబను నంత కాకకుం**
**బాలయి రాత్రి పంచశరుబారికిఁ జిక్కితి నీకు దక్కితిన్** 3-93

అని యేడ్చుచుఁ బలికెను. ఆ గంధర్వుఁడు జాలిపడి యామెకోరిక కొడఁబడినట్లు నటించి "కవయు సమయమున నీవు కన్నుఁగవ మూయవలయును. మా దేశమునందలి యాచారమిది. కన్ను తెఱచినచో పాపమగును. మఱియు నీ యభీష్టము నెఱవేరినను నేను నిన్ను సమ్మతింపఁజేసి యరుగువఱకు నీవు నన్ను వదలిపోరా"దని నియమ మేర్పఱిచెను, వరూధిని యట్లు చేయుట కంగీకరించి చెలులింటి కరుగ నతనితో క్రీడించెను. అట్లు కొంత కాలము గడవ నామె గర్భవతి యయ్యెను. గంధర్వుఁడు తన యభిమతము చేకూఱిన కతమున తన వంచన యెఱింగిన నామె శపించునేమో యనియు చెప్పకుండ నరిగినచో మదనశర పరంపర కగ్గమై ప్రాణములు వీడునేమో యనియు శంకించి యొకనా డామెకడకేగి "మున్ను నా పాదములకు పాదలేపము పూసిన యోగి తీర్థయాత్రావశమున నిచ్చటి కరుదెంచి సంసారస్థితులన్నియు చెప్పినాఁడు. అచ్చటి పరిస్థితు లధ్వాన్నముగా నున్నవి. నేను పోవలయును. ఆ సిద్ధుఁడావిద్యను నాకు పూర్తిగా నెఱింగించెను. అప్పుడప్పుడు వచ్చుచు పోవుచుందు"నని యొక విధమున నామె నంగీకరింపఁజేసి యథేచ్ఛనరిగెను.

వరూధిని నవమాసములు నిండినపిమ్మట నొక శుభముహూర్తమున కుమారుని ప్రసవించెను. అచటి మునులతనికి స్వరోచి యని పేరు పెట్టిరి. అతడు పెరిగి పెద్దయై మంథపర్వతతటిని విశ్వకర్మ నిర్మితమైన నగరమున నాటవిక సేనా సేవితుఁడై సామ్రాజ్య మనుభవింపఁ దొడఁగెను. ఒకనాఁడొక యెఱుకుఱేఁడాతని దర్శించి కైలాసగిరి ప్రాంత కాంతారమునందలి మృగముల వర్ణింప నతనికి మృగయాకౌశల మతిశయించెను. తరువాత నతండనుచరుల మృగయాసాధనముల నన్నింటిని నియమించి వారితో నేగి మృగములను పక్షులను వేటాడి యొక్కచో విశ్రమించెను. అప్పుడు కొన్ని దుశ్శకునములు తోఁపనొక శాకునికుఁడు "మనము వేట నెపమున చాలదవ్వు వచ్చితిమి. ఈ శకునములు కొఱగానివిగాఁ దోచుచున్న"వని పలుక స్వరోచి సజ్యకార్ముకుఁడై యేయాపదనైన నెదుర్కొన సిద్ధముగా నుండెను. అప్పుడాతని మేన జయలాభ సూచకములైన కొన్ని నిమిత్తములు పొడకట్టిన నాతఁడు ప్రాణరక్షాసంశయమగు నొక యుద్ధమగుననియు చివరికి జయము లభించుననియు నూఱడిలి యుండెను. ఆ సమయమున "హా! హా! వనిత ననాథ నబల నార్తవిపన్నన్ గావరె

యీ పుణ్యమునం బోవరె" యను నాడుమొఱ వినిపించెను. అది యేమని స్వరోచి మొఱవచ్చినవంక చూచుచుండ భయశోకాక్రాంతయైన కాంత యాతని యెదుటి కరుదెంచి "రాజా! నేఁటికి మూఁడునాళ్ళ నుండి భయంకరుఁడైన యొక రాక్షసుఁడు నా ప్రాణములు గొనుటకై నన్ను వెంటాడుచున్నాఁడు. ఇందీవరాక్షుండను గంధర్వునికి మరుదశ్వ పుత్రికయందుఁ బుట్టినదానను, నాపేరు మనోరమ, పారర్షి పట్టి కళావతియును, మందార విద్యాధరాత్మజ విభావసియు నాకు ప్రాణసఖులు, మేము ముగ్వురము నొకనాఁడు కైలాసపర్వతమున పుష్పాపచయము కావించుచు నొక బిలమున నొడలంతయు రోమతతితో నిండియుండిన యొక ముసలిమునిని గాంచితిమి. బాల్యచాపలమున నేనాతని ముఖము పట్టుకొనఁగా నాతఁడు కనులు తెఱిచి "ఓసి దురాత్మురాల! ముసలివాఁడగు నన్ను స్పృశించి పరిహాసమొనరించితివి కావున నొక యసురకు పట్టువడు"మని శపించి కోపమున తనచేతి నాగబెత్తముతో నన్ను పసరముఁ గొట్టినట్లు గొట్టెను. అంత నా సఖులా మునిని నిందింప నాతఁడు "రాజయక్ష్మక్షోభ మెసగ నశింపుఁ"డని వారికి శాపమొసంగెను. వెంటనే యా రోగము వారి కంకురించెను. "నన్ను మూడునాళ్ళ నుండి రాక్షసుఁడొకఁడు వెంటఁ దఱుముచున్నాఁడు. నీకస్త్రహృదయమను విద్య నొసంగెదను. దీనిని గ్రహించి రక్కసుని దునిమి నన్ను రక్షింపు"మని వేడుకొనెను. స్వరోచి శుచియై యావిద్య గ్రహించెను. ఇంతలో నా రక్కసుఁ డచ్చటి కరుదెంచెను. స్వరోచి యాతనితో యుద్ధమొనరించి చివరి కాగ్నేయాస్త్ర మతనిపై ప్రయోగించెను. అతఁడు రాక్షస రూపమును విడిచి గంధర్వుఁడై స్వరోచిని గౌఁగిలించుకొని "నీ దర్శనముచే ధన్యుఁడనైతిని. నేనిందీ వరాక్షుఁడను గంధర్వుఁడను. నీ తల్లికి తమ్ముఁడను. నేనొక మునిశాపము కతమున నిట్లు రాక్షసుఁడనై యీ నా కూతుప్రాణములు గొన వెంట దఱుముచున్నా"నని పలికెను. అప్పుడు మనోరమ యచ్చటి కరుదెంచి తండ్రి పాదములకు నమస్కరించెను.

స్వరోచి యిందీవరాక్షునిఁగాంచి యతనిని ముని శపించుటకుఁ గారణము చెప్పుమని యడిగెను. ఇందీవరాక్షుఁడు తన వృత్తాంతము నిట్లు చెప్పెను. "నేను నలనాభుఁడను గంధర్వునికుమారుడను. బ్రహ్మమిత్రుఁడను ఋషి శిష్యులకు నాయుర్వేదము బోధించుచుండెనని విని నేనతని దర్శించి యావిద్య నాకుఁగూడ ననుగ్రహింపుమని ప్రార్థించితిని. అతఁడు తిరస్కరించెను. నేనంత మాయచే కపట శిష్యుఁడనై విద్యనంతను నేర్చి యొక నాఁడు మునితో

**తంత్రీ నాకు ననుగ్రహింపఁగదె వైద్యంబంచుఁ బ్రార్థించినన్**
**గంద్రల్ గానటులాడి ధిక్కృతులఁ బోకాల్మంటి వోహో మదిన్**
**దీంద్రల్ గల్గినవారికే కరణి నేనిన్ విద్య రాకుండునే**
**గుంద్రా డాచినఁ బెండ్లి యేమిటికిఁ జిక్కుం గష్టముప్టింపచా.** 5-17

అని పల్కితిని.

అంత నాతఁడు కోపించి “ఓరి కుటిలాత్మా! ఆసురియగు మాయ మాయెడ ప్రయోగించి వంచించి విద్యనపహసించితివికావున నసురవై వసియింపు” మని శపించెను. అంతనేను శాపమునకవధి ప్రసాదింపుమని దీనుఁడనై యతని ప్రార్థించితిని. అతఁడు దయదాల్చి “కొన్నినాళ్ళకు నీవు నీ కూఁతు మ్రింగబోయి యొక ధన్యుని దివ్యశరార్చిఁబ్రేలి శుభము నొందుదు” వని యనుగ్రహించెను. నేనింటికరిగి రక్కసుఁడనై పురమునను అంతః పురమునను ఇరుగు పొరుగూళ్ళనుగల వారినందఱిని మెసవ నారంభించితిని. నా భార్యను పుట్టినింటి వారుత్సవదర్శన మిషమునఁగొనిపోయిరి. నే నశనముగానక కైలాసవనమున పూలుగోయు నీ కన్నియ నాకటికై మ్రింగ వెంటఁదఱుముచు నిచ్చట నీ దర్శనమున పాపవిముక్తుఁడనై నిజ ప్రకృతిఁబొందితిని. ఈయుపకారమునకుఁ బ్రత్యుపకారము చేయఁ జాలను. ఈ నా తనయను నీకు భార్యగానిత్తును, ఆయుర్వేదముతోఁగూడ నీమెను గ్రహించి పెండ్లియాడుము”. స్వరోచి యావృత్తాంతము విని సంతసించెను. పిమ్మట నిందీవరాక్షుఁడు తన కూఁతును స్వరోచిని మంథగిరికిఁగొనిపోయెను. తరువాత మనోరమాస్వరోచుల కతివైభవమున వివాహము జరిగెను. వివాహానంతర మిందీవరాక్షుడు కూఁతునకు నల్లునకు వివిధములైన కానుక లొసంగెను.

కేళీగృహమున స్వరోచి మనోరమను గౌఁగిలించి కవయఁదమకించు సమయమున నామె కన్నీరు కార్చుచు దుఃఖింప దొడఁగెను. అతఁడందుకు కారణమేమని యడిగెను. ఆమె తనప్రాణసఖులు దారుణరోగమునకు పాలై కుందుచుండఁ దాను దుఃఖింపకెట్లుందునని పలికెను. పిమ్మట నాతఁడు మనోరమతో నా సఖులున్న చోటికరిగి వారికిఁదగిన చికిత్స యొనరించి యనామయ ధన్యలఁగావించెను. వారెంతయు సంతోషించిరి. పిమ్మట విభావసి తన వృత్తాంతము నాతనికిఁదెల్పనెంచి “అనఘా, నేను మందార విద్యాధరుని కూఁతురను. నన్ను విభావసి యందురు. మృగపక్షి జాతుల భాషలెల్ల నేనెఱిఁగియుందును. ఆ విద్య నావలన గ్రహించి నన్ను వివాహమాడు”మని ప్రార్థించెను. అప్పుడు కళావతి తన వృత్తాంతమునిట్లు చెప్పెను.

“పారుఁడను బ్రహ్మర్షి మా తండ్రి. అతఁడు నేలపై నంగుష్ఠము మోపి చతురగ్ని మధ్యమున నిల్చి ముకుందునిగూర్చి తపమాచరించుచుండ భీతుఁడై యింద్రుఁడతని కడకు పుంజికస్థలయను నచ్చరను బంపెను. అప్పుడు వసంతర్తువు విలసిల్లెను. ఆమె చెలికత్తెలతో ముని సమీపమున పూలుకోయు నెపమున విహరించుచుండఁగా నతఁడామెనుగాంచి మదనబాణవిఖండిత ధైర్యుఁడై పర్ణశాలాంతరము చేర్చి కందర్పకేళిఁదేలెను. కొంత కాలమున కామెగర్భముదాల్చి నవమాసములు నిండినతఱి నన్నుగాంచి విపినాంతరమునఁ బాఱవైచి యరిగెను. మునియు నన్నుఁ గూర్చి చింతింపఁడాయెను. నేను చంద్రకిరణములనుండి స్రవించు నమృతరసము నాని యెట్లో జీవించితిని. అంత మునినన్నుఁగాంచి శశికళా

సంవర్ధితనగుటచే నాకు కళావతియను పేరు పెట్టి పెంచుచుండెను. నేను క్రమముగా యౌవనముపొంది తండ్రికి సేవచేయుచుండ దేవాపి యను ఖేచరుండొకండు నన్నుఁ జూచి వలచి బంధువులతో నరుదెంచి మా తండ్రికి తన భావమును తెలిపెను. మా తండ్రి వారి వేషములు చూచి యసహ్యించుకొనుచు వారిని నిందించెను. దేవాపి తన మనోరథము విఫలమగుటచే క్రోధాంధుఁడై నాఁటి యర్ధరాత్రి సమయమున మా తండ్రిని సంహరించెను. తెల్లవారిన పిమ్మట నతనికగ్ని సంస్కారముకావించి, చిన్న నాటినుండియు పెంచి పెద్ద చేసిన తండ్రి మరణించెఁగదా యని వగచుచు, నేను ప్రాణత్యాగ మొనరింపఁబోవుచుండ పార్వతి యాకసము నుండి దిగివచ్చి" అందమునకు నిలయమైన యీ తనువునిట్లు విడువనేల? సాహసముడుగుము. స్వరోచి నీకు భర్తయగును. అతని జేపట్టి నీవప్రతిమాన వైభవమునందెదవు. అదిగాక నీకు నేను పద్మినియను విద్యనొసంగెదను. తత్ప్రసాదమున నీ కభీష్ట సౌఖ్యములు సిద్ధించు" నని పల్కి యా విద్య నాకుపదేశించి యరిగెను. ఆమె మాటలు ధైర్యముగొలుప నేనింతవఱకు ప్రాణములు పట్టుకుని యున్నదానను. ఆ స్వరోచి వీవేయనుకొందును. ఆ విద్యారత్నముతోగూడ నన్ను పరిగ్రహింపుము" ఆ మాటలువిని స్వరోచి యా విద్యలు రెండును గ్రహించి యా యిరువురు కన్యల నొక్క సుముహూర్తమున పెండ్లియాడెను.

స్వరోచి యా ముువ్వురు భార్యలతో నాయా ప్రదేశముల విహరించుచు నొకనాఁడొక కాసారతీరమున కరుదెంచెను. ఆ సమయమునందుండిన యొక హంసి దవ్వులనున్న చక్రవాకిని బిల్చి "ఈ పతియు సతులుఁ గవగూడి యుండఁగా నేమి తపమాచరించిరో కదా!సతీపతులకు వలపు సమయమై యుండుట పూర్వజన్మపుణ్యము. ఈ రాజున కీ సవతులపైని ఈ సతులకీరాజుపై ప్రేమ యగ్గలమై యొప్పుచున్నది. పూవుయుతావియువలె నాకు వీరధికమైన యానందము నావహించుచున్నా"రని పలికెను. ఆ మాటలు విని చక్రవాకి,

**"పలువురయందు నొక్కనికి బ్రాఁతియు నొక్కనియందుఁజూడన**
**గ్గలమగు ప్రేమ పల్వురకుఁగల్గుట యద్భుత మట్లుగాన యి**
**వ్వెలఁదులయందుఁగూర్మిపస వీనికి నేమియులేదు వీనియం**
**దలవడఁగల్గదీ జలరుహాక్షులకుం బ్రియ మెవ్విధంబునన్** 6-70

**తగులునెవ్వఁడొక్క తరుణికి నొకనికి**
**మెలఁతవలచు నదియుమేలనంగ**
**వచ్చుఁగాని పెక్కువనితలపై ఁగూర్మి**
**గలుగుననుట బొంకుగాదె తరుణి!** 6-74

వేయిమాటలేల? నేనొక్కతెనే భాగ్యసమన్వితను. నావిభుఁడొక్కఁడే ధన్యుఁ"డని ప్రత్యుత్తరమిచ్చెను. స్వరోచి మృగపక్షి భాషల నెఱిఁగినవాఁడు కావున నా చక్రవాకి పల్కులు విని లజ్జితుఁడయ్యు పట్టరాని తమకమున నా నెలతలతో నూఱేండ్లు సౌఖ్యమనుభవించెను.

ఒకనాఁడతఁడు లేడిపిండు తన్ను జుట్టిరా నావనమున చరించునొక హరిణమును గాంచి తన సతులకుఁజూపించెను. ఆ సమయమున నాడులేళ్లు ప్రియు నాననము మూర్కొనుచు నఖ్ఖు నాకుచుండెను. అప్పుడు హరిణము,

> **హుంకారంబొనరించి వేతలఁగుఁ డోహో! నేను స్వారోచినే**
> **పంకేజాక్షులతోడ నెల్లపుడు దర్పస్ఫూర్తిఁగ్రీడింప ల**
> **జ్జాంకూరంబడఁగించినారు తలపోయంజాల రోఁతయ్యె మీ**
> **రింకంబోయి వరింపు డొక్కరుని భోగేచ్ఛన్నివారించితిన్** 6–79

వీని విధమున వనితాధీనుఁడనై పెంపుదక్కి తిరుగుచుండుటకు నేను వెఱ్ఱినే" యని పలుక నాడులేళ్లు మసలక వెడలిపోయెను. స్వరోచి యామాటలు కూడ విని వైరాగ్యము దయించినను దుర్వారములైన కోర్కెలకు వశుఁడై తనభార్యలతో నాఱు నూఱేండ్లు విహరించెను. తరువాత మనోరమాదులగు మువ్వురు భార్యలయందును నతఁడు విజయ మేరునందన విభావసులను ముువ్వురు తనయులను గాంచి పద్మినీ విద్యా ప్రభావమున మూఁడునగరములు కల్పించి వారినందు పట్టముగట్టి యానందమున కాలము పుచ్చుచుండెను.

ఒక నాడతఁడు వేటకరిగి యొక యేకలమును గాంచి దాని నేయఁబోవుసమయమున నొక హరిణాంగన యా బాణము తనపై విడువుమని యతని ప్రార్థించెను. అతఁడు నీకు ''తనువుపై రోఁతపుట్టుటకు కారణమే''మని యడిగెను. అంత నాహరిణాంగన "అన్యకాంతాసక్తుఁడగు వానితోఁగూడఁదలఁచు కంటె మరణమే మేల"ని బదులు పలికెను. రాజు నీ హృదయమెవ్వనిపై నిలిచెనో చెప్పుమని యడిగెను. హరిణి నా మనము నీయందే తగిలి మదన బాణముల కగ్గమై బాధపడుచున్నదని పలికెను. అతఁడు "నీవు హరిణాంగనవు. నేను నరుఁడను. మన యిరువురికి మిథునకృత్యమెట్టు చేకుఱు"నని యడుగనది "నీ వనురాగమున నన్నాలింగన మొనరింపుము. అంతియచాలు"నని వేడుకొనెను. కృపార్ద్రుఁ డగుటచే స్వరోచి దానిని గౌఁగిటఁజేర్చెను. అంత నాహరిణి వనదేవతయయ్యెను. స్వరోచి "మృగివైన నీవంగనవెట్లైతివో చెప్పు" మని యడిగెను. హరిణి "నేనీ వనదేవతను. సకల భూభువన రక్షాదక్షుఁడైన మనువును నీ వలనఁబడయు మని దేవతలందఱును బ్రార్థింప నిటువచ్చితిని. అనురాగవతినైన నన్ను వరించి నాయందు తనయుఁబడయుము. దాన నీకు పుణ్యలోకావాప్తియగు"నని పలికెను. స్వరోచి యంగీకరించెను. వనదేవత యతనితో క్రీడించుచు గర్భవతియై యొక శుభదినమున తేజోనిధియైన యొక కుమారుని గాంచెను. స్వారోచిషుఁ డను పేరుగాంచిన యతఁడు శాంతి దాంతి దయాసత్యశౌచనిరతుఁడై యచ్యుతుని గూర్చి తపమాచరించెను. విష్ణువాతనికి ప్రత్యక్షమయ్యెను. అతఁడాతనికి సాష్టాంగ ప్రణామమాచరించి భక్తితో నతనిబొగడియతని దశావతారములు వర్ణించెను. విష్ణువుప్రీతుఁడై వరము వేడుకొనుమనెను. అతఁడు "దేవా! భవద్దాస్యసుఖము వేడెదను. సాలోక్యమొసంగుము.

ఇతరములే నొల్ల”నని ప్రార్థించెను. విష్ణువు “నీకు సాలోక్యము తుదినిచ్చెదను. ద్వితీయమనువవై ధర్మాలోలబుద్ధినిలనేలు’ మనిపల్కి యాతని మనుత్వమునకు పట్టముగట్టి యదృశ్యుఁడయ్యెను. స్వారోచిషుఁడు యథాశాస్త్రముగా బ్రజలను బ్రజలవలె పాలించెను. అతఁడు భూమినిపాలించుసమయమున వానలు సకాలమున వర్షించెను. ప్రజలు పుత్రపౌత్రా యురారోగ్యైశ్వర్యవంతులై నూఱేండ్లు జీవించిరి. స్త్రీలు పతివ్రతలై చరించిరి. అగ్నితస్కర వ్యాధి భయములడఁగెను. ప్రజావృద్ధి తామరతంపమయ్యెను.

రాయలు పెద్దనను మార్కండేయోక్తప్రకారముగా మనుచరిత్ర రచింపుమని యడిగెను. పెద్దనయు సంస్కృతాంధ్ర మార్కండేయ పురాణములను చదివి యందలి కథావిధానమునఁ గొన్ని మార్పుచేర్పులొనరించి మనుచరిత్ర నాదర్శప్రబంధముగా రూపొందించెను. ప్రబంధము వర్ణన ప్రధానమైన కావ్యమగుటచే పెద్దన మూలమున లేని పెక్కు వర్ణనముల నాంధ్ర ప్రబంధమున క్రొత్తగా చొప్పించెను. హిమవద్వర్ణనము, సంధ్యాంధకార చంద్ర చంద్రికా వర్ణనము, చంద్రమన్మథమలయమారుతోపాలంభములు, పుష్పాపచయవర్ణనము, సంభోగ వర్ణనము, మృగయావర్ణనము, యుద్ధవర్ణనము, మందరపర్వతవర్ణనము, పౌరకాంతావర్ణనము, వివాహవర్ణనము, వసంతవర్ణనము, దశావతారవర్ణనము మున్నగునవి యందు ముఖ్యమైనవి. అందుచేతనే ఆంధ్రమార్కండేయ పురాణమున నూటయేఁబది పద్యములలో వ్రాయబడిన యీ కథ ప్రబంధమున సుమారెనిమిది వందలపద్యముల నాక్రమించుట సంభవించినది. సంస్కృతమున బ్రాహ్మణ ప్రవరుఁడని మాత్రముండఁగా మారన యతనికి ప్రవరాఖ్యుఁడని పేరు పెట్టెను. పెద్దనదాని ననుసరించెను. వరూథిని చెలికత్తెలలో నొకతెపేరు, విభావరి యని మూలమున నుండ పెద్దన దానిని విభావసిగా మార్చెను. ప్రవరవేషము వేసికొని వరూథినిని వరించిన గంధర్వుని పేరు కలియని మూలమందున్నది. పెద్దన గంధర్వకుమారుఁ డనియెనే కాని కలి యని యెచ్చట నాతని పేరు పేర్కొని యుండలేదు. “మనువులలో స్వారోచిషమనుసంభవ మరయ”నను పద్యమునందలి ‘కలిధ్వంసక’ మను విశేషణ మాతనిపేరు ధ్వనింపఁజేయుచున్నదని కొందఱు విమర్శకులు తలంచిరి. కాని మనుచరిత్రమున నా పేరునకే ధ్వంసము కలిగినదిగాని యా గంధర్వునికెట్టి ధ్వంసమును కలిగియుండలేదు.

పెద్దన యౌచిత్య పోషణమునకై మూలకథలోఁ గొన్ని మార్పులు కావించెను. సంస్కృతమున సిద్ధుఁడు చూచిన తీర్థక్షేత్రాదులనువిని ప్రవరుఁడాశ్చర్యము ప్రకటించినట్లున్నది. తెలుఁగు పురాణమున “వాయపు రజ్జువేల మునివల్లభ…నమ్మనెద నీపలు”కని ప్రవరుఁడన్నట్లు వ్రాయఁబడినది. అతిథిని గూర్చి యిట్లనుట యుచితము కాకుండుటచే పెద్దన అది విడిచి ప్రవరునిచే వినయపూర్వక ప్రార్థన చేయించెను. మూలమున సిద్ధుఁడు పాదలేపమును ప్రవరుని కిచ్చినట్లు చెప్పఁబడినది. పెద్దన యొక పసరిదియది

యని చెప్పకుండ నాతఁడే ప్రవరుని పాదములకు పూసెనని వర్ణించెను. ఈ మార్పు తరువాతి కథకెంతో యనుకూలముగా నున్నది. మూలమున మంచుచే పాదలేపము కరఁగిన కతమున శీఘ్ర గమనసత్వము చెడినపిమ్మటకూడ ప్రవరుఁడింకను గొన్ని వింతలను జూచుచుండెనని కలదు. పెద్దన దీనిని దొలఁగించెను. వరూధిని తన్ను గౌఁగిలించుకొన్నప్పుడు ప్రవరుఁ డోరమోమిడి యంసద్వయం బంటి పొమ్మంచుం ద్రోయుట పెద్దన కల్పించిన సన్నివేశమే. మూలమున "నాతఁడంటకంటకు నన్ను, మృగాక్షి"యని మాత్రమన్నట్లు వ్రాయఁబడినది. పెద్దన మాయాప్రవరుఁడు సంగమ సమయమున వరూధిని కన్నులు మూయవలెనను నియమముతోపాటు "వాంఛితము దీర నను నీవు వదలఁజెల్లదేను నిను సమ్మతిలఁజేసి యరుగుదనుక" నను రెండవ నియమముకూడ సూచించెను. ఇది యావశ్యకమైన పెంపు. లేనిచో గంధర్వకుమారునికి తనివితీరుట యెట్లు? ముసలిమునిని జూచి మనోరమ నవ్వెనని మాత్రము మూలమున నున్నది. ఆ నేరము శాపమునకుఁ జాలదని కాఁబోలు పెద్దన "బూచి వోలె నున్న వాచంయముని మోము" నామె పట్టెనని వర్ణించెను. తరువాత ముని శపించి నాగబెత్తముతో మనోరమను బసరముఁ గొట్టినట్టు కొట్టెనని పెద్దన కల్పించెను. అప్పుడుకాని చెలికత్తెలు మునిని నిందించుటకు సాహసింపరని యాతఁడు భావించియుండును. మూలమున వారిలో నొకతెకు కుష్ఠవ్యాధియు నింకొకతెకు రాజయక్ష్మమును కలుగవలెనని ముని శపించినట్లున్నది. పెద్దన ముని యిరువురికిని రాజయక్ష్మమే కలుగవలెనని సమానమైన శాపమొసంగెను. ఇరువు రొనరించిన యపరాధము సమానమేకదా! మూలమున వరూధినీందీవరాక్షులకుఁగల సంబంధము తెలుపఁబడలేదు. పెద్దన యాతఁడు వరూధిని తమ్ముఁడని తెల్పి తెలుఁగునాట విరివిగాఁ గనఁబడు మేనఱికమును సూచించెను. విద్యాగ్రహణానంతర మిందీవరాక్షుఁడూరక నగుచుండెననియు బ్రహ్మమిత్రుఁడాతని శపించెననియుఁ గలదు. మఱియు నందా శాపము సప్తరాత్ర మాత్ర పరిమితమైనది. పెద్దన బ్రహ్మమిత్రుని కోపమునకుఁ గారణమైన యిందీవరాక్షుని పరుషోక్తులనుగూడ వర్ణించెను. మనోరమ తన చెలికత్తెల రోగముసంగతి స్వరోచితో వివాహము కాకముందే చెప్పినట్లు మూలమందున్నది. పెద్దన ప్రథమ సమాగమమునకు ముందామె యాతనికా విషయము తెల్పి వారికి రోగవిముక్తి కలిగించినట్లు మార్చి వ్రాసెను. ఈ మార్పెంతయు నౌచిత్య భాసురమై యొప్పారుచున్నది. మూలమున మను జననానంతరము స్వరోచి హంసమిథునము వాక్యములు విని నిర్విణ్ణుడై భార్యలతోఁగూడ నడవికేగి తపస్సొనరించి యమరత్వమొందెనని యున్నది. పెద్దన యా విషయమును విడిచివైచెను. కాని మనువే విష్ణువును గూర్చి తపస్సొనరించెననియు విష్ణువాతనికి ప్రత్యక్షమై మనుత్వమునకు పట్టము కట్టె ననియు కల్పించి వ్రాసెను. ఈ సందర్భమున నాతఁడు విష్ణు దశావతార స్తోత్రమున కవకాశము కల్పించుకొని తన విష్ణుభక్తిని ప్రదర్శించెను. అతఁడు మార్కండేయ పురాణమునందలి కథావిధానమునే కాక మారన యనువాదమందలి భావములను పదబంధములనుగూడ సన్నిహితముగా ననుసరించెను.

పురాణములకును ప్రబంధములకును వస్తు సంవిధానమునఁ గొంత భేదము గోచరించును. పురాణములలో ప్రధానకథకు నడుమ ప్రసక్తాను ప్రసక్తముగా నుపకథలు, ఉపాఖ్యానములు, ధర్మతత్త్వ ప్రసంగములు చెప్పఁబడుచుండును. అందు కవికి కళాదృష్టికంటె ధర్మతత్త్వోపదృష్టి హెచ్చుగా నుండును. ప్రబంధములందట్లు గాక యొకే కథ సర్వాంగ సుందరముగా ప్రపంచింపఁబడుచుండును. నాయికా నాయకులకు సంబంధింపని యితర వృత్తాంతముల కందుఁ దావులేదు. అట్టివందు చొప్పింపఁబడుచో నందలి వస్త్వైక్యమునకు భంగము కలుగును. మనుచరిత్రమునందలి వస్తువును వరూథినీ ప్రవర వృత్తాంతము, వరూథినీ మాయాప్రవర వృత్తాంతము, స్వరోచి వృత్తాంతము, మనోరమా వృత్తాంతము, ఇందీవరాక్ష వృత్తాంతము, విభావసీ కళావతుల వృత్తాంతము, మృగీస్వరోచుల వృత్తాంతము, మనుసంభవ వృత్తాంతము అనునెనిమిది ప్రధాన భాగములుగా విభజింపవచ్చును. ఇందు స్వారోచిషమను సంభవమను మనుచరిత్రమునకు తుది రెండు భాగములతో మాత్రము సన్నిహిత సంబంధమున్నది. మిగిలిన వృత్తాంతములన్నియు నప్రసక్తములుగానే కనిపించును. అందుచేతనే మనుచరిత్రమున వస్త్వైక్యము చెడినదని కొందఱు విమర్శకులభిప్రాయ పడుచున్నారు. స్థూలముగాఁ జూచినచో నది యట్లే కనిపించును. కాని సూక్ష్మముగాఁ బరిశీలించిన పెద్దన తన కావ్యమున నావృత్తాంతములనెల్ల వర్ణించుటలో మూలకథను యథాతథముగా వర్ణించు నుద్దేశమేకాక కథై క్యౌచిత్యములను బోషించు నుద్దేశముకూడ గోచరించును.

ఈ ప్రబంధమునందలి ప్రధానవస్తువు స్వారోచిషమనువు పుట్టుక. మనువు కావలసినవాని కుండవలసిన లక్షణములల్పములైనవి కావు. అతఁడు వివిధ మహిత లక్షణోపేతుఁడై జగచ్ఛాసకత్వమున కర్హుఁడై యుండవలయును. వేద విద్యాప్రవీణుఁడు, కర్మనిష్ఠుఁడు, రాజనీతిచతురుఁడు, పరాక్రమసంపన్నుఁడు, వైరాగ్యశోభితుఁడు నైనవాఁడు కాని మనుత్వమున కర్హుఁడు కాఁజాలఁడు. స్వారోచిష మనువు నందాలక్షణములన్నియు నున్నవి. అందుచేతనే అతఁడు తపస్సొనరించినపుడు విష్ణువు ప్రత్యక్షమై "సాలోక్యము తుదినిచ్చెద, నేలుమిల ద్వితీయమనువవీవై నయధర్మాలోల బుద్ధిఁ దిరముగ వేలుపులకుఁ దపసులకును విధికిఁ బ్రియముగాన్" అని నియోగించెనను విష్ణు వచనానుసారముగా నతఁ డట్లే పరిపాలనము సాగించెను.

స్వారోచిష మనువున కుత్తమ మనులక్షణములెట్లు సంక్రమించెను. అతఁడు స్వరోచికిని వనదేవతకును బుట్టినవాఁడు. అందాతని దివ్యత్వము సువ్యక్తమే. స్వరోచి వరూథినికిని గంధర్వునకును బుట్టెను. వారిరువురును విలాస పరాయణులే. ఇంద్రియ నిగ్రహము వారిలో మృగ్యము. అట్టివారి సంతతి మనుత్వమున కెట్లర్హత సంపాదింపఁగల్గెను? స్వరోచి జననమున నొక రహస్యమున్నది. అతఁడు మాయాప్రవరునికి వరూథిని యందు జన్మించెను. వరూథినికిఁ

దన్ను కలసినవాఁడు గంధర్వుఁడని తెలియదు. అతఁడు మొదట తన్ను దారి యడుగుటకై వచ్చి వలపించిన ప్రవరుడనియే ఆమె హృదయపూర్వకముగా భావించెను. ఆమె శారీరకముగా గంధర్వునితోడనే కూడినను మానసికముగా ప్రవరాఖ్యునే భావించుచుండెను. పెద్దన యీవిషయము నీ క్రింది సీసపద్యమున ప్రస్ఫుటము కావించినాఁడు.

**మున్ను విప్రాకారమునఁ గూడుచో శంకఁ**
**గనుమూయఁబంచె నాఖచరభర్త**
**యవ్వరారోహయు నాసక్త గావున**
**నిచ్చలో నటుసేయనియ్యకొనియె**
**నా ప్రతిజ్ఞా పూర్తి యయ్యెఁ దనంత న**
**వ్వనితకు రతి పారవశ్య పటిమ**
**నపుడు తత్ప్రవర సమిద్ధ శిఖి దీప్తి**
**శాంబరీ మహిమచే సంగ్రహించి**

**నట్టి గంధర్వమూర్తి సౌఖ్యానుభూతిఁ**
**జలన మేదిన మానసాబ్జమున నిలువ**
**వెలసెఁ దేజోమయంబైన వృద్ధి నట్టి**
**మేటి గర్భంబు; నెలలు తొమ్మిదియు నిండె** 4-3

సంగమసమయమున నామె వేద విద్యాపారగుఁడు, అలేఖ్యతనూవిలాసుఁడు, నిత్యాగ్నిహోత్రి, జితేంద్రియుఁడునైన ప్రవరునే తలపోయుచుండెను. భావనామహిమచే నామెకాసంగమమునకు ఫలితముగా జనించిన సంతానమున గూఢముగా నా ప్రవరాఖ్యుని గుణములన్నియుఁ బ్రవేశించెనని చెప్పవచ్చును. అవి స్వరోచియందు గుప్తములై యుండి అతని సంతానమునందు వ్యక్తములయ్యెను. "అనిమేషస్థితి మాన్చె బిత్తరుపుఁ జూపు" అను పద్యమున పెద్దన మనుష్యుని భావించుటచే గీర్వాణ వధూటికి మానుషత్వము చూపట్టెనని యుత్ప్రేక్షించి భావనామహిమను వ్యక్తము కావించెను. శారీరక బలముకంటె భావనాబలము వరీయముకదా! మఱియుఁ దల్లిదండ్రుల గుణరూప విశేషములు వారి సంతానమునకు సంక్రమించుట సర్వసామాన్యమైన విషయము. ఒకప్పుడు తండ్రిగుణములు పుత్రునందుఁ గాక పౌత్రునందుప్రస్ఫుటము లగుటయుఁగానిపించును. ఇట వరూధినీభావనాస్థితుఁడైన ప్రవరాఖ్యుని గుణరూప విశేషము లామె పౌత్రుఁడైన వ్యక్తి యందుఁజొచ్చి, సహజసిద్ధములైన ధైర్య విక్రమాదులతోఁగూడి యాతని మనువుగా రూపొందించెను. అవి లేనిచో నాతఁ డితరగుణము లెన్ని యున్నను మనుత్వమున కర్హుఁడు కాకపోయి యుండును. ఆ యర్హతను దానిని జేకూర్చిన పారంపర్యమును సూచించుటకై పెద్దన యితర వృత్తాంతములనుగూడ కావ్యమున వర్ణించినట్లు తోచుచున్నది. అతఁడు మనుచరిత్రమును వరూధినీ ప్రవరుల

వృత్తాంతముతో నారంభించుట కిదికారణమని యనుకొన్నచో నందు వస్త్వైక్యమునకు భంగము లేదనియూహింపవచ్చును.

కథాకథనమున పెద్దన ప్రదర్శించిన నేర్పు ప్రశంసనీయముగానున్నది. అతఁడచ్చుటచ్చుట మూలమున లేని వర్ణనములు చొప్పించినను అవి కథా గమనమునకు ప్రతిబంధకములుగా లేవు. చతుర్థాశ్వాసారంభమునందలి వేట వర్ణనమే కొంచెమతి దీర్ఘముగా నున్నది. అతఁడు మనోరమకథను, ఇందీవరాక్షునికథను, విభావసికథను సంగ్రహముగా చెప్పివైచెను. కళావతి వృత్తాంతమున పుంజికస్థలాపారర్షుల శృంగారము నతఁడ నవసరముగా విస్తరించినట్లు గోచరించును. వరూధిని గర్భమును, స్వరోచి జనించి పెద్దయగుటను ఆతఁడు మిక్కిలి సంక్షేపముగా చెప్పివైచెను. ఈ సందర్భమున నాతఁడు వర్ణనలచే కావ్యమును పెంచుట కవకాశమున్నది. కాని యతఁడు ప్రధానకథను దృష్టియందిడుకొని యా భాగమును సంగ్రహించినట్లు కన్పించును. ద్వితీయాశ్వాసమునందలి వరూధినీ ప్రవరాఖ్యుల సంభాషణ మునతఁడు నాటకమునవలె చుఱుకుగను సరసముగను నడిపించెను. అట్లే ప్రసిద్ధవరులయు వరూధినీ మాయాప్రవరులయు సంభాషణలు రమ్యములుగా నున్నవి.

మనుచరిత్రమున మాయాప్రవరుని గాంచి వరూధిని ప్రవరుఁడేయని భ్రాంతిచెందుట యందే కథయంతయు నాధారపడియున్నది. పెద్దన యాభ్రాంతిని, శాంబరీ వృత్తాంతమును కావ్యారంభమునందలి పద్యములలోనే కాక యచ్చుటచ్చుటఁగల వర్ణనలలోఁగూడ ఎక్కువ సూచించెను.

**శ్రీ వక్షోజకురంగనాభమెదపై ఁజెన్నొంద విశ్వంభరా**
**దేవిన్ దత్కమలా సమీపమునఁ బ్రీతిన్నిల్పినాఁడోయనం**
**గా వందారు సనందనాది నిజభక్తశ్రేణికిం దోఁచురా**
**జీవాక్షుండు కృతార్థుఁజేయు శుభదృష్టిం గృష్ణరాయాధిపున్** 1-1

అను కావ్యాది పద్యమున విష్ణువు లక్ష్మిని కౌఁగిలించుకొన్నప్పు డాతని యెదపై నంటుకొన్న లక్ష్మీవక్షోజ కస్తూరీ పంకమును జూచి సనందనాదు లాతఁడు లక్ష్మికి సమీపమున నింకొక భార్యయైన భూదేవినిగూడ నిల్పెనాయని భావించిన క్రమము వర్ణింపఁబడినది.

**అంకముఁజేరి శైలతనయా స్తన దుగ్ధములానువేళ బా**
**ల్యాంక విచేష్టఁదొండమున నవ్వలి చన్గబళింపఁబోయి, యా**
**వంక గుచంబుగాన కహి వల్లభహారము గాంచి వేమృణా**
**ళాంకుర శంకనంటెడు గజాస్యునిఁ గొల్తు నభీష్టసిద్ధికిన్.** 1-4

అను వినాయక ప్రార్థనమున విఘ్నేశ్వరుఁడు పార్వతి చన్ను గుడుచుచు కుడివైపున నున్న స్తనమును గబళింపఁబోయి యచ్చట నున్న పాపసరములను జూచి మృణాళాంకురములని భ్రాంతి వహించినట్లు వర్ణింపఁబడినది. ఈ రెండు పద్యములందలి భ్రాంతియు

కావ్యకథయందలి వరూధిని భ్రాంతిని వ్యక్తము చేయుచున్నవి. ప్రవరాఖ్యుఁ డరిగినపిమ్మట వర్ణితమైన సంధ్యాకాల వర్ణనమందలి "ఉరుదరకుహ" రేత్యాది సీసములందలి భ్రాంతి పరంపరకూడ తరువాత వరూధిని గుఱికానున్న భ్రాంతిని ధ్వనింపఁజేయు చున్నది. "ఉల్లమునందు నక్కటిక మూనుట (1-2)" అనుపద్యమున శాంబరీ భిల్లుఁడైన శివుఁడర్జునుని పాశుపత దివ్యశరాధ్యునిజేయుట గంధర్వకుమారుఁడవలంబించిన శాంబరీ మహిమను సూచించుచు రమ్యముగా నున్నది.

వస్తురూప సన్నివేశ వర్ణనములందు పెద్దన కృతహస్తుఁడు. అతఁడు హిమాలయమున నేనుఁగులు తొండములు సాఁచి యందుగు చిగుళ్లకై నిక్కుటయు, వనదంశములు సెలవుల మూఁగి నెఱవెట్ట పెద్దపులులు పొదరిండ్ల గుఱకలిడుటయు, సెలయేటి యిసుక లంకల వరాహములు మొత్తములై త్రవ్వి ముస్తెలెత్తుటయు, మనుబిళ్లు ఆ పడ్డలవలె వ్రేళ్లు వాఱుటయు, నెలుగులు మధుకోశముల శిథిలములు కావింపఁగా మక్షికలు చెదరి పాఱుటయు సహజసుందరముగా వర్ణించెను. అతఁడా పర్వతమున గాంచిన ముఖ్యమైన చోట్లీ క్రింది పద్యమున రమణీయముగా వర్ణింపఁబడినవి. అవి యన్నియు పురాణసిద్ధములైన కథా సన్నివేశములకు సంబంధించినవి.

**నిడుద పెన్నెఱిగుంపు జడగట్ట సగరు ము**
**మ్మనుమండు తపము గై కొనిన చోటు**
**జరఠ కచ్ఛప కులేశ్వరు వెన్ను గాన రా**
**జగతికి మిన్నేఱు దిగినచోటు**
**పుచ్ఛడీక తనంబు పోఁబెట్టి గిరికన్య**
**పతిఁ గొల్వ నాయాసపడినచోటు**
**వలరాచ రాచవాఁ డలికాక్షు కనువెచ్చఁ**
**గరఁగిన యల కనికరపుఁ జోటు**

**తపసి యిల్లాండ్ర చెలువంబు తలఁచి తలఁచి**
**మున్ను ముచ్చిచ్చును విరాళి గొన్నచోటు**
**కనుపపులువేల్పుఁ బడవాలుఁ గన్నజోటు**
**హర్షమునఁజూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన** 2-9

ఇందొక్కక్క గాథకు సంబంధించిన రెండేసి సన్నివేశములు వర్ణింపఁబడినవి. పుచ్ఛడీకతనము విడిచి గిరికన్య పతిని గొల్వనాయాసపడుట వరూధిని ప్రవరుని వలపించుటకై పడిన యాయాసమును, వలరాఁజు శివుని కంటిమంటకెరయగుట ప్రవరుఁడామె వలపును దిరస్కరించి యామెకేకాక మన్మథునికిఁ గూడఁ బరాభవ మొనరించుటను చక్కఁగా సూచించుచు నభిప్రాయ గర్భితములై యున్నవి. హిమవంతమునఁ బై నుండి యదుగుమోవఁ గ జేగురైన తటము కులిశధారాహతి పొలుపున నుండెనని భావించుట యద్భుతముగా నున్నది.

**తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్**
**మావుల్ క్రోవులు నల్లిబిల్లి గొను కాంతారంబునం దైందవ**
**గ్రావాకల్పిత కాయమాన జటిల ద్రాక్షా గుళుచ్ఛంబులన్**
**బూవుం దీవెల నొప్పు నొక్కభవనంబున్ గారుడోత్కీర్ణమున్** 2-22

హిమవంతమున జటిల ద్రాక్షా గుళుచ్ఛములుండుట కవకాశము లేదు. కాని పెద్దన పెనుగొండలోనో, హంపిలోనో, చూచిన ద్రాక్షావల్లరులకచ్చట తావు కల్పించియుండును. పెద్దన వరూధిని నిట్లు వర్ణించెను.

**అతఁడావాత పరంపరా పరిమళ వ్యాపారలీలన్ జనా**
**న్వితి మిచ్చోటని చేరఁబోయి కనియె న్విద్యుల్లతా విగ్రహన్**
**శతపత్రేక్షణఁ జంచరీక చికురన్ జంద్రాస్యఁ జక్రస్తనిన్**
**నతనాభిన్నవలా నొకానొక మరున్నారీ శిరోరత్నమున్** 2-25

తృతీయాశ్వాసారంభమున వరూధిని,

**కమ్మని కుందనంబు కసుగందని మేనెలదేఁటి దాఁటులన్**
**బమ్మెర వోవఁ దోలుఁ దెగబారెఁడు వెంద్రుకలిందు బింబముం**
**గిమ్మన నీదు మోము గిరిక్రేపులు మూఁపులు కౌనుగానరా**
**దమ్మక చెల్లఁ వాని వికచాంబకముల్ శతపత్ర జైత్రముల్** 3-6

అని ప్రవరాఖ్యుని సౌందర్యముగూర్చి తలపోసెను. వరూధిని విద్యుల్లతా విగ్రహ. విద్యుల్లత కాంతి యధికమేగాని యది యస్థిరము చంచలము నైనట్టిది. ప్రవరాఖ్యుని మేను కమ్మని కుందనము. కుందనము కాంతి స్థిరమైనట్టిది. వరూధిని శతపత్రేక్షణ. ప్రవరుని కన్నులు శతపత్ర జైత్రములు. ఆమె చంచరీక చికుర; అతనివెంద్రుక లెలదేఁటి దాటులను బమ్మెరవోఁవదోలును. ఆమె చంద్రాస్య; అతని మోము చంద్రబింబమును కిమ్మన నీదు. ఈ విధముగా నిరువురికిని సమముగానున్న యవయవములలో ప్రవరునిదే మీఁది చేయిగా కనిపించుచున్నది. అందుచేతనే యతని గాంచినతోడనే వరూధిని మోహ పరవశురాలగుట సంభవించెను. ఈ విధముగా వారిరువురి సౌందర్యములందలి తారతమ్యమును బ్రదర్శించుటలో పెద్దన చాల కౌశలము ప్రకటించెను.

**శ్రేణుల్ గట్టినభోఽంతరాళమునఁ బాఱెన్బక్షు, లుష్ణాంశు పా**
**షాణవ్రాతము కోష్ణమయ్యె, మృగతృష్ణా వార్ధి లింకెన్, జపా**
**శోణంబయ్యెఁబతంగ బింబము, దిశాస్తోమంబు శోభాదరి**
**ద్రాణంబయ్యె, సరోజషండములు నిద్రాణంబులయ్యెం గడున్** 3-12

అనుపద్యము సంధ్యాకాలమును సహజముగా వర్ణించుచున్నది. ఇందలి పద ప్రయోగమును, నడకయు హృద్యములుగా నున్నవి.

**ఉరుదరీకుహర సుప్తోత్థశార్దూలముల్**
**ఝరవారి శోణిత శంకఁద్రావ**
**వన కుంజమధ్య శాద్వలచరన్మృగపంక్తి**
**దావపావకభీతి దల్లడిల్ల**
**నాశ్రమాంతర భూరుహాగ్రముల్ మునికోటి**
**బద్ధకాషాయ విభ్రాంతిఁజూడ**
**ఘనసానుశృంగ శృంగాటకంబులఁగాంచి**
**యమరులు హేమాద్రియనుచు వ్రాలఁ**

**గాసెఁబేశలరుచిఁ గింశుక ప్రవాళ**
**ఘుసృణకిసలయ కంకేళి కుసుమగుచ్ఛ**
**బంధుజీవ జపారాగ బాంధవంబు**
**లన్నగంబున జరఠారుణాతపములు** 3-11

అనుసీసము సంధ్యాకాంతి ప్రసరించుటవలన వేనిరూపమెట్లు మాఱెనో, యవి యెవరి మనముల నెట్టి భ్రాంతి కలిగించెనో, మనోహరముగా వర్ణించుచు కథా విన్యాసమున నెంతో ప్రాధాన్యముగల వరూధిని భ్రాంతిని సూచించుచున్నది. ఈ సందర్భమున పెద్దన "ఏ విహంగముఁగన్న నెలుఁగిచ్చుచును సారెకును సైకతంబులఁగూడఁదారు" (3-16) అను పద్యమున సంజఁ బ్రియుబాసి వగచెందు చక్రవాకి చేష్టలను నిసర్గరమణీయముగా వర్ణించి వరూధిని విరహవేదనాతిశయము నన్యాపదేశముగా వ్యక్తముచేసి యున్నాఁడు.

**స్ఫుటసౌగంధికరాగ రక్తరుచియైఁబూనెన్ జపాసన్నిధి**
**స్ఫటికంబట్లుదయాద్రిగైరిక శిరస్స్థానస్థితిన్ జంద్రుఁడ**
**చ్చొటువాయన్శుచి యయ్యెనౌఁ బ్రకృతినచ్ఛుండైన సన్మార్గియె**
**న్నఁటికింగూటమి వంక గల్గువికృతిన్మగ్నుండుఁగా నేర్చునే** 3-24

అనుపద్యమున చంద్రుఁడుదయించు నప్పుడించుక రక్తుఁడై తరువాత నిర్మలుఁ డయ్యెనను విషయమును పెద్దనయెంతో చమత్కారముగాఁజెప్పి యర్థాంతరన్యాసముచే ప్రవరాఖ్యుని సద్వర్తనమును వికృతి రాహిత్యమును నిపుణముగా సూచించి యున్నాడు.

చతుర్థాశ్వాసమున పెద్దన అమూలకమైన స్వరోచివేటను విపులముగా వర్ణించెను. అందతఁడు మృగములవేటను, పక్షులవేటను దానెప్పుడో స్వయముగాఁ జూచినట్లు చక్కగా వివరించెను. "గూనివీఁపుల దురగొణఁగి తిట్టుచు నేఁకుగఱచినట్టి కుక్కగండ్లనంగ"

పందివలలు మోచి పఱచిన మూఁతి నరవ మీసముంబోయ ముదుసళ్లు పెద్దన రాయలసీమ యందు నిత్యమును జూచుచుండెడి బోయల ప్రతిబింబములే. అతఁడు వేటనెపమున స్వరోచిని దూరముగాఁ గొనివచ్చి మనోరమ మొఱనాలించుట కవకాశము కల్పించెను. స్వరోచికిని రాక్షసునికిని జరిగిన యుద్ధమునుగూడ నాతఁడు విశదముగా వర్ణించెను. రాక్షసుని బాధపడలేక కిరాతబలము పాఱిపోవుచుండ స్వరోచి వారికి కావించిన ప్రబోధము భావగంభీరమై యుత్సాహజనకముగానున్నది.

వివాహసందర్భమున మామయెదురేగి పెండ్లికొడుకును గొనివచ్చుట, మధుపర్కమొసఁగుట, కన్యాదానము, తెరపట్టుట, ముత్తెపుసేసలువోయుట, మంగళసూత్రము కట్టుట, హోమముచేయుట, సనెకల్ మట్టించుట, పెండ్లికివచ్చినవారును మామయుం బెడ్లికొడుకునకుఁ గట్నములు కానుకలు నొసఁగుట, తండ్రి పసుపునకై కూఁతునకు గ్రామములిచ్చుట, ముత్తైదువుల సంభ్రమము మున్నగువానిని పెద్దన అనుభవ పూర్వకముగా వర్ణించెను. రాజు వివాహమునకై యేఁనుగునెక్కి వెళ్లుసందర్భమున పురకాంతలాతనిఁ గాంచి పొందిన వికారములు సరసముగా వర్ణింపబడినవి.

**ఒకనేత్రాంబుజ మొక్కగల్ల మొక చన్నొయ్యారపున్‌లీల వీ**
**థికిఁదోఁపన్ దలుపోరగానొక పురంధ్రీరత్నమీక్షించె రా**
**జకిశోరంబుఁ దదీయలై వెలయు భాషాలక్ష్మలంజూచి త్ర్యం**
**బకభాగంబు మొఱంగి మైత్రికి శివాభాగంబ యేతెంచెనాన్** 5–69

మున్నగు పద్యములు పెద్దనభావనా వైచిత్రిని, ప్రపంచపరిశీలనమును, పద్య రచనా పాటవమును చాటుచున్నవి.

కళావతి తనవృత్తాంతమును స్వరోచికెఱింగించు సందర్భమున తనతండ్రి తపమొనరించుచుండఁగా భయపడి యింద్రుఁడు పుంజికస్థలను బంపెనని చెప్పుచు వసంతాగమమును వర్ణించెను. “చలిగాలి బొండుమల్లెల పరాగమురేఁచి నిబిడంబుసేసె వెన్నెలరసంబు, వెన్నెలరసముబ్బి వెడలించె దీర్ఘికామంద సౌగంధిక మధునదంబు” అను పద్యమును ముక్తపదగ్రస్తాలంకారముతోఁగూడి వసంత విలాసమును చక్కగా వెల్లడించుచున్నది. మనువు తపమొనరింపఁగా విష్ణువు ప్రత్యక్ష మయ్యెను. ఆ సందర్భమున నతఁడు విష్ణువు దశావతారములను పదిపద్యములలో వర్ణించెను. తృతీయాశ్వాసమున వరూధిని చెలికత్తెలు కావించిన పుష్పాపచయము రగడలో వర్ణింపఁబడినది. తరువాతి ప్రబంధకర్తలు పలువురిది చూచి పుష్పాపచయమునో జలక్రీడావిహారమునో వర్ణించునప్పుడు రగడలను వాడియుండిరి.

పెద్దన పెక్కుచోట్ల వస్తువ్యక్తివర్ణనములకై సీసపద్యములను వాడియుండెను. ఆ పద్యములు వర్ణ్యముల రూపురేఖలను గుణగణములను సమగ్రముగా విశదముచేయుచు

పెద్దన లోకపరిశీలనమును, పాండితీ వైభవమును, వర్ణనకౌశలమును వ్యక్తము చేయుచున్నవి. సిద్ధుఁడు(1-59) గార్హస్థ్యము(1-66) వీణవాయించుచున్న వరూధిని (2-27) ప్రవరుఁడు(2-36) సంధ్య(3-17) కటిక చీకటి(3-19) మాయాప్రవరుఁడు(3-71) కపటభూసురాకారమున పూవులుకోయుచున్న గంధర్వుఁడు(3-88) ప్రథమ సురతము(3-116) క్రొవ్విన యేకలములు(4-17)సైంధవము(4-28) జాగిలములు(4-31) సూకరము(4-42) మనోరమను వెంటనంటెడురాక్షసుఁడు(4-37) ధైర్యగుణము(4-108) అసురభావమును బొందిన యిందీవరాక్షుఁడు(5-24) వెన్నెల(5-38) వసంతము(6-27) దేవాపికి కళావతి నిమ్మని యడుగవచ్చిన గంధర్వులు(6-44) ఏకలము(6-88) వనదేవత(6-96) మనువునకు ప్రత్యక్షమైన విష్ణువు(6-102) మున్నగు వస్తువులను వ్యక్తులను వర్ణించు సీసము లిందుకుఁ దార్కాణములు.

**విసుమానములుగాఁగ వసతోడఁబెనవెట్టి**
**నెట్టెంబుగాఁబ్రేవుఁ జుట్టినాఁడు**
**బండికందెనచాయ బైసిమాలిన మేన**
**మెదడు గందపురొంపిమెత్తినాఁడు**
**కునఖంపుడాచేతి పునుక కప్పెర నిండఁ**
**బ్రాణికోటులనల్లఁ బట్టినాఁడు**
**కొకిబికివేసంపు గూనివీఁపులమీదఁ**
**మూఁడుపంగలయీటె మోపినాఁడు**

**నిట్టతాడనఁబొడవుచే నిక్కినాఁడు**
**నిడుదకోఱల మిడిగ్రుడ్ల నెగడినాఁడు**
**నరవరోత్తమ! నేఁటి మూన్నాళ్ళనుండి**
**యుసుఱుగొన వెంటఁదిరిగెడు నసురయొకఁడు** 4-73

అను పద్యము మనోరమను వెంటనంటెడు రాక్షసుని వికృత భీకరాకారమును బ్రత్యక్షముచేయుచు నైషధమునందలి కలిరాజు వర్ణనమును దలఁపునకు దెచ్చుచున్నది.

**వల్లీమతల్లి లావణ్య సర్వస్వంబు**
**విమలాంగరేఖ నావిర్భవింప**
**మంజులమంజరీ మహితసౌభాగ్యంబు**
**పరివృత్తకుచవృత్తిఁబరిణమింప**
**బల్లవచ్ఛదచారు భావానుభావంబు**
**మృదుహస్తలీల మూర్తీభవింప**
**రమణీయ ముకుళ విభ్రమ భాగధేయంబు**
**కరరుహస్ఫూర్తి సాక్షాత్కరింపఁ**

**జేసి మృగియై వహించు నక్షిద్వయంబు**
**భాసురంబుగఁ దనయంకపాళిలోన**
**మించుక్రొమ్మించు నుపమించు మెలఁతయగుచు**
**నిలుచునవ్వనదేవత నృపతిఁజూచి** 6-76

అను సీసము హరిణి వనదేవతగా మాఱినప్పటి యాకారమును వర్ణించుచున్నది. లతలు,పూలగుత్తులు, పల్లవచ్ఛదములు, ముకుళములు, లేళ్లు అనునవి ప్రకృతిరూపిణియైన వనదేవతయాకృతియందలి ప్రధానద్రవ్యములు, అవి యే విధముగా స్త్రీ రూపిణియైన యామెయంగములుగాఁ బరిణమించినవో యిందు పెద్దన సొగసుగను కవిసమయాను గుణముగను వర్ణించియున్నాఁడు. అతఁడీవర్ణనము గావించినను రూపమునందలి ప్రధానాంశములను విడువక దానిని పఠితలకు సాక్షాత్కరింపఁజేయుచుండును.

ప్రబంధకవులెల్లరును శృంగారరసపరిపోషణమున కనువగు వస్తువులనే స్వీకరించిరి. పెద్దనయు మనుచరిత్రమున శృంగారరసమునే ప్రధానముగా పోషించెను. అది యందొకచో నాభాసరూపమునను, ఒకచో వియోగరూపమునను, ఒకచో సంభోగరూపమునను వైవిధ్యముఁ దాల్చి రెండుచోట్ల శాంతముతో సంఘర్షముకూడ పొందినది. వరూధిని 'యక్షతనయేందు జయంత వసంత కంతులన్ జక్కఁదనంబునన్ గెలువఁజాలు, ప్రవరాఖ్యుని వలచి యాతడు "నాకరణుల్ దర్భలు నగ్నులుం బ్రియములైనట్లన్యముల్గా వొడల్ తిరమే చెప్పకుమిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియ'లని యెంత చెప్పుచున్నను వినక రతిసంరంభముతో నాతనిఁ గౌఁగిలించి యధరమాసించెను. అతఁడామెను త్రోసివైచి యామెమేన జవ్వాది పసకదంబించు నొడలు కడుగుకొని వార్చి తనకుపాస్యుఁడైన గార్హపత్యాగ్ని యనుగ్రహమునఁ దనగృహము చేరెను. ఇచ్చట శృంగార మేకత్రమాత్ర నిష్ఠమగుటచే నాభాసత్వమును బొందినది. ఈ సందర్భమున శాంత శృంగారములకును ధర్మ కామములకును, బ్రహ్మేంద్రియానందములకును గలిగిన సంఘర్షణము నాన్యతో దర్శనీయమై మనుచరిత్రను మను-చరిత్రగా నొనరింపఁజూచినది. ప్రవరుఁడరిగిన వెనుక వరూధిని యాతనినట వెదకి యెందునుగానక వియోగసాగరమున నోలలాడినది. విరహదహనదాహమున దేహము తల్లడిల్ల నిట్టూర్పులు పుచ్చుచు వివిధ దశాంతరములొంది వేఁగఁ జొచ్చినది. ఆమె వియోగవేదన కోర్వఁజాలక చంద్రమన్మథ మలయమారుతముల నుపాలంభించినది.

**పాలఁ బుట్టినమాత్రాన మేలిగుణము**
**నేఁడు నీకేల గల్గునో నీరజారి!**
**నీటఁ బుట్టినవాఁడు గాఁడోటు వహ్ని**
**గాల్చుచున్నాఁడు జగమెల్లఁ గరుణలేక** 3-41

చంద్రుడు పాలసముద్రమునఁ బుట్టియుఁ దనకపరిమిత వేదనాకరుఁడగుటచే నామె యిట్లాతని నిందించినది. మన్మథుడహంకారమున శివునిపై కరిగి యాతనికంటి కడింది మంటచే నడపొడ కానరాక తెగటారియు వానచేఁ గాలిన మ్రోడు చిగుర్చు విధమున రతికన్నీటిచే మరల జీవింపఁజాలెను. ఇది యంతయు రతీదేవి మంగళసూత్ర మహత్త్వమేయని యామె భావము.

> **సాహంకారత శంకరుండలిగి నేత్రాగ్నిం బయింబంపినన్**
> **స్వాహాకాముకుఁ దౌటచే నతఁడు గావంబోలు మోమోడి సం**
> **దేహంబేని రతీశ! నీవు మగుడం దేహంబుతో నుండు టె**
> **ట్లాహా! దైవము దోసకారులకె తోడైవచ్చు నెప్పట్టులన్** 3-47

శివుఁడు మన్మథుని దహించుటకై యగ్నిని బంపఁగా స్వాహాకాముకుఁడైన యతఁడు మన్మథుఁడు మరణించినచోఁ దన ప్రణయవ్యాపారము సాగదని మోమోటపడి స్వార్థమునకై యతని గాల్చక విడిచియుండును. లేనిచో నాతఁడు మగుడదేహము దాల్చుటెట్లని యామెసందేహము. దైవమెప్పుడును దోసకారులకె తోడగుచుండునని యామె యాసందేహ మునుదీర్చుకొనెను. ఇచ్చటి భావమెంతో సరసమై యామె వేదనాతిశయమును సూచించుచున్నది. బ్రహ్మ పామునకు వాయువును దినుటకే రెండునాలుకలు సృజించెను. కాని యాగ్రహము విరహిజన దురితముచే పవనమును భక్షింప లేకుండెనని యామె విచారించినది. ఇచ్చట విరహశృంగారము సమగ్ర సుందరముగా వర్ణింపఁబడినది.

గంధర్వుఁడు ప్రవరాకారముధరించి వంచనమై వరూధినితో భోగించెను. ఇచ్చటి శృంగారము సంభోగాత్మకము. కాని యిదియు నొకవిధముగా నాభాసమేయగుట సంభవించినది. గంధర్వకుమారుఁడు వరూధినిని ప్రేమించెను. వరూధిని ప్రవరుని ప్రేమించెనుగాని గంధర్వుని ప్రేమింపలేదు. ఆమెకు గంధర్వుఁడాచరించిన వంచన తెలియదు. అందుచే ఆమె ప్రవరాఖ్యుని గూడినట్లే సంతోషించెను. తత్త్వము పరిశీలింప ననురాగ మిచ్చట కూడ నేకత్ర నిష్ఠమే. ఈ విషయము పాఠకులకుఁ దెలియును. అందుచే నిటఁ గావ్యస్థ పాత్రలదృష్టితోఁ జూచిన సంభోగశృంగారమే యైనను పాఠకులపాలికాభాసమేయైనది. ఇది చాలా విచిత్రమైన సంఘటనము.

స్వరోచి మొదట మనోరమను దరువాత విభావసీ కళావతులను వివాహమాడి వారితో పెక్కువందల సంవత్సరములు శృంగార క్రీడలనుభవించెను. బహునాయకరతివలె బహునాయికారతియు నాభాసమేయని కొందఱు శంకింపవచ్చును. కాని యిచ్చట దానిని దక్షిణనాయకతాసూచకముగనే గ్రహింపవచ్చును. ఈ సందర్భమున శృంగారరసము పోషింపఁ బడినది. చెలికత్తెలు మనోరమాస్వరోచులను కేళీసదనమునఁజేర్చి వెడలిన పిమ్మట స్వరోచి మనోరమను జెంతకుఁజేర్చి కౌగిలించిన విషయమును పెద్దన యీ క్రింది సీసమున మనోహరముగా వర్ణించెను.

**దట్టంబు నీకట్టినట్టి చెంగావికి**
**బాగుగాదని కేలఁ బయటనిమిరె**
**గోరంటొ గోళ్ళనిక్కువపుఁగెంపో యని**
**చెయిపట్టి నయమున సెజ్జఁజేర్చె**
**నగరు ధూపముచేత నయ్యో తనూవల్లి**
**సెక సోకెనని యెదఁజెయ్యివెట్టె**
**మృగనాభికామకరికలఁ గ్రముమించె**
**నని మూరు కొనుచుఁ జుంబన మొనర్చె**

**హారమణులిటుసూపు నాయఱుతనున్న**
**హారమణులకుఁ గాంతినీడౌనొకావొ**
**యనుచు నక్కునఁగదియించు నానెపమునఁ**
**గంపమునుబొందు సతిమేను గౌఁగిలించె** 6-8

స్వరోచి మనోరమాదులతో వివిధ ప్రదేశములందువారు “తమకతమక ప్రియుండని తమకమెసఁగ” నుప్పొంగ పద్మినీ ప్రభావఘటితాన్న పానభూషావిశేషాది సామగ్రినిజెంది క్రీడించెను.

తరువాత స్వరోచి హరిణాంగన ప్రార్థన ననుసరించి దానిని గౌఁగిలించెను. ఇచ్చట శృంగార ముభయనిష్ఠమయ్యుఁ దిర్యగ్గత మగుటచే నాభాసమువలెఁ గానిపించును. హరిణి వనదేవతగా మాఱినపిమ్మట నది శృంగారమైనది. ఈ శృంగారము మనుసంభవమునకుఁ గారణమగుటచేఁ పరమధార్మికమై ప్రకాశించినది. కళావతి తన వృత్తాంతమును జెప్పుసందర్భమున పారర్షి పుంజికస్థలతో మనోజక్రీడా విపులైశ్వర్యములనుభవించుట వర్ణింపబడినది. ద్వితీయాశ్వాసమున వలెనే యిచట గూడ శాంత శృంగారములకు సంఘర్షణ జరిగినది. కాని ముని నిగ్రహహీనుఁడగుటచే శాంతమే వీఁగిపోవలసి వచ్చినది.

మనోరమ బూచివలెనున్న వాచంయముని మోము పట్టుకొనుటచే నతఁడు భగ్నానుసంధానుఁడై యామెను శపించుటయేగాక యామెను నాగబెత్తముతోఁ గొట్టెను. అంత చెలికత్తెలు నిందింప వారినిగూడ శపించెను. ఇట్లే బ్రహ్మమిత్రుఁడు వంచనచే నిందీవరాక్షుఁడు తన దగ్గఱ నాయుర్వేదము గ్రహించుటెఱిఁగి యతని శపించెను. ఈ రెండు తావులందు శాంతమునకు రౌద్రముతో సంఘర్షణము సంభవించెను. ఇచ్చట రౌద్రమతిమాత్రమై శాంతమును గ్రిందుచేసినది.

స్వరోచి రాక్షసునితోఁ బోరు సందర్భమున వీరరౌద్రములు వర్ణింపఁ బడినవి. సమాగమమునకుఁ బూర్వము మనోరమ చెలికత్తెలకై విలపించు సందర్భమునను, రాక్షసానుగతయై యామె రక్షింపుఁడని మొఱవెట్టు సందర్భమునను కరుణమున్నది.

ఇందీవరాక్షుఁడు గంధర్వుఁడుగా మాఱిన సందర్భమునను, హరిణి వనదేవతగా మాఱిన సందర్భమునను నద్భుతరసమును, దేవాపి పారర్షిని సంహరించు సందర్భమున బీభత్సరసమును గోచరించుచున్నవి. మనువు విష్ణువును గూర్చి తపమాచరించి యాతనివలన వరములు గాంచుటతోఁ గావ్యము ముగియుచున్నది. ఇచ్చట శాంతరసము పోషితమైనది. పెద్దన యా కాలము ప్రభావమునుబట్టి మనుచరిత్రమున ప్రధానముగా శృంగారమునే వర్ణించినను ఆరంభావసానములందు శాంతమున కఖండవిజయము గ్రహించి తన కాలమర్యాద నతిక్రమింపఁజాలెను.

మనుచరిత్రమునకు లోకమున నఖండగౌరవమునావహించిన గుణవిశేషములలో నందలి పాత్రపోషణము ముఖ్యమైనది. ప్రవరాఖ్యుఁడెంత సౌందర్యవంతుఁడో యంత జితేంద్రియుఁడు. పెద్దన యీ విషయమును కావ్యారంభముననే చక్కగా సూచించినాడు

**వాని చక్కఁదనము వైరాగ్యమునఁ జేసి**
**కాంక్షచేయు వారకామినులకు**
**భోగబాహ్యమయ్యెఁ బూచిన సంపెంగ**
**పొలుపు మధుకరాంగనలకుఁ బోలె.** 1-52

అతని కర్మపరాయణత్వమును, అతిథిసేవాసక్తిని, పితృభక్తిని, శిష్యానురక్తిని పెద్దన చాలనేర్పుతో వర్ణించెను. మనుచరిత్ర రచనానంతరము జితేంద్రియత్వమునకు శుకభీష్మాదుల కంటెఁగూడ నాంధ్రులకు ప్రవరాఖ్యుఁడే యెక్కువ యాదర్శప్రాయుఁడయ్యెనన్న పెద్దన యాతని పాత్రనెంత కౌశలముతో వర్ణించెనో వేఱుగాఁ జెప్పనక్కరలేదు. "కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్" అనుటకాతఁడు పరమాదర్శము. వరూధిని సౌందర్యనిధానము. ఆమె యింద్రియానందమునే జీవితమునకుఁ బరమావధిగాఁ దలంచెను. ఆమె యనురాగము నిర్మలమైనదే యయ్యు నిగ్రహరహితమైనది. అదియే యామె వంచిత యగుటకుఁ గారణమయ్యెను. గంధర్వకుమారుఁ డింద్రియలోలుడు. మోహపరవశుఁడు. అతఁడు తనకుఁ దృష్టి కలిగినపిమ్మట వరూధినిని విడిచి వెడలిపోవుట క్రూరమనిపించును. "క్రూరుఁడై చనియె" ననుమాట పెద్దన ప్రవరునిగూర్చికాక యీతనిఁగూర్చి యనవలసినది. కాని యా పరిస్థితులలో నాతఁడట్లు చేయక తప్పినది కాదు. స్వరోచి మహాపరాక్రమవంతుఁడును దయార్ద్రహృదయుఁ డు నయ్యు నింద్రియాధీనుఁడు. హంసీ చక్రవాకులయు, హరిణము యొక్కయు వాక్యములు విన్నప్పుడాతఁడు తాత్కాలికముగా విరక్తుఁడయ్యును మరల లోలత్వమునే ప్రదర్శించెను. మనోరమ సౌందర్యవతి. ఆమెకు సఖుల యెడఁగల ప్రేమ యపారమైనది. ఇందీవరాక్షుఁడు విజ్ఞానప్రియుఁడయ్యు నించుక ధూర్తుఁడు. ఆ ధూర్తతయే యతనికి రాక్షసత్వము కలిగించెను. మనువు మహానుభావుఁడు. జననాగతమైన పాపమేమైన నున్న నాతఁడు దానిని తపస్సుచేఁ బ్రక్షాళించి మనుత్వమును బొందఁజాలెను.

పెద్దన తన కాలమునందలి ప్రజల మనఃప్రవృత్తులను ఆచార సంప్రదాయములను ఎడనెడ ప్రదర్శించుటేకాక తన కావ్యముద్వారా కొంత యుపదేశమును గూడ నందిచ్చుటకుఁ బ్రయత్నించెను. మనోరమా స్వరోచుల వివాహమును వర్ణించు సందర్భమున నతఁడాకాలపు వైవాహికాచార సంప్రదాయములను జక్కగా సూచించెను. ఇందీవరాక్షుఁడు వరూధిని సోదరుఁ డని తెల్పి మేనఱికపు పద్ధతిని బ్రకటించెను. బ్రహ్మమిత్రుని వృత్తాంతమువలనను, స్వరోచి విభావసీ కళావతుల నాయుర్వేదవిద్యాబలమున ననామయలగా నొనరించుటవలనను అతనికేకాక యాకాలపు ప్రజలకుఁగూడ నాయుర్వేదము నెడఁగల విశ్వాసము వ్యక్తమగుచున్నది. ఇందీవరాక్షుఁడు తన నగరమును వర్ణించుచు ''ప్రభిన్న గజఘోటచ్ఛన్నగహనాపణములన్నిగనిగద్యుతి రవిన్నగు మణిప్రకరమున్న గరిమం బేరెన్నఁ గల యంగడుల వన్నెగని సంపదల....ఒప్పుద''వని చెప్పియుండెను. ఆ కాలమున విజయనగరపు టంగడులలో సూర్యుని గేలిసేయు కాంతిగల మణులు విక్రయింపబడుట పెద్దన దీనిచే సూచించెనని భావింపవచ్చును. స్వరోచికి శాకునికుఁడెఱిఁగించిన విషయమునుబట్టి యప్పుడు శకునములయెడను నిమిత్తములయెడను గల నమ్మకము వెల్లడి యగుచున్నది. ఇందీవరాక్షుఁడు తనకాయుర్వేదము బోధింపుమని యడిగినప్పుడు బ్రహ్మమిత్రుడు.

**నటవిట గాయక గణికా**
**కుటిల వచస్సీధురసముఁ గ్రోలెడు చెవికిం**
**గటువీశాస్త్రము; వలది**
**చ్చట నినుఁ జదివింపకున్న జరుగదె మాకున్** 5–9

అని యాతని నిరాకరించెను. అట్లే గంధర్వులతో దేవాపి పారునికడకరిగి కళావతిని దనకిమ్మని యడిగినప్పుడతఁడు వారి వేషములు చూచి జుగుప్సనొంది మనమునఁ గడు నసహ్యించుకొనుచు

**ఆహా ధన్యుఁడ నైతి, మద్విమల వంశాచార విద్యా తప**
**శ్శ్రీహోమాదులు నేఁడుగాఁ దుది ఫలించెన్ నాగవాసంబు మ**
**ద్గేహక్షోణికి బిడ్డ వేఁడుటకు నేతేఁగాంచుటన్; బ్రాహ్మ్యమిం**
**కోహోచాలుఁ, బొకాలిపోయెదరొ పోరో నోటి క్రొవ్వేటికిన్** 6–45

అని వారిని నిందాపూర్వకముగాఁ దిరస్కరించెను. దీనినిబట్టి నటవిట గాయకాదుల యెడను తత్సదృశులయెడను ఆ కాలమువారికిఁగల యనాదర భావము వెల్లడి యగుచున్నది. ఆ కాలము భోగ ప్రధానమైనట్టిది. స్వరోచి భోగలాలసత్వమునుబట్టియు, వరూధిని ప్రవరాఖ్యునితోఁ దెల్పిన మాటలను బట్టియు నీ విషయము నూహింపవచ్చును. ప్రవరుఁడు

తన కోరికను నిరాకరించిన పిమ్మటఁగూడ నామె "వెలివెట్టిరే బాడబులు పరాశరుఁబట్టి దాశకన్యాకేళి తప్పుచేసి" అను హేతువాదమును జూపి యాతని నొడంబఱుప యత్నించుటయు, పెద్దన "తరుణిననన్యకాంత నతిదారుణ పుష్పశిలీముఖ వ్యథాభర వివశాంగి నంగభవుబారికి నగ్గముచేసి క్రూరుఁడైయరిగె మహీసురాధముడహంకృతితో"నని వరూధినియెడ సానుభూతిని ప్రకటించుటయు, భోగపరాయణత యప్పుడంత దోషముగాఁ బరిగణింపడకుండెనేమో యను ననుమానమును గలిగించును. ప్రవరునివంటి బుద్ధిమంతులు కొందఱు "తుచ్ఛ సుఖముల్ మీసాలపై తేనియ"లనియు, నింద్రియవశగతి బ్రహ్మానందాది రాజ్య పదవీచ్యుతి కలిగించు'ఁ ననియు భావించుచు భోగపరాయణతను ప్రతిఘటించుచుండిరనియు నీ కావ్యమువల్ల తేట తెల్లమగుచున్నది. షష్ఠాశ్వాసము నందలి హంసీచక్రవాకులయు, హరిణము యొక్కయు పల్కులీ విషయమును బలపఱచుచున్నవి. స్వరోచి మితిమీరిన విషయలోలతచే తిర్యక్కులకుఁగూడ పరిహాసపాత్రుఁడయ్యెను. గంధర్వకుమారుఁడు వరూధినిని విడిచి వెడలి పోవునప్పుడు

**ఎవ్వఁడు మీఁదెఱుంగక యథేచ్ఛ సుఖైకరతిం జరింపఁగా**
**నవ్వల వంశహాని వ్రతహాని యశోధనహాని పుట్టుదా**
**నవ్వెడ నమ్మనుష్యపశు వయ్యవివేకి చెడున్ జగంబున**
**న్నవ్వఁగఁబాలు రౌరవమునంబడబాలును నిందపాలునై** 3-135

అని మితిమీఱిన భోగేచ్ఛను తెగడి పల్కెను. అది నిజమే కాని యామాటలా గంధర్వుని నోటరావలసినవికావు. వీనిని జదువుచున్నప్పుడు రూపతేజములతోపాటా గంధర్వుని బుద్ధియు ప్రవరావేశితమయ్యెనా యనిపించును. లేనిచో నెఱిఁగి వరూధినియెడ నాతఁడటుల వర్తించుటకు సాహసించి యుండఁడు. అతనినోట వెలువడి యా నీతి సగమువిలువ కోల్పోయినది. వరూధినీ ప్రవరాఖ్యుల కథలో పెద్దన భోగలాలసతోఁగూడిన విషయపరాయణత కవమాన తిరస్కారములను విషయపరాఙ్ముఖమైన ధార్మిక ప్రవృత్తికి విజయమును భగవదనుగ్రహమును ఫలములుగా నలవడునని నిరూపించెను. దానజపాగ్నిహోత్రపరతంత్రుఁడై పరదారధనాదులఁ గోరక భగవత్పదాంబుజ ధ్యానమునంగాలము పుచ్చు ప్రవరునికి పావకుఁడు సన్నిహితుఁడై యీప్సితార్థప్రాప్తిఁ గలిగించుటయుఁ గామాంధయై కంటికింపుగాఁగనిపించిన యాగంతుకునిపైఁ బడఁగోరిన వరూధిని విఫలమనోరథయై విలపింపవలసివచ్చుటయు నిందుకు నిదర్శనములు.

బూచివంటి వాచంయమి మనోరమను ఆమె సఖులను శపించుటేకాక మనోరమను నాగబెత్తముతోఁ గొట్టెను. నిజమునకాతని తపస్సు శాపప్రయోజనకరమే యయ్యెను. బ్రహ్మమిత్రుఁడిందీవరాక్షుని మొదట నిందించి తరువాత నతని వంచన యెఱింగి శపించెను. పార్ష్ణి కళావతి నడుగవచ్చిన గంధర్వులను గోపవశుఁడై "ముక్కుడిస్సిన పసరము క్రియఁ

గెరలి" తిట్టెను. ఫలితమేమన సంయమి సుగుడి కాకుండఁ బోయెను. బ్రహ్మమిత్రుఁడు వంచితుఁడయ్యెను. పారర్షి ప్రాణములే కోల్పోయెను. హద్దుమీఱిన యాగ్రహమును బరనిందయు పెద్దలకైన పతనకారణములే యగుననుటకీవృత్తాంతములు నిదర్శనములు. మనోరమయుఁ దత్సఖులను ఇందీవరాక్షుఁడును బాల్య చాపల్యముననైననేమి మదాంధ్యమున నైననేమి గురుతిరస్కారముకావించి, దానికి ఫలితముగాఁ దీవ్రములైన శాపములకు గుఱియై యిడుమల గుడిచిరి. పారర్షి నిగ్రహరాహిత్యముచే నతని కథలో శాంతముకంటె శృంగారముదే పైచేయి యగుట సంభవించెను. పెద్దన కపరిణతమైన సన్యాసముపైకన్న పరిణతమైన గార్హస్థ్యముపైనే మన్నన మిన్న. "కెలఁకుల నున్న తంగెటి జున్నుగృహమేధి" యను సీసమున 'భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె' యని యాతఁడాయభిమానమును వాచ్యము చేసియుండెను. ఆశ్రమమేదైన నేమి? ఆత్మశుద్ధియుండవలయును.

పెద్దన అపారమైన కవితాప్రతిభతోపాటు నిరుపమానమైన పాండిత్యమును అసాధారణమైన లోకానుభవమును గలిగిన మహాకవి. మాయాప్రవరునిఁజూడగనే వరూధినికిఁ గల్గిన భావముల నాతఁడద్భుతముగ వర్ణించెను.

**తొలుఁదొల్తవానిఁ గన్నులఁ గాంచినప్పుడ**
**పల్లవాధర గుండె జల్లుమనియె**
**నటరెండు మూఁడంజఁ లరుగు నప్పుడకాళ్ల**
**బంకజాక్షికిఁ దొట్రుపాటు గదిరె**
**డాయంగఁజనునప్పుడ ముఖాంబుజంబునఁ**
**గంబుకంధరకు దైన్యంబు దోఁచెఁ**
**గదిసి నిల్చినయప్డ కనుదోయి ఱెప్పల**
**లలనకు మిగులఁ జంచలత బెరసెఁ**

**గటకటా! యనునపుడ గద్గదికవొడమెఁ**
**జెఱఁగు పట్టినయపుడ లేఁ జెమటగ్రమ్మె**
**సొలసి మాటాడనుంకింపఁదలఁచి మోముఁ**
**దేరకొని చూచునపుడ కన్నీరు వొడమె** 3-91

ఇందు జరుగఁబోవుచున్న వంచనకు ఫలముగాఁ దెలియకుండనే యామెకుఁ గలిగిన వికారములను శృంగారభావములుగా దోచుఁనట్లు వర్ణించి కవి చూపిన నేర్పునన్యసామాన్యమై యలరారుచున్నది. "రవిబింబపతన దీర్ణపయోధి గర్భనిర్గత శేషఫణిఫణారత్నరుచియొ (3-17)" "అటఁజనికాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ పటలముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్స్వనస్ఫుట నటనానురూప పరిఫుల్ల కలాపకలాపిజాలమున్ (2-3)" మున్నగు వర్ణనాత్మకములైన పద్యములందు సమాసజటిలమైనరచన సాగించినను అతఁడు

సంభాషణ సందర్భములందలంతియలంతి మాటలతోఁగూడిన సులభసుందరమైన శైలిని గూడఁ బ్రదర్శించి యుండెను. వరూధినీ ప్రవరాఖ్యుల సంభాషణమిందుకు నిదర్శనము. అతఁడలంకారములందు ప్రీతి కనఁబఱచినను అవియెచ్చటను ప్రయత్న ప్రయుక్తములుగను కృతకములుగను గోచరింపవు. అతఁడు రూపకోపమోత్ప్రేక్షార్థాంతరన్యాసములను విరివిగా వాడియుండెను.

**ప్రబల భల్లుక నఖభల్ల భయదమథన**
**శిథిలమధుకోశవిసర విశీర్ణ మక్షి**
**కాంతరాంతర దంతురితాతపమునఁ**
**బుడమి తిలతండుల న్యాయమున వెలుంగ** 2–7

అనునదాతని శబ్దాలంకార ప్రయోగ ప్రావీణ్యమునకును ప్రకృతి పరిశీలనమునకును నిదర్శనము. చతుర్థాశ్వాసమున స్వరోచిరాక్షసుల యుద్ధమునువర్ణించు సందర్భమునందు పెద్దన వృత్తవైవిధ్యమును శబ్దాలంకార ప్రీతిని బ్రదర్శించెను.

**పలాశి డాసి రాజుఁజూచి పల్కెనోరి నోరికీ**
**పొలానఁబెన్పొలాన లేకపోవ నీవు దోఁచితౌ**
**బలా! బలాలితోడఁ బాలబట్టిబిట్టు చుట్టినిన్**
**హళాహళిన్ హలా హలాభ యౌ బుభుక్షఁ దీర్చెదన్** 4–98

అనుపద్యమతని యనుప్రాసరచనావైచక్షణ్యమును దేటతెల్లము కావించుచున్నది, ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వని కుమారతకు గ్రౌంచాచల రాజమయ్యె "1–11 అను పాదము నందలి'కుమారతకు అనుప్రయోగము శ్లిష్టమై గంభీరమైన యర్థము నొసంగుచున్నది. తొలుఁదొల్తఁ గమలమిత్రుని వంకరూపొట దక్షాధ్వరధ్వంసి తన్నుగనుట" 3–37 "అపరిమితానురాగసుమనోలసయై చిగురాకుఁజేతులం దపసిని గౌఁగిలించె వనితా యిదె రంభ" 3–77 ఇత్యాది పద్యములు సులభమును సుందరమునైన శ్లేషను బ్రకటించుచున్నవి.

**ఆమందిడి యతఁడరిగిన**
**భూమీసురుఁడరిగెఁ దుహిన భూధరశృంగ**
**శ్యామల కోమలకానన**
**హేమాఢ్య దరీ ఝరీనిరీక్షాపేక్షన్** 1–79

అను కందమునందలి హ్రస్వదీర్ఘాక్షరముల ప్రయోగము హిమవంతమునందలి నిమ్నోన్నతములను స్ఫురింపజేయుచున్నది.

**ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర! యే**
**కాంతమునందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించు లా**
**గింతయ కాక నీవెఱుఁగవే మునువచ్చిన త్రోవచొప్పు నీ**
**కింత భయంబులేకడుగ నెల్లిదమైతిమి మాటలేటికిన్** 1-41

అను పద్యము సులభపదములతోఁగూడి గంభీరమైన వ్యంగ్యార్థమును సూచించుచున్నది.

**మృగమద సౌరభ విభవ**
**ద్విగుణిత ఘన సారసాంద్రవీటీగంధ**
**స్థగితేతర పరిమళమై**
**మగువపొలుపు తెలుపు నొక్కమారుతమొలసెన్** 2-24

అను పద్యము పెద్దన లోకానుభవమును జాటుచున్నది.

**వాలారుంగొనగోళ్ళ నీవలసతన్ వాయించుచో నాటకున్**
**మేళంబైన విపంచి నిన్న మొదలున్ నీ వంటమింజేసి యా**
**యాలాపంబె యవేళఁబాడుచుఁ బ్రభాతాయాతవాతాహతా**
**లోల తంత్రుల మేళవింపఁగదవే లోలాక్షి దేశాక్షికిన్** 3-57

అని చెలికత్తెలు వరూధినితో నాటరాగమునకు మేళవింపుమని కోరుట పెద్దన సంగీతశాస్త్ర పాండిత్యమును, ఆయారాగముల కాలానుకూల్య పరిజ్ఞానమును బ్రకటించుచున్నది. "అల్లసానివాని యల్లిక జిగిబిగి" యను నభియుక్తోక్తి సత్యశోభితమైనది. పద్యముల కూర్పులో నాతఁడు ప్రదర్శించుకౌశల మనన్య సాధ్యమని చెప్పవచ్చును.

**చకితైణాహుతిదావ, మావళిత పుచ్ఛ స్వల్పగచ్ఛత్తర**
**క్షుక, మద్రిగ్రహయాళు భల్లుకము, వక్షోభాగ నిక్షిప్తడిం**
**భకవల్గత్ప్లవగీకదంబము, హ్రదాంభః ప్రోత్థితక్రోడనా**
**యకమాభీల ముఖద్విపిస్థ పుటితం బయ్యెన్వనంబత్తతిన్** 4-38

**బహురత్నద్యుతి మేదురోదర దరీభాగం బులంబొల్చు** 2-45

మున్నగు పద్యములాతని యల్లిక బిగువునకు నిదర్శనములు. అతఁడందందు రచించిన దీర్ఘవచనములతని పాండిత్యమునకును, శబ్దాలంకారప్రీతికిని, లోకానుభవమునకును. బ్రకృతి పరిశీలనకును దార్కాణములుగా నున్నవి. సిద్ధుఁడు ప్రవరునికిఁ దెల్పిన యాయాపర్వతము లందలి విశేషముల వర్ణనము(1-73) పెద్దన సమాసఘటనాపాటవమును జాటుచున్నది. తృతీయాశ్వాసమునందలి వెన్నెల వర్ణనమును(3-28) చతుర్థాశ్వాసమునందలి దేగలయు

శ్వానములయు వర్ణనమును(4–27) అడవియందలి వివిధ ప్రదేశముల వర్ణనమును(4–37) వేఁట వర్ణనమును(4–60) యుద్ధవర్ణనమును(4–116) అలతి యలఁతి పదములతోడను వివిధములైన క్రియలతోడను, అనుప్రాసాద్యలంకారముల తోడను గూడి ప్రౌఢసుందరములుగా నున్నవి. ఎడనెడనిట్టి ప్రౌఢబంధముతోఁ గూడిన రచన కానిపించినను పెద్దనశైలి రాయలవా రన్నట్లు "శిరీషకుసుమపేశలసుధామయోక్తుల" కెల్లయై పఠితలయుల్లములను బల్లవింపఁ జేయుచున్నది. అందుచేతనే సాధారణముగా నెవ్వరికవితను మెచ్చనికవి చౌడప్ప పెద్దనవలెఁ గృతిచెప్పిన బెద్దనవలె"నని యాతని మనసారఁ బ్రశంసించి యున్నాడు.



## ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు

# పారిజాతాపహరణము

ఆంధ్రప్రబంధములలో పరిమాణమున చిన్నదయ్యును రసపరిమళములచే నాంధ్రరసికులమైమఱపించు కావ్యమందారము పారిజాతాపహరణము. దీనిని రచించినవాఁడు నందితిమ్మన. పారిజాతాపహరణకావ్యము చివరనితఁడు దన్ను గూర్చి వ్రాసికొన్న సీసమును బట్టి యితఁడు కౌశిక గోత్రుఁడనియు, ఆపస్తంబ సూత్రుఁడనియు, నాఱువేలనియోగి యనియు, తిమ్మాంబాసింగామాత్యుల కుమారుఁడనియు, సకలవిద్యావివేక చతురుఁడైన మలయమారుత కవికి మేనల్లుఁడనియు, శివపరాధీనమతియనియు, నఘోరశివగురుశిష్యుఁడనియు, కృష్ణరాయక్షితీశ కరుణా సమాలబ్ధ ఘనచతురంతయాన మహాగ్రహార సన్మానయుతుండనియు తెలియుచున్నది. కృష్ణరాయల తండ్రియైన నరసనాయకునికి వరాహపురాణము నంకితము చేసిన నందిమల్లయ ఘంటసింగనలను జంటకవులలో రెండవ వాఁడైన ఘంటసింగనకు మలయమారుతకవి యను ప్రఖ్యాతికలదు. నందితిమ్మన యతనికి మేనల్లుఁడు. వీరిరువురును అఘోరశివగురుని శిష్యులే. బహుశః సింగన వార్ధక్యముననుతిమ్మన యౌవనముననను, అతనికి శిష్యులై యుందురు. మేనమామకును మేనల్లునికిని వయస్సున నిరువది యిరువదై దేండ్లకంటె నెక్కువ వ్యత్యాసముండియుండదు. మేనమామ సాహాయ్యముననే యాతఁడు రాయల యాస్థానమునఁజేరి తరువాత నష్టదిగ్గజకవులలో నొకఁడుగా ప్రశస్తికెక్కియుండెను. అతఁడు చిన్నాదేవితోడనో తిరుమలదేవితోనో అరణముగా వచ్చిన కవియని లోకమున ప్రతీతికలదు. చిన్నాదేవి వేశ్యయగుటచేతను, తిరుమలదేవి కర్ణాటకుఁడైన మైసూరురాజు తనయ యగుటచేతను అతఁడు వారిరువురిలో నెవరితోఁగాని యరణపుకవిగా వచ్చెనని తలంచుట కవకాశము లేదని ఆంధ్రకవితరంగిణి చెప్పుచున్నది. అరణపుకవి కాకపోయినను వారాతని నెక్కువగా నాదరించి గౌరవభావముతో చూచుచుండిరని తలంపవచ్చును.

నందితిమ్మన కాలమును గూర్చి నిశ్చయముగా చెప్పుటకాధారములులేవు. కృష్ణరాయల మరణకాలము వఱకు నాతఁడాతని యాస్థానమునే యలంకరించి యుండును. రాయల మరణానంతరమతఁడెంత కాలమెట్లు జీవించెనో తెలియదు. యుద్ధయాత్రలలోఁ గూడ నతఁడు రాయలవారితో నుండెడివాఁడని చెప్పుదురు. రాయలవారు 1522వ సంవత్సరమున గయలో వేయించిన విజయ శాసనమునకు కర్త నందితిమ్మనయే. పారిజాతాపహరణ ద్వితీయాశ్వాసాంతమునఁగల “తిరుమలదేవీవల్లభ, కరుణామయహృదయ, రాజకంఠీరవ,

యీశ్వరనరసభూపురందర, వరనందన బాసదప్ప వరగండాంకా!" యనుకందపద్య మా శాసనమందు కూడ కనంబడుచున్నది. రాయలవారి కళింగవిజయము 1519వ సంవత్సరము ఆగస్టునెలలో పూర్తియైనది. ఆ విజయమును తిమ్మన పారిజాతాపహరణమున పూర్తిగా వర్ణింపని కారణమున నతఁడు 1519వ సంవత్సరమునకు పూర్వమే ఆ కావ్యమును రచించి యుండునని విమర్శకులభిప్రాయపడుచున్నారు. దీనినిబట్టి మనుచరిత్రకంటె నిదియే ముందు రచింపఁ బడి యున్నట్లు తోఁచుచున్నది. అయినను ప్రథమప్రబంధమను గౌరవము మనుచరిత్రకే దక్కినది. రాయలు పెద్దనను వలెనే తిమ్మనను కూడ నగ్రహారాది దానములచే సత్కరించియుండెను. కృష్ణరాయక్షితీశ కరుణాసమాలబ్ధ చతురంతయాన మహాగ్రహార సన్మానయుతుఁడనని యతఁడే చెప్పుకొనియుండెను.

నందితిమ్మనకు ముక్కుతిమ్మన యను పేరే లోకమున బహుళ వ్యాప్తినందియున్నది. అందుకాతని ముక్కు పెద్దదిగా నుండుటయే కారణమని చెప్పుదురు. వసుచరిత్రయందలి ద్వితీయాశ్వాసమున నర్మసచివుఁడు నాయికయైన గిరిక ముక్కు నీక్రింది పద్యమున వర్ణించెను.

**నానాసూన వితాన వాసనల నానందించు సారంగమే**
**లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకం దపంబంది యో**
**షా నాసాకృతి దాల్చి సర్వసుమనస్సౌరభ్యసంవాసియై**
**పూనెం బ్రేక్షణమాలికామధుకరీ పుంజంబు లిర్వంకలన్**

ఇందలి భావము చమత్కారముతోఁగూడి యత్యంత రమణీయముగా నున్నది. ఇదివసుచరిత్ర కర్తయైన భట్టుమూర్తి రచించినది కాదనియు, తిమ్మన రచింపఁగా భట్టుమూర్తి యందలి భావసౌందర్యమున కలరి కొంత మూల్యమిచ్చి తిమ్మన దగ్గఱ దానిని విలిచి తన గ్రంథమున వేసికొనెననియు, నప్పటినుండియు నందితిమ్మనకు ముక్కుతిమ్మన యను ప్రచారము కలిగెననియు చెప్పు నైతిహ్య మొకటున్నది. కాని యిదియంత విశ్వాసపాత్రముగా లేదు. విచిత్రకల్పనా ధురీణుఁడైన భట్టుమూర్తి యింతకంటెను రమ్యతరములైన కల్పనలతోఁ గూడిన పద్యములెన్నో వ్రాసియున్నాఁడు. తిమ్మననుండి యాతఁడీపద్యమును కొనవలసిన యక్కఱ యేమాత్రమునులేదు. ముక్కు తిమ్మనయను పేరు విన్న పిమ్మట దానికేదో కారణము చెప్పవలెనని యెవ్వరో యీకథ కల్పించి యుందురు. రాయలకొలువున తిమ్మన నామధారులుఁ (తిమ్మరుసు, వాకిటికావలితిమ్మన, తిమ్మకవి) ముగ్గురుండెడి వారనియు, మిగిలిన యిరువురి నుండి పృథక్కరించుటకై పెద్దముక్కు గల తిమ్మనను ముక్కుతిమ్మనయను పేరుతో నప్పుడుపిల్చు చుండెడివారనియు కొందఱు చెప్పు కారణము యుక్తియుక్తముగా నున్నది. అంగముల ప్రత్యేకతను బట్టి వ్యక్తులకు పేరుపెట్టు నాచార మిప్పటికి కూడ నాంధ్రదేశమున కానవచ్చుచునే యున్నది.

తిమ్మన రచించినకావ్యము పారిజాతాపహరణ మొక్కటే యిప్పుడుఁలభ్యమగుచున్నది. అతఁడు వాణీవిలాసమను పేరనింకొక కావ్యమును కూడ వ్రాసినట్లు కూచిమంచి వేంకటరాయకవి రచించిన కవి మనోరంజని యనుపేరుగల అప్పకవీయ విమర్శ వలన తెలియుచున్నది. అది యిప్పుడు లభించుటలేదు. అందుచేనది యెంతవఱకు సత్యమోచెప్పఁ జాలము.

సాధారణముగా పెక్కుప్రబంధముల అవతారికలందు కృతిపతి కృతికర్త నాహ్వానించి యాతని నేదైన ప్రబంధము రచింపుమని కర్పూరతాంబూల ప్రదానపూర్వకముగా నడిగినట్లును, ఆతఁడు గ్రంథము రచించి యభ్యుదయపరంపరాభివృద్ధిగా నాతని కంకితము చేసినట్లును చెప్పఁబడియుండును. పారిజాతాపహరణమున నట్టి సన్నివేశములేదు. కృత్యారంభమున నాశీర్వాదమైన వెంటనే తిమ్మన కృతిపతివంశమును వర్ణించి షష్ఠ్యంతముల తరువాత కథా ప్రారంభమొనరించెను. వేంకటేశ్వర శివ వినాయక లక్ష్మీ సరస్వతులతోపాటు చంద్రుదుకూడ కృష్ణరాయలను దయతోఁ జూచుఁగాకయని యాతఁడీ క్రింది పద్యమును వ్రాసెను.

**వలిమలయల్లువాఁడు తలవాక ధరించిన పూవుగుత్తి, వే**
**ల్పులగమిజీవగఱ్ఱ, యుడివోవని చల్వలటెంకి, వెన్నెలల్**
**మొలచిన పాదు, పాల్కడలి ముద్దులపట్టి, నృసింహ కృష్ణరా**
**యలఁగరుణారసంబు నిను పారెడి చూపులఁజూచుఁగావుతన్**

ఇతర కావ్యములలో నిట్లు కృత్యాది పద్యములలో చంద్రుని పేర్కొను నాచారము కానరాదు. కాని కృతిపతి వంశమునకు మూలపురుషుఁడు చంద్రుఁడే యగుటచే కాఁబోలు తిమ్మన యాతనిఁగూడ నిందు చేర్చినాఁడు. ఈ పద్యమొక విధముగా కృతిపతి వంశవర్ణనమున కుపక్రమముగా కూడ భావింపఁదగియున్నది. మఱియు చంద్రునికిని శృంగార రసమునకును గల సంబంధముచే నీ పద్యము కావ్యమునందలి శృంగారరస ప్రాధాన్యమును సూచించుచున్నది. అట్లే యిందలి “తలవాఁక ధరించిన పూవుగుత్తి” యను ప్రయోగము కావ్యవస్తువున ప్రాధాన్యము వహించు పారిజాతమును స్ఫురింపఁజేయుచున్నది.

పారిజాతాపహరణము నందలి కథ చాల స్వల్పమైనది. కృష్ణుఁడు నరకాసురుని జయించి యాతని యింటనుండిన యచ్చరల కులమునకు చెందిన పదియాఱువేవురు లలనామణులను నారదుని పంపున వివాహమాడి వారితోడను, అష్టమహిషులతోడను క్రీడించుచు, సౌఖ్యాబ్ధి నోలలాడుచుండెను. అతఁడందఱిని సమముగా చూచుచుండినను రుక్మిణీసత్యభామలను మన్నించి వారికధికముగా చనవునిచ్చుచుండెను. వారిరువురు నెవరికి వారే కులమును, రూపమును, మగని కూరిమియుఁగలదాననని తలంచుచుండుటచే వారికి మనస్సులలో రవరవలు పొడమెను. ఒకప్పుడు కృష్ణుఁడు రుక్మిణి యింట నామెతో

జూదమాడుచు వినోదించుచుండ నారదుఁడచ్చటి కరుదెంచెను. కృష్ణుఁడు వనితలతో నాతని కెదురేగి యుచితసత్కారము లొనరించి యాతని రాకచేఁ దాను ధన్యుఁడనైతినని పలికెను. నారదుఁడాతని యవతారములు ప్రశంసించి తనతోఁదెచ్చిన పారిజాతపుష్పమును మిన్నేటి పసిఁడి నెత్తమ్మి చిగురుటాకునఁబొదివి యాతని కిచ్చెను. కృష్ణుఁడు గ్రహించి దానిని రుక్మిణికిచ్చినచో సత్యభామ యేమనుకొనునో, సత్యభామకు పంపిన రుక్మిణిని దేలిక చేసినట్లగునేమో యని కొంతతడవనుమానించి తానక్కడనుండుటచే నితరులకుఁ బంపుట దగదని నిశ్చయించి నారదుని కనుసన్నచే రుక్మిణి కిచ్చెను. రుక్మిణి దానిని జేకొని నారదునికి మ్రొక్కి తన కొప్పునఁ జెఱువుకొని వింత సోయగముతోఁ బ్రకాశించెను.

నారదుఁడంత నా పారిజాతప్రసవము గుణగణములన్నియు వర్ణించి, సత్యభామ ప్రసంగముతెచ్చి "ఇన్ని దినములను హరి సవతులందఱిలో సత్యభామ కనుసన్న లంద్రిమ్మరునని వినుచుందును. కాని నీ యెడఁగల గౌరవమాతని కింకెచ్చటను గానరాదు. అతఁడనర్ఘ్యమైన దివ్య కుసుమోత్తమము నీకుఁగాక మఱెవ్వరికైన నిచ్చెనా? చక్కనిదానను, ఎలజవ్వనిని, లోకమున పేరెక్కినదానను, పతి నాయెడ నెంతయు ననురక్తుఁడు అని సత్య నిక్కుచు విఱ్ఱవీఁగుచు నితరకాంతల లెక్క చేయదు. ఇప్పుడు నీ మహిమ చూచిన బోటులు విన్న వించినచో స్రుక్కకుండునా? ఈ పుష్పము నీ ధమ్మిల్లమున నొకయేఁడుండి పిమ్మట పారిజాత తరువు కడకరుగు"నని తెల్పెను. ఈ పల్కులను, అచట జరిగిన వృత్తాంతమును సఖులు పోయి వేఱువేఱుగా దేవేరులకు విన్నవించిరి. సత్యభామ తప్ప మిగిలిన వారందఱు నేదో విధమున సరిపెట్టుకొని యూరకుండిరి.

సత్యభామ తన శృంగారవనమున చంద్రకాంత వేదికపైఁ గూర్చుండి శౌరి గుణములు వర్ణించుచు దక్షిణాంసచూచుక నయనప్రకంపగుణసూచనలచే ప్రాణేశుఁడింకొక చపలాక్షిఁ గూడి తన్నొల్లని చెయ్దములేమి చేసెనోయని యనుమానించుచుండ నొకచెలి యరుదెంచి నారదుఁడు రుక్మిణీ సౌధమున కరుదెంచి యొక దివ్యకుసుమమును కృష్ణునికొసఁగుటయు, కృష్ణుఁడు దానిని రుక్మిణికిచ్చుటయు, దానినామె ధరింపఁగనే యామెకు వింతచెలువము కలుగుటయు, తోడి భామినులు మచ్చరము వీడి యామెను భజించుటయు, నారదుఁ డహంకారమున విఱ్ఱవీఁగు సత్య గరువమిఁక చెల్లదని పల్కుటయు నామె కెఱింగించెను. ఆ మాటలు వినఁగనే సత్యభామ వ్రేటు వడ్డ యురగాంగనవలె కోపించి కృష్ణుడు రుక్మిణిపైఁ గల ప్రేమయేమియుఁ గనఁబడనీక తనయెడ బూటకపు ప్రేమ చూపుచు మోసగించెనని వగచెంది కోపసదనమునకరిగి సంతాపము పొందుచుండెను.

కృష్ణుడు సత్యచెలికత్తె జరిగిన సంగతియంతయు నేమేమికల్పనలు చేర్చి చెప్పెనోయని తలంచి ప్రద్యుమ్నుని నారదునికడ నుంచి సత్య సౌధమున కరిగెను. అలబలములేక చిన్నవోయియున్న నగరెల్లచూచి యతఁడనుమానించుచు కోపగృహమున కరిగి యొక కాంత

తాళవృంతముతో నామెకు విసరుచుండ దానిని తానుగైకొని విసరుచుండెను. పారిజాత వాసనలు వింతగొలుపఁగా సత్యభామ ముసుఁగుతీసి విసరుచున్న కృష్ణునిఁజూచి మరల ముసుఁగు పెట్టుకొని లోలో కుమారిలుచుండెను. కృష్ణుఁడామెను పలువిధముల ననునయించుటకు ప్రయత్నించి, యామె కోపము తీర్చుటకు మార్గము గానక, 'తత్పదద్వయీ పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియవెట్ట' నామెకు మ్రొక్కెను. సత్యభామ యంత నాతని శిరమును వామ పాదముతో ఁదొలఁగఁద్రోచెను. కృష్ణుడు మెయిగగుర్పొడువ "నీవిట్లు నెయ్యపుఁ గిన్కతోఁదాచుట నాకు మన్ననయే. నీపాదపల్లవమునకు మత్తనుపులకాగ్రకంటక వితానముచే నొప్పికలిగెనేమో యని నేను వంతనొందుచున్నాను. ఇకనైన కోపము మానవుగదా"యని పలికెను. సత్యభామ జంకెన చూపులడరించుచు కృష్ణుని పలువిధముల నెత్తిపొడిచి యింకమాటలాడఁజాలక యేడ్వఁదొడంగెను. కృష్ణుడాఁమెను గౌఁగిటఁజేర్చి బుజ్జగించుచు" నీ కింత వంతయేల? దేవతా కేలివనముచొచ్చి, యింద్రుఁడెదిరించినచో నతని జయించి, పారిజాతమునిటఁకుదెచ్చి, నీ కేళీవనమునఁబెరటిచెట్టుగ నాఁటింతు"నని పలికెను. ఆ మాటలు విని సత్యయు చెలికత్తెలును సంతోషించిరి.

ఇంతలో మధ్యాహ్న శంఖధ్వనులు వినిపించెను. కృష్ణుడు, స్నానమాచరించి తన చెంతకరుదెంచిన సత్యను గౌరవించి యామెతో సల్లాపమొనరించుచుండ నారదుఁడు మాధ్యందిన కృత్యము లాచరించి యచ్చటి  కరుదెంచెను. సత్యాకృష్ణులాతని కాతిథేయ సత్కారము లొనరించిరి. పిమ్మట వారందఱును భోజనమాచరించిరి. సత్యభామ యంతః పురమున నుచితకృత్యములు తీర్చి కృష్ణునికడకరుదెంచి, నారదుని పాదములకు నమస్కరించెను. నారదుఁడామె వైభవమును బొగడి "భర్త యెంతటి కార్యమైన విడిచి నీ కోరిన కోర్కులు ఘటించుఁగాక" యని యాశీర్వదించి పోయివచ్చెదనని కృష్ణునకు విన్నవించెను. కృష్ణుఁడంత నాతనితో "నారదా! నరకుఁడపహరించిన యదితి కుండలముల నాతని వధించి గైకొని నాటినుండియు పదిలముగా దాచియుంచితిని. నేను పట్టుకొని వచ్చి యిచ్చెదననియు యింద్రునితోఁజెప్పుమ" ని పల్కి యాతని వీడ్కొలిపెను. తరువాత నతఁడు సత్యభామతో జూదమాడుచుండ సూర్యుఁడస్తమించెను. క్రమముగా నంధకారము వ్యాపించెను. నక్షత్రములు తోఁచెను. చంద్రుఁడుదయించెను. వెన్నెల విరిసెను. సత్యభామయు కృష్ణుఁ డును శయనాగారముచేరి నిద్రించిరి.కొంత సేపటికి వేగురుఁజుక్క పొడిచెను. వైతాళికులప్పుడు ప్రాభాతిక రమణీయరాగఫణితులు చెలఁగ కృష్ణుని మేల్కొలిపిరి. కృష్ణుఁడు లేచి ప్రాతఃకాల కృత్యములొనరించి హితామాత్యబంధులతో పేరోలగంబుండి గరుడునిఁదలంచెను. గరుడుఁ డరుదెంచి యాతనిపదముల కెఱఁగెను. కృష్ణుఁడు జరిగిన వృత్తాంతమును, తాను స్వర్గమునకరిగి పారిఁజాతము తెచ్చెదనని చేసిన ప్రతిజ్ఞను అతని కెఱిగించెను. గరుడుఁ డింద్రునితోఁదనకుఁగల పూర్వవైరము తీర్చుకొనుట కవకాశము కలిగెనని తలంచి

సంతసించెను. కృష్ణుఁడు పట్టణరక్షణమునకుఁ దగిన వారి నియోగించి సత్యభామతోఁగూడ గరుత్మంతు నధిష్ఠించెను. గరుడుఁడు దిక్కుగ్గా విను వీధికెగసెను. అతఁడు గగనపథము గడచి చనుచుండ కృష్ణుఁడు సత్యభామకు మేరుపర్వతమును, అందుండు సిద్ధ విద్యాధర గంధర్వాదులను, సురరాజధానిని వర్ణించి చెప్పెను.

ఇంద్రుఁడు నారదునివలన కృష్ణుని యాగమనము నెఱింగి దిక్పాలకాదులతో యెదురేగి యాతనికి నమస్కరించెను. కృష్ణుడాతని గౌఁగిలించుకొనెను. తరువాత వారందఱును బయలుదేఱి యింద్రుని సౌధముకడ కరిగిరి. కృష్ణుఁడింద్రుఁడు కైదండయొసంగ కక్ష్యాత్రితయము దాఁటి యదితినిగాంచి,నమస్కార పూర్వకముగా నామెకుఁ దాఁదెచ్చిన కుండలము లర్పించెను. అదితి వానిని గ్రహించి దీవించి చింతారత్నపీఠముపై నుంచెను. పిమ్మట నామె కృష్ణుని మేను నిమిరి శిరసు మూర్కొని దశావతార వర్ణనపూర్వకముగా నాతని ప్రశంసించి, నేఁడు రేపు నీవు నీవనితయు నిచ్చటనుండి మజ్జనభోజనాది పూజనములు గైకొనవలయునని పల్కెను. కృష్ణుడింద్రునిమోము చూచెను. ఇంద్రుఁడు వినయావనతుఁడై వైజయంతము విడిదిపట్టుగాఁ జిత్తగింపుమని పల్కుచు కైదండయొసఁగి యాతని నాసౌధముకడకుఁ గొనిపోయెను. కృష్ణుఁడింద్రాదులను వీడ్కొల్పి సత్యభామా సహితుఁడై యథోచితకృత్యము లాచరించెను. తరువాత కృష్ణుఁ డచ్చరలు గొల్వ సత్యభామా సమేతుఁడై దివ్యారామమును చూడనరిగెను. అప్పుడాయారామమున నాతని సేవించుటకో యన షడృతువులు నొక్కట విలసిల్లెను. కృష్ణుఁడు సత్యభామకందలి లతావృక్షములను విశేషములను వర్ణించి చెప్పెను. పిమ్మట వారచ్చటనున్న పారిజాత వృక్షముకడ కరుదెంచిరి. కృష్ణుఁడు దాని గుణగణములు, మహిమలు వివరింప విని సత్యభామ "ఇంకాలస్యమేల ఈ వృక్షమును బెకలించి నాకేళీవనవాటికయందు నిల్పి నీ పంతము నిల్పుకొను" మని పల్కెను. కృష్ణుఁడు నవ్వుచు నట్లే కావించెదననిపల్కి యాచెట్టు పువ్వులగుత్తి నామెకు కర్ణావతంసముగా నిడెను. తరువాత నతఁడు సత్యభామతోఁ గూడ పుష్పాపచయ మొనరించెను. ఇంతలో మధ్యాహ్నమయ్యెను. కృష్ణుఁడు సత్యభామతోడను దివ్యాంగనలతోడను గూడి దివిషద్గంగయందు జలక్రీడ యొనరించి, మరల నింద్రుని పురము ప్రవేశించెను. సూర్యుఁడస్తమించెను. కృష్ణుఁ డారాత్రి సత్యభామతో వైజయంతమునఁ గడిపి మఱునాఁటి యుదయమున పారిజాతవృక్షము నపహరించు నుద్దేశముతో సత్యతోఁ గూడ నందనారామమున కరుదెంచెను. పిమ్మట నాతఁ డా వృక్షమును పెకలించి గరుడుని స్కంధముపైఁ బెట్టెను. అప్పుడు నందన వనపాలకులు కృష్ణుని జేరి "నీవిట్లు ధౌర్త్యము వహించి పారిజాతమును వంచనమై హరించుట పాడియే? ఇంద్రుఁడు విన్న నీకు మేలే? దీనిని మరల యథాస్థానమునబెట్టిచను" మని పల్కిరి. అప్పుడు సత్యభామ యేదో వచింపబూను వల్లభుని మాన్పి వీడిన కొప్పు పల్మఱుం దోఁపుచు, వారలఁ గాంచి "ఈ పారిజాత వృక్షమున కింద్రాణి యెవ్వతె, ఇంద్రుఁడెవ్వఁడు? తోడి యిందిరను

కౌస్తుభమును అధిపుఁడై యెవ్వఁడు ధరించెనో యాతఁడే దీనిని గూడ చేకొనుఁగాక! ఇది యొకరిసొత్తా? నేనిప్పుడు దీనిని నా విభునిచే నొడియించుకొని పోవుచున్నాను. మీ శచీదేవి వీరపత్నియగుచో తన ప్రాణేశుఁడైన యింద్రుని బంపి సత్యభామా విధేయునిచే మరల దీనిని గ్రహించుట మే" లని పలికెను. వనపాలకులా గర్వోక్తులు శచీసమేతుఁడైన యింద్రునికెఱిఁగించిరి. ఇంద్రుఁడు కుపితుఁడై దివ్య నగముతోపాటు సత్యభామా గర్వమును కూడ విడిపింతునని శచితోఁజెప్పి సుధర్మాస్థానమున కరిగి యావిషయ మితరదిక్పాలకుల కెఱింగించెను. అప్పుడు యుద్ధ సూచకమైన నిస్సాణము మ్రోగెను. ఇంద్రుని పురమంతయు మంథరక్షుభితవార్ధివలె ఘూర్ణిల్లెను. అమరవీరులును, దిక్పాలురును యుద్ధమునకు సన్నద్ధులై పురద్వారము నిర్గమించిరి. దిక్కులన్నింట సింహనాదములు చెలంగెను. దేవతాయోధులు కృష్ణుని దాఁకిరి. కృష్ణుఁడు సత్యను పారిజాతమును దింపి దేవతలపై బాణములు విసరెను. దిక్పాలకులు కృష్ణుని ధాటి కాగఁజాలక పోయిరి. ఇంద్రుఁడు వారికి ధైర్యము చెప్పుచు రణరంగమున కరుదెంచి కృష్ణునితో యుద్ధ మొనరించెను. కృష్ణుఁడొక బాణముచే నింద్రుని టెక్కెమును గూల్చెను. ఇంద్రుడంత క్రుద్ధుఁడై కృష్ణునిపై వజ్రమును ప్రయోగించెను. కృష్ణుఁడు దానిని బంతినివలె పట్టుకొనెను. దిక్పాలకులును గంధర్వ విద్యాధరాదులును భయమునఁ బరుగెత్తిరి. ఇంద్రుఁడేనుఁగు దిగివచ్చి నేనపరాధినని పల్కుచు కృష్ణునికి సాఁగిలి మ్రొక్కెను. కృష్ణుఁడాతని లేవనెత్తి "నీయెడ నేయపరాధమును లేదు. నీమఱఁదలీ పారిజాతము కావలెనని కోరఁగా దీనిని దెచ్చితిని. నీ సొమ్ము నీవే గ్రహింపు"మని వజ్రము నొసంగి వృక్షమును గూడ నీఁదలంప నింద్రుఁ డాతనికి మ్రొక్కి "సర్వ ప్రపంచమును నీ సొమ్మే. నీవుర్వి నుండునందాఁక నీ పారిజాతమును నీకడనేయుంచుకొ"మ్మని పల్కి యాతని వీడ్కొలిపెను. కృష్ణుఁడు సత్యను వృక్షమును గరుడునిపైఁ బెట్టుకొని యుద్ధవార్తలామెకుఁ దెల్పుచు ద్వారకా నగరమున కరుదెంచెను. ఆ పారిజాతము మహిమవలన ద్వారకయందలి వృద్ధులందఱు యౌవనము పొందిరి. దరిద్రులు కూడ సర్వసంపదలతోఁదులఁదూఁగిరి. సత్యభామ విభుని ప్రస్తుతించి పారిజాతమును నిజమందిరారామవాటికా మధ్యసీమఁ బ్రతిష్ఠించి దాని కనుదిన మర్ఘ్యములైన పూజ లొనరించుచుండెను. అది యామెకుఁ గోరిన కోరికలెల్ల నొసంగుచుండెను.

ఇట్లు సత్యాకృష్ణు లిష్టసౌఖ్యములొందుచు సంతోషమునం గాలము పుచ్చుచుండ నొకనాఁడు నారదుఁడు వారిని జూడ నరుదెంచి, సత్యభామ సౌభాగ్యమును బ్రశంసించి యామెతో "నీవు మహిమాతిశయమున కుచితమైన పుణ్యకవ్రత మొనరింపవలయును. మున్ను దానిని గౌరీశచ్యరుంధత్యాదు లొనరింపఁగాఁజూచియుంటిని. తదాచరణ క్రమమెఱింగించెదను వినుము. తెల్లవాఱఁగనే లేచి నదిలో స్నానమాడి, యత్తమామలకును భర్తకును నమస్కరించి మచ్చరము లేకుండ సవతులంతీ యిండ్లకు నేగి వారిని వ్రతోత్సవమునకుఁ దోడి తేవలయును. ప్రతి దినమును పదివేవురు పేరంటాండ్ర కర్చన లొనరించి, చైత్రశుద్ధ నవమి మొదలుగా

నెల వ్రతమాచరించి ఆచారధురీణుఁడు, అధ్యయన సంపన్నుఁడు, శుభాకారుఁడు శాస్త్ర రహస్యజ్ఞుఁడు, శాంతిదయాపరతంత్రుఁడునైన యొక విప్రవరునాచార్యునిగా నియమించి యాతనికి కరితురగ వస్తువాహనదక్షిణాసహితముగా పారిజాతవృక్షముతోఁ గూడ ప్రాణేశ్వరుని ధారవోయవలెను. పిమ్మట నాతఁడు కోరిన యర్థములెల్ల నొసంగి మరల నతని నుండి భర్తను గ్రహింపవలయును. ఇట్లు చేసినచో ధనకనకసంతాన సమృద్ధి కలిగి భర్తతోన నితర సులభములైన సుఖములు పొందవచ్చు"నని పలికెను. సత్యభామ భర్తయనుమతితో తద్వ్రతప్రారంభ మొనరించెను. పుణ్యక వ్రతమునకాప్తబంధు మహీపతి ప్రముఖులందఱు నరుదెంచిరి. కృష్ణునానతిచే విశ్వకర్మ రైవతకాద్రిచెంత దానమంటపము నిర్మించెను. కృష్ణుఁడు సత్యభామతో శుభలగ్నమున వ్రతదీక్షవహించి వ్రతకల్పోచిత దానప్రతి గ్రహణమునకు నారదుని సమ్మతింపఁజేసెను. ధౌమ్యాది ఋషులు ఋత్విజులుగా నరుదెంచిరి.

కృష్ణుఁడును సత్యభామయు దానమంటపము కడకేగుదెంచిరి. సత్య పారిజాతమును వలగొని నారదునికి యథోచితార్చన లొసంగెను. పుణ్యకవ్రతమును జూచుటకై రుక్మిణి పదాఱువేల సతులతో వచ్చెను. నారదుఁడు సత్యభామతో "ఈ పుణ్యకవ్రత విధానమునకు నాథుని ధారోదకపూర్వకముగా నీవలయునని చెప్పితినిగదా! అందుకు కృష్ణునియ్యకొలుపు"మని పలికెను. సత్యభామ కృష్ణుని వంక జూచెను. కృష్ణుఁ డాగమోక్తముకాన విచారింపక ధారవోయుమని సమ్మతించెను. సత్య కృష్ణుని కాంచనాంబరాంచలమును క్రొవ్విరుల దండతో పారిజాత వృక్షమునకుఁ గట్టి గర్గముని సంకల్పము చెప్పుచుండ సదక్షిణాకముగ వృక్షమును ప్రాణేశ్వరుని గూడ నారదునికి దానమొసంగెను. తరువాత నామె తన భూషణము లన్నియు నిష్క్రయముగా నొసంగి తన విభుని నారదుని నుండి మరలఁ గైకొని సవతులందఱికిని వాయనము లొసంగెను. నారదుఁడు చిత్రగతుల కృష్ణుఁని స్తుతించి యథేచ్ఛనరిగెను. కృష్ణుఁడును మిత్రులతో నిజపురము ప్రవేశించెను. అతఁడు వ్రతము చూడవచ్చిన రాజులను కల్పక ద్రుమ సంభూత భూషణావళులతో సత్కరించి వీడ్కొలిపి నిరంతర సౌఖ్యరసైక లోలుఁడై కాలము పుచ్చుచుండెను.

పారిజాతాపహరణ కథయందు సపత్నీ మాత్సర్యమునకమితమైన ప్రాధాన్యమున్నది. అదియే కథావృత్తమునకు కేంద్రము. తిమ్మన యీ విషయమును కావ్యారంభమునందలి రెండవ పద్యమున దిఙ్మాత్రముగా సూచించియున్నాఁడు.

**పొలఁతుల్ కౌఁగిట గ్రుచ్చియెత్తి తలఁబ్రాల్ వోయించు నవ్వేళ నౌ**
**దల గంగం దననీడ తానగని మౌగ్ధ్యం బొప్ప వేఱొక్క తొ**
**య్యలియంచున్ మదినెంచు పార్వతి యసూయావాప్తి కిన్నవ్వు క్రొ**
**న్నెలపూదాలుపు కృష్ణరాయలకు సంధించున్ మహైశ్వర్యముల్** 1-2

పార్వతి తలంబ్రాలు పోయు సమయమున శివుని తలమీఁది గంగలోఁ దన ఛాయచూచి వేఱొక కాంతయని యసూయపడెను. అదిచూచి శివుఁడు నవ్వెను. కావ్యార్థ సూచనముకావింప వలెనను నుద్దేశము తోడనే తిమ్మన సపత్నీమాత్సర్యముతోఁ గూడిన భావము నీపద్యమునఁ జొప్పించియుండెను.

పారిజాతాపహరణకథ భాగవతమునందును, విష్ణుపురాణమునందును, హరివంశము నందును గలదు. వీనిలో హరివంశమునందది మొదట సంగ్రహరూపమునను, దరువాత విస్తృతరూపమునను గనవచ్చుచున్నది. విష్ణు పురాణ భాగవతములందది యతిసంగ్రహముగాఁ జెప్పఁడినది. నాచన సోమనాథుఁడు శృంగార రసప్రియుఁడయ్యు నుత్తర హరివంశమున దాని నెందుచేతనో విడిచివైచెను. ఎఱ్ఱన యనువాదమున నది సంగ్రహముగా నున్నది. అందుచే సంస్కృత హరివంశమునందలి పారిజాతాపహరణమును వర్ణించు విస్తృతవృత్తాంతము ప్రక్షిప్తమై యుండుననియు, బహుశః ఆంధ్ర పారిజాతాపహరణము రచింపఁబడిన తరువాతనే యది యందుఁ జేరియుండుననియు కొందఱు భావించుచున్నారు. పారిజాతాపహరణ కథాప్రారంభమున తిమ్మన జనమేజయుఁడు వైశంపాయనుని "హరివంశ కథలెల్ల నానుపూర్విగ నిట్లు విని కృతార్థుఁడ నైతిని. హరి యమరుల కాధారమగు పారిజాతము పుడమి కేరీతిఁ దెచ్చెనో' చెప్పుమని యడిగినట్లు రచించి యుండుటచే నతఁడు భాగవత విష్ణుపురాణములను గూడ చూచియుండినను హరివంశమునందలి కథనే యెక్కువగా ననుసరించి యుండినట్లు తోఁచుచున్నది. అతఁడు కథావిధానమున చేసిన మార్పులు స్వల్పములు. హరివంశమున హరి నరకాసురుని వధించిన వెంటనే కుండలముల నదితి కర్పించినట్లున్నది. తిమ్మన వానిని కృష్ణుఁడు పదిలముగా దాచియుంచి సత్యభామ కోరిక నెఱవేర్చుటకై పారిజాతమును దెచ్చు నిమిత్తము స్వర్గమున కరిగినప్పుడామెను దర్శించి వానినామె కర్పించినట్లు వ్రాసెను. ఈ మార్పువలన నాతఁడు సాధించిన ప్రయోజన మొకటున్నది. పారిజాతవృక్షమును స్వర్గమునుండి తెచ్చి నీ కేళివనములో నాటించెదనని కృష్ణుఁడు సత్యభామతో ప్రతినచేసి యా దినమంతయు నామెయింటనే గడపెను. అప్పుడు నారదుఁడచ్చటికి వచ్చి వీడ్కొని వెడలిపోవుచుండఁగా కృష్ణుఁ డాతనితో,

**అదితి మొఱంగి కుండలములానరకుండు హరించె వానినేఁ**
**గదనములోనఁ ద్రుంచి యవిఁ గైకొని దాఁచితి నాఁటనుండియుం**
**బదిలముగాఁగ నన్నడుగఁ బంపని కారణమేమి లాఁతినే**
**యిదె చనుదెంచి యిత్తుననుమీ శతమన్యునితోడ సంయమీ.** 2-28

అని చెప్పి యింద్రునికి తన రాక ముందే తెలియఁబంపెను. ఈ విధముగా నతఁడు స్వర్గమునకుఁ బోవుటకొక కారణమును గల్పించు కొనెను. ఇది లేనిచో నాఁతడు సత్యభామా ప్రీణనమునకై పారిజాత వృక్షమును దెచ్చుకొఱకే స్వర్గమునకుఁ బోవలసి వచ్చును. తిమ్మన కుండలప్రదానమునిచ్చుట చొప్పించుట యౌచిత్యవంతముగా నున్నది.

పుణ్యకవ్రత వృత్తాంతము సంస్కృత హరివంశమున నున్నది. తిమ్మన దానిని బెంచి రసవత్తర మొనరించెను. ఎఱ్ఱన యెందుచేతనో దానిని విడిచివైచెను. సంస్కృత హరివంశమున శ్రీకృష్ణుఁడు పారిజాతమునకై తపమొనర్చినట్లుండఁగా తిమ్మన కథాసందర్భమున కదియతుకకుండుటచే విడిచివైచెను. అట్లే యుద్ధసందర్భమున నారదుని ద్వారా పంపిన సందేశమును గూడ నఁతడు విడిచివైచెను. నారదుడు కలహాశనుఁడు. అతఁడు కలహవర్ధనమున కుపకరించునట్లు సంధి సంఘటనమున కుపకరింపఁడుకదా!

తిమ్మన చేసిన ప్రధానమైన మార్పు సత్యభామ కోపమును దీర్చుట కుపాయమేదియుఁ దోఁపకపోఁగా కృష్ణుఁడామెకుఁ మ్రొక్కినప్పుడామె యెడమకాలితో నాతని శిరస్సును దొలఁగ ద్రోచెననుట. ఆంధ్రహరివంశమునఁగాని సంస్కృత హరివంశమునఁగాని యీవృత్తాంతము లేదు. తిమ్మన దీనినిట్లు కల్పించుటకు రాయల యంతిపురమున జరిగిన యొక సంఘటనము కారణమని చెప్పుదురు. రాజులు బహువ్యాపృతులు. వారనేక హేతువులచే నొక్కొక్కప్పు డంతిపురము నందలి శయ్యాగృహమున కాలస్యముగా పోవచ్చును. అంతవఱకు రాణులుకూడ నిద్రపోకుండ మేల్కనియుండుట కవకాశముండనిచో రాజు వచ్చువఱకు వారు శయ్యపై కాళ్ళ దెస తలపెట్టి నిద్రించుట సంప్రదాయమఁట! రాజు వచ్చిన పిమ్మట వారిని లేపుటయు వారు సరిగా నిద్రించుటయు జరుగును. ఒకప్పుడు తిరుమలదేవి రాయలు రాకముందే కాళ్ళకడ తల పెట్టుకొని నిద్రించుచుండెను. రాయలు ప్రొద్దు పోయినపిమ్మట శయ్యాగృహమున కేగి యామెను లేపకుండనే శయ్యపై పండుకొనెను. అప్పుడు తిరుమలదేవి నిద్రలో కాలు కదల్చుటచే బంగారపుటందెతోఁ గూడిన యామెకాలు రాయల శిరమునకుఁ దగిలెనఁట! రాయలామె బుద్ధిపూర్వకముగనే యట్లొనర్చెనని భ్రమించి కుపితుడై శయ్యాగృహమును వీడి వెడలిపోయి మఱి యావంకకే వచ్చుట మానివైచెనఁట! దేవేరి పశ్చాత్తప్తురాలై యాయనకు కబురు పంపినను లాభము లేకపోయెను. అంతఃపుర దాసివలన నీ వృత్తాంతము నెఱింగి యరణముగా వచ్చినవాఁడో యాదరపాత్రుఁడో యైన తిమ్మకవి కావ్యరచనద్వారా రసికుఁ డైన రాయలకు ప్రబోధము కల్గింపనెంచి హరివంశమునందలి పారిజాతాపహరణ కథ యందుకుపయోగపడునను నుద్దేశముతో దానిని గ్రహించి కావ్యము వ్రాయుచు రసవత్తరమైన యా సన్నివేశమును కల్పించెనని చెప్పుదురు. పారిజాతాపహరణ కావ్యమునకు ప్రథమాశ్వాసమును, ప్రథమాశ్వాసమున కాసన్నివేశమును ప్రాణభూతములని చెప్పవచ్చును.

సత్యభామ కోపగృహములోఁ బండుకొనియున్నప్పుడు కృష్ణుఁడచ్చటికరిగి పలువిధముల నామెననునయించెను. అతని అనునయోక్తులామె కోపము తీర్పఁజాలకపోయెను. అతఁడు చేయునదిలేక యామె పాదములకు మ్రొక్కెను. సత్యభామ యెడమకాలితో నతని శిరము తొలఁగద్రోచెను. తిమ్మన యీ సందర్భమున వ్రాసిన రసవన్మధురములైన పద్యము లాంధ్రలోకమున సుప్రసిద్ధములు.

**పాటలగంధి చిత్తమునఁ బాటిలు కోపభరంబుఁ దీర్పనె**
**ప్పాటను బాటుగామి, మృదుపల్లవ కోమలతత్పదద్వయీ**
**పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియవెట్ట నా జగ**
**న్నాటక సూత్రధారి యదునందనుఁడర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్.** 1-120

**జలజాతాసన వాసవాది సురపూజాభాజనంబై తన**
**ర్చు లతాంతాయుధుకన్నతండ్రి శిరమచ్చో వామపాదంబునం**
**దొలఁగంద్రోచె లతాంగి, యట్లయగు నాథుల్ నేరముల్ సేయఁ బే**
**రలుకం జెందినయట్టి కాంతలుచిత వ్యాపారముల్ నేర్తురే.** 1-121

ఇచ్చట కృష్ణుని జగన్నాటక సూత్రధారి యనుట గంభీరార్థ సంభృతమై యున్నది. కృష్ణుని శిరమునకు కవి వాడిన విశేషణములు సాభిప్రాయములు. అతని తల అందఱితల వలె సామాన్యమైనది కాదు. అది బ్రహ్మేంద్రాది సురులపూజలకు భాజనమైనట్టిది. మఱియు లతాంతాయుధుఁడైన మన్మథుని కన్నతండ్రికి సంబంధించినది. మొదటి విశేషణము వలన దాని మహత్త్వమును రెండవ విశేషణము వలన దాని సుకుమారత్వమును సూచింపఁ బడుచున్నవి. సత్యభామ యట్టి తలను కుడికాలితోనైన తొలగంద్రోచినది కాదు. ఆ కార్యమున ఎడమకాలు ప్రయోగించినది. ఏ కారణములైనను ఫలితమొక్కటే కాని ఎడమకాలితో నా పని చేయుట మఱింత యవమానకరము. కవి యీవిధముగా నిచట నామెయొనర్చిన కార్యమునందలి దోషమును విస్ఫుటము కావించి నాథుల్ నేరముల్ సేయఁబేరలు కంజెందిన యట్టి కాంతలుచిత వ్యాపారముల్ నేర్తురే యని యామెను సమర్థించి నాడు. అలుకచెందిన వారికుచితానుచితములు తెలియవు. కాంతల కంతకుమున్నే తెలియవు కాబోలును! అందును కాంతులు నేరముచేసినప్పు డసలే తెలియవు. అట్టి స్థితిలో చేతితో లేవనెత్తుటకంటె కాలితోఁ దొలగఁద్రోచుటయే యుచితమని కవి సమర్థించినాడు. సంస్కృతమున కాళిదాసుని "కామార్తాహిప్రకృతికృపణాశ్చేతనాచేతనేషు" అను నర్థాంతరన్యాసమువలె తెలుగున నీ యర్థాంతరన్యాసము బహుళ ప్రచారమునందినది.

సత్యభామ తన శిరమును కాలితోఁదొలగద్రోచిన పిమ్మట రసికజన చూడామణి కృష్ణుఁడేమిచేసెనో తిమ్మన యీ క్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

**కోపన పదహతిఁ గుహనా**
**గోపాలుఁడు గాంచి మెయి గగుర్పొడుఁవగ ను**
**ద్దీపిత మన్మథ రాజ్య**
**ప్రాపితుఁడై పలికెఁగూర్మి బయలుపడంగన్.** 1-122

**నను భవదీయదాసుని మనంబునఁనెయ్యపుగిన్కబూని తా**
**చిన యది నాకుమన్ననయ, చెల్వగు నీపదపల్లవంబు మ**
**త్తను పులకాగ్రకంటకవితానము దాకిననొచ్చునంచు నే**
**ననియెద నల్కమానవుకదా! యికనైన నరాళకుంతలా!** 1-123

'అరాళకుంతలా!' యను' సంబోధనము సత్య కుంతలములదే కాకయంత రంగముదైన అరాళత్వమును కూడ సూచించుచున్నది. కృష్ణునిమాటలు విని సత్యజంకెనచూపులు చూఁచి అధరపల్లవము కంపించుచుండ నాతని పలువిధముల నుపాలంభించినది. తాను మరణింతు నన్నది. అటు గాద్గద్యముచే మాటలాడలేక యేడ్చినది. ఎట్లేడ్చినది?

**ఈసునఁబుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే**
**గాసిలి యేడ్చెఁబ్రాణవిభు కట్టెదుట న్లలితాంగి పంకజ**
**శ్రీసఖమైన మోముపయిఁజేల చెఱంగిడి బాలపల్లవ**
**గ్రాసకషాయకంఠ కలకంఠవధూకలకాకలీధ్వనిన్.** 1-133

ఆ యేడ్పు విని కృష్ణుఁడింక నూరకుండలేక యామెనుగౌగిఁటఁజేర్చి పారిజాత వృక్షమును బెకలించుకొనివచ్చి నీకేళివనములోఁ బెరటి చెట్టుగ నాటించెదనని ప్రతిన పల్కినాఁడు. అంబుదశ్యాముఁడైన అతని మధురవాక్యగర్జితములకు సత్య నీపలతయయ్యెను. సఖీమయూరికలు చెలరేఁగెను.

నిజమునకు కృష్ణుఁడొనరించిన దోషమేదియులేదు. అతఁడు రుక్మిణి యింట నుండఁగా నారదుఁడిచ్చిన పారిజాతమును రుక్మిణికీయక సత్యకుఁబంపియుండినచో రుక్మిణియెడ దోషమొనరించిన వాఁడై యుండును. అతఁడౌచిత్యమునే పాటించినాడు. అయినను సత్యకోపింపఁగా నతఁడు తప్పుతనదేయైన ట్లామెపాదములకు మ్రొక్కినాఁడు. ఆమె యాతని శిరమునెడమకాలితోఁ దన్నినది. కోపమున నైనను బుద్ధిపూర్వకముగాఁ జేసిన పనియేయది. ఇచ్చట సత్యభామ యాతని శిరమును కాలితోఁ దొలగంద్రోచెనేకాని తన్న లేదనికొందఱామెను సమర్థింపఁజూతురు. కాని తత్కార్య ఫలమనుభవించిన కృష్ణుఁడు "తాఁచిన యదినాకు మన్ననయ" యని యామె తన్నెననియే చెప్పుచున్నాఁడు. ఆమె చేసిన పనిని దోషముగా స్ఫురింపఁజేసి యామె కోపప్రవాహమున కడ్డుకట్టవేయఁదలంచెను కాఁబోలును. ఇంత దోషమొనరించిన సత్యభామను కృష్ణుఁడట్లుపలాలించి యాదరించెను. అది రాసిక్యలక్షణము. నిద్రలో పొఱపాటున కాలు తగిలినంత మాత్రమున కోపగించి మొగము చూడకుండుట తమవంటి రసికచక్రవర్తులు చేయవలసిన పనికాదు." అని తిమ్మన యీ సన్నివేశము ద్వారా రాయలవారికి బోధించెను. "భావధ్వని వ్యంగ్యసేవధిగాఁగ" సత్యావధూప్రీణనము చెప్పిన రాయలవారు తిమ్మన పారిజాతాపహరణము నందలి ప్రథమాశ్వాసము వినీ వినకుండనే

యందలి వ్యంగ్యప్రబోధమును గ్రహించి నాఁటిరాత్రియే తిరుమలదేవి యంతిపురి కరుగ నిశ్చయించిరి. తిమ్మన యది యెట్లుపసికట్టెనో "రాయలవారీనాఁడు తప్పక శయ్యా గృహమున కరుదెంతురు. స్వాగతీకరింపవలసిన" దని దేవేరి కాసాయంకాలమే కబురు పంపెను. అది యట్లేజరిగెను.

**ప్రతివర్ష వసంతోదయ**
**కుతుకాగత సుకవినికర గుంభిత కావ్య**
**స్మృతిరోమాంచ విశంకిత**
**చతురాంతఃపురవధూప్రసాదన రసికా!** 1-139

అను ప్రథమాశ్వాసాంత పద్యమునందలి సంబోధనచే తిమ్మన యా విషయమును సూచించెనేమో యనిపించును. తిమ్మన చేసిన యీ కల్పన వెనుకనింత యంతఃపుర రహస్యము దాగియున్నది. బహుశః ఏతత్కార్య సంఘటనము నందలి త్వరచేతనే తిమ్మన రాయలవారంకితమిమ్మని కర్పూరతాంబూల ప్రదానపూర్వకముగా నడుగకుండ యా కావ్యమును వారి కంకితము చేసి యుండును. లేనిచో పెద్దన "కృతిరచింపుము మాకు శిరీషకుసుమపేశల సుధామయోక్తుల పెద్దనార్య" యని రాయలవారు తన్నడిగిరని చెప్పుకొన్నట్లే తిమ్మనయు "ముద్దుపల్కులతోఁ గూడిన యపూర్వప్రబంధము నంకితము చేయు" మని తన్నడిగినట్లవతారికలోఁ జెప్పుకొనకుండునా?

తిమ్మన పారిజాతాపహరణమునకు కన్నడమునందలి రుద్రభట్టవిరచిత జగన్నాథ విలాసము మూలమని కొందఱి అభిప్రాయము. ఇందలి పద్యములు కొన్ని దానియందలి పద్యములకు కేవలానువాదములై యున్నవఁట! ఇదే సత్యమైనచో తిమ్మన ప్రతిభకు కొంత లాఘవము చేకూరును. మఱి పారిజాతాపహరణము నందలి పద్యములే యనువాదితములై కన్నడ కావ్యముల కెక్కినవని తలంచు విమర్శకులును లేకపోలేదు. తత్త్వనిర్ణయమునకై యింకను నిశితమైన పరిశోధనజరుగవలసి యున్నది.

పారిజాతాపహరణ మందలి కథావస్తువల్పమేయైనను దానిని సంఘటించుటలో తిమ్మన యపారమైన కౌశలము ప్రదర్శించినాడు. ప్రథమాశ్వాసమునందలి కథ పారిజాతపుష్పమును రుక్మిణికిచ్చిన పిమ్మట సత్యసముదంచిత కాంచనసౌధ సీమకరుగు హరియరదము వలె చాల వేగముగా సాగినది. తిమ్మనకావ్యము నారంభించుటయే "హరినరకాసురుంగెలిచి" యని నేరుగా కథోపక్రమముతో నారంభించినాఁడు. నిజమునకు ప్రబంధ సాధారణవిధానము నవలంబింపఁదలఁచినచో కావ్యమున, ద్వారకానగరము, కోట, అగడ్త, చాతుర్వర్ణము రథగజతురంగపదాతులు, వేశ్యలు, పుష్పలావికలు మున్నగు వాని వర్ణనముతో నారంభించి యుండవచ్చును. తిమ్మన యట్లుచేయక కావ్యమునకు నాటకోచితమైన యారంభము నొసగినాఁ

డు, నాటక దృష్టితో నీప్రథమాశ్వాసమును మూఁడు ప్రధానరంగములుగా విభజింపవచ్చును. రుక్మిణీసౌధమునకు నారదుఁడరుదెంచి కృష్ణునకు పారిజాతమిచ్చుదృశ్యము. కేళీవనమున హరి రామికి చిడిముడిపాటునొందు సత్యకు చెలికత్తెవచ్చి కృష్ణుఁడు రుక్మిణికి పారిజాతము నిచ్చిన వృత్తాంతముతోపాటు నారదుని యెకసెక్కెపు మాటలనుగూడ నెఱింగించు దృశ్యము, కోపగృహదృశ్యము, భర్తృవియోగముచే తిరుమలదేవి పొందుచున్న మనస్తాపము నెఱింగి యుద్విగ్నమైన తిమ్మనచిత్తము కోపగృహదృశ్యమును వర్ణించి రాయలవారికి ప్రబోధము కలిగించుటకై వేగిరపాటు పొందుచున్నదా యన నీయాశ్వాసమున కథయంతయు చకచకసాగిపోయినది. ఇందనవసరవర్ణనముకాని యనవసరభాషణముకాని కనిపించదు. అందుచేతనే యీ యాశ్వాసమునకు రసజ్ఞలోఁకమున ననితరసాధారణమైన ప్రశస్తి కలిగినది.

ప్రథమాశ్వాసము ముగియుటతో తిమ్మన కావ్యరచనా ప్రధాన ప్రయోజనముకూడ ముగిసినది. అతనిదృష్టి యప్పటినుండి తిరుమలదేవి వంకనుండి తోడికవులైన పెద్దనాదుల వంకకు తిరిగినది. అతఁడింక నరణపుకవిగాఁగాక ప్రబంధకవిగా గోచరించును. మిగిలిన నాలుగాశ్వాసములను కొంచె మించుమించుగా వర్ణన ప్రధానములైనట్టివి. అందుచే కథాగమనమందు మిక్కిలి మందముగా గానిపించును. అయినను తిమ్మన యెడనెడ సన్నివేశ సంఘటనచాతుర్యమును ప్రదర్శించుచునేయుండును. ద్వితీయాశ్వాసమున కృష్ణుడు సత్యభామసౌధముననుండఁగా నారదుఁడచ్చటికరుదెంచెను. నిజమునకాతఁడప్పుడు మరల ప్రవేశింపవలసిన యక్కఱలేదని మనకనిపించును. కాని యతడట్లు వచ్చుటలో రహస్యమున్నది. కలహప్రియుడైన యాతఁడు తాను ప్రథమాశ్వాసముననాటిన కలహాంకురమెట్లు పరిణమించెనో తెలిసికొన నువ్విళ్లూరుచుండెను. అతఁడు రుక్మిణిసౌధముననుండఁగనే కృష్ణుడు ప్రద్యుమ్ను నాతనిదండనిడి వెడలిపోయెను. ఆ వెడలుట సత్యసౌధమునకేయని యతడు గ్రహించెను. అతఁడు రుక్మిణి వీడుకొల్పఁ "మున్నీటిజలంబున మజ్జనాది మాధ్యంది నకృత్యములాచరించి" సత్యసౌధమునకు వచ్చెను. ఆమె

**మాత్సర్యఘనమేఘ మాలికాపగమ ప్ర**
**కాశిత హిమధామకళయనంగ**
**విరహ నిశీథినీ విరమసంప్రాపితో**
**న్మీలనామోద పద్మినియనంగఁ**
**గ్రోధదంతావళక్షోభ విభ్రమ పునః**
**సంప్రాప్తనైర్మల్య సరసియనఁగ**
**సంతాప నైదాఘ సమయనిర్గమ కోర**
**కిత నవమాలతీ లతిక యనగ** 2-15

వికసితస్వాంతయై శాంతితో చెన్నారుచుండెను. అతఁడు కొంత నిరుత్సాహము పొంది యుండును. భోజనానంతరమామె వచ్చి నమస్కరింపగా నతడామె వైభవోన్నతులు పొగడి,

**అనిక్కైనం బతినిన్నుఁబాసిచనునో ప్రాణంబు ప్రాణంబుగా**
**నిను మన్నింపఁడొ నీమనోరథముల న్నెయ్యంబుతోఁ జేయడో**
**చనువున్నీవలె నెవ్వరేఁగనిరె నీ సౌభాగ్యమింతంతయే**
**నినుఁబోలంగల రబ్జగంధులన వింటే యెందు సాత్రాజితీ!** 2–25

**అటులైనను గానిమ్మో**
**కుటిలాలక! నీకు మగఁడు కోరిన కోర్కెల్**
**ఘటియించుఁగాక తానెం**
**తటికార్యంబైన డించి నా దీవనలన్.** 2–26

అని దీవించెను. అతఁడు రుక్మిణి సౌధమున నామెనుఁగూర్చి పల్కిన పల్కులకును వీనికిని సంబంధము లేదు. “అనిక్కైనం బతినిన్నుఁబాసి చనునో” యన్న మాట కృష్ణుఁడామెను నరకాసురసంహారమునకుఁ బోవునప్పుడు తనతోఁగూడఁ దీసికొనిపోయెనను విషయమునే చెప్పినట్లున్నను ముందు జరగఁబోవు యుద్ధమునుగూడ సూచించుచున్నది. చెలులు కృష్ణుడు పారిజాతమును రుక్మిణికిచ్చెనని చెప్పిన పిమ్మటనామె తనకుఁగూడ పారిజాతపుష్పమునో, వృక్షమునో, తెచ్చియిమ్మని యడిగి యుండునని యాతఁడూహించి “నీకు మగఁడు కోరిన కోర్కుల్ ఘటియించుఁగాక” యని దీవించి యుండెను. నారదుఁడు సెలవు తీసికొని వెడలిపోవుచుండఁగా కృష్ణుఁడదితి కుండలముల నామెకర్పించుటకై తాను స్వయముగా వచ్చుచున్నట్టింద్రునకుఁజెప్పుమని కబురంపెను. అతడు పారిజాతము సంగతి యేమియు నాతనికిఁదెల్పియుండలేదు. తాను నాటిన కలహాంకుఁరమేమయ్యెనో యాతనికిఁ దెలియలేదు. అతడు వెళ్ళి కృష్ణుఁడు వచ్చుచున్నట్లింద్రునకుఁ దెల్పెను. కుండల ప్రదానమునకే యాతఁడు వచ్చుచుండెనని యింద్రుఁడు భావించి యుండును. అందుచేతనే యాతఁడు దిక్పాలకులతో నాతని కాదరపూర్వకముగా నెదురేగెను. పంచమాశ్వాసమున నింద్రుఁడును యుద్ధమున కారంభించినప్పుడు నారదుఁడు తన ప్రయత్నము ఫలించెనని సంతోషించి యుండును. అచ్చట తిమ్మన “ఆ రణము చూచి రణాశనమౌని నింగిపైఁ గుతుక రసాతిరేకమునఁ గుంచియవీచి నటించె”నని వ్రాసి యున్నాఁడు. పారిజాతాపహరణానంతరము నారదుఁడు మరల సత్య యింటికరుదెంచి పుణ్యకవ్రతము చేయుమని యామెను ప్రోత్సహించెను. కృష్ణుఁడాత్మదానమునకంగీకరింపనిచో సత్య గర్వభంగమగునని నారదుఁడు భావించెనేమో! కాని యా సన్నివేశమున కృష్ణు “డాగమోక్తంబుగాన విచారింపక ధారవోయు” మని దానవస్తువగుటకు సమ్మతించెను. సత్యభామ భర్తృదానకార్యమును నిర్విఘ్నముగా నాచరించెను. సవతులు లజ్జాభరాక్రాంతలై వక్త్రపంకరుహములు వాంచిరి.

పారిజాతాపహరణకావ్యము సత్యభామాగర్వాపహరణమున కుద్దేశింపఁబడినట్లు తోఁచును గాని యామె కెచ్చటను గర్వభంగముకాలేదు. పారిజాతాపహరణము, పుణ్యకవ్రతాచరణము అను రెండుచోట్లను ఆమెయే సంపూర్ణ విజయమును పొందజాలెను.

పారిజాతాపహరణమను పేరుగల యీ కావ్యము పారిజాత ప్రతిష్ఠ (5-52) తో ముగిసియుండినచో నెక్కువ యుచితముగా నుండి యుండును. కాని కవి చివర పుణ్యకవృత్తాంతమును గూడ చేర్చి యున్నాడు. పారిజాతవృక్షముతోఁగూడ భర్తనొక బ్రాహ్మణునకు ధారవోయవలయుట తప్ప దీనికిని పారిజాతాపహరణమునకును మఱే సంబంధము లేదు.

**ధనకనకవస్తు సమితియుఁ**
**దనయ సమృద్ధియును గల్గి తానుంబతియున్**
**మనమున నఱగొఱలెఱుఁగక**
**యనితరసులభైక సుఖములందుదు రనుచున్** 5-62

నారదుఁడు పుణ్యకవ్రతమునకు ఫలితముగాఁ జెప్పెను. సత్యభామకు తనయ సమృద్ధికూడ కలిగినట్లు కనిపింపదు. బహుశః రాయలవారి యంతఃపురమున జరిగిన యొక వ్రతోత్సవమును దృష్టియందిడుకొని తిమ్మన దీనిని రచించెనేమో! పదాఱువేల సవతులును తోడు రాగా పట్టపుదేవియైన రుక్మిణి తగవేనని పుణ్యకవ్రతమును చూచుటకై వచ్చెను. "వదనాంబుజం బునం గృతకవికాసమచ్చుపడ"నని తిమ్మన వ్రాయుటచే నామెమర్యాద కొఱకే వచ్చెనుగాని మనఃపూర్వకముగా వచ్చియుండలేదని తెలియుచున్నది. తిమ్మన యీ వృత్తాంతమును చాల సరసముగా వర్ణించెను. కాని సరసములు కదా యని యన్నిటిని కావ్యమునఁ జేర్చుట యుచితముగానుండదు కదా!

తిమ్మన రెండు మూఁడు నాలుగాశ్వాసములను వర్ణనలతో నింపియుండెను. కృష్ణుని మాధ్యాహ్నిక స్నానము, భోజనము, సాయంకాలము, అంధకారము, నక్షత్రములు, చంద్రోదయము, వెన్నెల, చంద్రికావిహారము, మేల్కొల్పులు, మేరుపర్వతము, స్వర్గస్త్రీలు కృష్ణుని దర్శించుట, దశావతారములు, వైజయంతము, నందనవనము, పారిజాతము, పుష్పాపచయము, సూర్యాస్తమయము, యుద్ధము, మధ్యాహ్నము, జలకేళి, మున్నగువాని వర్ణనములందు ముఖ్యములైనవి. ఈ వర్ణనములు కావించునప్పుడు తిమ్మన రాయల యంతఃపురమునందలి యాచారములను, దైనిక కృత్యములను, అందలి యుద్యానవనములు భవనములు మున్నగు వాని సౌందర్యమును చక్కగా విశదీకరించెను. కావ్యమున నష్టాదశవర్ణనము లుండవలయునను లాక్షణికుల నియమమున కివి యనుగుణముగనే యున్నను అతి దీర్ఘములగుచు కథాగమనమునకు కొంత యాటంకము కలిగించుచున్నవి. కవి యిందు ప్రదర్శించిన

భావనాశక్తియు, లోకప్రకృతిపరిశీలనమును, భావగాంభీర్యమును, పద ప్రయోగౌచిత్యమును అత్యంత ప్రశంసా పాత్రములుగా నున్నవి.

ప్రథమాశ్వాసమున నారదుఁడు రుక్మిణికి పారిజాతము గుణగణములు తెలియఁ జెప్పుచు,

**అలినీలాలక! నీపు నీపతి రహస్యక్రీడ వర్తించు వే**
**ళ లతాంతాయుధు సంగరమ్మునకు నుల్లాసంబు కల్పించు ను**
**జ్జ్వలదీపాంకురమై, రతిశ్రమతనూసంజాత ధారాళ ఘ**
**ర్మలవంబుల్ తొలఁగింపఁగా సురటియై రంజిల్లు నిచ్ఛాగతిన్** 1-60

అని దాని రతిసమయానుకూల ప్రవృత్తిని వెల్లడిచేసెను. అది సత్యమే కావచ్చును. కాని బ్రహ్మచారియు, శాంతిదాంతి సముపేతుఁడునైన నారదమహాముని యిందిరా ప్రతినిధియైన రుక్మిణి కీవిధముగా వివరించుట యౌచిత్యదూరమై యున్నదని పలువురు విమర్శకులు తలంతురు. ఏతత్పద్య రచనాసందర్భమున తిమ్మన తత్కాల ప్రభావము నుండి తప్పించుకొనలేకపోయెను. "కృతకాద్రి కందరాకేళీ నిగూహనవేళా పరస్పరాన్వేషణములు" అను సీస పద్యము(1-95) సత్యాకృష్ణుల శృంగారలీలలను వలె రాయలవారియు తన్మహిషీ మణులయు విహార విశేషములను గూడ హృద్యముగా వర్ణించుచున్నది.

**పొందుగఁ బశ్చిమాద్రి తటభూస్థలి నంశుమదంశుమత్ఫలా**
**కందము వాసరాంత హలిక ప్రవరుండిడ సాంధ్యవారి భృ**
**త్కందళముల్ తమోదళయుతంబులునై గొలపండి వ్రాలెఁబూ**
**ర్ణేందుని పేరఁ బ్రాచినది హేతువు వెన్నెలకల్మి కల్మికిన్** 2-42

సాయంకాలహలికుఁడు సూర్యుఁడను నరటిదుంపను పడమటి సంద్రము తీరప్రదేశమున పాతఁగా నది చెట్టై యాకులతో పెరిఁగి తూర్పుదిక్కుగా నిండు చంద్రుఁడను గెల వేసెను. వెన్నెలకల్మి కల్మి కదియే హేతువు. అరటిచెట్టు తూర్పుగా గెలవేసినచో నది సంపత్సూచకమని పెద్దలు చెప్పుదురు. ఆ సంప్రదాయమును పురస్కరించుకొని కవి రూపకాలంకార బంధురముగా భావగంభీరమైన యీ పద్యమును రచించెను.

**తారకాధీశు కిరణ కదంబకంబు**
**చిలికెఁ బలుచని వలిపంపుఁ జిలుఁగుమంచుఁ**
**గౌరవశ్రీవధూ కరగ్రహణ వేళ**
**వెలికిఁ గ్రమ్మిన సాత్త్విక స్వేదమనఁగ.** 2-48

చంద్రుని కిరణములుచిలుకు పలుచనిమంచుకలువ కన్నె పాణిగ్రహణ మొనరించువేళ వ్యక్తమైన సాత్త్వికస్వేదమన నుండెనని కవి యుత్ప్రేక్షించుచున్నాఁడు. కలువకన్నె చంద్రునికిఁ బ్రియురాలనెడి కవిసమయమును బురస్కరించుకొని కవి యిచ్చట వెల్లడించిన భావమద్భుతముగానున్నది. తరువాత పద్యమున (2–49) చకోరపు పేరంటాండ్రు చిగురువిలుకాని జాతర చేయఁబూని కులముసాముల నందఱిని బిలిచి సాగించిన బువ్వపుబంతి వర్ణింపఁబడినది. ఈ విందున చకోరములు విరహులమైసోఁకి వేఁడియైన వెన్నెలను పచ్చివెన్నెల చేర్చి నులి వెచ్చ చేసియు, కలువపుప్పొళ్ళచే కసవైన వెన్నెలను వలిప వెన్నెలలో వడిచి తేర్చియు, చంద్రకాలపు నీటిచే జాలైన వెన్నెలను ముదురు వెన్నెల చేర్చి జుఱ్ఱుఁబదనుచేసియు, సతులమైపూఁతచే పిసాళించు వెన్నెలను తనువువెన్నెలచే రసాయనముగా నమరించియు చతుర్విధాహారములను చేకూర్చినవఁట! ఇందు చెప్పిన వెన్నెలయందలి వింతభేదములు పారిజాతాపహరణమునఁ దప్ప మఱెందును గోచరింపవు.

వైతాళికులు కృష్ణుని మేల్కొల్పుచు చెలువు వోనాడి యల్లనల్లనవ్రాలు చంద్రు నిట్లు వర్ణించి యుండిరి.

**చరమాద్రి దావాగ్ని సంప్లుష్ట సుర సౌర**
**భేయీకరీషైక పిండమనఁగ**
**బహు చకోరకదంశ పరిపీత చంద్రికా**
**క్షౌద్ర నీరసమధుచ్ఛత్రమనఁగఁ**
**బ్రత్యఙ్ముఖోచ్ఛల ద్రాత్రి వర్షీయసీ**
**పలిత పాండుర కేశబంధమనఁగ**
**గగనసౌధాలేపకర కాలశిల్పి ని**
**ర్ముక్త సుధావస్త్రముష్టియనఁగ**

**సుమహిత జ్యోత్స్నికాలతా సుమగుళుచ్ఛ**
**మనఁగ నతిధూసరచ్ఛాయ నబ్జవైరి**
**చెలువు వోనాడి బింబావశిష్టుఁడగుచు**
**నల్లనల్లనవ్రాలెడు నంబుజాక్ష.** 2–59

ఇందలి యుత్ప్రేక్షలు తిమ్మకవి భావనాసముద్రమున పుట్టిన రత్నములు. కాంతిహీనుఁడై బింబమాత్రావశిష్టుఁడైన చంద్రునతఁడు వివిధరీతుల నూహించినతీరు విస్మయావహమై యాతని ప్రతిభా సంపదను పట్టి చూపుచున్నది. “రంభా మహోరోజకుంభపరీరంభ కుసుమిత ప్రత్యగ్ర కురువకంబు”(3–44) అను సీసమున నుద్యాన వనముతోపాటు వివిధ దోహదక్రియలను రమ్యముగా వ్యక్తము చేయఁబడినవి.

**తూఁగెం జల్లనిగాడ్పులేమి ఫణిసందోహంబు పేరాఁకటన్**
**లోఁగెం దప్తసరోజ శీధురసముల్ గ్రోలన్మదాళిచ్ఛటల్**
**గ్రాగెన్నీఱుగఁ గాంచనాచలతటీ గండోపలవ్రాతముల్**
**డాఁగెన్బల్వల పంకసీమ బకజాలత్రస్త పాఠీనముల్** 4-20

అను పద్యమున మధ్యాహ్నపువేఁడిమి ప్రభావము చక్కగా వర్ణింపఁ బడినది. ఇది తిమ్మన నిశితమైన ప్రకృతిపరిశీలనకుఁ దార్కాణము.

**ఎలదేటుల్దమ వాలుఁ గన్గవలపై నిందీవర భ్రాంతిచే**
**మెలఁగం జీరలఁ గప్పుకోనలవిగామిం జీఁదఱం జెంది యి**
**చ్ఛలఁ గాంక్షించిరి నిర్నిమేష జలజాస్యల్ మానుషత్వంబున**
**య్యలిభీతి న్ముకుళీకృతాక్షియగు సత్యాకాంత నీక్షించుచున్** 4-12

దేవతలకు ఱెప్పపాటుండదు. ఉద్యానవనమున విహరించునప్పుడు తేంట్లు కలువలేమో యను భ్రాంతిచేఁ దమకన్నులపై వ్రాలఁగా దేవకాంతలు వానిని జీరలతోఁ గప్పుకొనుటకు వీలు లేకపోయెను. అవి చీరలకంటెఁ బెద్దవగుట యందుకుఁగారణము. సత్యభామకాబాధ కలుగలేదు. ఆమె మానుషియగుటచే కన్నులు మూసికొనఁ జాలెను. అందుచే దేవకాంతలు కూడ మానుషత్వమును కాంక్షించిరని యిందలి భావము. ఈ పద్యము దేవతావనితల నేత్ర వైశాల్యమును విశదముగా వెల్లడిచేయుచు నత్యంత రమణీయముగా ఉన్నది.

కృష్ణుఁడు కుండలములను తెచ్చియీయఁగనే సంతోషించి యదితి యాతని దీవించి దశావతారవర్ణనము కావించెను. ప్రథమాశ్వాసమున నారదుఁడు కృష్ణుని దర్శింప వచ్చినప్పుడుకూడ దశావతార వర్ణనమున్నది. కాని యది యతిసంగ్రహముగా నున్నది. అచ్చట రామావతారము వఱకుఁగల విషయము భూతకాలముననను కృష్ణావతార విషయం వర్తమానకాలముననను బుద్ధకల్క్యవతారముల విషయము భవిష్యదర్థకమైన తద్ధర్మముననను ఉండుట గమనింపఁదగియున్నది. అదితి కావించిన వర్ణనమున మొదటి యైదవతారముల తరువాత పరశురామ రామ బలరామావతారములను పిమ్మట బుద్ధకృష్ణావతారములును వివరింపఁబడినవి. ఇందు కల్క్యవతారము లేదు. కృష్ణావతారమున హరి యొనరించిన కార్యములన్నింటిని ఆమె పెద్ద దండకమున విశదముగా వర్ణించియుండెను. ఈ క్రింది పద్యము వామనావతార వర్ణనముతోఁ గూడినవి.

**నను నాకశ్యప కామినీమణులలోనన్ధన్యఁగాఁజేయు మ**
**త్తనయ వ్యాజముదాల్చి వామనుని చందాన న్బలిన్మట్టవే**
**ఘనమార్గోన్నమితాంఘ్రిపద్మమునకుం గంజాప్తుఁడంశువ్రజం**
**బను కింజల్క పరంపర ల్మెఱయ నుద్యత్కర్ణికం బోలఁగన్** 1-3

ఆకసమున కెత్తబడిన వామనుని పాదము పద్మమువలెనొప్పారెను. సూర్యుఁడు కర్ణికవలెను ఆతని కిరణములు కింజల్కముల వలెను ప్రకాశించెను. ఇచ్చటి రూపకోపమా లంకారములు రమణీయములై కవి భావించిన భావమును విస్పష్ట మొనరించుచున్నవి.

చతుర్థ పంచమాశ్వాసాంతారంభములందు కృష్ణునకును దేవతా యోధులకును, దిక్పాలకులకును, ఇంద్రునికిని జరిగిన యుద్ధము వర్ణింపబడినది. తిమ్మన దీని నపారమైన నేర్పుతో వర్ణించెను. కాని యాతని శైలి సహజ మాధుర్య సంపన్నమగుటచే నిచ్చటి యుద్ధము నాటకము నందలి యుద్ధము వలెనే యుండునుగాని తీవ్ర భయంకరముగాఁ గని పింపదు. ఇంద్రుడేసిన యాగ్నేయానిలసౌరబ్రహ్మాపాశుపతాస్త్రములు వరుసగా కృష్ణుని తేజోనిశ్వాస దక్షిణాంబరనాభీ దేహార్ధము లందడంగెనని చెప్పుట (5-30) కృష్ణుని పరబ్రహ్మత్వము ధ్వనింపఁ జేయుచున్నది.

**భిన్నాసురాస్త్రముల చవి**
**గన్న మురాహిత శిలీముఖములపు డనిలో**
**మున్నెఱుఁగని సురవీరుల**
**క్రొన్నెత్తురు చవినెఱింగి క్రోలఁ దొడంగెన్** 5-7

కృష్ణుని బాణములంతకుముందు రాక్షసుల నెత్తురు చవినెఱింగెనే కాని దేవతల నెత్తురు రుచి నెఱుంగవు. ఇప్పుడాచవినెఱింగి యవి క్రోలఁ దొడంగెననుట దేవతా కృష్ణుల యుద్ధమునందలి యపూర్వతను జాఁటుచున్నది. వేల్పుమ్రానియందు వేడుకపడు ప్రియసతుల కోరికతీర్చుటకై హరియు హరియు నన్యోన్యజయకాంక్షతోఁ బోరిరనుట యందును వారిరువురి యాశుగములను అసురజీవితాపహరములే యనుట యందును మైత్రితోనుండవలసిన వారు సతులకై సంగ్రామము నొనరించుటలోఁ గల వింతఁదనము వ్యక్తమగుచున్నది.

ప్రబంధములన్నిటియందువలె పారిజాతాపహరణము నందును శృంగారమే ప్రధానరసము. ప్రథమాశ్వాసమున నీర్ష్యామానశృంగారము వర్ణింపఁబడినది. కృష్ణుఁడు పారిజాత పుష్పమును దనకీయక రుక్మిణికిచ్చెనని విని సత్యభామ యపారములైన యీర్ష్యాకోపములకు లోనైనది. పారిజాతాపహరణము నందలి కథయంతయు నీ భావములపై నాధారపడినట్టిదే.

**బిసరుహపత్రలోచనకుఁ బెల్లగుమోహము సంఘటిల్లె వె**
**క్కసమగు నెవ్వగల్వొడమెఁ గంపమువుట్టె జెమర్చెమేను మా**
**నసమున విన్నఁబాటొదవె, నాఁటెఁగడుంబరితాపవేదనల్**
**మసకపుఁబాముకాటువలె మచ్చరమన్విష మగ్గలించినన్** 1-10

అను పద్యమున సత్య మనమున సపత్నీ మాత్సర్యముచేఁ గలిగిన వికారములు వర్ణింపఁబడినవి. "వెడవెడ గన్ను మూయుఁ గనువిచ్చు, నగుం దలయూఁచు"నని తరువాతి పద్యమాసందర్భముననామె పొందిన యగ్గలమైన మనోజబాధకు ఫలితములైన చేష్టను వివరించుచున్నది. మాత్సర్యము కోపమునకు దారితీయఁగా నామె కృష్ణుఁడరుదెంచి యెంత యనునయించినను శాంతింపక యాతఁడు ప్రేమతో మ్రొక్కఁగా వామపాదముతో నాతనిశిరము తొలఁగ ద్రోచినది. తరువాత నాతఁడు కూర్మి బయలు పడునట్లుగాఁ బల్కిన పల్కులువిని చలితాధరపల్లవాగ్రయై యతని పలువిధముల నుపాలంభించినది. ఇతర ప్రబంధములందు వియోగ వేదనా సందర్భమున నాయిక చంద్ర మన్మథ మలయ వాయువుల నుపాలంభించుట కాననగును. పారిజాతాపహరణమున దానికవకాశము లేకపోయినది. కవికోపముతోఁగూడిన నాయిక యిచ్చట ముఖాముఖిగా నాయకునే యుపాలంభించినట్లు వర్ణించినాఁడు. కోపమున నామెయెడలెఱుంగక 'యెఱుంగునే పసులకాపరి భావజమర్మకర్మము'లని కృష్ణుని నిరసించినది. తరువాత ఘనతరగద్గదికా నిస్వనమున మాటలాడఁజాలక యేడ్చినది.

ద్వితీయ తృతీయాశ్వాసములందలి వర్ణనము లన్నియు శృంగార రసానుకూలములుగా చేయఁబడినవి. సత్యాకృష్ణులు స్వర్గమునకేగినప్పుడు వేలుపు వనితలు హర్మ్యములనెక్కి చూచుచు పొందిన సాత్త్వికభావ వికారాదులను కవి హృద్యముగా వర్ణించెను.

**అలఁదిన చందనమ్ము వృథయౌఁజెమరింపఁగ సమ్మదాశ్రులం**
**దొలచిన యట్లువోయెదుఁ గనుంగవకాటుక, పేటులెత్తుఁజె**
**క్కులమకరీ విలాసము గగుర్పొడువన్ హరిజూచువేళ నో**
**చెలి! కయిసేయకమ్మయని చేడియ యొక్కతె పిల్చె నెచ్చెలిన్** 3-12

అను పద్యమున నొకకాంత కలుగఁబోవు శృంగారభావాలను పురస్కరించుకొని యొడలు కైసేసి కోవలదని చెలిమిని వారించుచున్నది.

**అలికుల వేణి యొక్కతె మురారిఁగనుంకొని మ్రానుపాటుమై**
**నెలకొన నున్నచో సడలు నీవిక లేఁజెమరంటి నిల్వె, నం**
**జలిపరిపూర్ణలాజలను సాధ్వసకంపము దానచల్లె న**
**చ్చెలువకు సాత్త్వికోదయము చేసిన మేలికఁజెప్ప నేటికిన్** 3-17

సాత్త్విక కంపముచే నీ కాంత యంజలియందలి లాజల నయత్నముగా చల్లివేసినది. అందుచే ఆమెకు సాత్త్వికోదయము చేసిన మేలింతింతగాదని కవి వివరించుచున్నాఁడు. చివరనున్న పుణ్యకవ్రతము కూడ సతీసుతులు మనమున నఱగొఱ నెఱుఁగక యనితరసులభైక సుఖములందుటకే నిర్వహింపఁబడినది.

కృష్ణుఁడింద్రునితోడను దేవతాయోధులతోడను బోరుసందర్భమున వీరరౌద్రములను, నారదుఁడు కృష్ణునిస్తుతించు సందర్భమున శాంతమును అదితి కృష్ణుని మేనిమిరి శిరసు మూర్కొని యొకవంక దీవించుచునే వేఱొకవంక నాతని పరబ్రహ్మత్వమును నిరూపించుచు స్తుతించుటయందు వాత్సల్యభక్తియు, మేరు పారిజాతాదుల వర్ణనలందద్భుత రసమును నిందంగములుగా వర్ణింపఁబడినవి. పుణ్యకవ్రత సందర్భమున కృష్ణుడు సత్యభామ చిఱునవ్వునకు బదులుగాఁ దన్ను ధారవోయుమని పల్కినప్పుడు సంబంధిభూపాలకులు నర్మగర్భిత వచః ప్రాగల్భ్యమేపారఁగా నవ్విరి. సత్యకృష్ణుని గ్రొవ్విరులదండతో పారిజాతవృక్ష మునకుఁ గట్టినప్పుడామె బోంట్లు "బలిదనుజేంద్రుఁ గట్టితని పల్కఁగ విందుముగాని నేఁడు మాచెలియిదె పుష్పదాయకముచే నినుఁగట్టఁగఁగంటి మింక నెమ్మెలు పచరింప రా" దనుచు మేలములాడిరి. దానగ్రహణానంతరము నారదుఁడు కృష్ణునితో కేళిపరుఁడై "నిన్ను నిప్పుడు సత్యాపతి మాకునిచ్చె నిఁకమాయభీప్సిత కృత్యంబులు సల్పు" మనుచు,

**మేళవించినవి సుమీ్మ దీనిమెట్లని**
**మాంసలాంసంబున మహతిఁ జేర్చి**
**మిన్నేటిజలము సుమీ్మ తొలంకెడునని**
**డా చేత మణికమండలువొసంగి**
**యిది తపోచితము సుమీ్మ జతనంబని**
**వలచేతఁ బద్మాక్షవలయమిచ్చి**
**యీశానుఁడిచ్చెఁ జుమీ్మ మాకునిది యని**
**శార్దూలచర్మంబుఁజంకఁ జొనిపి**
**పొమ్ము పొమ్మని యొక కొంత పోవఁబోవ**
**రమ్ము రమ్మని మరలఁ జేరంగఁబిలిచి**
**కపటనటనాపరుండైన కంసవైరిఁ**
**బరమ ముని నవ్వుటాలకు బనులుగొనియె** 5–87

ఈ సందర్భములందు సున్నితమైన హాస్యము గోచరించుచున్నది.

తిమ్మనకవి కృష్ణసత్యభామనారద పాత్రలను పారిజాతాపహరణమున నద్భుతముగా చిత్రించియున్నాఁడు. కృష్ణుడిందు దక్షిణ నాయకుడు. సౌఖ్యరసైకలోలుఁడు, సత్యాచంద్రముఖీ వరుఁడు. 'నను భవదీయదాసుని మనంబున నెయ్యపుటల్కఁ బూని తాఁచిన యది నాకు మన్ననయ'యని పల్కిన సరసుఁడు. జగన్నాటక సూత్రధారి. మఱియొకప్పుడతఁడు సర్గస్థితిలయ కారుఁడైన పరబ్రహ్మం, (3–27) భక్తగణాధీనుఁడు, ఇంద్రుని వజ్రాయుధమును గూడ పిడికిలించిన మహావీరుఁడు. సత్య ఆక్రాంతనాయికయైన ప్రౌఢమానిని. "నను నెవ్వతిఁ గాఁ జూచితి"వని కృష్ణునితోఁ బల్కుట యందును (1–132) కృష్ణుని వామపాదమునఁ

దొలఁగఁ ద్రోయుట యందును ఆమె మానినీత్వము గోచరించును. చతుర్థాశ్వాసమున పారిజాతమును బెఱికి గరుడస్కంధమునఁ బెట్టుకొని సత్యాకృష్ణులరుగఁబోవు సందర్భమున వనపాలకు లడ్డమై కృష్ణునితో నా వృక్షమును మరలఁ బెట్టిపొమ్మని పలుక నాతఁడు వారికేదో సమాధానము చెప్పఁబోయెను. సత్యభామ కరసంజ్ఞచే నతని మాన్పి "చన్గ్రేవల జాఱు కొంగు సవరించుచు వీడిన కొప్పు బల్మఱుం జేవెడఁదోఁపుచుఁ" జెందొవ చూపులు క్రేళ్ళు దాఁటఁ గా నిట్లు పలికెను.

**వినుఁడు సురేశ్వరు వనపాలకులు వార్ధిఁ**
**బొడమిన యీ దివ్య భూరుహమున**
**కింద్రాణి యెవ్వతె యింద్రుండు నెవ్వఁడు**
**తోడి యిందిరను గౌస్తుభమునెవ్వఁ**
**డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁగాక**
**తెకతేర యిదియేమి యొకరిసొమ్మె**
**యిదె నాదు విభునిచే నీవదాన్యనగమ్ము**
**నొడియించుకొని పోవుచున్న దానఁ**

**బలుకులేటికిఁ దా వీరపత్నియేని**
**మీ శచీదేవి తనదు ప్రాణేశుఁడైన**
**మఘువునిటఁబంపి సత్యభామా విధేయు**
**వలన మరలంగఁ గొనుటెపో వాసితనము** 4-59

ఈ పలుకులామె ప్రౌఢత్వమును, ఆక్రాంతవల్లభాత్వమును సూచించుచున్నవి. వనపాలకులకివి గర్వోక్తులుగాఁ గనిపించినవి. కాని యవి వట్టి గర్వోక్తులు కావు. ఆమె యట్లు తు.చ. తప్పకుండ చేయించుకొనఁజాలిన దిట్ట. కృష్ణుని భార్యలందఱిలో నామె "సౌందర్యవతియు, మానవతియు, మహనీయసౌభాగ్యవతియు"(1-70) నని కవి చెప్పియున్నాఁడు. శృంగార వనములోనున్నప్పుడు "దక్షిణాంస చూచుక నయన ప్రకంప గుణసూచనలు" కలిగినప్పుడు మది జాలివొంది యొకరీతిఁ దలంకఁ "బ్రాణనాథుఁ డొండొక చపలాక్షిఁగూడి ననునొల్లని చెయ్దము లేమిచేసెనో" యని కలఁతనొందెను. ఇది యామె సౌభాగ్యమునకుఁ దార్కాణ. 'తా నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య' (1-66) యన్న నోటితోనే నారదుఁడు "పతినీవై విహరింపఁగా, నతుల ప్రాభవవైభవోన్నతుల ప్రోవై యిట్లు వర్తించు నినుఁజూచి సవతికాంతలు లజ్జింతురనియు, చనవుల్నీవలె నెవ్వరేఁ గనిరో నీ సౌభాగ్య మింతంతయే" (2-25) యనియు నామెను స్తుతించియుండెను. పుణ్యకవ్రత నిర్వహణమున నామె సౌభాగ్యము పరాకాష్ఠనందెను. నారదుఁడారివేరంపుఁ దపసియని కవి యాతనిఁ బ్రవేశ పెట్టునప్పుడే తెల్పెను. అతఁడు ప్రథమాశ్వాసమున కలహాంకురము నాటెను.

ద్వితీయాశ్వాసమున దాని పరిణామమెట్లున్నదో చూచుటకు సత్యభామ యింటి కరుదెంచి యించుక నిరుత్సాహము పొందెను. యుద్ధము జరుగునప్పుడు కుంచె వీచుచు నాట్య మొనరించెను. పంచమాశ్వాసమున సత్యను పుణ్యకవ్రతమునకు ప్రేరేఁచెను. అతఁడు 'చివ్వల యోగిరపుఁ దపసి' యయ్యును భక్తాగ్రగణ్యుఁడు. ద్వారక వైకుంఠపురమనియు రుక్మిణి లక్ష్మియనియు నాతఁడు భావించి వారిని గొల్చుటకై యచ్చటి కేగుచుండెను. చివర నాతఁడు చేసిన కృష్ణస్తుతి బంధగతమై చిత్రగతుల నడచుటచే క్లిష్టముగా నున్నను నిరుపమానమైన యాతని భక్తిని జాటుచున్నది. అందుచేతనే కృష్ణుఁడు సర్వసద్గుణ సముపేతుఁ డై యుండవలసిన దానప్రతిగ్రహీతగా నాతని నిశ్చయించెను. పారిజాతాపహరణ కథాసూత్రధారి నారదుఁడు. ఆతని వాఙ్నైపుణ్యమును, కలహాశనత్వమును, భక్తి నిష్ఠలను తిమ్మన చాలనేర్పుతో, వర్ణించియున్నాఁడు. రుక్మిణి 'యందఱిలోన పెద్ద మహిమాన్విత'. ఇందిరా ప్రతినిధి. ఈమె పారిజాతాపహరణకావ్యమున మాటలాడినది తక్కువ. ఔచిత్య పరిజ్ఞానము కలది. పుణ్యకవ్రతమామె కంతసంతోష ప్రదము కాకపోయినను 'రాఁదగనౌ' నని యచ్చటికి వెళ్ళెను. ఇంద్రుఁడు శచీదేవితోఁగూడియున్నప్పుడు వనపాలకులరుదెంచి పారిజాతాపహరణ వృత్తాంతమెఱింగించిరి. సత్యగర్వోక్తులాతని రౌద్రాకారునొనరించెను. అతఁ డు శచితో "సత్యా గర్వభారంబు దివ్యనగంబున్విడిపించి" వత్తునని పలికి యహంకారము ప్రదర్శించెను. కృష్ణుఁడు వచ్చుచున్న వార్తవిని యాతఁడెదురేగి "భక్తివివేకతరంగితాత్ముఁడై యడుగులమీఁద" వ్రాలినవాఁడే యిట్లహంకరించుట కప్పటి సన్నివేశపరిస్థితులే కారణము. పారిజాతమును ప్రాణముగాఁ జూచుకొను శచీకాంత చేరువ నున్నప్పుడా వార్త వినుటచే నతఁడట్లు వర్తింపవలసి వచ్చెను. వజ్రమును కృష్ణుఁడు బంతినివలెఁ బట్టుకొనఁగనే యాతనికా యహంకారము సడలెను. అతఁడు వెల్లనేఁగు దిగివచ్చి యపరాధినని వచించుచు సాఁ గిలఁబడి కృష్ణునికి మ్రొక్కెను. కృష్ణుఁ డాతనియెడఁదప్పు లేదని పల్కి వజ్రముతోపాటు పారిజాతమును గూడ నీయఁదలంచెను. ఇది కేవలము మర్యాదకొఱకు పారిజాతమాతనికడనే యుండునని పలికి లేని యౌదార్యము బ్రకటించెను. అంతకంటెనేమి చేయును?

తిమ్మన పారిజాతాపహరణ కావ్యారంభమున రాయలవారి వంశమును వర్ణించెను. రాయలవారినిగూర్చి యతఁడు వ్రాసిన పద్యములు భావగంభీరములై యున్నవి.

**యాదవత్వమున సింహాసనస్థుఁడుగామి**
**సింహాసనస్థుఁడై చెన్నుమెఱయ**
**గొల్లయిల్లాండ్రతోఁ గోడిగించుటఁజేసి**
**పరకామినీ సహోదరతఁజూప**
**మఱి జరాసుతునకై మధుర డించుటఁ జేసి**
**పరవర్గ దుర్గముల్ బలిమిఁగొనఁగఁ**
**బారిజాతము నాసపడి పట్టి తెచ్చుట**
**నౌదార్యమున దాని నడుగువఱుపఁ**

**గోరి తొలిమేనఁ దనవైన కొదువలెల్ల**
**మాన్చుకొనవచ్చి భువనైక మాన్యలీల**
**నవతరించిన కృష్ణుఁ డౌననఁగ మించె**
**నరస విభు కృష్ణరాయ భూనాయకుండు.** 1–17

అను పద్యము యాదవ కృష్ణుఁడే తనకాజన్మముననున్న లోపము లన్నియుఁ దీర్చుకొనఁగోరు కృష్ణరాయలుగాఁబుట్టెనని చెప్పుచున్నది. తిమ్మన కథలోఁగూడ రాయలకును కృష్ణునికిని గల సాదృశ్యము వ్యంగ్యముగాఁ బ్రకటించియున్నాడు. తిరమలదేవీ కృష్ణరాయల స్థానములందే యాతడు సత్యాకృష్ణులను నిలిపియున్నాడు. రాయలు కూడా దానే కృష్ణుడని వెల్లడించెడి వారిపై నధికమైన యభిమానము ప్రదర్శించెడివారని చెప్పుదురు. ఒకప్పుడు రాయలవారు సభలో దాశరథులు, పాండవులు అనువారిలో నెవరు గొప్పవారని యడిగిరట. దానికెవ్వరును సమాధానము చెప్పియుండలేదు. అంత రాయలవారు సాక్షాద్దేవాంశ సంభూతులై ఘనకార్యము లొనరించిన దాశరథులకంటె కేవలము మానవులుగాఁబుట్టి మహా కార్యములొనరించిన పాండవులే గొప్పవారని పలికిరఁట. అప్పుడు వారిలో వీవన పట్టుచున్న చాకలి "ఈ జన్మములోఁగూడ దేవరవారికి పాండవేయులమీఁద నభిమానము పోలే"దని చమత్కారముగాఁబలుక రాయలు వానికి దేవరకోట నగ్రహారముగా నిచ్చిరట!

**శ్రీరంగేశ్వరనాభిపంకజ రజశ్శ్రీకంటెఁ జోళేంద్రత**
**న్వీరాజత్కుచపాళి కుంకుమముకంటె న్సహ్యాభూభృత్తటీ**
**నీరంధ్రీకృతగైరిక ద్రవముకంటె న్వన్నెగావించెఁగా**
**వేరీతోయము కృష్ణరాయఁడ హితోర్వీనాథరక్తప్రభన్** 1–18

అనుపద్యము రాయలవారి పరాక్రమమును రమ్యాతిరమ్యముగా వర్ణించుచున్నది. ఆ రోజులలో రాయలవారిని గూర్చి పలువురుకవులు రచించిన పద్యములన్నిటికి నిది తలమానికమని చెప్పదగియున్నది.

ముక్కుతిమ్మనార్యు ముద్దుపల్కనుమాట యాంధ్రదేశమున చిరకాలవ్యాప్తమై యున్నది. అతఁడు సంస్కృత సమాసముల నెక్కువగానే వాడును. అయ్యును అతని పదముల కూర్పులో నొక మాధుర్యమున్నది. మార్దవమాధుర్యములును ప్రసాదగుణమును అతని రచనకు సహజసిద్ధములు. "వలిమలయల్లువాఁడు తలవాఁక ధరించిన పూవుగుత్తి"(1–6) "అమరుల బోన పుట్టిక"(2–41) అను పద్యములు రెండును చంద్రవర్ణనాత్మకములైనట్టివే. ఈ రెండింట నతఁడచ్చతెలుఁగు పదములనే యెక్కువగా వాడినాఁడు. చల్లని చంద్రుని తేటతెల్లములగు తెలుఁగుమాటలతో వర్ణించుట యౌచిత్య శోభితముగానున్నది. తిమ్మనపద్యములు ధారాశుద్ధిశోభితములును, భావగంభీరములును, అలంకారరమణీయములునై యింపునింపు చుండును."సంతసమంది జాదులు ప్రసాదమయ్యె"(2–75) "పూసలలో దారంబు

మాడ్కి"(1-93) మున్నగు జాతీయములనాతఁడక్క డక్కడ చక్కగా వాడి యుండెను. అతని యుపమానములు సహజములును అర్థగంభీరములునై యలరారును. "వ్రేటువడ్డ యురగాంగనయుం బలె" "నేయివోయ భగ్గన దరికొన్న భీషణ హుతాశన కీలయనంగ", "వలిగుబ్బలిముద్దుఁబట్టి లేఁతనెల ధరించినట్లమరె"(1-55) "చీఁకటింటి కడకంకటిపై జలదాంత చంద్రరేఖా సదృశాంగియై పొరలె"(91-99) "నీమాగధోత్కరముంబోలుచుఁ జూడనొప్పె(2-61) మున్నగునవి యాతని రమ్యోపమానఘటనాచాతుర్యమునకు నిదర్శనములు. తిమ్మనకలంకారప్రీతి మెండు. వర్ణనాత్మకములైన యాతని పద్యములన్నింట నేదో యొక యలంకారము గోచరించుచునే యుండును. "నాథుల్ నేరముల్సేయఁ బేరలుకం జెందిన యట్టి కాంతులుచితవ్యాపారముల్ నేర్తురే" యనుదాని వలెనే "రాజవల్లభల సూర్యంపశ్య లేదుర్గదా"(2-69) "సహవాసుల దుఃఖము నెయ్యురోర్తురే"(2-31) "చాల గాంభీర్యశీలురు సంక్షోభము నొందువారినెచటన్ లోగొంచు వర్తింపరే"(4-29) మున్నగునవి కూడ చక్కని యర్థాంతరన్యాసములు. వానితోఁగూడిన పద్యము లన్నియు చమత్కారసహితములైన భావములతోఁగూడి పఠితలనానంద పరవశుల నొనరించుచుండును. అతని రూపకోత్ప్రేక్షలు సహజసుందరములును సముచిత భావసంపన్నములునై శోభిల్లుచుండును.

**సారాంగాక్షులచూపుచోఱగముల, న్లజ్జొండల, న్మోహదు**
**ర్వారావర్తముల, న్మనింగి దరిఁజేరన్రాక యుప్పొంగు సం**
**సారాంభోనిధి సత్క్రియాతరణి నిశ్శంకన్ సముత్తీర్ణుఁడై**
**చేరున్సజ్జన నావికుండు మదిరాక్షీ! ఈపురద్వీపమున్** 2-10

అనుపద్యమాతని రమ్యరూపకాలంకార సంఘటనమునకు నిదర్శనము. అతని వర్ణనచాతుర్యమును గూర్చి చెప్పునప్పుడతని యుత్ప్రేక్షలకుదాహరణములైన పద్యము లొసంగబడినవి.

**మలయ సమీరణ చ్యుత సమంచిత పాండుపలాశలైన పా**
**దుల నునుసోగతీఁగలు యదుప్రభునిం దలపించె బాలచా**
**పలహృతతీరవస్త్రలయి పంకరుహాకరమధ్య సీమలన్**
**నిలిచిసముగ్ధ గోపరమణీ రమణీయ విలాసరేఖలన్** 3-50

అనుపద్యము స్మరణాలంకారమున కుదాహరణము. ఇందు పాదులు సరస్సులను, అందు రాలిన పాండుపలాశములు జలములను, విగతపత్రములైన తీఁగలు వివస్త్రలైన గోపికలను దలపించుచున్నవి. "యామినీసమయంబు నాశాతట ప్రదేశంబుఁ బ్రసన్నభావంబు నొందె" (2-68) అను సీసమునందలి పాదోత్తరార్ధములు చక్కని శ్లేషతోఁ గూడియున్నవి. "తామసవృత్తిలేదు, సతతంబును నుగ్రుఁడుకాఁడు, పౌరుషంబేమియు వెల్తిగాదు, తనకెందును బైమఱి రాజు లేఁడు" (1-9) అనుపద్యమునఁ శబ్దప్రధానమైన చక్కని ధ్వని యున్నది.

**చోద్యమప్పుడు భవరోగవైద్యుఁడైన**
**యంబుజోదరు డాసిన యంతమాత్ర**
**నపగతాసాధ్యగదుఁడయ్యె యక్షభర్త**
**సోరిదిరుద్రులు నిర్ముక్తశూలులైరి** 5–11

అనుపద్యమున గద, శూలశబ్దములర్థద్వయము నొసంగుచు పద్యభావమున కుత్కర్ష సమకూర్చుచున్నవి. తిమ్మన యచ్చటచ్చట యమకానుప్రాసాది శబ్దాలంకారములను గూడ వాడియుండెను.

**అలరుంబోడుల లోపల**
**నలరుం బోడుములు నీకు నగ్గలమగుచుం**
**దలపూ వాడకయుండుము**
**తలపూవుధరించి వికచతామరసాక్షీ!** 1–64

అలరుంబోడులలోపల – స్త్రీలలో; అలరున్ పోడుములు నీకు; తలఁపుఁ ఊవాడకయుండుము; తల+పూ+వాడక యుండుము అని యందలి పదములను విడదీయవచ్చును. "అలికులరావముల్ కిసలయాకుల కోకిలకాకుకాకలీ కలకలనాదముల్ వెలఁగ (1–72) మున్నగునవి యనుప్రాసాలంకారమునకు నిదర్శనములు. "మొగుడుఁ దమ్ములఁ జిక్కు మగతేటియలుఁగులు సడలిపోఁజేయు విశల్యకరణి" (4–49) అను సీసము పాదాంతముల కరణి, సరణి, తరణి అను సమాన ధ్వనులు గల పదములతోఁ గూడియున్నది. తిమ్మన యెడనెడ సాభిప్రాయము లైన పదములను వాడుచు భావములకపూర్వమైన పుష్టి చేకూర్చు చుండును.

**పూనుకొని మేలు గీళ్ళకు**
**లోనయి వర్తించువారి లోకమెఱుఁగదో**
**యా నరకాసురదమనుఁడు**
**తానెఱుఁగడొ భోజకన్య తానెఱుఁగదొకో!** 1–91

కృష్ణుఁడు నరకాసురుని సంహరించుటకై యేగినపుడు సత్యభామ యతనితోనరిగి చాల సాయమొనర్చినది. అతనికి నరకాసురదమనుఁడను కీర్తి తనవలననే వచ్చెనని యామె అభిప్రాయము. మేలుగీళ్ళకు లోనయి వర్తించువారి నానరకాసుర దమనుఁడెఱుఁగడాయని యడుగునపుడా శబ్దమును వాడుటయందలి యభిప్రాయమది.

**ఓర్పొకయింతలేని వికచోత్పల లోచన చిత్తవీథిఁజ**
**ల్లార్పఁగ నీలనీరదశుభాంగుఁడు వేచనుదెంచెనంచుఁ గం**
**దర్పహుఁతాశనున్ వెలికిఁదార్చుసఖుండును బోలె వేడి ని**
**ట్టూర్పు దళంబుగా నిగిడె నున్న మితావరణాంశుకాంతమై** 1–112

చిత్తవీథిఁజల్లార్చుటకై వచ్చుచున్నాఁడు. కావున నీలనీరద శుభాంగుడను విశేషణము వాడుట సాభిప్రాయమై యున్నది. మేరువును వర్ణించు వచనములో తిమ్మనశ్లేషవిరోధాభాసాలంకారములను వాడియున్నాఁడు. ఈ విధముగా నాతఁడు శబ్దార్థాలంకారముల నధికముగా వాడినను అతనిశైలి యెచ్చటను మార్దవహీనమై యున్నట్లు కనిపింపదు.

తిమ్మన మేరువు, వైజయంతము, యుద్ధము, వెన్నెల మున్నగు వానివర్ణించుటకు దీర్ఘ వచనములను వ్రాసియున్నాఁడు. ఇవి యొక్కచో దీర్ఘ సమాసములతోడను ఒక్కచో శబ్దాలంకార బాహుళ్యముతోడను గూడి మిక్కిలి ప్రౌఢములుగా నున్నవి. కావ్యాంతమున నారదుఁడు కృష్ణుని స్తుతించు సందర్భమున నతఁడు అనులోమపాదభ్రమకములను, ద్వ్యక్షరులను, గర్భకవితను, గోమూత్రికానాగచ్ఛురికాచక్రబంధములను వాడియున్నాఁడు. అందొకదానిలో నతఁడు తనపేరును రాయల వారి పేరును గూడ నిమిడ్చినాఁడు. చిత్రగతుల నారదుఁడు కృష్ణుని గొనియాడెనని కవియే చెప్పినాఁడు. చతుర్థాశ్వాసమున పుష్పాపచయ సందర్భమున వృషభగతిరగడయు నదితి కృష్ణుని స్తుతించు సందర్భమున దండకమును గలవు. ఇంతకంటె నతని రచనలో ఛందో విశేషములు లేమియు లేవు.

తిమ్మన యొకప్పుడు సుందరములైన బంగారుకుండలములు ధరించి యరుగుచుండఁగా నొకభట్టుకవి యాతనిగాంచి

**మాకొలఁది జానపదులఁకుఁ**
**నీకవితాశోభయబ్బునే, కూపనట**
**ద్భేకములకు గగనధునీ**
**శీకరముల చెమ్మ! నంది సింగయతిమ్మా**

అనుపద్యమును జెప్పెనఁట! తిమ్మన సంతసించి తన చెవులనున్న కుండలములలో నొకటితీసి యాతనికి బహూకరించెను. తరువాత వారిరువురు నొంటికుండలములతో రాయలవారి కొలువున కరిగిరి. రాయ లదేమియని యడుగఁగా జరిగిన వృత్తాంతమాతనికిఁ దెలిపిరి. రాయలంత 'గగనధునీ' అనుచోట 'నాకధునీ' అనియుండిన బాగుగా నుండునని సూచించెనఁట! అప్పుడు వారిరువురును నాకశబ్దప్రవేశమువలన పద్యమునకుఁ గలిగిన యపూర్వ సౌందర్యమునకలరి తమ చెవులకున్న కుండలములుతీసి రాయలవారికి బహుమానముగా నొసంగిరఁట. ఈ కథకల్పితమే కావచ్చు. కాని తిమ్మనకు కమ్మగా ముద్దుగా పద్యము వ్రాయునేర్పెకాక యట్లు వ్రాసిన వారిని మెచ్చుకొని బహూకరించు కౌశలముకూడఁ గలదని స్పష్టము చేయుచున్నది.



# సాహితీ సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు

# ఆముక్త మాల్యద

స్వయముగా మహాకవియై విద్వత్కవిపుంగవులను తనయాస్థానమున కాహ్వానించి, వారిచే రసవన్మనోహరములైన ప్రబంధములను రచింపఁజేసి యాంధ్ర సరస్వతి కపూర్వాలంకారము లలవరించిన రాజకవిచంద్రుఁడు శ్రీకృష్ణ దేవరాయలు. అతడు పరిపాలించిన కాలము తత్పరిపాలిత రాజ్యమునకేకాక ఆంధ్రసారస్వతమునకు స్వర్ణయుగమై పరిఢవిల్లినది. ఆంధ్రభోజుడను బిరుద మతనికన్వర్థమైనట్టిది. సమరాంగణమున వలె సారస్వతరంగమున కూడా సార్వభౌముడై శోభిల్లిన పరాక్రమ ప్రతిభా పాథోనిధి యా మహనీయుఁడు. అతడాంధ్ర సంస్కృత భాషలు రెండింట ప్రౌఢమైన కవిత్వము చెప్పియుండెను. అతని సంస్కృత కృతులెక్కువ ప్రచారము పొందియుండలేదు. జాంబవతీ పరిణయమను రూపకమొక్కటే యిటీవల ప్రచురింపబడినది. అతఁడాంధ్రమున రచించిన ప్రబంధ మొక్కటే. అది అద్వితీయము; ఆముక్తమాల్యదానామధేయము.

శ్రీకృష్ణదేవరాయల తండ్రి నరసనాయకుడు సాళువ నరసింగరాయల సేనాధిపతియై, అతని యనంతరము కొంతకాలమతని కుమారుని నామమాత్రమునకు రాజుగా చేసి, తరువాత తానే రాజ్యమునాక్రమించెను. నందిమల్లయ ఘంటసింగన కవులీతనికి వరాహపురాణము నంకితము చేసియుండిరి. ఇతడు క్షత్రియుఁడగునో కాదో స్పష్టముగా తెలియదుకాని అల్లసాని పెద్దన యయాతి కుమారుఁడైన తుర్వసుని వంశము తుళువాన్వవాయ మయ్యెననియు, నా వంశమున నెందఱో జన్మించి నిఖిలభువనప్రపూర్ణనిర్నిద్రకీర్తి నధికులైరనియు వారిలో నరసనాయకుఁడొకడనియు చెప్పియుండెను. నరసనాయకునకు తిప్పాంబ, నాగలాంబ, ఓబమాంబ అను ముప్పురు భార్యలుండిరి. వారిలో నాగాంబకు శ్రీకృష్ణదేవరాయ లుదయించెను. ఇతని జననకాలమును గూర్చి చరిత్రకారులలో భిన్నాభిప్రాయములున్నవి. ఇతడు 1465లో జన్మించెనని కొందఱును, 1487లో జన్మించెనని కొందఱును చెప్పుచున్నారు. నరసనాయకుని తరువాత ఓబమాంబ కుమారుడైన వీరనరసింహరాయలు 1509 వఱకును రాజ్యపాలనము కావించెను. తదనంతరము శ్రీకృష్ణదేవరాయలు సింహాసనమధిష్ఠించి 1529 వఱకు పరిపాలించెను. ఇతడు 1525వ సంవత్సరముననే కీర్తి శేషుడయ్యెనని చెప్పు చాటు పద్యమొకటి కలదు. కాని అది విశ్వసనీయము కాదు. రాయలవారు 1487లో జన్మించి 1529 ప్రాంతమున నిర్యాణమొందిరని పలువురు విమర్శకుల అభిప్రాయము.

రాయలకు చిన్నాదేవి, తిరుమలదేవి అను నిరువురు భార్యలుండినట్లు సర్వవిదితము. వీరుగాక గజపతి తనపుత్రిక నాతనికిచ్చి వివాహము కావించినట్లు చారిత్రక నిదర్శనము లున్నవి. ఈమె పేరు తుక్కాదేవియని కొందఱును లక్ష్మీదేవి (లుఖ) యని కొందరును, జగన్మోహినియని కొందఱును చెప్పుచున్నారు. అన్నపూర్ణాదేవి యను నాల్గవభార్యకూడా నుండెనని చాగంటి శేషయ్యగారి అభిప్రాయము. వీరిలో చిన్నాదేవి తప్ప మిగిలిన ముష్వురును రాయల జీవితాంతము వఱకు జీవించియుండిరి. రాయలకు తిరమలరాయలను నొక కుమారుడు, తిరుమలాంబిక, కృష్ణాంబ అను నిరువురు కూతురులును కలరనుటకు నిదర్శనము లున్నవి. తిరుమలరాయలు తిరుమలదేవి కుమారుడు. ఇతడు రాయల జీవిత కాలముననే మరణించెను. మహామంత్రి తిమ్మరు సీతని చంపించెనను ప్రతీతియున్నది. కాని అది విశ్వస నీయము కాదు. తిరుమలాంబికను అళియరామరాయలును, కృష్ణాంబను మట్ల వరదరాజును వివాహమాడిరి.

రాయలు సింహాసన మధిష్టించు కాలమున విజయనగర రాజ్యమునకు పలువురు శత్రువులుండిరి. అతడు తిమ్మరుసు మంత్రి సాహాయ్యమున వారి నందఱి నోడించి రాజ్యము సువిస్తృతమును నిష్కంటకమును కావించెను. అతడు 1509-10 సంవత్సరములలో రాయచూరు, ముద్గల్లు దుర్గములను స్వాధీనము కావించుకొనెను. మఱుసటి సంవత్సరమున గంగరాజు నోడించి ఉమ్మత్తూరు, శివసముద్రము, శ్రీరంగపట్టణము అనుచోట్లగల దుర్గములను పట్టుకొని దక్షిణదేశమునంతను వశము కావించుకొనెను. 1512-18 సంవత్సరములలో అదిల్‌ఖానును వధించి మూడు మహమ్మదీయ రాజ్యములను జయించి మూరురాయరగండ బిరుదాంకితుడయ్యెను. తరువాత కలబరిగి దండయాత్ర కావించి, బహమనీ సులతానును కారాగృహ విముక్తుని చేసి సింహాసనమెక్కించి యవనరాజ్యస్థాపనాచార్య డయ్యెను.

**అలుకన్ ఘోటక ధట్టికాఖురపుటీ హల్య న్ఖురాసాని పు**
**చ్చలువో దున్ని చలచ్చమూగజమదాసారప్లుతిన్గీర్తి పు**
**ష్కల సస్యంబిడి యేకధాటి భళిరా కట్టించితౌ దృష్టి కే**
**దులఖానోగ్రకపాల మర్దనహరిద్భూజాంగల శ్రేణికిన్** 1-42

అను ఆముక్తమాల్యద కృత్యాదిలోని పద్యమువలన రాయలేదుల్‌ఖానును వధించినట్లు తెలియుచున్నది. ఈ యేదుల్‌ఖాను బిజాపురమును పాలించిన యూసఫ్ ఆదిల్‌ఖాను. అందుచేతనే అతనికి 'పరిభూత సురత్రాణ' అను బిరుదము కల్గినది.

దక్షిణోత్తర దిగ్విజయము పూర్తియైన పిమ్మట రాయలు పూర్వదిగ్విజయ యాత్రకారంభించెను. తూర్పున నతనికి ప్రబల విరోధిగ నుండినవాడు ప్రతాపరుద్ర గజపతి. తెలంగాణమున మహమ్మదీయుల వశమందుండిన ప్రదేశము తప్ప నెల్లూరు నుండి గంజాము

మండలము వఱకును గల భాగమంతయు నతని అధీనమున నుండెను. ఈ గజపతి రాజ్యముపై రాయలు నాల్గుసారులు దండెత్తెను. ఈ దండయాత్రలు 1514 నుండి 1517 సంవత్సరాంతము వఱకును జరిగినవి. తుదకు గజపతి తన కూతురును రాయలకిచ్చి సంధి చేసికొనుటతో పూర్వ దిగ్విజయ యాత్ర ముగిసెను. రాయలు తానుజయించిన ప్రదేశములో చాలభాగము మరల గజపతికిచ్చివైచెను. ఈ దండయాత్ర జరుగుచుండిన సమయముననే రాయలు తీర్థయాత్రలు కూడా చేయుచుండెను. అతడు 1514లో ఉదయగిరి దుర్గమును, 1515లో కొండవీడు దుర్గమును, ఆ సంవత్సరమందే కొండపల్లి దుర్గమును జయించెను. తరువాత కళింగదేశ దండయాత్ర సాగించెను. 1515 అక్టోబరు 1516 మార్చి నెలల నడుమ రాయలు శ్రీకాకుళమునకేగి ఆంధ్ర విష్ణువును దర్శించుటయు, నా దేవుడతనికి స్వప్నమున దర్శనమిచ్చి ఆముక్తమాల్యద రచింపుమని ఆదేశించుటయు జరిగియుండును. తరువాత మూడు నాలుగు సంవత్సరములలో రాయలు కావ్యరచన పూర్తిచేసి యుండును.

రాయల అధీనమున నుండిన రాయచూరు దుర్గమును ఇస్మాయిల్ ఆదిల్‌షా మరల తన వశము చేసికొనుటకు యత్నించుచుండుటచే రాయలు కూడ తగిన ప్రయత్నము చేసి 1520లో అతని నోడించెను. ఇదే మూడవ రాయచూరు యుద్ధము. తరువాత నా సంవత్సరమే ఉత్తరార్థమున బెడందకోట యనబడు బీదరు నాతడు జయించెను. 1529లో అనగా రాయలు మరణించుట కించుక పూర్వము రాయలు ఇస్మాయిల్ ఆదిల్‌షాతో నాల్గవ రాయచూరు యుద్ధ మొనరించెననియు నందాదిల్‌షా ఓడి పాఱిపోయెననియు కీ.శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు వ్రాసియున్నారు. ఈ విధముగా రాయలు సింహాసనమధిష్ఠించిన దాది తుదివఱకు ప్రబల శత్రువులతో పోరాడుచునే, తీర్థయాత్రలు కావించుచు, కవి పండితులతో గోష్ఠి సాగించుచు, తీఱిక కల్గినప్పుడు కావ్యరచన చేయుచుండెను.

రాయల ఆస్థానమున నష్టదిగ్గజకవులుండిరను నంశము జగద్విదితము. కాని ఆ అష్టదిగ్గజము లెవరనువిషయమున భిన్నాభిప్రాయములున్నవి. పెద్దన, నందితిమ్మన, ధూర్జటి, మాదయగారిమల్లన అను నలువురి విషయమున సందేహము లేదు. తెనాలిరామకృష్ణుఁడు కూడ నష్టదిగ్గజములలో నుండెననియు, నతడు రాయలవారి రాజ్యాంత కాలమున నాతని కొలువు చేరియుండుననియు, అయ్యలరాజు రామభద్రుడు, భట్టుమూర్తి, పింగళి సూరన్న అనువారి విషయము సందేహాస్పదమనియు, నాముప్వురి స్థానములందు సంస్కృత కర్ణాటక కవులెవ్వరో యుండియుందురనియు కీ.శే. చాగంటి శేషయ్యగారి అభిప్రాయము. కందుకూరి రుద్రకవి కూడ నష్టదిగ్గజములలో నుండెననియు, నాతడీశాన్యదిక్కునందలి సింహాసనము నధిష్ఠించుచుండెననియు డా. నేలటూరి వేంకటరమణయ్య గారు తెల్పియుండిరి. మనుచరిత్రమును, పారిజాతాపహరణమును రాయలవారి కంకితము చేయబడిన కావ్యములు. ఈ యంకిత మహోత్సవము లెప్పుడు జరిగెనో నిశ్చయముగా చెప్పఁజాలము. 1516, 1517

సంవత్సరములలో నివి జరిగియుండును. కీ.శే.లక్ష్మణరావు పంతులుగారు 1526 ఏప్రిల్ నెల తరువాత మనుచరిత్ర కృతిసమర్పణము జరిగియుండునని భావించియున్నారు. అది సత్యమైనచో పారిజాతాపహరణ కృతి సమర్పణమే ముందుజరిగెనని భావింపవలసి వచ్చును.

ఆముక్తమాల్యద కర్తృత్వము విషయమున విమర్శకులలో రెండభిప్రాయములున్నవి. అల్లసాని పెద్దనయో, మఱొక వైష్ణవ కవియో దానిని రచించి రాయలపేర వెలయించెనని ఒక అభిప్రాయము. కాని పలువురు విమర్శకులది రాయలకర్తృకమేయని భావించుచున్నారు. ఆముక్తమాల్యద పీఠికయందు పెద్దన మనుచరిత్రమున రచించిన వంశవర్ణన పద్యములే యున్నమాట సత్యమే. అంతమాత్రముచే గ్రంథమంతయు పెద్దనయే రచించెనని తలంపరాదు. అవికత్థనుడు ధీరోదాత్తుడునైన రాయలు తన వంశమును తానే ప్రశంసించుకొనుట యుక్తముగా నుండదని తనకు పూజ్యుడు ఆస్థానపండితుడునైన పెద్దన రచించిన పద్యములనే తన కావ్యమందు చేర్చి యుండును. రాయలు పెద్దనను భట్టుమూర్తిని రెండు కావ్యములు రచించి తెమ్మని యాజ్ఞాపింప వారట్లే మను, వసు చరిత్రలను వ్రాసి తెచ్చిరనియు, రాయలు వానిని చదివి మనుచరిత్ర కొంత లేతపాకముగా నున్నదని తెలిపెననియు, నప్పుడు పెద్దన పంతమునకు కఠినశైలిలో నాముక్తమాల్యద రచించెననియు మొదటి పక్షమువారు తెల్పుదురు. మను, వసు చరిత్రలు రచింపఁబడిన కాలములు భిన్నములని స్పష్టముగా తెలియుచుండుటచే నీవాదము నిల్చునట్టిది కాదు. మఱియు భట్టుమూర్తి అష్టదిగ్గజములలో నుండెనా లేదాయను విషయము సంశయాస్పదము. “కృష్ణరాయల పేరు నిడినీవు రచించితివి తొల్లి విష్ణుచిత్తీ యమనగ, కాఠిన్యమర్థంబు గ్రాహ్యంబుకాదు సాధారణులకని భూధవుఁడు పలుకఁ దరువాత మనుచరిత్రము నొనరించితుత్తమ కావ్యము మహాద్భుతముగ” నను చాటువును బట్టి మొదటి పక్షము వారాముక్తమాల్యదను పెద్దనయే వ్రాసెనని చెప్పుదురు. ఈ చాటువునుబట్టి మొదట నాముక్తమాల్యదయు తరువాత మనుచరిత్రమును రచింపఁబడినట్లు తెలియుచున్నది. కాని మనుచరిత్ర తరువాతనే ఆముక్తమాల్యద రచింపబడెననుట కందుదాహృతములైన చారిత్ర కాంశములే నిదర్శనములు. ఆముక్తమాల్యదలో పేర్కొనఁబడిన యుద్ధాదులు మనుచరిత్రలో పేర్కొనబడియుండలేదు. అందుచే పై చాటువు విశ్వసనీయము కాదు. అది యెవ్వరు వ్రాసిరోకూడ సరిగా తెలియదు. ఆముక్తమాల్యదను రాయలే వ్రాసెనని తలంపు పఠితలకు కలుగుటకై పెద్దన బుద్ధిపూర్వకముగా నందు కఠినశైలి నుపయోగించుటయేకాక కొన్ని వ్యాకరణ విరుద్ధములైన ప్రయోగములను కూడా కావించెనని మొదటి పక్షమువారు వాదింతురు. ఈ వాదములో బలములేదు. ఒకేకవి అత్యంతభిన్నములైన రెండుశైలులు వ్రాయగల్గుట అసంభవము. మఱియు పెద్దన రాయలవారి పేర వెలయించు గ్రంథములో బుద్ధిపూర్వకముగా వ్యాకరణవిరుద్ధ ప్రయోగములు కావించుట రాయలకాగ్రహకారణమగును కాని ఆదరహేతువు కాఁజాలదు. అందుచే ఆముక్తమాల్యద పెద్దనయో మఱెవ్వరో రచించిరను వాదము యుక్తియుక్తముకాదు.

మఱియు నాముక్తమాల్యద రాయలే రచించెననుటకు ఆంతరములు బాహ్యములునైన నిదర్శనములు పెక్కు కలవు. నంది తిమ్మన పారిజాతాపహరణములో రాయలవారిని గూర్చి

**శ్రీ వేంకట గిరివల్లభ సేవాపరతంత్రహృదయ! చిన్నమదేవీ**
**జీవితనాయక! కవితాప్రావీణ్యఫణీశ! కృష్ణరాయ మహేశా!**

అను పద్యము వ్రాసెను. ఇందలి కవితాప్రావీణ్యఫణీశ అను సమాసమునకు కవిత్వమునందలి నైపుణ్యమేమియులేని తన్నుగూర్చి అట్లొక కవి ప్రశంసించినచో రాయలవంటి ధీరోదాత్తుడు సంతోషించి యూరకుండడు. దానిని తప్పక తీసివేయించి యుండును. సంస్కృతమున నతనికిఁగల కవితానైపుణ్యమును గూర్చి తిమ్మనయట్లు చెప్పెనేమోయని కొందఱనుమానింపవచ్చును. తెలుగు కావ్యములో తిమ్మన సంస్కృత కవితాప్రావీణ్యమును గూర్చి చెప్పియుండడు. మఱియు సంస్కృతములో కవిత్వము చెప్పగలవాని కాంధ్రభాషా కవిత్వమశక్యము కాదని ఆముక్తమునందే కలదు. అందుచే రాయలు తెలుగునకూడ కవితాప్రావీణ్య ఫణీశుడే. ఆముక్తమాల్యద తప్ప అతని తెలుగు రచన మఱొకటి కానరాదు. అదియునుగాక యత డాముక్తమాల్యదయందలి ప్రత్యాశ్వాసాంతము నందును నైషధకర్తవలె నాకావ్యమును తానురచించి నట్లొక్కొక్క పద్యమును వ్రాసియున్నాడు. వాని ననుమానించుటకు కారణములేదు. రాయలవంటి సార్వభౌమునికి మహాకావ్యము వ్రాయు తీఱిక యుండునాయని కొందఱనుమానింతురు. హర్ష భోజ శూద్రకాదులు కావ్యములు రచించినట్లు నిస్సందేహముగా తెలియుచుండ రాయలుకూడ నట్లేరచించెనని తలంచుట కనుమానమెందులకు?

ఆముక్తమాల్యదను బ్రాహ్మణేతరుడును వీరుడునైన క్షత్రియుడు రచించెననుట కందేకొన్ని నిదర్శనములు కానవచ్చు చున్నవి. అందలి ద్వితీయాశ్వాసమున

**తారుణ్యాతిగ చూతనూత్నఫలయుక్తై లాభిఘారస్వన**
**ద్ధారాధూపిత శుష్యదంబుహృత మాత్స్యచ్ఛేద పాకోద్గతో**
**ద్గారంపుంగనరార్చు భోగులకు సంధ్యావేళలం గేళి కాం**
**తారాభ్యంతర వాలుకాస్థిత హిమాంతర్నా రికేళాంబువుల్** 2-68

అను పద్యమున్నది. దీనినిబట్టి కావ్యము వ్రాసినవాడు మత్స్యభుక్కును మాత్స్య పాకమును రాజభోగ్యముగా పచనము చేయుటెఱింగిన వాడును అయియుండునని స్పష్టమగుచున్నది. మఱియు శ్రీ విల్లిపుత్తూరు వర్ణనమందలి "కరుల తొండము సిక్కఁగబళించి మ్రింగిన హరులనాఁ దొండమొప్పగు తదశ్మహరుల తాచినతాప" లను భావము రాయలవంటి మృగయాసక్తునికిఁదప్ప వేటమొగమెఱుగని బ్రాహ్మణునికి స్ఫురించుట కష్టము. అట్లే షష్ఠాశ్వాసమున బ్రహ్మరాక్షసుని వర్ణించు సందర్భమందలి "వ్యత్యస్తహస్తిమస్తాభఁ బాయగు గడ్డమును దంష్ట్రికలుఁ బొల్చు మొగమువాని" అను పాదమునందలి భావము రాయల

వంటివాడు వ్రాయఁదగినదే కాని బ్రాహ్మణుడు వ్రాయఁదగినదికాదు. యామునాచార్యుడు తన కుమారుని కెఱింగించిన విస్తృతమైన రాజనీతి కేవల గ్రంథపఠన సిద్ధముకాక స్వానుభవ సిద్ధముగా కనిపించుచున్నది. రాయలకు తప్ప పెద్దనకట్టి స్వానుభవముండెనని చెప్పుట యుక్తియుక్తముకాదు. పాండ్యరాజు తన సోదరిని యామునాచార్యునికిచ్చి వివాహము చేసెనను విషయమమూలకమైనది. బ్రాహ్మణుని కపకర్షహేతువైన యిట్టి కల్పనను పెద్దనచేసి యుండడు.

ఆముక్తమాల్యద విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదకము. రాయలా మతమునందత్యంతా భినివేశముకలవాడు. పెద్దనయు శఠకోపయతివలన విశిష్టాద్వైత సిద్ధాంతముల నెఱింగి యున్నను ఆ సిద్ధాంతములను ప్రతిపాదించుటకే కావ్యము వ్రాసియుండడు. ఆముక్తమాల్యదలో నచ్చుటచ్చుట కన్నడపదములు కనిపించును. రాయలది తుళువాన్వవాయము. తుళుభాష కన్నడమునకు సన్నిహితమైనది. అందుచే నతడెడనెడ కన్నడ పదములను వాడియుండును. మనుచరిత్రయందలి శైలికి ఆముక్తమాల్యదయందలి శైలికిని హస్తిమశకాంతరమున్నది. ఆ గ్రంథములను చదివినచో వానిరచయితలు భిన్నులను విషయము స్పష్టముగా తెలియ వచ్చును. పెద్దన యెంత ప్రయత్నించినను తనకు సహజముకాని యట్టి శైలిలో కావ్యము వ్రాసి యుండడు. అతని రచనయందలి ప్రసాదమాధుర్యగుణము లిందరుదుగా కనిపించును. అందుచే పలువురు విద్వాంసులు భావించున ట్లాముక్తమాల్యదను రాయలే రచించెననుట నిర్వివాదము. అతడు రచించిన తరువాత పెద్దన దానిని పరిష్కరించి యుండవచ్చును. ఋతువర్ణనాదులయందెడనెడ పెద్దనాదుల పద్యములను కూడ సందర్భానుగుణముగా రాయలిందు చేర్చిన చేర్చియుండవచ్చును. అంతేకాని కావ్యకర్తృత్వమునే శంకించుట పాడిగాదు.

రాయలవారు తామాముక్తమాల్యదను రచించిన పరిస్థితులను కావ్యారంభమున తెల్పియున్నారు. వారు కళింగదేశ విజిగీషామనీష దండెత్తిపోయి విజయవాడలో కొన్ని దినములుండి శ్రీకాకుళమందలి ఆంధ్రవిష్ణువును సేవించుటకై అరిగిరి. అచ్చట హరివాసరోపవాసము కావించి నిద్రించుచుండ నారాత్రి చతుర్థయామమున నాంధ్రవిష్ణు వాయనకు కలలో కనిపించి "నీవు మదాలసచరిత్ర, సత్యావధూ ప్రీణనము, సకలకథాసార సంగ్రహము, జ్ఞానచింతామణి, రసమంజరి మున్నగు కృతులు సంస్కృతభాషలో రచించి మెప్పుపొందితివి. ఆంధ్రభాష నీకసాధ్యము కాదు. అందుకూడ మాప్రీతికై యొక కృతిరచింపు"మని ఆనతిచ్చెను. కృతియందు గ్రహింపవలసిన వస్తువును కూడ ఆదేవుడే యీ క్రింది పద్యమున సూచించెను.

**ఎన్నిను గూర్తునన్న విను మే ముసు దాల్చిన మాల్య మిచ్చున**
**ప్పిన్నది రంగమందయిన పెండిలి సెప్పుము, తొల్తఁ గొంటినే**
**వ న్నన దండ నొక్క మగవాఁడిడ నేను తెనుంగు రాయఁడన్**
**గన్నడరాయ! యక్కొదువఁగప్పు ప్రియాపరిభుక్త భాక్కథన్** 1-14

'మును దాల్చిన మాల్యమిచ్చు నప్పిన్నది' ఆముక్తమాల్యద. ఆమె పేరు గోదాదేవి. ఆమెనే ఆండాళ్ళనికూడ పేర్కొందురు. ఆమెను శ్రీరంగేశ్వరుడు వివాహమాడిన వృత్తాంతము చెప్పుమని ఆంధ్ర విష్ణువు సూచించెను. అందుకాతడు చెప్పిన కారణము వింతగా నుండును. కృష్ణావతారమున దేవుడు పురుషుడైన సుదాముడిచ్చిన పూలమాల గ్రహించెను. అది యాతనికొక కళంకముగా నుండెను. ఒక కన్యకామణి మొదట తాను ధరించిన పూలమాలను తరువాత తన తండ్రిచే తన కర్పింపఁజేసిన వృత్తాంతము కావ్యముగా చెప్పినచో నా కళంకము మాసిపోవునఁట! ఈ సందర్భముననే ఆంధ్ర విష్ణువు–

**తెలుఁ గదేల యన్న దేశంబు తెలుగేను**
**తెలుఁగు వల్లభుండ తెలుఁగొకండ**
**యెల్ల నృపులు గొలువ నెఱుఁగవే బాసాడి**
**దేశభాషలందుఁ దెలుఁగులెస్స!** 1–15

అని కూడ చెప్పి యుండెను. రాయలవారు దేశ భాషలందు తెలుఁగు లెస్స అని చెప్పెనను ప్రతీతి కలుగుట కీపద్యమే హేతువు. అంకితము "నీ కిష్టదైవమైన వేంకటపతికిమ్ము నీకుత్తరోత్తరయగు" నని కూడ దేవుడే తెల్పియుండెను. రాయలుదయముననే లేచి వివిధ వేదాగమ విదులగు విద్వజ్జనులఁ బిలిపించి వారికాశుభ స్వప్న మెఱింగించెను. వారందఱి యెల్ల యంశములకును సత్ఫలితములు తెల్పి, అతని వంశ క్రమమును వర్ణించి

**"ప్రబల రాజాధిరాజ వీర ప్రతాప**
**రాజ పరమేశ్వరార్థ దుర్గానటేశ**
**సాహితీ సమరాంగణ సార్వభౌమ**
**కృష్ణరాయేంద్ర! కృతి వినిర్మింపు"** మనిరి. 1–44

రాయలు ప్రహృష్టాంతరంగుడై కావ్య రచన కారంభించెను.

వావిళ్ళవారు ప్రచురించిన ఆముక్తమాల్యదప్రతిలో నాఱాశ్వాసములే యున్నవి. బ్రహ్మరాక్షసుడు తనకు రాక్షసత్వమెట్లు కలిగెనో చెప్పిన యుదంతమును, గోదా శ్రీరంగేశ్వరుల వివాహవృత్తాంతమును ఇందాఱవ ఆశ్వాసమునందే యున్నవి. ఇది కీ.శే. వేదము వేంకటరాయ శాస్త్రులవారు సవ్యాఖ్యానముగా ప్రచురించిన ప్రతిలో నేడవ ఆశ్వాసముగా విభజింపఁబడినది. ఒక ఆశ్వాసము పెరుగుటచే అదనముగా చేరిన ఆశ్వాసాద్యంత పద్యములు నాలుగే వేదము వారి ప్రతిలో నధికము. వావిళ్ళవారి ప్రతిలో నివి గ్రంథాంతమున ప్రక్షిప్తములుగా ముద్రింపఁ బడినవి. రాయల తరువాత మఱెవ్వరైన నాఱాశ్వాసముల కావ్యము నేడా శ్వాసములుగా విభజించుట కావశ్యకము లేక పోవుట చేతను, ప్రక్షిప్తములోని చెప్పబడిన ఆ పద్యము లితరాశ్వాసాద్యంత పద్యములనే పోలియుండుట చేతను కీ.శే. చాగంటి శేషయ్యగారు రాయలు కావ్యము నేడా శ్వాసములుగనే రచించి యుందురని భావించుచున్నారు.

ఆముక్తమాల్యద యందలి కథ యిట సంగ్రహముగా చెప్పంబడుచున్నది. పాండ్య దేశమునకు తిలకాయమానమై శ్రీవిల్లిపుత్తూరను పట్టణము కలదు. అచ్చట విష్ణుచిత్తుడను అన్వర్థాభిధానుడగు భక్త వరేణ్యుడుండెను. అతడెక్కువగా చదువుకొనక పోయినను చిరచిదీశ్వర భేదకమైన ద్వైతజ్ఞానమునకు నెలవై, భగవత్పరిచర్య చేయుటయే పరమార్థమని తలంచి, పట్టణముననున్న మన్నారుకృష్ణునికి మాలికాకరణ కైంకర్యము చేయుచు, అతిథుల కన్నదానమొనరించుచు కాలము పుచ్చుచుండెను. అప్పుడు మధురానగరము రాజధానిగా పాండ్య దేశమును మత్స్యధ్వజుడను రాజేలుచుండెను. ఒక వేసవి కాలమున మధురకు సమీపమందలి వృషగిరి సుందరబాహుస్వామికి తెప్పతిరునాళ్ళు జరుగుచుండగా చూచి, పరదేశి విప్రుడొకడు మధురానగర వైభవము తిలకింప నరుదెంచి, రాజపురోహితునింట భోజనము చేసి, తోడి బ్రాహ్మణులతో నొక యరుగుమీద పరుండెను. ఉబుసుపోకకై వారిలో కొంద ఱార్యలను, కొందఱు గీతలను చదువుచుండ నతడు సుభాషితములను పఠించుచుండెను. అప్పుడాదారిని వేశ్యయింటికిఁ బోవుచున్న రాజతడు పఠించిన

**వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్**
**నిశార్థ మర్థందివసే యతేత**
**వార్ధక్య హేతోర్వయసా నవేన**
**పరస్య హేతోరిహ జన్మ నాచ**

అను సుభాషితమును విని, తటిచ్చంచలమగు రాజ్యానందము మరగి యింద్రియా రాముడై కాలము పుచ్చుటకు చింతించి, పరలోకానందము పొందయత్న మొనరింప సంకల్పించి, ఆ బ్రాహ్మణునకు బహుమానమిప్పించి వేశ్యాగృహమున కరుగక నగరికి తిరిగి వెళ్ళిపోయెను. తరువాత నతడు కొలువు తీర్చి యందలి పండితులతో మోక్షప్రదుడైన దేవుడెవ్వడో నిరూపించి వాదమున గెల్చినవారి కిచ్చెదనని తెల్పి మాడలతో నిండిన జాలెను సభలో కట్టించెను. అచ్చటి పండితులలో నొకడు హరియన మఱొకడు హరుడన నితరులన్యులన నా విషయమున వాదము జరిగెను.

అప్పుడు శ్రీ విల్లిపుత్తూరిలో విష్ణుచిత్తుడు విష్ణువువక్షమున తులసీమాల్యము నలంకరించుచుండ విష్ణువు మధురానగరమున కరిగి రాజసభలో తనమహిమ ప్రకటించి శుల్కము గ్రహింపుమని పలికెను. విష్ణుచిత్తుడు తానందు కశక్తుడనని విన్నవింప విష్ణువు "నీ వరుగుము. రాజసభలో నిన్ను గెల్పింతును. పైన నేనున్నాను కదా" అని ధైర్యము గొలిపి పంపెను. విష్ణుచిత్తుడు రాజసభ కరిగి అన్యపండితులతో వాదించి వేదవాక్యములను బ్రహ్మ సూత్రములను ప్రమాణముగా చూపి "అపహతపాప్మా దివ్యోదేవ ఏకోనారాయణః" అని విష్ణు పారమ్యమును నిరూపించెను. తరువాత సమస్తమునకు నారాయణుడే పరాయణమని

ప్రతిపాదించి, అతనిఁగనుటకు తగిన యోగము చెప్పెదనని పలికి, ఖాండిక్యకేశిధ్వజో పాఖ్యానము నెఱింగించెను. ఇట్లు విష్ణుచిత్తుడు పరతత్త్వనిరూపణము చేయ శుల్కముగా వ్రేలఁగట్టిన జాలె తెగి క్రిందపడెను. దేవదుందుభులు మొరసెను. పుష్పవర్షము కురిసెను. రాజు విష్ణుచిత్తునూరేగించి, అతనిని విల్లిపుత్తూరు పంపుడని దొరలను రాకుమారులను ఆదేశించెను. దారిలో విష్ణుచిత్తునకు విష్ణువు సాక్షాత్కరింప నతడు భక్తితో దశావతారవర్ణన పూర్వకముగా నాతని స్తుతించెను. విష్ణుచిత్తుడు రాజు తనకిచ్చిన ధనమంతయు భాగవతులకిచ్చి వేయునని యెఱింగి విష్ణువు విశ్వకర్మ నాతని నిలయమును మణిమయమును సార్థమును కావింపుమని యాదేశించెను. విశ్వకర్మ యట్లే చేసెను. విష్ణుచిత్తుడు పురజను లెదుర్కొని స్వాగతమొసంగ పురము ప్రవేశించి తొల్లిటికంటె నెక్కువగా భాగవతపరాయణుడై యుండెను.

ఒకనాటి మధ్యాహ్నము విష్ణుచిత్తుడు దేవునికి మాలికనర్పించి మందిరమున కరుగుచుండ నతనిని కరుణార్ద్రమగు దృష్టితో వీక్షించి గరుడ వాహనుడైన నారాయణుడు లక్ష్మితో "యామునాచార్యుడును ఈతడునే కదా మదనుగ్రహమున నా మతము నుద్ధరించి" రని పలికెను. అంత లక్ష్మి యామునాచార్యుని వృత్తాంతము తెలుపుమని యడిగెను. విష్ణువు యామునాచార్యుడు పరమశివభక్తుడైన పూర్వ పాండ్యరాజు కొలువునకు పరమవిష్ణుభక్తి పరాయణయైన రాణి సాహాయ్యమున నరిగి విష్ణుచిత్తునివలెనే యచ్చటి పండితుల నందఱి నోడించి విష్ణుపారమ్యము నిరూపించుటయు, నెదురుగా నుండిన పిప్పలవృక్షము నుండి యదియే సత్యమను పల్కు వినబడుటయు, రాజు వైష్ణవుడై తన కడగొట్టు చెల్లెలి నాతనికిచ్చి వివాహ మొరించుటయే కాక అర్ధరాజ్య మొసంగి, అతనిని యువరాజుగా చేసి విరోధులను సాధింప దండయాత్రకు పంపుటయు, యామునుడు శరత్కాలము వచ్చువఱకు నాగి (ఇచ్చట వర్షాశరత్కాలముల విస్తృతవర్ణనము కలదు) దిగ్విజయము కావించి భోగాసక్తుడై యుండుటయు, అతని పితామహుడైన నాథముని శిష్యుడైన శ్రీపుండరీకాక్షు ననుగు శిష్యుడగు శ్రీరామ మిశ్రుడు తన పరమగురు పౌత్రుడు యోగసామ్రాజ్యము మఱచి సామ్రాజ్యమున నాసక్తుడగు టెఱింగి చింతించి, ఆహారదోషమే విజ్ఞాన నాశమునకు మూలమను నూహ చేసి ప్రతిదినము వంట బ్రాహ్మణునిచే నొక వైష్ణవుడు కానుకగా నిచ్చెనని తెల్పుచు నలర్కశాకమును పంపించుటయు, రాజొకనాడా వైష్ణవుని చూపుమని యడుగుటయు, శ్రీరామమిశ్రు డరిగి "మీ పెద్దలు కూర్చిన నిక్షేపము కావేరీ ద్వీపాంతరమున నున్నది. దానిని చూపుటకై వచ్చితి"నని పల్కుటయు, రాజతనితో శ్రీరంగమున కరుగనతడు "మీ పెద్దలు కూర్చిన నిక్షేపమిది" యని శ్రీరంగేశ్వరుని పాదపద్మయుగముచూప నతడు మోహముక్తుడై తన ప్రమాదము నెఱిగి, శ్రీరామమిశ్రుని వృత్తాంతము తెలిసికొని యతనివలన ద్వయమంత్రోపదేశము పొంది సన్యాసాశ్రమము స్వీకరింపవలెనను తలంపున కుమారునికి రాజనీతి యంతయుఁ దెలిపి యతని పట్టాభిషిక్తు నొనరించుటయు నెఱింగించెను.

ఒకనాడు తులసీవనమందు విష్ణుచిత్తునకు శుభలక్షణ లక్షితయైన యొక స్త్రీశిశువు కనిపించెను. అనపత్యుడైన తనకు ముకుందుడే ఆ శిశువును ప్రసాదించెనని సంతుష్టాంత రంగుడై ఆమెను తీసుకొనిపోయి తన భార్యకిచ్చెను. ఆమె యాశిశువును పెద్ద చేసెను. ఆమె యౌవనవతి యయ్యెను. ఆమె భూదేవి యగుటచే పూర్వజన్మమైత్రివలన నాగకన్యలు మరాళిక, ఏకావళి, హరిణి, మనోజ్ఞ, స్రగ్విణి, అను నామములతో నిరుగు పొరుగు భాగవతుల యిండ్లలో జన్మించిరి. వారు బొమ్మ పెండ్లిండ్ల యందు లక్ష్మీపరిణయ గేయములు పాడుచుండ నందు విష్ణుని యనంత కల్యాణగుణములు విని ప్రాగ్జన్మ సంస్కారముచే నతని గవయు తలంపుదయింప తదనుగుణముగా వర్తించుచుండెను. ఆమె తన తండ్రి సంపన్నుడయ్యును మాలికాకరణ కైంకర్యము విడువక చేయుచుండ నామె యతడు కూర్చు చెంగలువదండలను తన కొప్పున ధరించి నూతిలో నీడ చూచుకొని దానిని మరల పుష్పపుటికలో నుంచుచుండెను. ఆమె విష్ణు విరహము ననుభవించుచు చెలులు పాటలు పాడుచుండ వెచ్చనూర్చుచు "హరి యెప్పుడు తన్ను వలచిన స్త్రీలను త్రోపాడక కాపాడినా"డని అతని నుపాలంభించుచుండెను. ఆమె యొక్కొక్క మాఱు రాత్రులం దొంటరిగానున్న సమయమున రాధను గూర్చియు యమునను గూర్చియు నిందాగర్భితముగా పల్కుచుండెను. ఆ మాటలు రహస్యముగా చెలులు వినుచుండిరి. ఆమె విరహబాధ భరింపలేక తల్లడిల్లుచు ప్రతిదినమును ప్రత్యూషకాలమున లేచి గృహారామ దీర్ఘికయందు ద్రావిడామ్నాయములు పఠించుచు స్నానమాచరించి, తిరుమణిని శ్రీచూర్ణము బొట్టుగా పెట్టుకొని యాయూరనున్న దేవుని పూజించి ప్రసాద తీర్థములు కొని తిరిగి వచ్చుచుండెను. ఆమె వియోగచ్యుత ధైర్యయై ద్రవిడభాషలో యదుపతిగుణములు పాడుచుండెను. వసంతకాల మరుదెంచెను. ఆమె విరహమధికమయ్యెను. విష్ణుచిత్తుడది చూచి తాను మన్మథవేదన నెఱుగని వాడగుటచే నదియు నొకవిధమైన తపమే యనుకొని దినదినప్రవర్ధమాన తనయాతనుగ్లానికి తల్లడిల్లి గుడికి చని తన మనోనిర్వేదము దేవునికెఱింగించి కాపాడుమని ప్రార్థించెను. దేవుడు నవ్వి మాలదాసరి కథ నెఱింగించెను. అందు మాలదాసరి బ్రహ్మరాక్షసునికి భాగవతతత్త్వము నొసంగిన వృత్తాంతమును, హరినామసంకీర్తన మహిమయు కలవు. ఆ బ్రహ్మరాక్షసుడు పూర్వము సోమశర్మ యను బ్రాహ్మణుడు. అతడు తాను బ్రహ్మరాక్షసత్వము నొందిన తెఱంగు మాలదాసరికి తెల్పెను. ఈ విషయమంతయు విష్ణువు విష్ణుచిత్తునకు చెప్పి "నా పూజా విశేషములందెల్ల గానమే విశేష ఫలప్రదము. భూదేవియే నీకు కూతురైపుట్టి నామసంకీర్తన రూప తప మొనరించుచున్నది. ఆమెను శ్రీరంగమునకు శ్రీరంగేశ్వరు సేవకై తోడ్కొని పొ" మ్మని ఆనతిచ్చెను.

విష్ణుచిత్తుడును కూతును పల్లకిపై నిడుకొని భాగవతపరిషత్తు కొలువ ప్రయాణమై శ్రీరంగమున కరిగెను. అచ్చట నతడు కూతురితోఁగూడ గుడిలోని కరిగి శ్రీరంగేశ్వరు బహువిధముల స్తుతించెను. దేవుడును తనకు కుసుమాంజలు లర్పించు నాముక్త మాల్యద

యెలప్రాయము గాంచి యామెను తన శుద్ధాంతసీమకు ప్రవేశపెట్టి యొక మాయా కన్యక నామె యున్నచోట నుంచెను. విష్ణుచిత్తుడు కూతును పల్లకిలో బసకుఁగొనిపోయి తెఱచి చూడగా నామె యందుకనబడలేదు. అంత విష్ణుచిత్తుడు రంగభర్త తన కూతును లోనవైచుకొని అన్యాయము చేసెనని బాష్పకంఠుడై మొఱపెట్టెను. శ్రీరంగేశ్వరుడు భయపడి అతని ఛాందసమునకు నవ్వుచు "ఇదేమి, కూతునింటిలో పెట్టుకొని నన్ననవసరముగా దూఱుచున్నావు. ఇల్లింకొకమాఱు సరిగా వెదకు" మని పల్కెను. విష్ణుచిత్తుడింటి కరిగి తనకు మ్రొక్కనరుదెంచిన కూతుఁజూచి సంతసించి బసలో నుండెను.

అంత శ్రీరంగేశుడు సరస్వతీ చతుర్ముఖులను, పార్వతీపరమేశ్వరులను కన్యను తనకిమ్మని యడుగుటకు విష్ణుచిత్తునికడకు పంపెను. విష్ణుచిత్తుడు సంతసించి "తగిన సంబంధము దొరకినదికదాయని కన్యను మోచి తెచ్చి యిచ్చెనని లోకులను కొందురు. కావున రంగేశ్వరుడు మా పురమునకు వచ్చినచో కన్య నిచ్చెద"నని చెప్పెను. వారావిషయము వచ్చి విన్నవింప రంగభర్త గరుడవాహనుడై బ్రహ్మాదులు వెంటరా శ్రీవిల్లిపుత్తూరి కరిగెను. అట సరస్వతీ పార్వత్యాదులు పాటలు పాడ నాముక్తమాల్యదను పెండ్లికూతుగావించిరి. తరువాత గోదాశ్రీరంగేశ్వరులకు వివాహము మహావైభవముగా జరిగెను. రంగ భర్త ఆముక్తమాల్యద గళమున మంగళసూత్రము కట్టెను. పిమ్మట నాతడు బ్రహ్మరుద్రాదు లర్పించు నుడుగరలఁగైకొని వధువుతో కూడ నాత్మపట్టణమున కరిగెను.

ఈ ప్రబంధమునకు నాయికయగు ఆముక్తమాల్యదను (గోదాదేవి) బట్టి ఆముక్తమాల్య దయనియు, ఆమె తండ్రియు పన్నిద్దరాళ్వారులలో ముఖ్యుడగు (పెరియాళ్వారు) విష్ణుచిత్తుని బట్టి విష్ణుచిత్తీయమనియు రెండు నామములు కలవు. రాయలవారు గోదాదేవీ యామునా చార్యుల వృత్తాంతములను గురుపరంపరా ప్రభావమును ప్రాచీన వైష్ణవగురు చరిత్రము నుండియు, ఖాండిక్యకేశిధ్వజసంవాదమును విష్ణుపురాణమునుండియు, మాలదాసరి కథను (చండాల బ్రహ్మరక్షస్సంవాదమును) వరాహపురాణము నుండియు గ్రహించి తనకు తోచిన మార్పులు కావించి యీ ప్రబంధమును రచించెను. యామునాచార్యుడు పాండ్యరాజసోదరిని వివాహమాడుటయు, క్షత్రియ ధర్మము నవలంబించి దండయాత్ర కావించి శత్రువుల నోడించుటయు, కుమారునికి రాజనీతి నుపదేశించుటయు గురుపరంపరా ప్రభావములో కానరావు. వానిని రాయలు సందర్భోచితముగా కల్పించి యందు చొప్పించెను.

ఆముక్తమాల్యద యందలి ప్రధాన వస్తువు గోదా శ్రీరంగేశ్వరుల వివాహము, ఇది యైదాఱేడా శ్వాసముల యందు వర్ణింపబడినది. మొదటి నాల్గాశ్వాసములందలి కథకును దానికిని సన్నిహిత సంబంధము లేదు. ఏదైన స్వల్ప సంబంధమున్న నది గోదాదేవి తండ్రియైన విష్ణుచిత్తుని వృత్తాంతము కొంత యందుండుట. రాయల వైష్ణవ మతమునందపారమైన యభిమానము కలవాడు. ఆ మతము యొక్క మహత్త్వమును, విష్ణుపారమ్యమును

నిరూపించుటకే విష్ణుచిత్తుఁడును, యామునాచార్యుఁడును ఇతర మతస్థుల నోడించిన వృత్తాంతమును, ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానమును, శైవుఁడైన పాండ్యరాజు వైష్ణవుఁడుగా మాఱిన వృత్తాంతమును ఆతఁడందు చేర్చియుండెను. ఉత్తరభాగమునందలి మాలదాసరి కథయు విష్ణువుయొక్కయు, విష్ణుభక్తునియొక్కయు, విష్ణునామసంకీర్తనముయొక్కయు మహిమ నుద్ఘాటించునదే. సోమశర్మ వృత్తాంతమునకు ప్రధానేతివృత్తముతో సంబంధమే లేదు. ఈ విధముగా నతఁడిందు ప్రధానకథతో సంబంధములేని కొన్ని యుపాఖ్యానములను చేర్చుట చేతను, గ్రీష్మవర్ష శరద్వసంతర్తువులను, రాజనీతిని అతిదీర్ఘముగా వర్ణించుట చేతను, ప్రబంధమున వస్త్వైక్యమునకు భంగము కలిగినది. నిజమునకది యొక చిన్నవిష్ణుపురాణముగా కనిపించును, పురాణములు పెక్కు పాఖ్యానములతోడను, ధర్మనీతి తత్త్వప్రబోధము తోడను కూడి వస్త్వైక్యహీనములై అతివిస్తృతములుగా నుండును. ప్రబంధమట్లుకాక యొక నాయకుని ప్రణయ వృత్తాంతమును వర్ణించుచు వస్త్వైక్య శోభితమై యుండును. పురాణప్రబంధములకుఁ గల ప్రధానభేదములలో నిది యొకటి. రాయలు మితిమీరిన మతాభిమానము చేతను, వర్ణనప్రీతిచేతను తన ప్రబంధము నొక్క పురాణముగా పరిణమింపఁజేసెను. విష్ణుచిత్తుని కథలో ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానమునకు కొంత స్థానమున్నది. కాని యామునాచార్యుని వృత్తాంతము మాత్రము బలవదానీతముగా కనిపించును. దానికి విష్ణుచిత్తుని కథతో నెట్లో కొంత సంబంధము కల్పించుటకైనను రాయలు శ్రద్ధ వహింపలేదు. ఒకనాఁడు విష్ణుచిత్తుఁడు మధ్యాహ్నసమయ మాలికాసమారోపణా నంతరము మందిరమున కరుగుచుండ విష్ణువాతని కరుణాకటాక్షములతో వీక్షించి లక్ష్మితో

> **"యామునాచార్యుడొక్కడుఁ నీమహాత్ముఁ**
> **డొక్కఁడునుగాదె మన్మతం బుద్ధరించి**
> **రస్మదీయకృపాతిశయమున"** 4-39

నని తెల్పెను. అప్పుడు లక్ష్మి "ఇతని కథ యెఱిఁగినదే. యామునాచార్యుఁడే మొనర్చె"నని యడిగెను. విష్ణువప్పుడాతని కథ చెప్ప మొదలిడెను. అందులోనే గ్రీష్మ వర్ష శరదృతు వర్ణనములును రాజనీతి వర్ణనమును వచ్చినవి. శ్రీవిల్లిపుత్తూరు విష్ణుచిత్త వర్ణనములతోఁగూడిన ప్రథమాశ్వాసము నుంచి ద్వితీయ తృతీయ చతుర్థాశ్వాసములను తీసివైచినను ప్రధాన కథకెట్టి లోపమును కలుగదు. అట్లే సోమశర్మ వృత్తాంతము నొక్క వాక్యముతో ముగించి యుండవచ్చును. విష్ణువు లక్ష్మితో పాండ్యరాజును గూర్చి చెప్పుచు "వెఱ్ఱిశైవంబు ముదిరి మద్వినుతి వినఁడు, నతి యొనర్పఁడు మామక ప్రతిమలకును" అని తెల్పియుండెను. రాయల వారికి పాండ్యరాజు యొక్క ముదిరిన వెఱ్ఱిశైవమే కనిపించెను కాని ముదిరిన తన వైష్ణవము కనిపింపలేదు. ఏ మతమునందైనను అభిమానము ముదిరినచో నది యెట్టిదైనను అనుయాయుల నౌచిత్యదూరులైన వెఱ్ఱులనుగా చేయునుకాఁబోలును.

వస్త్వైక్య దృష్టివిడిచి ఆముక్తమాల్యదయందలి యుపాఖ్యానములను, వర్ణనములను ప్రత్యేకముగా పరిశీలించినచో నవి అద్భుతములుగా నుండును. కథాకథనమున రాయలు కడుంగడు నిపుణుఁడు. గోదాదేవి విష్ణుచిత్తునకు కనిపించుట, ఆమె యౌవన వర్ణనము, ఆమె విష్ణువు నుపాలంభించుట, ఆమె విరహము, దినకృత్యము, విష్ణుచిత్తుఁడామెస్థితి స్వామి కెఱింగించుట, స్వామి సంకీర్తనమహిమ తెల్పి దానికి దృష్టాంతముగా మాలదాసరికథ వివరించుట, సోమశర్మ వృత్తాంతము, స్వామి గోదాదేవిని శ్రీరంగమునకు గొనిపొమ్మని యుపదేశించుట శ్రీరంగేశ్వరుడు గోదాదేవిని గ్రహించి మాయ గోదాదేవిని పల్లకీలో నుంచుట, బసకేగినపిమ్మట గోదాదేవిని కానక విష్ణుచిత్తుడు మొఱపెట్టుట, శ్రీరంగేశుడు సరస్వతీబ్రహ్మలను శివపార్వతులను కన్యను తనకిమ్మని యడుగఁబంపుట, విష్ణుచిత్తుఁడు స్వామి తమ పురమున కరుదెంచినచో కూఁతునిచ్చెదననుట, వివాహము అనునవి ప్రధాన కథయందలి యంశములు. ఉపాఖ్యానములలో మొదటిది ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానము. విష్ణుచిత్తుఁడు పాండ్య రాజసభలో నన్యమతస్థుల నోడించి, విష్ణువే "మాతాపితాభ్రాతానివాసః శరణం సుహృద్గతిః" అని నిరూపించి అతని గనుటకుఁ దగిన యోగము తెల్పుచు పై ఉపాఖ్యానము నెఱింగించెను. ఖాండిక్యకేశిధ్వజులు నిమివంశ సంజాతులైన మితధ్వజకృతధ్వజులను అన్నదమ్ముల కుమారులు. వారిరువురును రాజ్యకాంక్షతో పండ్రెండు దినములు పోరాడిరి. ఖాండిక్యుఁడోడి పరివారముతో నడవికేగి నివసించుచుండెను. కేశిధ్వజుఁడు మృత్యువును గెల్చునుద్దేశముతో జ్ఞానాశ్రయుఁడై యొక యజ్ఞము చేయుచుండ యాగధేనువు మఖశాలా సమీపమున మేయుచున్న సమయమున పులి దానిని చంపెను. రాజు ఋత్విజులను ప్రాయశ్చిత్తమడిగెను. వారు కసేరువును, కసేరువు శునకుని, శునకుఁడు ఖాండిక్యుని అడుగుమనిరి. కేశిధ్వజుడడవి కరిగి ఖాండిక్యుని వలన ప్రాయశ్చిత్తము తెలిసి కొని యజ్ఞము పూర్తి చేసెను. తరువాత నతఁడు గురుదక్షిణ యీఁగోరి ఖాండిక్యుని సమీపించి యేమి కావలెనని అడిగెను. అతడు మంత్రిసేవకాదులతో నాలోచింపఁగా వారు రాజ్యము నడుగుమనిరి. ఖాండక్యుఁడది వినక సకల భవక్లేశసంక్షయకరమైన విద్య బోధింపుమని యడిగెను. కేశిధ్వజుఁడు ఖాండిక్యునకు బంధచ్ఛేదకమైన యోగము నెఱిఁగించి యతడు వలదనుచున్నను అతని రాజ్యము నతనికొసంగెను. ఖాండిక్యుఁడా రాజ్యమును కుమారునికిచ్చి వనమునందే నిల్చి కేశిధ్వజోపదిష్ట మార్గమున విష్ణునారాధించి తత్సాధర్మ్యము నొందెను. కేశిధ్వజుఁడు మిథిలా నగరమున కరిగి ధర్మ మార్గమున రాజ్యమేలు చుండెను. విష్ణుచిత్తుఁడీ యుపాఖ్యానమును పాండ్యరాజునకు తెల్పి, శరణాగత ధర్మమే నిరపాయమైన ధర్మమని యుపదేశించి, మూలమంత్రపూర్వకముగా ద్వయము ప్రసాదించి యతని భాగవత ప్రధాను నొనరించెను. ఇందలి కథాకథన విధానమద్భుతముగా నున్నది. కేశిధ్వజ ఖాండిక్యుల శీలములు పరమోదాత్తములుగా పోషింపఁ బడినవి. మంత్రిసామంతాదుల చిత్తవృత్తికిని ఖాండిక్యుని చిత్త వృత్తికిని హస్తిమశకాంతర

మున్నది. వారు లౌకికభోగాసక్తులు. అతఁడు ముముక్షువు. కేశిధ్వజుఁడు రాజధర్మానుగుణముగా రాజ్యము గెల్చుకొన్నను గురుభక్తుఁడు, విజ్ఞానసంపన్నుఁడు. రాయలతనిచే ఖాండిక్యుని కష్టాంగ యోగము తెల్పించి శరణాగత ధర్మమే పరమధర్మమని నిరూపించెను. ఉద్దేశ పూర్వకముగా యోగాదులను తెల్పుటచే నాయుపదేశము కొంత దీర్ఘమైనది. కథ మాత్రమత్యంత హృద్యముగా నున్నది.

యామునాచార్యచరిత్రకును, విష్ణుచిత్తునిచరిత్రకును కొంత పోలికయున్నది. విష్ణుచిత్తునివలెనే యామునాచార్యుఁడును పాండ్యరాజు కొలువులో నన్యమతస్థుల నోడించి విశిష్టాద్వైతమే యుత్తమమని నిరూపించెను. ఆ పాండ్యరాజు పరమశైవుఁడు. అతని పట్టమహిషి పరమవైష్ణవభక్తి సంపన్నురాలు. ఐనను మహాపతివ్రతయగుటచే వారి దాంపత్యము సుఖసంతోషమయముగనే సాగుచుండెను. విష్ణువారాజునకు వైష్ణవమతమునందాభిముఖ్యము కలిగింపనెంచి యామునాచార్యుఁడు చిఱుత ప్రాయముననే ఆచార్యకులమున వేదశాస్త్రాది విద్యలభ్యసించుచుండ నతని నితర మతస్థులను వాదమున నోడించుటకై యా రాజు కొలువున కంపెను. యామునాచార్యుఁడు రాణిసాహాయ్యమున రాజుకొలువునకేగి యన్యమతస్థులందఱిని వాదమున నోడించెను. అప్పుడెదుటనున్న రావిచెట్టు నుండి "రాజా! యీ బ్రహ్మచారి వాదము యథార్థము. నారాయణుఁడే పరబ్రహ్మము. అతని కొల్వు" మను పలుకు వినిపించెను. రాజు వైష్ణవమతము నవలంబించి తనకడగొట్టుచెలియలి నాతనికిచ్చి వివాహము కావించి యర్ధరాజ్యమొసంగెను. తరువాత నారాజు ప్రేరణచే యామునుడు శరదృతువురాగానే దండయాత్ర కరిగి దిగ్విజయముచేసి భోగలాలసుఁడై యాదమఱచియుండెను. అది చూచి తత్పితామహుఁడైన నాథమునిశిష్యుండగు శ్రీపుండరీకాక్షు ననుఁగుశిష్యుఁడైన శ్రీరామమిశ్రుడు తన పరమగురు పౌత్రుఁడట్లు యోగసామ్రాజ్యము మఱచి సామ్రాజ్యమున నాసక్తుఁడగుటకు వగచి ప్రతిదిన మాలర్కశాకమును రాజు బానసపు బాడబులకు పంపుచుండెను. వారది వండి రాజునకు పెట్టుచుండిరి. ఒక నాఁడు రాజాశాకము తెచ్చియిచ్చు వైష్ణవుని తనచెంతకుఁ గొని రమ్మని వారి కానతిచ్చెను. శ్రీరామమిశ్రుఁడు రాజును దర్శించి "మీ పెద్దలు కూర్చిన నిక్షేపమొకటి కావేరీనదీ ద్వీపముననున్నది. దానిని నీకు చూపుటకైవచ్చితి"నని తెల్పెను. రాజుచిత పరివారముతో నతనితోఁగూడ శ్రీరంగమునకరిగెను. అచ్చట శ్రీరామమిశ్రుఁడతనికి "మీ పెద్దలు కూర్చిన నిక్షేపమిది. దీనిని గ్రహింపు" మని శ్రీరంగేశ్వరు పాదపద్మములు చూపెను. శ్రీరంగేశుని పాదములు చూడఁగనే యామునుఁడు గతభ్రముఁడై యిన్నాళ్ళు తానుపడిన ప్రమాదమునకు నిర్వేదమునొంది శ్రీరామమిశ్రుని యుదంతము నెఱింగి యాతనికి సాష్టాంగ నమస్కారమొనరించెను. శ్రీరామమిశ్రుఁడాతనికి ద్వయముతోపాటు కర్తవ్యమును కూడ నుపదేశించెను. అతఁడు సన్యాసాశ్రమము స్వీకరింపఁదలంచి కుమారునికి రాజ్యభారము నొప్పగించి రాజనీతి నుపదేశించెను.

ఈ యామునాచార్యుని చరిత్రయొక ప్రత్యేక కావ్యమని చెప్పఁదగినది. రాయలు పాండ్యరాజు ముదిరిన 'వెఱ్ఱిశైవమును', రాణి విష్ణుభక్తి పాతివ్రత్యములను చక్కగా వర్ణించెను. యామునాచార్యుఁడు రాణిని దర్శించి యామె సాహాయ్యమున కొలువు ప్రవేశించుట యుచితముగా నున్నది. అతఁడు వయసున బాలుఁడయ్యు వాదమున ప్రదర్శించిన పాటవ మప్రతిమానము. ఈ సందర్భమున రాయలు వర్ణ్యమొక్కటియే యగుటచే విష్ణుచిత్తుఁడన్య మతస్థులనోడించిన సందర్భమందలి పద్యములే కొన్ని యనువదించెను. ఆహారదోషమే విజ్ఞాన నాశమునకు మూలమని యీ యుపాఖ్యానము బోధించును. దానికనుగుణముగానే శ్రీరామమిశ్రుడాలర్కశాకమును రాజుగారి బానసీనికి ప్రతిదినము పంపుచుండెను. అదియే యాభాగవతోత్తముఁడు రాజును దర్శించుట కవకాశము కలిగించెను. పెద్దలు కూర్చిన నిక్షేప వృత్తాంత మద్భుతముగా నున్నది. అట్లే శ్రీరంగేశుని పాదములు చూడఁగనే యామునుఁడు పూర్వవృత్తాంతమును స్మరించి వైరాగ్యము పొందుటయు పఠితల కాశ్చర్యము కలిగించును. రక్తినుండి విరక్తికి హఠాత్తుగా మాఱుట కిట్టిసన్నివేశము లొక్కొక్కప్పుడు కారణము లగుచుండును. ఇందలి వర్షాశరద్వర్ణనములను రాజనీతి వర్ణనమును అతిమనోహరములయ్యు బహుదీర్ఘములగుటచే కథాగమనమున కాటంకము కలిగించుచున్నవి. శ్రీరామమిశ్రుని గురుభక్తియు వైష్ణవమతావేశమును ప్రశంసనీయములు. ఇందు కూడ పరమశైవుఁడైనరాజు వైష్ణవుఁడుగా మాఱుట రాయలవారి వైష్ణవ మతాభిమానమును సూచించుచున్నది.

ఆముక్తమాల్యదలోనే కాదు ఆంధ్రవాఙ్మయమునందే పద్యరూపమున నున్న చిన్న కథలందెల్ల నుత్తమశ్రేణికి చెందినది మాలదాసరి కథ. రాయలవారు దానిని తీర్చిదిద్దిన తీరు శ్లాఘాలాఘవజాంఘికమైనది. నామ సంకీర్తన ఫల మహిమలను తెల్పుట కుద్దేశింపఁబడిన కథయది. వర్ణమేదైనను భక్తి సామాన్యులను కూడ మహామహిమ సంపన్నులను గావించును. మాలదాసరి స్పర్శయే బ్రహ్మరాక్షసునికి శాపవిముక్తి కలిగించి, అతనిని భాగవతోత్తమునిగా మార్చినది. "భక్తిః కిం నకరోతి". మాలదాసరి రాయలవారన్నట్లు చండాలేతరశీలుఁడు. అతని భక్తి అప్రతిమానము. అతనికి బ్రహ్మరాక్షసునికిని జరిగిన సంభాషణ మెంత సుందరమో అంత భావగంభీరము. మాలదాసరి తిరిగి వచ్చునని యెవ్వరును అనుకొనరు. బ్రహ్మరాక్షసుఁ డును అనుకొనలేదు. అతనిరాక రాక్షసుని కాశ్చర్యమును కనువిప్పును కలిగించెను. అట్లే యామునాచార్యుఁడు రాగభోగములనుండి యోగరాగములకు మాఱుటయు, ఖాండిక్యుఁడు రాజ్యమునుకాక యోగసామ్రాజ్యమును కోరుటయు పఠితుల ఊహలకతీతము లగుటచే వారి నాశ్చర్య చకితుల నొనరించును. అతర్కితోపనతములైన యిట్టి సన్నివేశముల సంఘటనము రాయల కథాకథనమున కెనలేని సౌందర్యము చేకూర్చుచు వారి అనల్పశిల్పకౌశలమును చాటుచున్నది.

సోమశర్మ వృత్తాంత ముపాఖ్యానములోని యుపకథ. ఇతఁడు చోళ భూమినుండెడి యొక బ్రాహ్మణుఁడు. ఇతఁడు పట్టని దానము లేదు. చేయరాని పనులెన్నో చేసెను. ఇట్లు గడించిన ధనము తీసికొని స్వగ్రామమున కరుగుచుండఁగా కిరాతసంఘ మాతని ముట్టడించెను. ఆ కిరాతులలో కాకశ్మశ్రువను ఘోరాకారుఁడొక డతనిసొమ్మంతయు దోచుకొని చావఁగొట్టి వెడలిపోయెను. చచ్చినట్లు పడియున్న యతనిని తద్భార్య సహోదరుఁడు చూచి ఇంటికి మోసికొని పోవుచు దారిలో నొక చెట్టు క్రిందఁ బెట్టి నీరు త్రాగుట కరిగెను. ఇంతలో తన్ను ముట్టడించిన కాకశ్మశ్రుని రూపమే కన్నులఁ గట్టినట్లుండ నతడు ప్రాణములు విడిచెను. అంతకాలమున నా చండాలుని రూపమే స్మరణకు వచ్చుటచే నతనికి బ్రహ్మ రాక్షస రూపము కలిగెను. మాలదాసరి యనుగ్రహమున నతఁడు రాక్షసత్వమును వీడి వైష్ణవుడయ్యెను. రాయలు సోమశర్మ దుష్కర్మపరాయణత్వమును అల్పవాదిత్వమును చక్కగా వర్ణించెను. శీలము విషయమున మాలదాసరికిని ఇతనికిని పోలికయే లేదు. అతఁడు మహాభక్తుఁడు, గుణ విశిష్టుఁడు. ఇతడు రక్తుఁడు; శీలభ్రష్టుఁడు.

**యం యం వాపి స్మరన్ భావం త్యజ త్యంతే కళేబరం**
**తం తమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః** గీత 8–6

రాయలు వర్ణనప్రియుఁడు. ఆముక్తమాల్యద యందు ప్రథమాశ్వాసమున శ్రీవిల్లిపుత్తూరు వర్ణనమును, ద్వితీయాశ్వాసమున మధురానగర వర్ణనమును కలవు. ద్వితీయా శ్వాసమునందు గ్రీష్మమును, తృతీయాశ్వాసమున వర్షాశరద్వర్ణనములును, పంచమాశ్వాసమున వసంతమును వర్ణింపఁబడినవి. విష్ణుచిత్తుడు పాండ్యరాజసభలో నితర మతస్థుల జయించి రాజునకు ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానమును అందు యోగమును వివరించి శ్రీ విల్లిపుత్తూరు నకరుగుచుండ విష్ణువాతనికి ప్రత్యక్షమయ్యెను. అప్పుడు విష్ణుచిత్తుఁడు భక్తితో దశావతార ములను వర్ణించెను. యామునాచార్యుఁడు తాను సన్యాసియై కొడుకునకు రాజ్యమప్పగించు నప్పుడు విస్తృతమైన రాజనీతివర్ణనమున్నది. పంచమాశ్వాసమున గోదాదేవి వర్ణనమును, తరువాత వివాహవర్ణనమును కలవు. కావ్యాంతమున గోదాశ్రీరంగేశ్వరుల వివాహ వర్ణనమున్నది. ఈ వర్ణనములన్నియు కావ్యమున నర్ధాధిక భాగము నాక్రమించినవి. రాయలేది వర్ణించినను తనివితీఱ వర్ణించి దాని సమగ్ర స్వరూపమును పఠితలకు సాక్షాత్కరింపఁ జేయును. వర్ణన లందతని లోకజ్ఞతయు, కవిసమయపరిజ్ఞానమును, పాండితీవైభవమును, ప్రకృతిపరిశీలనమును సువ్యక్తములగు చుండును. వ్యక్తులను వర్ణించునప్పుడు కూడ నాతఁ డు వారి రూపములను సుస్పష్ట రేఖలతో తీర్చి దిద్దును. విష్ణుచిత్తుఁడు, పాండ్యరాజు, గోదాదేవి, మాలదాసరి, కాకశ్మశ్రువు మున్నగు వారి వర్ణనము లిందుకు తార్కాణములు.

రాయలు శ్రీవిల్లిపుత్తూరున గ్రామవాతావరణమును దక్షిణ మధురలో నగర వాతావరణమును ఎక్కువగా వర్ణించినట్లు కన్పించును. మధురావర్ణనమున నతఁడు కోట,

బురుజులు, పరిఖ, కరితురగాదులు, చాతుర్వర్ణ్యము, పుష్పలావికలు, వెలయాండ్రు మున్నగు వర్ణ్యములకు ప్రాధాన్య మొసంగెను. అతని ఋతువర్ణనము లప్రతిమానములు. ఆయా ఋతువులను వర్ణించునప్పుడతఁ డప్పటి వాతావరణమునంతను విశదీకరించి ఆకాలమునఁ గూడ పఠితలచే వాని ననుభవింపఁజేయును. మధుర సమీపమందలి వృషగిరి యందుండు సుందరబాహుస్వామికి తెప్ప తిరునాళ్ళు వేసవికాలమున జరుగును కాఁబోలును. అందుచే రాయలచ్చట గ్రీష్మర్తువును వర్ణించెను. యామునాచార్యుడు పాండ్యరాజు కొలువులో నితరమతస్థులను జయించిన సమయము వర్షకాలము. అందుచే నప్పుడు వర్షర్తువును, తరువాత నతఁడు రాజై దండయాత్రకు పోవు సమయమున శరదృతువును వర్ణింపఁబడినవి. రాజులు శరదృతువులో దండయాత్ర కరుగుట సహజమేకాక కవిసమయ ప్రసిద్ధము కూడనైయున్నది. గోదాదేవి విరహవర్ణన సందర్భమున వసంతర్తువు వర్ణనము కలదు. వసంతము విరహోద్దీపకమగుటచే నిచ్చట తద్వర్ణన మౌచిత్యవంతముగానే యున్నది. ఈ ఋతువుల వర్ణనలలో నచ్చటచ్చట వర్ణితమైన వస్తువే మరల వర్ణింపఁబడుట గోచరించును. రాయలు కవులనాహ్వానించి ఆయా విషయములనొసంగి వర్ణింపుఁడని యడిగి వానిలో తనకు నచ్చిన పద్యముల నాయా సందర్భములందు చొప్పించెనేమో యనిపించును. వర్ణనము లత్యంత విస్తృతము లగుటకును అందందు వర్ణితమైన వస్తువే మరల వర్ణింపబడుటకును అదే కారణమై యుండునని నా అభిప్రాయము. ఉదాహరణమునకు వర్షర్తు వర్ణనమున మెఱుపులు, గర్జలు, వడగండ్లు, ఇంద్రగోపములు, నెమళ్ళు, బలాకములు మున్నగువాని ప్రసక్తి రెండు మూడుచోట్ల కనిపించును. ఋతువుల వర్ణనము పెక్కు కావ్యములందుండును. ఋతువర్ణనైక వస్తుకములైన కేవల వర్ణనకావ్యములును కొన్ని కలవు. ఆంధ్రమునందే కాక సంస్కృతమునందును ఇంత విస్తృతతరములు భావవైవిధ్య యుక్తములునైన ఋతువర్ణనములు కానరావనుటలో నతిశయోక్తి యుండదు.

రాయల నిశిత పరిశీలనమును, అపూర్వ భావనాపాటవమును వ్యక్తము చేయుటకు రెండుమూఁడుదాహరణము లొసంగుదును.

**ఇల్లిల్లు దిరుగ నొక్కింతబ్బు శిఖి యబ్బె**
**నేనింటిలోఁ బూరి యిడి విసరక**
**రాజదు, రాజిన రవులు కొల్పాసలె**
**గాని కల్గదు మఱి దానఁగలిగె**
**నేని కూడగుట మందైనఁ బెన్పొగసుఖ**
**భుక్తి సేకూరదాభుక్తి కిడినఁ**
**బ్రాగ్భోక్తలకె తీఱు బహుజనాన్నము దీఱ**
**నారుల కొదవు పునః ప్రయత్న**

**మాజ్యపట ముఖ్యలయమెన్న రాలయాంగ**
**దారు లయ మెన్న రంతిక కార జనిక**
**వచన నాంథోగృహిణి రామిఁ బడక మరుఁదు**
**వెడ వెడనె యార్ప నొగిలి రజ్జడిని గృహులు.** 4-127

వర్షకాలమున గృహిణులు వంటచేయు విషయమున పడుపాట్లిందు చక్కగా వర్ణింపబడినవి. రాయలాపాట్లు సానుభూతితో వర్ణించి వర్ణించి చివర హాస్య మిశ్రితమైన యించుక శృంగారమును ప్రవేశపెట్టెను. ఇట్టి విధానము మఱికొన్ని పద్యములలో కూడ గోచరించును. వండిన యన్నము ప్రాగ్భోక్తలకే సరిపోఁగా స్త్రీలు తమకొఱకై మరల పునః ప్రయత్నము చేయవలసి వచ్చెడిది. నిప్పంటుకొనుటయే కష్టమగుటచే వారప్పటికే చాల ప్రొద్దెక్కుటవలన నేతిలో తడిపిన గుడ్డలను, ఇంటి వాసములను కూడ ప్రొయ్యిలో పెట్టుచుండిరి. వారిట్లిబ్బంది పడుచుండఁగా తృప్తిగా తిని పడక చేరిన భర్త లింకను ఇల్లాండ్రు తమ్ము చేరరాలేదని నొగులుచుండిరట! అట్లే "రవిఁజూచి కుడుచు వారలకును గృకలాసములకును దృష్టిమిన్నులనె నిలిచె" (4-113) అను పద్యమున కూడ నతడు చివర

**అతిథి సంఘంబులకును నీని నట్టి యెనుప**
**కడుపు వేఁగల గమికి వాకట్టు లెసఁగె**
**మంటి మిద్దెల వారికి మరు పనులకు**
**నెలతఁ బాసిన వారికి నిదురచెడియె** 4-123

అని నిదురచెడిన వారి కాచేటేల చేకూరెనో హాస్యపూరితముగ తెల్పియుండెను. ఋత్వంతరముల వర్ణనమునకంటె రాయలు వర్షర్తు వర్ణనమున నెక్కువ అభినివేశము చూపియుండెను. అది చదువుచున్నప్పుడందలి పద్యము లర్థము కావలెను. కాని నిజముగా వర్షర్తువున మెలగుచున్నట్లుండును.

**స్ఫుట భూయోహృతిశంక వార్ధినిన రశ్మల్ మిన్ను చేర్పం దటి**
**చ్ఛట లౌర్వంబుగఁ గారుకొంచు, ఘనమై క్ష్మాఁదీర వర్షింప, న**
**చ్చొటనుందోఁచి గ్రసింపఁ బోలుఁ గలశీ సూనుండు, గాకున్న నొ**
**క్కొటఁ దారాగ్రహ భాస్కరేందుమణి శుక్తుల్ వ్యక్తమై తోఁచునే** 4-145

ఇది శరదృతు వర్ణనమునందలి పద్యము. శరదృతువు రాఁగానే ఆకాశము నిర్మేఘమగును. సూర్యేందు నక్షత్రాదులు స్ఫుటముగ ప్రకాశించును. అగస్త్యోదయమగును. పూర్వమగస్త్యుఁడు సముద్ర జలమును దేవతా ప్రార్థనచే చుళుకీకరించియుండెను. ఆ భయముచే నా జలములు మేఘరూపమున నాకసము చేరఁగా నుదయించిన యగస్త్యుఁడచ్చట కూడ వానిని గ్రోలియుండెను కాఁబోలును, అందుచేతనే యందలి మణిశుక్త్యాదులు భాస్కరేందు

గ్రహరూపమున విస్పష్టముగా కానవచ్చుచున్నవని కవి భావము. అతఁడు సర్వ శరత్ప్రకృతిని శరద్వర్ణనము నందిమిడ్చెను. వేసవికాలమున సుడిగాలులు చెలరేగుచుండును. వానిని రాయలీ క్రింది పద్యమున నద్భుతమైన భావనా పాటవముతో వర్ణించెను.

**దవధూమంపుఁ దమిస్రలోఁ దమ రస ద్రవ్యంబు పంకేజ బాం**
**ధవ భానుప్రతతుల్ హరింపఁ గుయివెంటన్వోళ్ళు శూన్యోరు కూ**
**పవితానంబనఁ జూడఁ జూడఁ బుడమిం బాటిల్లి పై విప్పులై**
**యవసం బంచుల నాడఁగా విసరె వాత్యాళి వ్రజశ్చక్రముల్** 2–48

వేసవిని నూతులెండిపోవును. అందుచే నానూతులు తమ జలమనెడి ద్రవ్యమును సూర్యకిరణములు హరించెనని దేవునకు మొఱపెట్టుకొనుటకు పోవుచుండెను. అంచుల నంటిన గడ్డిపరకలతో దుమ్ముతో కూడ విరివిగా విసరు సుడిగాలులట్లు పైకిపోవు నా నూతులవలె నుండెనని భావము. గ్రీష్మమున దినములు దీర్ఘము లగుటను రాయలుత్ప్రేక్షించిన తెఱంగు(2–49) అద్భుతముగా నున్నది. "నిర్ఝర ప్రజల వేణికలింకఁ జట్రాలఁ బేరిన ప్రాఁచి పెన్నేట లెగసె" (2–46) అను సీసమతని నిశిత పరిశీలనమును చాటుచున్నది. వసంతమున నతఁడా ఋతువున పూచు పుష్పములను, కోకిలలను, అళిఝుంకారములను, చిగుళ్లను చక్కగా వర్ణించెను. వసంతమున సూర్యుఁడుత్తర దిక్కునకు తొలగెను. మొదటనే ఆముక్తమాల్యద తాపోష్ణముచే వేగిన దక్షిణ దిక్కు తానుకూడ నందే యున్నచో నది తుదిముట్ట మాడిపోవునను భయమే సూర్యుడం దుండక యుత్తరమునకు తొలగుటకు కారణము.

**తనయుదరంబునం బొడమి తామ్రరుచిచ్ఛటలుల్లసిల్లఁ గో**
**ల్కొను ధరణీజ సంతతికిఁగోరక దంతము లించుకంత ని**
**క్కినయది యాదిగాఁగఁజెలఁగెన్ వనలక్ష్మి కడుంజెలంగఁగా**
**జనుఁ బ్రియుఁడైన మాధవుని సంగతి మీఁదటఁ జాలఁగల్గుటన్** 5–116

వనలక్ష్మికి చెట్లు సంతానము. అవి తామ్రకాంతులుల్లసిల్లఁగా వృద్ధినొందెను. తరువాత వానికి మొగ్గలనెడు దంతములంకురించెను. అప్పుడు ప్రియుఁడైన మాధవుని సంగతి యింకఁ దనకుఁగల్గునని వనలక్ష్మి మిక్కిలి సంతోషించెను. పుట్టిన బిడ్డలకు దంతములు వచ్చువఱకు బాలెంతలకు పురుష సంపర్కము కూడదను సంప్రదాయమును పురస్కరించుకొని కవి ఈ పద్యమునురచించెను. ఇచ్చట వనమును లక్ష్మితోఁబోల్చి వసంత విష్ణ్వర్థములు రెండునుగల మాధవ శబ్దము వాడుట మిక్కిలి యుచితముగానున్నది ఈ ఋతువర్ణనములందు రాయలు కవి సమయముల నెన్నిటినో ప్రదర్శించెను. విష్ణువు వర్షకాలమున యోగనిద్రలో ప్రవేశించి శరత్కాలము రాగానే లేచుట, శరత్తున నగస్త్యుఁడుదయించుట, అగస్త్యుఁడు సముద్రోదకములను త్రాగివేయుట మున్నగున విట్టివి. రెండు మూడుచోట్ల నతఁడు దోహదక్రియలను గూడ పేర్కొనెను.

విష్ణుచిత్తుఁడు శ్రీవిల్లిపుత్తూరుకరుగుచుండఁగా తనకు ప్రత్యక్షమైన నారాయణుని యవతారములను వర్ణించెను. ఆతఁడు పరశురామ రామ బలరామావతారములను మూఁడింటిని వర్ణించుటచే నవతారములు పదకొండైనవి. నారాయణుఁడేయవతారమున నెట్టి ఘనకార్యములొనరించెనో యతఁడు వివరించెను.

**స్యందనస్థిత బిడౌజః క్షత్త్రుజాద్యకృత్**
**ఝంఝూ మరుద్గరుత్ ఝూత్కృతములు** 4–27

అను సీసమున రాముని బాణములు వర్ణింపఁబడినవి. ఇందలి పద ప్రయోగము వలెనే భావములును క్లిష్టముగా నున్నవి. కావ్యారంభమున గరుడుని ఱెక్కల గాలులు వర్ణింపబడినవి. గరుడుని రెక్కల గాలులును,రాముని బాణములును గూడ పాపము లడంచుఁ గాక యని యాతఁడు కోరియుండెను. ఈ అవతార వర్ణనమునఁ గూడ రాయలవారి వైష్ణవాభిమానము వెల్లడి యగుచున్నది.

పంచమాశ్వాసమున గోదాదేవి వర్ణనమును, ఆమె విరహ వర్ణనమును కలవు. రాయలు గోదాదేవి బాల్యమును వర్ణించి యుండలేదు. విష్ణుచిత్తుఁడు తులసీవనమున తనకు కనిపించిన శిశువు నాదరమునఁగొనిపోయి తన భార్య కొసంగెను. ఆమెయు ననపత్యయగుటచే పొంగి చేపిన నిజస్తన్యములతో నా శిశువును పెంచెననియు నామె క్రమముగా పెరిగెననియు తెల్పి యౌవన వర్ణనమున కారంభించెను.

**వాతెఱ తొంటి కైవడి మాటలాడదు**
**కుటిలవృత్తి వహించెఁ గుంతలములు** 5–7

అను పద్యము బాల్యాంతర మామెకు యౌవనోదయమగుట నద్భుతముగా తెల్పుచున్నది. రాయలామెను కేశాది పాదాంతము వఱకు వర్ణించెను. ఆమె తనుకాంతి యెదుట నూతనహరిద్ర సాటిరాలేక మిక్కిలి మలినమయ్యెను. అందుచేతనే దానికి రాత్రి, నిశ, తమిస్ర, నిశీధిని, క్షప అను పేరులు కలిగెను. రాత్రిని తెలుపు పదములన్నియు పసుపునకు కూడ చెల్లును. ఈ వర్ణనమంతయు రూపకోపమోత్ప్రేక్షాద్యలంకారముల తోడను, అపూర్వ భావములతోడను కూడిన పద్యములతో నత్యంత రమణీయముగా నున్నది. ఇట్టి వర్ణనములు సర్వ ప్రబంధ సామాన్యములే.

**నాసాచంపకతన్ సుగంధ మచటన్ రాభృంగముల్ గ్రోల సం**
**త్రాసంబందియుఁ, బల్కుచో నలము వక్త్రం బేల నానేల యం**
**దే సౌరభ్యములేదు కుందములు గావే దంతముల్ గానినాఁ**
**డాసక్తిన్ బ్రతిబింబ దంభమున నేలా వ్రాలఁ దజ్జాతికిన్** 5–16

ఇది గోదాదేవి నాసికాదంత వర్ణనము, నాసిక సంపెంగవలె నుండెను. ఆ సౌరభము తుమ్మెదలకు పడదు. అయినను ఆమె పల్కునప్పుడు తుమ్మెదలామె ముఖముపై ముసరు చుండెను. ఆ ముఖమునందన్ని సౌరభములును కలవు. ఆమె దంతములు కుందములు,కానిచో తుమ్మెదలు ప్రతిబింబము నెపముచే దంతముల యందు వ్రాలుటకు కారణమేమని భావము. ఆమె ముఖము యొక్క సర్వ సౌరభ్యమయత్వముతో పాటు దంతముల స్వచ్ఛతయు నిందు వ్యక్తీకరింపఁబడినది. ఈ వర్ణనము నందలి పద్యములన్నియు నిట్లే భావగంభీరములై యుండును.

నాయికా విరహవర్ణనమన్ని ప్రబంధములందు నుండును. అందు నాయిక చంద్రమన్మథ మలయవాయువులను, శుకపికశారికాదులను ఉపాలంభించుటయు, చెలులు శీతలోప చారములు కావించుటయు వర్ణింపఁబడు చుండును, గోదాదేవి విరహ మితర నాయికల విరహము వంటిదికాదు. ఈమెది భక్తితోఁ గూడిన ప్రేమ, చెలుల పాటలు విని యామె నారాయణుఁ డాయాయవతారము లందు స్త్రీలకు కలిగించిన బాధలెన్ని యతనినే యుపాలంభించును. ఈ సందర్భమునం దితరప్రబంధములందువలె చంద్రమన్మథాదుల ఉపాలంభనము లేనేలేదు. ఈమె కావించిన నారాయణుని యుపాలంభమునందలి భావములు విరహతాపముచే నామె యతని యెడ నారోపించిన దోషములతో కూడి వింతగా నుండును.

**ధరపై నీతఁడు పూర్వకల్పములసక్త స్త్రీ విశాలాంబకాం**
**బురుహశ్రేణి జలంబుమైఁ బులకలున్ బూరించుచుం బెంచుదు**
**గ్భర కర్మం బలమంగ వచ్చు జలచార స్తబ్ధరోమత్వకే**
**సరితల్ పొందవతార దంభమున నాచ్ఛాదించుఁదాఁ బ్రౌఢిమన్** 5-44

అను పద్యమున విష్ణువు మత్స్య వరాహ నరసింహ జన్మముల నెత్తుట కాతఁడొనరించిన పూర్వపాపమే కారణమనియు, నతఁడు ప్రౌఢుండగుటచే నవతారదంభమున దాని నాచ్ఛాదించుననియుఁ దెల్పఁబడినది.

**ఒల్లఁ బొమ్మన్నఁ బోదె, తానుల్లసముల**
**నేప నది రక్కసియ యౌట యెగ్గె వలచి**
**స్త్రీలు తలవంపఁ దానె వచ్చె, నది చాల**
**కాడుదాని బజీతు సేయంగనగునె** 5-51

అను పద్యమున నామె రామునుపాలంభించిన క్రమ మత్యంత సహజముగా నున్నది. ఆమె పొందిన విరహము కూడ నల్పమైనదికాదు.

**ఎఱుఁగరుగా యొకద్భుతము, నీచెలి దీర్ఘికఁ దీర్ఘమాడ నా**
**యఱుతఁదగిల్చి పోవుఁ దనహారము వోయిన నేను బోవుదున్,**
**మఱువక వెంటఁ బోవ జలమగ్నత నౌనది సున్నమైనఁ దాఁ**
**గఱకతిపెట్టి సొమ్మడుగుఁగాని నిజార్తి యెఱుంగదేమియున్** 5-61

అని యొక వయస్య యామె విరహ తీవ్రతను వర్ణించెను. గోదాదేవి రాధాయమునల చర్యలను గూడ నధిక్షేపించెను. ఆమె విరహవేదనచే మూర్ఛిల్లెను. వయస్యలు "చేతికావాంత సీతాళవృంత మృదువాత హిమాంబుకణాళి"చే నామెను తేర్చిరి. ఆమె మరణించుటకు సిద్ధముకాఁగా చేటికలు వారించి 'విష్ణువు రంగమందున్నాఁడనియు శ్రీవిల్లిపుత్తూరునందలి హరిని భజించినచో నాతఁడు విభుఁడు కాఁగల'డనియుఁ దెల్పిరి. ఆమె వియోగచ్యుత ధైర్యయై యా యూరనున్న హరిని బూజించుచు నతని గుణములు ద్రవిడభాషలో పాడుచుండెను. ఇది సంకీర్తన భక్తి. రాయలు భక్తి మిశ్రితమైన గోదా విరహమును వర్ణించిన తెఱంగపూర్వమును అనన్యకృతమును నైనట్టిది. విష్ణుచిత్తుఁడు దేవునికి తన కూఁతు పరిస్థితిని వివరించునప్పుడది యేమో యామయమో తపస్సో యని తలంచి తనకుఁ దెలియకుండనే యామె విరహమును విశదీకరించెను. గోదా విరహ వర్ణనమున రాయలు ప్రదర్శించిన నూత్నత్వము ప్రశంసాపాత్రమై యున్నది.

కావ్యాంతమున గోదా శ్రీరంగేశ్వరుల వివాహము వర్ణింపఁబడినది. శ్రీరంగేశుఁడు విశ్వకర్మ మణిమయముగా నిర్మించిన విడిదిపట్టునవిడిసి స్నానమొనరించి దివ్యాభరణ భూషితుఁడై యుండెను. పార్వతీవాణీప్రముఖ గీర్వాణీ సముదాయము సీతారామ కల్యాణమునకు సంబంధించిన పాటలు పాడుచుండ విష్ణుచిత్తునింట ఋషిపత్నులును చెలికత్తెలును గోదాదేవిని స్నానమాడించి పెండ్లికూఁతుఁ గావించిరి. శ్రీ రంగేశుఁ డప్రాకృత వైభవమున గరుడ వాహనుఁడై వెడలి కల్యాణమండపమున జాంబూనదపీఠముపై కూర్చుండెను. విష్ణుచిత్తుఁడు కనకభాజనమున స్వామి పాదములు కడిగి, షోడశోపచార పూర్వకముగా మధుపర్కము నొసంగెను. తరువాత నతఁడు సపత్నీకుఁడై ధారవోయ స్వామి కన్యకారత్నమును గ్రహించెను. వధూవరులు తలంబ్రాలు పోసికొనిరి. శ్రీరంగేశుఁడు గోదాదేవి మెడలో మంగళసూత్రము కట్టెను. తరువాత లాజహోమము, సప్తపది, అరుంధతీ దర్శనము మున్నగునవి జరిగెను. బృందారకులు భక్తితో నొసగు కానుకలు గైకొని స్వామి వధువుతో శ్రీరంగమున కరుదెంచెను. ఈ విధముగా రాయలు సంగ్రహముగానైనను సంప్రదాయసిద్ధముగా నా పుణ్యదంపతుల వివాహమును వర్ణించెను.

యామునాచార్యుఁడు శ్రీరామమిశ్రుని ప్రబోధమున రాజ్యభోగములం దాసక్తి విడిచి తురీయాశ్రమము గైకొనుటకు ముందు రాజ్యమును కుమారుని కొప్పగించి యతనికి రాజనీతి బోధించెను. చతుర్థాశ్వాసాంతమున నీ రాజనీతి ఎనుబది పద్యములలో నతివిస్తృతముగా

నున్నది. రాయలర్థశాస్త్రమును, శుక్రనీతిసారమును, చాళుక్యుల సర్వార్థచింతామణిని పఠించియుండిన వాడగుటచే నందలి విషయములకు స్వానుభవమును కూడ జోడించి రాజనీతిని సర్వ సమగ్రముగ వర్ణించెను. ఇందు దుర్గము లెట్టివారి కీయవలయునో, మంత్రిత్వమును దేవాలయాధిపత్యము నెట్టివారి కొసంగవలయునో, గజాశ్వముల నెట్లు సమకూర్పవలయునో, ఆటవిక బలమునెడ నెట్లు వర్తింపవలయునో, ఎట్టి మంత్రులను నియమింపవలయునో, రేవులను వాణిజ్యమును ఎట్లు నిర్వహింపవలయునో, దండనము విషయమునను రాయబారుల విషయమునను ఎట్లు జాగరూకతతో వర్తింపవలయునో, ప్రజల యాదరమునెట్లు సంపాదించవలయునో యాతఁడు వివరముగా వర్ణించెను.

**రాష్ట్రవర్ధన మెదఁగోరు రాజు మేలు**
**రాష్ట్రమును గోరు, దానఁగార్యమొ యనంగ**
**రాదు, బ్రహ్మోత్తరములైన ప్రజల యేక**
**ముఖపుఁ గోర్కిఁ దదంతరాత్ముం డొసఁగఁడె?** 4-205

అను పద్యమున ప్రజాభివృద్ధిని గోరు రాజు వృద్ధిని ప్రజలు కూడ కోరెదరనియు దాని వలన నెంతో లాభము చేకూరుననియు నందుకు బ్రహ్మోత్తరములైన ప్రజల ఏకముఖపు కోరిక తదంతరాత్మ డొసగుట కారణమనియు నాతడు తెలిపియుండెను.

**నీతిం దాన తలంచి చేయఁ బనిగాఁనీ కాకపోనీ బల**
**వ్రాతార్థాఢ్యత నెమ్మి నుండ కొరుఁ బ్రోవన్మంత్రి యంచుం గుణా**
**తీతుం గుమ్మడికాయ యంత యగుముత్తెంబై మనం బేర్చ, న**
**ట్లే తానాతని చేతిలో బ్రదుకువాఁడే యౌఁజుమీ మీఁదటన్** 4-213

అను పద్యమున గుణాతీతునైనవాని మంత్రిగా నియమించినచో కలుగు హాని నాతఁడు చక్కగ వివరించియుండెను.రాజు ధనవంతుఁడైన మాత్రమున లాభము లేదు. గొప్పవారి సాహాయ్యము కూడ ముఖ్యముగా నుండవలయును. వారు స్వాధీనులగుటకై క్రౌర్యము విడిచి, సత్యప్రవర్తనము కలిగి, యౌదార్యముతో వర్తింపవలయును. రాజు ఆటవిక బలమును బెదరు వాపి అనుకూలము చేసికొనవలయును. వారల్పులగుటచే వారికి ప్రేమాగ్రహములును విశ్వాసావిశ్వాసములును అల్పముననే కలుగుచుండును.

**మును దనసీమ చేసికొని, ముల్లిడి, గుద్దట వెండిచేని మె**
**త్తనకయి వేరు వెల్లఁకియుఁ ద్రవ్వెడు కర్షకునట్లు, శత్రుతో**
**నెనసియయైన దుర్గబల మే కొనియైన, నిజాత్మ చింతలే**
**క నెగడఁ జేసి, లోన మతి కంటకశోధనఁ జేయు టొప్పగున్** 4-219

అను పద్యము రాజు శత్రువుతో కపట స్నేహము చేసియైనను, స్థలజలాది దుర్గములు గైకొనియైనను, రాష్ట్రమును తన అధీనమును చేసికొని పరులనుండి ఉపద్రవము కలుగునను విచారములేక క్షుద్ర శత్రు నిరసనము కావింపవలెనని తెలుపుచున్నది. రాజు తనకు వచ్చు నాదాయములో ఒక పాలు త్యాగ భోగములకును, రెండు పాళ్లు చతురంగబల రక్షణమునకును, ఒక పాలు కోశాగారమున నిలువయుంచుటకును ఇట్లు నాలుగు పాళ్ళుగా చేసి చారదృష్టితో సర్వమును పరిశీలించుచు రాజ్యము కావింప వలయును. రాజు దండపారుష్యము లేక పరులు చెప్పుకొండెములు వినక ప్రజలవిశ్వాసమును చూఱగొనుచు జాగరూకుడై యుండెనేని చిరకాలము రాజ్యసుఖము లనుభవించును.

**రాష్ట్ర మెరియించు, కొనుము దుర్గములు, తదవ**
**రోధమగుపడ్డఁ బుట్టింటి రూఢి నడపు,**
**పరుసములు దద్రిపుల రాయబారులెదుటఁ**
**బలుకకుము, సంధి యొకవేళ, వలసియుండు** 4-267

అను పద్యము రాయలవారి రాజనీతిలో మిక్కిలి ప్రధానమైనట్టిది. రాజు శత్రు దుర్గములను వశము చేసికొనవచ్చును. వారి స్త్రీలు దొరికినచో పుట్టింటనున్న విధమున వారి నాదరింపవలయును. శత్రువుల రాయబారుల యెదుట నెప్పుడును పరుషములు పలుకరాదు. ఏలయన నొక్కొక్కప్పుడు వారితో సంధిచేయుట అవసరమగుచుండును. రాజు దినకృత్యములెట్లొనర్పవలయునో, తన శరీరారోగ్యమును ఎట్లు కాపాడు కొనవలయునో రాయలు చక్కగ తెలిపియుండెను. అతడు "సాంగరాజ్య మొకెత్తుగ, స్వాంగరాజ్యమొక్క యెత్తుగ" చూచి ఆ రెండింటిని పెంపొందింపవలయును. రాజు అపరాహ్ణమునందే గర్భగోళ శుద్ధి ఐన పిమ్మట భోజనము చేయవలయును. ఆతఁడేడు వారములందును ఆయా వారముల కధిపతులైన గ్రహములకు చెప్పఁబడిన రత్నములతో కూడిన యలంకారములు ధరింపవలయును. పట్టభద్రుండగు రాజు ధర్మమునందే దృష్టియిడి నడువవలయుననుట యతని రాజనీతి యందలి ప్రధానాంశము. ఈ విధముగ రాయలు యామునాచార్యుని ముఖమున రాజులకును ప్రజలకును రాజ్యమునకును శ్రేయస్సు కలుగునట్లుగ రాజ్యపాలన మెట్లు జరుగవలయునో ఈ రాజనీతి యందు చెప్పించెను.

ఆముక్తమాల్యద యందలి ప్రధాన రసము శాంత్యంతర్భూతమైన భక్తి. ఇందు ధర్మ వీరము ప్రధానమని చెప్పెడువారును కొందఱు కలరు. ఇందలి పూర్వభాగమున విష్ణు చిత్తునకును, ఉత్తరభాగమున గోదా శ్రీరంగేశ్వరుల ప్రణయమునకును ప్రాధాన్యము కలదు. విష్ణుచిత్తుడు మహాభక్తుడు. సార్థక నామధేయుఁడు. వేదములను వేదాంతములను చదువకయే తజ్జన్యమైన ద్వైతజ్ఞానము సంపాదించినవాఁడు. రాయల ననుసరించి అతఁడెక్కువగా చదువుకొనకపోయినను దైవానుగ్రహమున నితరమతస్థుల నోడింపఁజాలెను. యామునా

చార్యుఁడు పాండిత్య బలముచే నోడించెను. విష్ణుచిత్తుఁడు శ్రీమన్నారాయణుఁడొసంగిన సంపద విస్తారముగా నుండినను దైవమునకు మాలికాకరణ కైంకర్యము చేయుచునే యుండెను. ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానమున విష్ణుచిత్తుఁడు రాజునకు శరణాగతి ధర్మమే తరణోపాయమని సూచించెను. మాలదాసరి కథ సంకీర్తన భక్తికి పరమావధి. అందు సంకీర్తనము కూడ నొక తపస్సనియు, నది సాధింపలేని దేదియు నుండదనియు, నిరూపింపఁబడినది. గోదాదేవి భక్తురాలు. ఆమె విరహము భక్తి మిశ్రితమైనట్టిది. భాగవతము నందలి గోపికలవలెనే యామె కూడ శ్రీమన్నారాయణుని విరహమును స్వల్పకాలమైనను భరింపఁజాలక పోయెను. విరహావస్థ యందు కూడ నామె తెల్లవారుజాముననే లేచి, స్నానము చేసి, దేవుని పూజించి యాతని గూర్చి పాటలు పాడుచుండెను. ఆమె సంకీర్తనముతో కూడిన మధురభక్తిని ప్రదర్శించెను. విష్ణుచిత్తుఁడు తన కూఁతునవస్థను తెలిపి రక్షింపుమని ప్రార్థించినప్పుడు దేవుఁడు ఆమె చేయునది తపస్సేయని తెలిపియుండెను. మధురభక్తి సాధనముగా నామె శ్రీమన్నారాయణుని భర్తగాఁ బడయఁజాలెను. శ్రీరంగేశ్వరుఁడును ఆమె భక్తి కలరి యామెను భార్యగా స్వీకరించెను. విష్ణుచిత్తుని కథయందును, గోదాదేవి వృత్తాంతము నందును భక్తియే అధికముగా గోచరించు చున్నది.

రాయలు పాత్ర పోషణమున నెంతో నేర్పు ప్రదర్శించి యుండెను. విష్ణుచిత్తుని భక్తిని, వినయ సంపదలను, అమాయికత్వమును, అబుద్ధేక్షు ధనుఃపత్రత్వమును చక్కగా ప్రదర్శించియుండెను. అతఁడు తనకూఁతునవస్థ భగవంతునితో తెలుపు నప్పటి వచనమతని అమాయికత్వమును వేయి విధముల వెల్లడి చేయుచున్నది. చివరి కాతఁడు మాలదాసరి కథ విని స్వామి చెప్పినట్లే తన కూఁతును శ్రీరంగమునకుఁ గొనిపోయెను. బస కరిగిన తరువాత కూఁతురు పల్లకీలో కనఁబడనప్పు డాతఁడు కావించిన యలజడికి దేవుఁడు కూడ భయపడెను. ఇది యాతని నిష్కాపట్యమునకు సూచన. యామునాచార్యుఁడు మహాపండితుఁడు. అతఁ డు వయస్సున చిన్నవాఁడగుటచే రాజు తనకు దర్శనమిచ్చునో యీయఁడో యని రాణి ద్వారా అతనిదర్శనము సంపాదించెను. “నవయం కవయస్తు కేవలం నవయం కేవల తంత్రపారగాః” అనఁజాలిన పండిత ప్రకాండుఁడగుటచే నతఁడు రాజసభలో ప్రతివాదుల నందటి నవలీలగా నోడింపఁజాలెను. పండితుఁడైన యతఁడు రాజ్యము లభింపఁగనే భోగలాలసుఁడగుటయు మరల శ్రీరామమిశ్రునిచే నుద్బోధితుఁడై వైరాగ్యమునొంది తురీయాశ్రమమును స్వీకరించుటయు నతని యుద్వేగశీలమును సూచించును. అతఁడధర్వ శిరస్సభ్యసించిన వాఁడగుటచే సర్వ దివ్యాస్త్రవేత్తయై దిగ్విజయ యాత్ర చేయఁజాలెను. గోదాదేవి భక్తి అనన్య సామాన్యము. ఆమె శ్రీరంగేశ్వరునుపాలంభించిన తెఱంగామెకు స్త్రీలయెడఁ గల యభిమాన సానుభూతులను ప్రౌఢతావివేకసంపదలను చెప్పక చెప్పుచున్నది. భక్తిచే నామె శ్రీరంగేశ్వరుని భర్తగాఁ బడయఁజాలినది. అందుకు పూర్వజన్మ సంస్కారము కూడ

నామెకు తోడ్పడినది. పూర్వజన్మమున నామె భూదేవి. ఆ వాసనా విశేషమే వయస్యలు పాడిన లక్ష్మీనారాయణ వివాహసంబంధులైన పాటలాలింపcగనే ఆమెను వియోగ సముద్రమున ముంచివైచినది. శ్రీరంగేశ్వరుcడు భక్తపరాధీనుcడు. గోదాదేవి నంతః పురములోనికి తీసుకొన్నను భక్తుడైన విష్ణుచిత్తుని యాక్రందనము విని భయపడి యామె నెవ్వరు చూడకుండనే విష్ణుచిత్తుని బసకు పంపి యాతని నోదార్చెను. అతcడు కోరినట్లు శ్రీ విల్లిపుత్తూరికే వెళ్ళి గోదాదేవిని పెండ్లి చేసికొనెను. రాయలు ఖాండిక్యుని వైరాగ్యమును, అతని అనుచరుల రాజ్యలాభాపేక్షను, కేశిధ్వజుని కర్మతత్వ విజ్ఞాన విశేషములను, పాండ్యరాజు ముదిరిన వెఱ్ఱిశైవమును, రాణి వైష్ణవభక్తి పాతివ్రత్యములను, మాలదాసరి అసాధారణ భక్తి నిష్ఠను, సత్యపరాయణత్వమును, దేశబలమును, బ్రహ్మరాక్షసుని క్రూరత్వముతో పాటంతర్గత కరుణావేశమును, సోమశర్మ దౌర్బ్రాహ్మణ్యమును, శ్రీరామమిశ్రుని గురుభక్తి మతాభిమానములను నిపుణతతో చిత్రించి యుండెను. పాత్రల చిత్తవృత్తులను ప్రదర్శించుటలో కూడ నతcడనన్య సామాన్యమైన నేర్పు ప్రదర్శించెను. విష్ణుచిత్తునిచే నోడింపcబడి యేగు పండితుల స్థితిని వర్ణించుచు నాతcడు రచించిన సీసమును "సెలవులు నాకుచు వెలియరంగులు చూడ కరిగి పాదూవాహు నరయువారు"(4-7), శ్రీరామమిశ్రుడు యామునాచార్యుని భోగపరాయణత్వమునుండి మరలింప నెంచుచు "నల్లగ్రోలనిచ్చి మెల్లనె చివ్వంగి నోరి జింకc దివియు నేరుపొదవు వేటకాcడు పోలె"(4-193) వర్తింపవలెనని తలంచుటయు, పాండ్యరాజు బ్రాహ్మణుడు చదివిన సుభాషితమును వినcగనే వేశ్య యింటి కరుగక సౌధమునకుc దిరిగి వెళ్లిపోవుటయు, కేశిధ్వజుcడు ప్రాయశ్చిత్తము నడుగుటకై వచ్చుచుండ ఖాండిక్యుని యనుచరులాతcడు తమ్ము చంపవచ్చుచున్నాcడని తలంచుటయు, గోదాదేవి శ్రీరంగేశు నుపాలంభించుట విని వయస్యలు "ఎవ్వరునట్లపో నెరసు లెన్నక మానరు ప్రాణభర్తలన్ దవ్వుల నున్నcగాకకతనన్"(5-56) అని పల్కుటయు నిందుకు నిదర్శనములు.

ఆముక్తమాల్యదయందు రాయలవారి బహుముఖ పాండిత్యము వ్యక్తమగుచున్నది. అతcడుభయభాషలందును ప్రౌఢమైన కవిత్వము చెప్పcగల మేటి. విశిష్టాద్వైతము నందతనికిc గల యభిమాన మపారము. అతcడా యభిమానమునకుc దగిన పాండిత్యపాటవమును గూడ సంపాదించెను. ద్రావిడప్రబంధములే కాక బ్రహ్మసూత్రాదులు కూడ నతనికి సుపరిచి తములు. విష్ణుచిత్తుc దన్యమతస్థుల నోడించు సందర్భమున నతcడు రచించిన "జగదుద్గ తికిని బీజము ప్రధాన మన నీక్షత్యాదివీశు నశబ్దవాది"(3-8) అను పద్యమున బ్రహ్మసూత్రము లందలి సూత్రములే యుద్ఘాటింపcబడినవి. విష్ణుచిత్తుcడు సభలోసప్రమాణముగా విశిష్టాద్వై తమును నిరూపించెను. అతcడు శ్రుతిస్మృతి సూత్ర సమాజమున కైకకంఠ్యము కల్పించి యాత్మమతము రాద్ధాంతముగ నొనరించెను. విష్ణుచిత్తుcడు ప్రదర్శించిన యీ పాండిత్య మంతయు రాయలవారిదే. వారు పెక్కుచోట్ల శ్రుతివాక్యములనో తదర్థమునో తెల్పియుండిరి.

"అపహతపాప్మాదివ్యోదేవ ఏకోనారాయణః" అను వాక్యము ఛాందోగ్యము నందలిది. "అలసతపరున్న మనుజుండు కలియుగంబు"(3-45) అను పద్యమునకు మూలము ఋగ్బ్రాహ్మణము. కేశిధ్వజుండు ఖాండిక్యునికి బోధించిన యోగ మపార పాండిత్య స్ఫోరకముగా నున్నది. యోగశాస్త్రమును, ఉపనిషదాదులను జదివినవారు తప్ప నితరులా యుపదేశము కావింపఁజాలరు. విష్ణుచిత్తునకును కృష్ణరాయలకును గూడ నాజ్ఞానము విష్ణు ప్రసాదముననే లభించినది. రాయల కవిసమయ పరిజ్ఞాన మపూర్వమైనది. ఆయా సందర్భములం దాతఁడు దానిని ప్రదర్శించియుండెను. అతని రాజనీతివిశారదత్వమునకు యామునాచార్యుఁ డు కుమారునికి బోధించిన రాజనీతియే సాక్షి. సాహిత్యము నందువలెనే సంగీతమునందుకూడ నతనికి నిశితమైన పరిజ్ఞానము కలదు. అతఁడీ కావ్యమున ప్రదర్శించిన పాండితీపాటవము మహాపండితులకే అచ్చెరువు కలిగించును. ఆ పాండిత్యము గురుముఖాభ్యస్తము కావచ్చును లేక బహుపండితగోష్ఠీ శ్రవణ సంజాతము కావచ్చును.

ఆముక్తమాల్యద తత్కాల మతసాంఘికాది పరిస్థితులకు దర్పణము వంటిది. రాయలు సార్వభౌముఁడైనను మాఱువేషము వైచికొని తన సామ్రాజ్యమునందలి పలు ప్రదేశముల కరిగి సామాన్యజనుల పరిస్థితులను కూడ పరిశీలించి యుండును. "ఇంటింటి కేఁగ నొక్కింతబ్బు శిఖి" యను పద్యము వర్షకాలమున గృహిణులు పడు పాట్లను చక్కగా వ్యక్తము చేయుచున్నది. శ్రీ విల్లిపుత్తూరున ద్రవిడాంగనలు చెంగలువల కొలనిలోఁబసుపుతో స్నానము చేసి, స్వామిమజ్జనము కొఱకు తీర్థపుబిందెను రొంట ధరించి, ద్రవిడ ప్రబంధాను సంధానము చేయుచు నుద్యానపులోఁద్రోవలందు పావడాలు ధరించిన పాదములతో నడచుచుండుట రాయలు చూచియుండెను. విష్ణుచిత్తుఁడు మహాభక్తుఁడయ్యును వర్షకాలము నందు భార్య కన్నొగ చొరకుండ ప్రొయ్యిలోనికి నారికేళపు బొఱియలు కూర్చి పెట్టెడివాఁడు. అప్పుడు ప్రజలు ఋతువుల కనుగుణముగా నెట్టెట్టి భోజనములు చేసెడి వారో రాయలు వర్ణించి యుండెను. "తెలి నులివెచ్చయోగిరము" (1-81) మున్నగు పద్యములిందుకు తార్కాణము. పరదేశి విప్రుఁడు రాజపురోహితునింటఁ గావించిన భోజనమును రాయలు వర్ణించిన "పరిపక్వసురభిరంభా ఫలంబుల తోడ" (2-74) అను పద్యమును జదువునప్పుడు పఠితలకు నోరూరక మానదు. వర్షకాల వర్ణనమున రెడ్లేమేమి భుజించి యెట్లు మంచములెక్కి పరుండిరో రాయలు "గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁ దగిరి సాకున్" (4-134) అను పద్యమున వర్ణించి యుండెను. "తారుణ్యాతిగ చూతనూత్న ఫలయుక్తైలాభిఘార స్వన" (2-68) అను పద్యము వేసవి కాలమున భోగులు చూతశకల మిశ్రిత మాత్స్యచ్ఛేద పాకమును తిని యావాసన పోవుటకు సాయంకాలములందెట్లు "కేళికాంతారాభ్యంతర వాలుకాస్థిత హిమాంత ర్నారికేళాంబువులు" సేవించుచుండిరో తెల్పుచున్నది. ఆ కాలపు జనులకు పూవులనిన ప్రాణము. వారు వాడిన పూవులను ధరించెడివారు కారు.

**వేవిన మేడపై వలభివేణికc జంటవహించి విప్పcగాc**
**బూవులు గోట మీటు తటిc బోయెడి తేcటుల మ్రోcత కామి శం**
**కావహమౌcగృతాభ్యసన లౌటను దంతపు మెట్ల వెంబడిన్**
**జేవడి వీణెమీటుటలుc జిక్కెడ లించుటలున్ సరింబడన్** 1-62

తెల్లవాళు జామున నే స్త్రీలు జడ ముందుకు తీసి వాడిన పూవులను గోటితో మీటుచుండcగా నందుండిన తేంట్లు ఝుంకార మొనరించుచు నెగిరి పోయెడివి. ఆ మ్రోcత యింకను వీధులలోc దిరుగుచుండిన విటులకు లోన స్త్రీలు వీణ వాయించుచుండిరేమోయను భ్రాంతి కల్గించుచుండెను. ఇది యప్పటి స్త్రీల పుష్పప్రీతినే కాక సంగీతాసక్తిని గూడ చాటుచున్నది. విదేశ యాత్రికులు పలువురు విజయనగర సామ్రాజ్య వైభవమును ఆశ్చర్యచకితులై వర్ణించి యుండిరి. హంపిలో రత్నములను రాసులుగా పోసి విక్రయించెడివారని వారు వర్ణించిరి. ఆ వైభవము రాయల ఆముక్తమాల్యదలో కూడా కనిపించును.

**స్థిరసౌధాగ్ర విహార యౌవత రతిచ్ఛిన్నాచ్ఛహారస్ఫురత్**
**గురుముక్తావళిcజేటికల్ విరులతోc గూడంగc ద్రోయ, న్నిజో**
**దరలగ్నంబగు దాని, నెమ్మొగి లధస్థంబై తతిన్ రాల్ప, నా**
**కరమభ్రంబని యంద్రుగా కుదధిcదక్కన్ పుట్టునే ముత్యముల్** 2-11

**నింగిటు త్రిశంకు కతన మాతంగ వాటి**
**యయ్యె నిcకనుండc దగదని యవని కేగి**
**నట్టి నక్షత్ర తారా గ్రహాళియనcగc**
**గాంత నవరత్నరాసులంగళ్ళc బొలుచు** 2-32

మున్నగు పద్యము లిందుకు తార్కాణములు. రాయలు మధురానగర వర్ణనమున పుష్పలావికలకును పూవులు కొననేగు యువకులకును జరిగిన సంభాషణమును వర్ణించియుండెను. (2-19-21) ఇట్టి రెండు మూcడు సందర్భములందుc దప్ప నతcడు శృంగార వర్ణన సందర్భమున నెంతో ఔచిత్యము పాటించెను. ఇవియైనను ఆ కాల ప్రభావమును బట్టి కావ్యమున ప్రవేశించినవి. రాయలకున్న వైష్ణవాభిమానము గ్రంథము నందంతటను కనిపించును.

**కచసక్త ఫణికంచుకము మౌళి వీర కే**
**దారంపుc బాగ చందము వహింపc**
**గలయ సంగమున మర్కట కీట కృతమైన**
**మగ్గంబు నేత్ర సంపద వహింప** 1-39

రాయల ధాటికి వెఱచి వింధ్య వాటి దాగిన గజపతి కేశముల నంటుకొనిన పాఁప కుబుసము వీర కేదారమనెడి యుష్ణీషము వలెను, అతని దేహము నందంతట నంటుకొనిన సాలీని తంతు రచన వలిపెంపు వలువ వలెను గోచరించినదని పై సీసపాదముల యర్థము. ఇది యానాటి సాలెవారి బట్టలనేఁత యందలి నేర్పును సూచించుచున్నది.

ఆముక్తమాల్యద యందలి రచన సమాసభూయిష్టమై యాలంకారికమై పండితైకవేద్యమై యుండును. అతనిది నారికేళపాకము. అదియునుగాక యతఁడెంతో గంభీరమైన యర్థమును రెండు మూఁడు పాదములలోనే వ్యక్తము చేయుటకు యత్నించును.

**ఖనటత్ పయోబ్ధి వీక్ష్య రసాతలాన్యోన్య**
**పిండీకృతాంగ భీతాండజములు** 1-3

మున్నగు పద్యములు చూచిన నీ విషయము తేటతెల్లమగును. ఇది గరుత్మంతుని ఱెక్కల గాలులను వర్ణించు పద్యము. గరుడుఁడొక్కసారి పక్షవిక్షేపము చేయగా సముద్రమునందలి నీరంతయు నాకసమున కెగురును. అంత పాతాళ లోకము కనిపించును. అందలి నాగములు గరుడవాసన సోకి భయముతో నొండొంటిని చుట్టుకొని యుండును. ఈ భావమును వ్యక్తము చేయుట కింకొక కవియైనచో రెండు మూఁడు పద్యములు వ్రాయును. రాయలందందు తమిళ కన్నడ పదములను కూడా వాడియుండెను. పసి(ఆఁకలి), ఎత్తిన(స్తుతించిన) విళంగాయ(వెలగకాయ), పెన్ దిరువడి (పెద్దశ్రీపాదము-గరుడుఁడని అర్థము) మున్నగునవి యిందుకు నిదర్శనములు. ద్రావిడ కవిసమయములను కూడ నీతఁడచ్చటచ్చట వాడి యుండెను(5-87) అతని కావ్యమున నేదోయొక అలంకారము లేని పద్యమే యుండదు. ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకము, భ్రాంతిమంతము, అతిశయోక్తి, స్వభావోక్తి మున్నగు నలంకారములు కావ్యమునందంతటను గోచరించును. అతఁడు వాడిన యుపమలు కొన్ని చోట్ల సహజములై అద్భుతములుగా నుండును.

**సామర దిదృక్షుఖన్థ రక్షఃపిశాచ** 4-13

**మునుదన సీమ సేసికొని** 4-219

మున్నగు పద్యము లట్టి యద్భుతోపములతోఁ గూడిన పద్యములలో రెండు మాత్రమే.

**తలపక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదారంపుఁగుల్యాంతర**
**స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకులుషఃస్నాత ప్రయాత ద్విజా**
**వలిపిండీకృత శాటికల్ సవి దదా వాసంబుఁ జేర్పంగరే**
**వులుడిగ్గ న్వెసఁ బాఱు వానిఁగని నవ్వున్ శాలిగోప్యౌఘముల్** 1-65

అను పద్యము చక్కని భావముతోఁగూడి స్వభావోక్తి భ్రాంతిమంతముల కాకరమై యున్నది. రాయలు శ్లేషాలంకారమును మూఁడు నాలుగు చోట్ల మాత్రమే వాడియుండెను. "కూరిమిఁ గృష్ణరాయ నృపకుంజర" (1-38) 'అయనిష్ఠన్ ధవళాతపత్రిదగు నయ్యాగంబు సాగంగ" (4-165) అను నవిందుకు నిదర్శనములు. రాయలు వాడిన శబ్దాలంకారముల సంఖ్య చాలా తక్కువ. "ఇందు కులావతంస మతఁ డేతఱి నేతరిగాఁడు" (2-40) వంటి పద్యము లెక్కడనో కాని కనిపించవు. రాయల భావము లుదాత్తములై అతి గంభీరములుగా నుండును. అతని పద్యములన్నియు కొంచె మించుమించుగా నిందు కుదాహరణములే.

**సైరంధ్రుల్ పయికెత్తి కజ్జలము పక్ష్మశ్రేణికిం దీర్ప వా**
**లారుంగన్నులు పైకిఁ జూచుతఱి ఫాలాంచ చ్చతుర్థీ నిశా**
**స్ఫారేందుంగనె వక్త్ర మక్కనుటఁగాఁ బర్వేందుడాత్మ ప్రభా**
**చోరుండుండఁగఁ దన్ను దద్గతవిభా చోరుండనున్ లోకముల్** 5-11

సైరంధ్రులు గోదాదేవి ఱెప్పలకు కాటుక పెట్టుచుండిరి. అప్పుడామె కన్నులు పైకి చూచెను. చవితి చంద్రుని వంటి ఫాలము కనఁబడెను. చతుర్థీ చంద్రుని చూచినచో నీలాపనింద కల్గుననుట యంద ఱెఱింగినదే. ఆ చూచినది వక్త్రము. చంద్రుడాఁమె ముఖకాంతిని హరించెను. కాని నిజమునకు ప్రజలు చంద్రుని కాంతినే ఆమె వక్త్రమపహరించెనని అపనిందమోపుచుండిరి. గోదముఖము రాకాచంద్రాతి శాయిగా నుండెనని తాత్పర్యము. ఇందలి భావమెంత సుందరమో అంత అద్భుతము. ఇట్టి పద్యములు కావ్యమున నెన్నియో కలవు. ప్రౌఢములైన సమాసములతోడను, గంభీర భావముల తోడను, బహువిధాలంకారముల తోడను, ఎడనెడ నపరిచిత పద ప్రయోగముతోడను కూడియుండుట చేతనే రాయల కావ్యము పండితైక వేద్యమైనది. ఇట్లని యాతఁడు జాతీయోక్తుల తోడను. నానుడులతోడను వ్రాసిన పద్యములు కొన్ని లేకపోలేదు.

**గ్రామ గ్రామంబున నొక**
**సామంతున కిడిన చలువ చప్పరములు త**
**న్నై మేదినిఁ గుంపటిలోఁ**
**దామరలుం బోలె నట్టి తఱి నొప్పారెన్** 2-69

**నానిశిఖి వంటచెఱకుల** 4-126

మున్నగు పద్యములిందుకు తార్కాణములు. ఇంటిలో నేదుమల్లయ్యె నిందు ముఖికి, కప్పురంబుపెట్టి యుప్పుకొనుట మున్నగు లోకోక్తులెన్నో కావ్యమున కనిపించును. రాయలు సంస్కృత వాక్యములనే చొప్పించి వ్రాసిన పద్యములు రెండు మూఁడున్నవి. ("ఆ నిష్ఠానిధి గేహసీమ" 1-84, అద్ధా వాగ్వి బుధమ్మ హోవచన కవ్యాహారమ్" 4-6) రాయలచ్చటచ్చట

చక్కని సంభాషణలు రచించి యుండెను, స్వామికిని విష్ణుచిత్తునికి జరిగిన సంభాషణము (స్వామీ నన్ను... ఇత్యాది) మాలదాసరికిని బ్రహ్మ రాక్షసునికి జరిగిన సంభాషణమును ఇందుకు నిదర్శనములు. రాయలాముక్తమాల్యదలో కొన్ని దీర్ఘ వచనములు చొప్పించెను. అవి యతని పాండిత్యమునకును, లోకపరిశీలనమునకును తార్కాణములు. విష్ణుచిత్తుని వర్ణనముతోఁ గూడిన వచనమును, విష్ణుచిత్తుఁడు స్వామితో తనకూఁతు నవస్థను వర్ణించుచు రక్షింపుమని ప్రార్థించు వచనమును అలఁతియలతి వాక్యములతోఁగూడి అతిసుందరములుగా నున్నవి. రాయలరచన యందలి శైలి అతని పాండితీ విజ్ఞానమునకు నెలవై పఠితలకాశ్చర్యము కలిగించును.

ఆముక్తమాల్యదలో నచ్చటచ్చట స్వతంత్రములైన సంధులును ప్రయోగములును కనిపించుచున్నవి. నింగి+ఇటు=నింగిటు, నిట్టతాడువంటి+అతివ=నిట్టతాడువంటతివ, గంజి+ఇండ్ల=గంజిండ్ల, అనునవి ఇకార సంధికిని, గంగ+అనుకాసె=గంగనుకాసె; చేష్ట+ఉడిగె=చేష్టుడిగె; రంగ భర్త+ అంచు=రంగ భర్తంచు అనునవి తత్సమాకార సంధికిని, చించి+ఇచ్చువారు=చించిచ్చు వారు, అంది+ఈన్=అందీన్, అనునవి క్త్వార్థ కేకార సంధికిని, పుట్టున్+ఈగెద=పుట్టన్నీగెద అనునది ద్రుతద్విత్వ సంధికిని నిదర్శనములు. పట్టుకొని యనుటకు పట్టుక యనియు, రెండు నాళ్ళనుటకు రెణ్ణాళ్ళనియు, దున్నన్ అనుటకు దునన్ అనుచు రాయలు ప్రయోగించి యుండెను. ప్రౌఢవ్యాకరణకర్త వీనిని ప్రయోగములుగా చూపి సమర్థించి యుండెను. రాయల రచనలో ఛందో విషయమున విశేషము లేవియు గానరావు. "అతులేతద్వదనేందు రాగ మిళనా ప్రాదుర్భవత్" 5-132 అనుచోట అకారమునకును ప్రాదుః అనుగతి సంజ్ఞక మందలి అకారమునకును యతి వేసి యుండెను. ఇచ్చట ప్ర+ఆ అని విడఁదీయుట కవకాశము లేదు.

వస్త్వైక్య రహిత మయ్యును ఆముక్తమాల్యద ఆంధ్ర వాఙ్మయమున కలంకారమని చెప్పఁదగిన ప్రబంధ రత్నము. అందలి భావములు గంభీరములు, పద ప్రయోగమద్భు తావహము; అలంకారములానంద సంధాయకములు. కథా కథన మతి రమణీయము; శైలి అనన్యసాధ్యము. అందుచేతనే తిమ్మన యతనిని 'కవితాప్రావీణ్య ఫణీశ' అని సంబోధించెను. ఆ సంబోధన అన్వర్థము.



## మహాంధ్ర కవితావిద్యాబలప్రౌఢి తెనాలిరామకృష్ణుని

# పాండురంగమహాత్మ్యము

అక్షరాస్యులైన ఆంధ్రులలో తెనాలి రామకృష్ణుని పేరెఱుంగని వారుండరు. అతనికి సంబంధించిన హాస్య కథలును, వికటకవితా కౌశలమును సర్వాంధ్రదేశ సుప్రసిద్ధములు. కాని అతని కావ్యములతో పరిచయమున్న వారి సంఖ్య మాత్రము చాలా తక్కువ. అందుకతడు సరసకవితాసనాథుఁడనని చెప్పుకొన్నను అందు సారస్యముతో ప్రౌఢత్వమును కూడ జత చేయుట యొక కారణము. అతఁడు రచించిన కావ్యములు మూఁడు మాత్రమే యిప్పుడు లభించుచున్నవి. మొదటిది ఉద్భటారాధ్య చరిత్రము. దీనినాతఁడు తిమ్మరుసు మంత్రి కల్లుడును, మేనల్లుఁడు నైన నాదెండ్ల గోపమంత్రికి రాజకార్యనిర్వాహకుఁడుగా నుండిన ఊరదేచమంత్రి కంకితము చేసి యుండెను. అప్పటి కాతఁడింకను శ్రీవైష్ణవమునకు మాఱి యుండలేదు. రెండవది పాండురంగమాహాత్మ్యము. దీని నతఁడు కృష్ణదేవరాయల తరువాత సదాశివరాయలకు లోఁబడి రాజ్యము చేయుచుండిన మహామండలేశ్వర మంగయ గురవరాజు కుమారుఁడు సంగరాజు కడ రాయసప్రవృత్తిలో (సంగ భూపాలమణి రాయసప్రవృత్తి) నుండిన విరూరి వేదాద్రిమంత్రి కంకితము చేసెను. మూఁడవది యైన ఘటికాచలమాహాత్మ్యము నాతఁడెవ్వరికి నంకితము చేయకుండనే మరణింపఁగా, తరువాత నతని పౌత్రుఁడు దానిని ఖండోజీ విచిత్రరాయఁడను ప్రభువునకు సమర్పించెను. ఇందలి కృత్యాది పద్యములను రామకృష్ణుఁడు వ్రాసి యుండలేదు. కృతిపతి తన కాశ్రితుఁడైన వేంకటగిరి యను కవిచే వానిని వ్రాయించుకొనెను. కావ్య రచన పూర్తియైన పిమ్మటనే కృత్యాది పద్యములను వ్రాయు నాచారము కలదనుటకు పెక్కు నిదర్శనములున్నవి. పై మూఁడు కావ్యములనేకాక రామకృష్ణుఁడు హరిలీలావిలాసము, కందర్పకేతువిలాసము, లింగపురాణము, ఆదిపురాణము, ప్రతిపద్య శిరఃకంపము, ఒక శతకము అను వానిని కూడ రచించెనని చెప్పుదురు. ఇందు మొదటి రెండింటినుండి కొన్ని పద్యములను పెదపాటి జగ్గకవి తన ప్రబంధ రత్నాకరమను సంకలన గ్రంథములో చేర్చి యుండెను. అప్పకవి ఆదిపురాణ మందలిదనియు, కస్తూరి రంగకవి ఇందుధరోపాఖ్యానము నందలిదనియు పేర్కొన్న "ఒక నాఁడిందు ధరుండు" అను పద్యము నాచనసోమన ఉత్తర హరివంశమున కానవచ్చుచున్నది. అందుచే నాదిపురాణ కర్తృత్వము సంశయాస్పదము, మిగిలిన రెండు గ్రంథములను రామకృష్ణుఁడు రచించె ననుట కాధారములు లేవు.

లక్ష్మమ్మారామపండితులు రామకృష్ణుని తల్లిదండ్రులు. రామపండితుని యింటిపేరు గార్లపాటివారు. వారు తెనాలిలో నివసించుటచే నది తెనాలిగా మాఱినది. వేదాద్రిమంత్రి రామకృష్ణుని 'తెనాల్యగ్రహారనిర్ణేత' యని వర్ణించెను. వారు కౌండిన్య గోత్రమునకు చెందిన యజుశ్శాఖా నియోగి బ్రాహ్మణులు. వారు శంకరుని అద్వైత సిద్ధాంతమునే ఆదరించినవారైనను శివభక్తి శైవసంప్రదాయముల కెక్కువ ప్రాధాన్య మొసంగినవారు. పాలగుమ్మివారు వారి శైవమతగురువులు. క్రీ.శ. 15వ శతాబ్దియందు అహోబలనృసింహక్షేత్రమునుండియు, తిరుపతి క్షేత్రము నుండియు శ్రీమద్రామానుజుల వైష్ణవ సంప్రదాయ మెక్కువగా ప్రచారము చేయబడెను. ఆ ప్రచారము ప్రభావముచే పలుకుటుంబములు వైష్ణవసంప్రదాయము నవలంబించెను. అట్టి కుటుంబములలో తెనాలివారి దొకటియని చెప్పవచ్చును. ఉద్భటారాధ్య చరిత్ర రచించు నాఁటి కింకను రామలింగఁడుగానే యుండిన కవి పాండురంగ మాహాత్మ్యము రచించునాటికి రామకృష్ణుఁడైనాఁడు. అప్పటి నుండియు నా పేరే లోకమున అధిక ప్రచారము పొందినది. రామకృష్ణుని తమ్ముఁడైన శ్రీగిరి మనుమఁడు రామభద్రకవి ఇందుమతీ పరిణయమున కృతిపతి "ప్రౌఢి మీ పెదతాత పాండురంగాది సత్కృతులు చేసెను రామకృష్ణ సుకవి" అని తనతో తెల్పు సందర్భమున రామకృష్ణ నామమునే వాడియుండెను. సంప్రదాయము మార్పుచే రామలింగఁడే రామకృష్ణుడైనాఁడను విషయము నెల్ల విమర్శకులు అంగీకరించినట్టిదే. పేరు మార్చుకొన్న తరువాత కూడ రామకృష్ణుఁడు శైవమతమును ద్వేషింపలేదనుటకు తరువాతి కృతులలో పెక్కు నిదర్శనములున్నవి.

శ్రీకృష్ణదేవరాయల భువనవిజయసభ నలంకరించిన అష్టదిగ్గజ కవులెవరను విషయమున విమర్శకులలో భిన్నాభిప్రాయములున్నవి. రామకృష్ణుఁడు పెద్దన, తిమ్మన, భట్టుమూర్తి, ధూర్జటి మున్నగు వారితో వాదము పెట్టుకొన్నట్లు తెల్పు చాటు పద్యము లిప్పటికిని ప్రచారముననున్నవి. అతఁడు రాయలవారిని కూడ పరిహసించిన సందర్భములు కొన్ని లేకపోలేదు. వీనిని బట్టి తరువాత మఱికొన్ని కథలు కల్పింపబడి యుండవచ్చును. అందుచే అన్నియు అభూత కల్పనలేయని కొట్టివేయుటకులేదు. రాయలు 1515లో కొండవీటి దుర్గమును స్వాధీనము చేసికొన్న పిమ్మట తిమ్మరుసు తన అల్లుఁడైన నాదెండ్లగోపమంత్రి నాదుర్గమున కధిపతిగా చేసియుండెను. అతడు తనకడ రాజకార్యనిర్వాహకుఁడుగా నుండిన ఊరదేచ మంత్రికి 1517వ సంవత్సరమున ఒక అగ్రహారము దానము చేసి యుండెను. అతనికి ఉద్భటారాధ్య చరిత్రము నంకితముచేసిన రామలింగఁడును అప్పటివాఁడే యైయుండును. ఈకృతి ప్రదానము 1525 ప్రాంతమున జరిగియుండుననియు, దేచమంత్రి సాయమున అతఁడు గోపమంత్రి ప్రాపును అతనిద్వారా తిమ్మరుసు అనుగ్రహమును సంపాదించి భువనవిజయ సభలో ప్రవేశమునొంది యుండుననియు భావింపవచ్చును. దీనినిబట్టి అతఁడు రాయల రాజ్యము చివరికాలమున అష్టదిగ్గజ కవులలో చేరియుండును. అతఁడు 1495,

1500 సంవత్సరముల మధ్యకాలమున జన్మించి సుమారు 75 సంవత్సరములు జీవించియుండును. అతఁడు రాయల జీవితకాలమున నైదాఱేండ్లు మాత్రమే అతని కొలువున నుండి యుండుటచే అతనికికాని మంత్రి తిమ్మరుసునకుఁగాని యేకృతిని అంకిత మిచ్చుట కవకాశము కలిగియుండలేదు.

లభ్యములగుచున్న రామకృష్ణుని మూడుకృతులలో శ్రేష్ఠమైనది పాండురంగ మాహాత్మ్యము. దీనిని రామకృష్ణుఁడు వైష్ణవ మతమును స్వీకరించిన పిమ్మటనే రచించెను. వాక్కాంతాశ్రయుఁడైన భట్టరు చిక్కాచార్యులు తనకు గురువని అతడతనినందు కీర్తించెను. వేదాద్రిమంత్రి రామకృష్ణుని

**తగసంస్కృతము తెనుంగుగఁ జేయఁ దెనుఁగు సం**
**స్కృతముగఁ జేయంగఁ జతురమతివి,**
**నలుదెఱంగుల నెన్నఁగల కావ్యధారల**
**ఘనుఁడ వాశువునందుఁగరము మేటి,**
**వఖిలభూమీపాల కాస్థాన కమలాక**
**రోదయ తరుణ సూర్యోదయుఁడవు**
**శైవవైష్ణవ పురాణావళీ నానార్థ**
**ములు నీకుఁగరతలామలక నిభము**

**లంధ్రభూమీకుచా గ్రహారాభమైన**
**శ్రీ తెనాల్య గ్రహారనిర్ణేత, వగ్ర**
**శాఖికా కోకిలమవీవు, సరసకవివి**
**రమ్యగుణ కృష్ణ! రామయ రామకృష్ణ!** 1-23

అని ప్రశంసించి "యశము కలిగించు నీ మృదు విశదోక్తులఁ బౌండరీక విభు చరితఁ జతుర్దశ భువన వినుతముగ శుభవశమతి నాపేర నుడువు" మని కోరి యుండెను. దీనినిబట్టి కావ్య నామము పౌండరీక విభుచరితమని తెలియుచున్నది. కాని కొన్ని ప్రాంత ప్రతులలోను, ఆశ్వాసాంత గద్యములందును పాండురంగ మాహాత్మ్యమను పేరే కానవచ్చుచున్నది. కావ్యమున క్షేత్ర దైవతమునకు పాండురంగఁడను పేరెట్లు వచ్చినదో తెల్పఁబడి యుండలేదు. కాని ఆ కాలమున విజయనగరమందు పాండురంగస్వామి గొప్ప వైభవముతోనుండి భక్తుల పూజలు కొనుచుండెను. ఇప్పటికిని ఆపాడుపట్టణమున విట్టలరాయని గుడి శిల్ప కళావైభవముతో నలరారుచు చూపరులకు కన్నుల విందొనరించుచున్నది. నిజమునకు పండరంగని క్షేత్రము రామానుజ సంప్రదాయమునకు చెందినది కాదనియు, మాధ్వులైన మహారాష్ట్ర కర్ణాటకులకు ప్రాణప్రదమైనదనియు, నైనను రామానుజ సంప్రదాయానుయాయులైన కృతిపతియు,

కృతికర్తయు ఆ క్షేత్ర కథయందు శ్రద్ధాభక్తులు చూపుట కామూర్తి కాకాలమున దేశీయముగా వెలయుచుండిన వైభవములే కారణమనియు శ్రీమాన్ అనంత కృష్ణశర్మ గారు తెల్పియున్నారు. అందుచేతనే రామకృష్ణుఁడు కూడ కావ్యమును పాండురంగమాహాత్మ్యమనియే పేర్కొని యుండును. పాండురంగమాహాత్మ్యారంభమున నాదేవుని రామకృష్ణుఁడు "స్కందపురాణ నీరనిధి కౌస్తుభమై ప్రభవించు దేవకీ నందను"ఁడని ప్రస్తుతించెను. దీనినిబట్టి కవి కథావస్తువును స్కందపురాణము నుండి గ్రహించెనని తెలియుచున్నది. శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు ఈ కథ స్కాందపురాణోత్తర సంహితలో ఉమామహేశ్వర సంవాద రూపమున నవాధ్యాయ పరిమితమైన యొక రచనలోనున్నదనియు, అది బహుశః తెలుగుఁ రచనకు తరువాతనే కల్పింపఁబడి యుండవచ్చునని తెల్పి యున్నారు. తెలుఁగు కావ్యమునందలి పదములే పెక్కందు యధాతథముగ ప్రయోగింపఁబడియున్నవి. మఱియు నిగమశర్మ, రాధిక, సుశీల, సుశర్మ, అయుత నియుతులు మున్నగు వారి వృత్తాంతములా మూలమున లేవు. మిగిలిన వైనను సంగ్రహముగా నున్నవి. తెలుఁగును బట్టియే మూలము సృజింపఁబడియుండునని శ్రీ వేంకటరమణయ్య గారు తలంచుటకివియే కారణములు. ఇది సంభావ్యముకాదు. కాని రామకృష్ణుఁడే స్కందపురాణము నుగ్గడించి యుండుట చేతను, అది బహువిస్తృతమైన గ్రంథమగుట చేతను అందెచ్చటనైన తెలుఁగు గ్రంథమునకు మూలమనఁదగిన భాగము న్నదేమో పరిశీలింపవలసియున్నది.

మున్నొకప్పుడు శౌనకాది మహర్షులు సూతునిఁగాంచి క్షేత్రమును, వేల్పును, దీర్థమును, ఇహపరార్థ ప్రాప్తిమూలములై యొక్కచో నున్నచో తెల్పుమని కోరిరి. సూతుఁడు వారికిట్లు చెప్పెను. "పూర్వమగస్త్యుఁడు లోపాముద్రతో కాశీనగరమున నుండి దేవతా ప్రార్థితుఁడై దక్షిణమున కరిగి వింధ్యపర్వతము గర్వము నడఁగించెను. పిమ్మట నతఁడు కొల్లాపురీ లక్ష్మిని సేవించి, యటనుండి తుంగభద్రానదిని దాఁటి స్వామి మలపై నున్న కుమారస్వామిని దర్శించెను. అల స్వామి తాను రచించిన స్కాందపురాణమునందలి పూర్వోత్తర భాగములు వినిపించి యింకేకథ వినఁగోరెదవని అగస్త్యు నడిగెను. అగస్త్యుఁ డంత శౌనకాది మునులు సూతునడిగిన విషయమునే తెల్పమని కోరెను. స్వామి 'తీర్థమును, క్షేత్రమును, వేల్పును క్షితితలమున నొక్కచోఁ గూడి యుండుట నా మదికి తోఁచుటలేదు, శివుని వలన నీ విషయము నెఱుంగుదము రం'డని పల్కి వారితోడను సముచిత పరివారముతోడను కైలాసమున కరిగెను. ఆ సమయమున శివుఁడు పార్వతితో ప్రమదవన విహారమొనరించి యొక సరస్సు నొద్దనఁ గల కేళికనకాద్రిపై సుఖముగాఁ గూర్చుండ పార్వతి భర్తకు నమస్కరించి తీర్థ క్షేత్ర దైవతములు మూడు సమప్రధానములై యొక్కచోఁగలసి యున్నచో నెఱిఁగింప వలెనని వేడుకొనెను. శివుఁడా విషయము వినిపింపఁబోవుచుండ కంచుకులు కుమారాగస్త్యాదుల రాక తెలిపిరి. శివుఁడు వారిని లోనికి రప్పించి వారి రాకకు కారణమడిగెను. వారును అదే ప్రశ్న మడిగిరి. శివుఁడిట్లు చెప్పెను.

"ఘర్మవీరానది భైమీనదిలోఁ గలసినచోట దక్షిణ తీరమునఁగల తీర్థక్షేత్రములకు పౌండరీకములను ప్రసిద్ధి కలదు. అచ్చుట విష్ణువు పాండురంగ నామముతో విలసిల్లు చుండును. ఆదికల్పమున పదునెనిమిదవ ద్వాపరము చివర పుండరీకుఁడను ముని యచ్చుటకృష్ణుని గూర్చి తపమొనరించెను. కృష్ణుఁడు ప్రత్యక్షమై వరమేమికావలెనని యడిగెను. పుండరీకుడా దేవుఁడా రూపముతోడనే యచట నుండవలెననియు,నచ్చుటి తీర్థ క్షేత్రములు తన పేర పౌండరీకములని ప్రసిద్ధి గాంచవలెననియు ప్రార్థించెను. కృష్ణుఁడాతనికా వరమొసంగెను. ఆ పుణ్యస్థలమే మీరడిగిన ప్రశ్నకు సమాధానము" అని చెప్పి శివుఁడా స్థలము నందలి వాకిళ్లను, అచ్చుట నుండు దేవతలను, తీర్థములను, ఇతర విశేషములను, త్రిదంష్ట్రుఁడను రాక్షసుని వృత్తాంతమును, ముక్తకేశినీ క్షేత్రవృత్తాంతమును, పాండురంగఁడు పొంగిపొరలి వచ్చు భైమీనదిని తన పాదముల మీఁదుగా ప్రవహింపుమని శాసించుటయు తెల్పెను. తరువాత నతఁడు నరసింహుఁడచట ముప్పది రెండు బాహువులతో నుండుటయు, అగస్త్య, బ్రహ్మ, చక్ర, సంగమ, సూర్యాది తీర్థముల వృత్తాంతమును వారి కెఱింగించెను.

అంత శౌనకుఁడు సూతుని "విష్ణువు యదుకులమున నందునిపట్టియై పుట్టుటకుఁ గారణమేమి? రాధ యెవ్వరు? రాధా కృష్ణులకుఁ గల సంబంధమెట్టిది? భైమీనది శివుని దేహమునుండి యెట్లు పుట్టెను. విష్ణుమంత్రరహస్యమెట్టిది" అని యడిగెను. సూతుఁడు శౌనకునిఁజూచి "అగస్త్య కుమారాదులు శివునివలన తమకుఁ గావలసిన వృత్తాంతము తెలిసికొని తిరిగి పోవుచుండఁగా శివునికడకరుదెంచుచున్న నారదుఁడు వారిని గాంచి, వారు శివుని వలనఁ దమకుఁ గలిగిన ఏదో సందేహమును దీర్చుకొని మరలి పోవుచుండవచ్చునని యూహించి వేవేగ శివుని దర్శించి, యతని నుతించిఁ 'దేవా! కుమారాదు లిప్పుడే యిచ్చుట నుండి తిరిగి పోవుచుండుట గాంచితిని. వారు తమ్మే మడిగిరి. తమరే సమాధాన మొసంగిరి తెల్పుం'డని ప్రార్థించెను. అంత శివుఁడగస్త్యాదులును పార్వతియు తన్నడిగిన ప్రశ్నమును, దను వారికిచ్చిన సమాధానమును ఎఱింగించెను. నారదుఁడపు డట్టి యుత్తమోత్తమ క్షేత్రమును గూర్చి తనకుఁ గూడ తెల్పుమని వేడెను. శివుఁడాతనికి పాండురంగ క్షేత్ర మాహాత్మ్యమును వివరింప మొదలిడి మొదట నచటి నరసింహక్షేత్రమహత్త్వము తెల్పుచు నిగమశర్మ కథ నిట్లు చెప్పెను.

"కళింగదేశమందలి పీఠికాపురమున సభాపతి యను వేదవేదాంగవేత్తయైన విప్రసత్తముడు కలఁడు. అతనికి లేకలేక నిగమశర్మ యను పుత్రుఁడుదయించెను. అతఁడు వివాహితుఁడయ్యు వ్యసనపరాయణుండును, అన్యకాంతాసక్తుఁడునై తిరుగుచు తండ్రి సంపాదించిన ఆస్తినంతను పాడుచేసెను. అతఁడింటికి వచ్చుటయే యరుదయ్యెను. అతనికి బుద్ధిచెప్పి సన్మార్గమునకు త్రిప్పుతలంపుతో నతనియక్క భర్తతోడను బిడ్డలతోడను పుట్టింటికి వచ్చి, హఠాత్తుగా నచటికరుదెంచిన తమ్మునికి సమస్తోపచారములొనరించి, హితోపదేశము

కావించెను. అతఁడు తనవర్తనమును మార్చుకొన్నట్లు నటించి యొకనాఁటి రాత్రి యింటిలోనివారందఱు నిద్రించుచుండగా వారి యాభరణము లన్నియు మూటకట్టుకొని యిల్లువిడిచిపోయెను. అతఁడడవి దారిని పోవుచుండఁగా దొంగలగుంపతని చావఁగొట్టి యాభరణములన్నియు నపహరించెను. మృతప్రాయుఁడై పడియున్న నిగమశర్మ నొకకాపు చూచి జాలితలఁచి యింటికిఁ గొనిపోయి చికిత్సచేయించెను. అందకత్తెయైన ఆ కాపుకోడలాతని వలచి వలపించుకొనెను. నిగమశర్మ యామెతో రహస్యముగ క్రీడించుచు కొన్ని నాళ్ళు గడిపి యొకనాఁడాయూరి గంగజాతరలో పాల్గొని యెల్లరు నిద్రించుచుండ నాకాపుకోడలితోకూడ నిల్లువిడిచిపోయెను. వారొక యడవికేగి యచ్చటి బోయలలో కలసిపోయిరి. కొంతకాలమైన పిదప నాపడఁతి మరణించెను. అనంతరము నిగమశర్మ యొక చండాల వనితతో కాపురము చేయుచు నామెవలన సంతానము కూడఁ బడసెను. ఒకనాఁడతఁడు వేటకేగిన సమయమున నతని కుటీరము కాలిపోయెను. చండాల వనితయు బిడ్డలును అందు మరణించిరి. నిగమశర్మ యింటికివచ్చి భార్యాపత్య మరణమునకు విలపించి నిద్రాహారములు లేక యాయా చోటులఁదిరుగుచు తుదకు శ్రీనరసింహ క్షేత్రమున కరుదెంచి యచ్చట నసువులు వాసెను. యమదూతలాతని పలువిధముల బాధించుచు నరకమునకుఁ గొని పోవుచుండ నతఁడా బాధలకోర్వఁజాలక యాక్రందన మొనరించెను. విష్ణువు భక్తరక్షణార్థ మచ్చట నుంచిన చక్రమామొఱ విని, యమకింకరులను తఱిమి యతని బాధావిముక్తుని గావించెను. విష్ణుదూతలరుదెంచి యతని శ్వేతద్వీపమందలి పరమపదమునకుఁ గొనిపోయిరి. అతఁడచ్చట కుముదుఁడను భాగవతోత్తముఁ డయ్యెను. పరమపాపాత్ముఁడైన నిగమశర్మ యట్టి యుత్తమ పదవి నొందుటకు నరసింహక్షేత్రమున మృతినొందుటయే కారణము. ఆక్షేత్రమునకు దక్షిణమున నేను నివసింతును. ఎట్టి పాపులైన నచ్చట మరణించినచో నింద్రపదవి బొందుదురు". శివుఁడు తెల్పిన కథవిని నారదుఁడచ్చటి తీర్థక్షేత్రదైవతములను గూర్చి వివరింపఁగోరెను. శివుఁడు నృసింహక్షేత్రము, చంద్రభాగానది, పౌండరీకక్షేత్రము, తన్మాహాత్మ్యము మున్నగు వానిని వివరించి ఆ క్షేత్రము నడుమ కృష్ణుఁడు పాండురంగడనుపేర వెలసియుండునని తెల్పెను. నారదుఁడంత విష్ణువాక్షేత్రమున వెలయుటకుఁ గారణ మేమని ప్రశ్నింప శివుఁడిట్లు చెప్పెను.

"పూర్వము పుండరీకుఁడను ముని యచ్చట ఘోరమైన తపమాచరించుచుండ తత్తపోజన్య తాపమున లోకములన్నియు నుడికిపోవుచుండెను. బ్రహ్మ ఆ విషయము నెఱిఁగింప విష్ణుసన్నిధి కరిగెను. సరిగా నాసమయముననే దుష్టజనుల భారము భరింపఁజాలక భూదేవి తనదీనస్థితి విష్ణువునకుఁ దెలుప శ్వేతద్వీపమున కేతెంచెను. విష్ణువు వారి స్తుతులకలరి, దర్శనమొసంగి, దుర్మార్గులగు రాజులను సంహరించి భారము నుడిగించెదనని భూదేవికిని, పుండరీకునికి ప్రత్యక్షమై వరములొసంగి యతనితపము మాన్పెదనని బ్రహ్మకును దెల్పి వారినూఱడించి

పంపివేసెను. తరువాత విష్ణువు భూదేవికి వాగ్దానము చేసినట్లు దేవకీవసుదేవులకు కృష్ణుం డనుపేర పుత్రుండుగా పుట్టి బాల్యమునుండియు ననేకములైన యద్భుతకార్యము లొనరించెను. కృష్ణునకానందము కలిగింప బ్రహ్మ యొక శక్తినిబంప నామె నందునిమఱందియగు శతగోపునికి రాధయను పేర కూంతురుగా జన్మించెను. రాధాకృష్ణుల కొండొరులపై ననురాగముదయించెను. రాధ మాధవుండే తనకు భర్తకావలెనని గోవర్ధనాచలము చెంతంగల ఋణవిమోచన తీర్థమున ఆయా ఋతువుల ననుసరించి తీవ్రమైన తపము కావించెను. శరదృతువున విష్ణువామెకు ప్రత్యక్షమై యామెకు కోరిన వరమొసంగెను. ఇంక నట తపము చేయుచుండిన పుండరీకునకు బ్రహ్మ ప్రత్యక్షమై విష్ణువాతనికి సాక్షాత్కరించి ముక్తి నొసంగుననియు, నాక్షేత్రము దేవమునిసేవితమగు ననియు తెల్పి వెడలిపోయెను. పుండరీకుండు సంతసించి విష్ణు ననన్య భక్తితో ధ్యానించుచుండ మూండవనాండు విష్ణువతనికి ప్రత్యక్షమయ్యెను. పుండరీకుండతని తేజమునకు బెదరి పాఱిపోవుచుండ విష్ణువు నవ్వెను. పుండరీకుండు భయమువీడి వెనుకకువచ్చి యతని స్తుతించెను. విష్ణువు వెంటవచ్చిన నేనును దేవతలును పుండరీకునిగుణములు ప్రశంసించితిమి. విష్ణువు పుండరీకుని కరుణార్ద్ర దృష్టితో చూచి వరము వేడుకొనుమన నతండు"దేవా! ఈ తీర్థక్షేత్రములు మహనీయములై యుండవలయును. నీవిచ్చట భక్తులకు దివ్యదర్శనమొసంగవలయును. ఈ తీర్థక్షేత్రములు నా నామముతో ప్రసిద్ధినొందవలయు"నని ప్రార్థించెను. విష్ణువాతని కావరములొసంగెను. విష్ణువాతీర్థమున హస్తద్వయము కటిపై నిడుకొని ప్రాక్పశ్చిమాభిముఖుండై రెండు మూర్తులతో వెలసెను. లక్ష్మీ, హ్రీ, శ్రీరూపములతో నతని రెండురూపములతో సేవించుచుండును. గరుడుండెదుట నుండును. సనకాదులును బ్రహ్మయు నేనును అతని చుట్టునుందుము. పంచశరద్వయస్కుండైన దేవుండు దిగంబరుండై రెండుకాళ్ళ నడుమ గోయష్టి నిఱికించుకొని యుండును. అతని దర్శించినచో నెట్టి పాపములైన నశించును. మున్ను గోవు, కాకి, హంస, చిలుక, పాము, మధుకరము మున్నగున వాదేవుని సేవించి యుత్తమజన్మములనొంది చివర ముక్తింగాంచినవి. నీకావృత్తాంతము లెఱింగించెదను.

"పాండురంగండు భీమరథీ నదీతీరమున వేణుగాన మొనరించుచుండ విని యొక గోవు పరవశమై పాలుస్రవింపంజేసెను. అందొక బిందు వెగిరి ఆ దేవునితలపై పడెను. అందుచే నాగోవు దేవునికి క్షీరాభిషేక మొనరించిన పుణ్యము నొంది తత్ఫలితముగా మఱుపుట్టువున సుశీలయను పేరనొక విష్ణుభక్తునకు కూంతురుగా పుట్టెను. యుక్తవయస్సు రాంగానే తండ్రి యామెకు యథావిధిగా పెండ్లి కావించెను. ఆమె భర్త క్రూరుండు, కడుంగడు లోభి. అతండెన్ని బాధలు పెట్టుచుండినను సహించి సుశీల యాతని సేవించుచు మహాపతివ్రతయను పేరుగాంచెను. ఒకనాండామె భర్త గ్రామాంతరమున కరిగిన సమయమున కృష్ణుండు పొట్టివడుగు వేషమున సుశీల యింటికరిగి తాను భరింపరాని యాంకలితో బాధపడుచుంటిననియు, వంటచేసిపెట్టువఱకు సైపలేనికతమున చల్దియన్నమునైన

భుజించెదననియు తెల్పి తనకన్నము పెట్టుమని కోరెను. ఆమె పెట్టిన అన్నమతనికి చాలలేదు. అప్పుడు సుశీల భర్త దాచియుంచిన భక్ష్యములు తెచ్చి యాతనికి పెట్టెను. అప్పటికిని ఆతని యాకలి తీరలేదు. సుశీల అతఁడు సామాన్యవటువు కాఁడని తలంచి కావలసిన వంటకముల ననుగ్రహింపుమని అగ్నిదేవుని ప్రార్థించెను. అతని యనుగ్రహముచే పలురకముల వంటకములు సిద్ధమయ్యెను. అంత నావటువామెకు కృష్ణరూపమున ప్రత్యక్షమై యామెపూర్వ వృత్తాంతము తెల్పి సాధ్వీ! నీభక్తికి మెచ్చితిని." నిన్ను పరీక్షించుటకే నేనిట్లు వచ్చితిని. నీ భర్త క్రూరుఁడగునట్లు చేసినవాఁడను నేనే. పూర్వమతఁడకృత సత్కృతుఁడను విప్రుఁడు. అతడు పాపాత్ముఁడయ్యు నొక యుత్సవమున నాకు నివేదించిన అన్నము నరసిన సుకృతముచే నుత్తమ బ్రాహ్మణవంశమున జనించి సర్వవిద్యానిష్ణాతుఁడై నిన్ను చెట్టపట్టెను. నేఁటి నుండి యతఁడుత్తముఁడగును. నీ కతనివలన నేవురుపుత్రులు కల్గుదురు. నీవు శతసంవత్సరములు జీవించి భర్తతోఁగూడ మోక్షము నొందుదు"వని పల్కి యదృశ్యుఁడయ్యెను. సుశీల శేష జీవితము నుత్తమ రీతిని గడపెను. ఆమె కైదుగురు పుత్రులు పుట్టిరి. గోవు సుశీల కాకాదులామె యైదుగురు పుత్రులు.

**"సమ్మార్జనమున ధ్వాంక్షము, నుపవేపనం**
**బున మరాళము,రంగమున విచిత్ర**
**శుకము, దీపాంకుర ప్రకటనంబునఁ బాము,**
**పదపద్మ తీర్థానుభవము కతన**
**సరఘయు, నూధస్య పరిషేచనంబున**
**ధేనువు, మోక్షంబు తెలువుగనియె"** 4-137

పాండురంగని కీశాన్యదిక్కున క్షేత్రపాలుఁడను కాల భైరవుఁడుండును. ఒకప్పుడు గంధర్వుఁడొక్కడు విమానమెక్కి గుడిపై నుండి పోవుచుండ కాలభైరవుఁడు చూచి కోపమున పై కెగిరి యాతని క్రిందకీడ్చి చంప సమకట్టెను. కరుణాళువగు పాండురంగఁడాతని వారించి గంధర్వుని కాపాడెను. గంధర్వుఁడతని నుతించి వెడలిపోయెను. భక్తులు తొలుత నా క్షేత్రపాలుని చూచిన పిమ్మటనే విఠలదేవుని దర్శింపవలెను".

నారదుఁడు శంకరుఁడు చెప్పిన వృత్తాంతము విని ఆ క్షేత్రమునకుఁగల ద్వారములను, అందుండు దైవతములను, స్థలవిశేషములను దెలుపుమని యడుగ శివుఁడు వానినెల్ల వివరించెను. దక్షిణద్వారమున పుష్పావతీ సంగమతీర్థములుండును. బోయఁడొకఁడు వేఁటకేఁగి యొకజింకను తఱిమి దానిహృదయమును వాడిబాణముతో నేసెను. అది యాబాణజనిత వేదనతో పరువెత్తి సంగమతీర్థమున మునిగి మరణించెను. ఆ తీర్థము ప్రభావమున నది గంధర్వరాజుగా మాఱి ఆకసమున కెగసెను. అది చూచి "ఆశ్చర్య చకితుఁడైన బోయఁడా తీర్థమున స్నానమాడి యందలి జలముత్రాగి పాపవిముక్తుఁడై దివ్యత్వము

నొందెను. తొల్లి యచ్చట సంగముఁడను రాక్షసుఁడు శిలక్రింద దాగియుండ విష్ణువతనిని బయటికీడ్చి చంపెను. కురుక్షేత్ర సంగ్రామమైన పిమ్మట ధర్మరాజు బంధువధ జనిత శోకముచే కుందుచుండ బ్రహ్మమానసపుత్రుఁడైన సనందనుఁడు శిష్యసహితుఁడై యతని దర్శించి పౌండరీక క్షేత్రమున కరిగిన నా శోకము పోవునని యుపదేశించెను. ధర్మజుండట్లే యొనరించి పాపసంతాప విముక్తుఁడయ్యెను. పాండురంగని కుత్తరముగా బోధిద్రుమరూపమున నృసింహుదుండును. అతనికి వేలకొలఁది దేవకన్యలు నీరాజనమిచ్చుచుందురు. అటనున్న కుండలతీర్థమున స్నానముచేసి నృసింహుని దర్శించువారికి రాజసూయ యాగమొనరించిన ఫలమబ్బును. ప్రయుతపుత్రుఁడైన అయుతుఁడు శాపవశమున కప్పయయ్యె నచ్చటనే ముక్తుఁ డయ్యెను. విఠలునికి పడమట పద్మతీర్థము కలదు. త్రిదంష్ట్రుఁడను రాక్షసుని చంపుటకై విష్ణు వచ్చట పద్మాయుధమును దాచి యుంచెను. అందు స్నానము చేసినవారికి ముక్తి లభించును. సుశర్మయను కిరాతుండు వేఁట కరిగి దప్పిగొని పద్మతీర్థమున స్నాతుఁడై తజ్జలము త్రాగెను. అతఁడు మరణించిన పిమ్మట చిత్రగుప్తుఁడు తాను వ్రాసి యుంచిన సుశర్మ పాపముల పట్టికను తెప్పించి చూచెను. అందొకటియు కనఁబడలేదు. తరువాత యముని యాదేశమున నతఁడు ప్రతిపుటయు పరికించిచూడ నొకచోట ఇతఁడొకనాఁడు పద్మతీర్థమున స్నానమాడి నందున నితని పాపములన్నియు నశించిన" వను విష్ణువు వ్రాఁత కనిపించెను. చిత్రగుప్తుని వలన నావిషయము విని, యముఁడు పద్మతీర్థప్రభావమును గొనియాడి, యాతని గౌరవించెను. తరువాత నతఁడు స్వర్గమున కరిగి యింద్రభోగములనుభవించి భూలోకమునం దుత్తమ కుటుంబమున జన్మించి పాండురంగనిగుడి నూడ్చుచు సుఖముగ పెక్కేండ్లు గడపెను. ఆ పుణ్యముచే నతండు చంద్రలోకమున కరిగి పెక్కు భోగములనుభవించి సుకీర్తియను సార్థకనాముఁడైన రాజుగా పుట్టి భక్తుఁడై, నిండువయస్సుననే సన్యసించి యవసానమున మోక్షము నొందెను.

కృతయుగమున హిరణ్యకశిపునకు పార్ష్ణిగ్రాహియను పుత్రుఁడుండెను. ఏకదంష్ట్రుడైన యతనిని నరసింహమూర్తి సంహరించెను. త్రేతాయుగమున నతండు ద్విదంష్ట్రుడైన అతికాయుడుగా పుట్టి రామునిచే నిహతుడయ్యెను. ద్వాపరమున నతడు త్రిదంష్ట్రుఁడుగా పుట్టి పాండురంగక్షేత్రమున కరుదెంచి కోపమున నాదేవుని గదతో వ్రేసెను. పాండురంగఁడు దానిని తూలించి త్రిదంష్ట్రుని సంహరించెను. అతని గదాఘాతమున కృష్ణుని మొలనున్న జాలెసంచి తెగి క్రిందపడెను. అది యిప్పటికి నచ్చట కానవచ్చును"

పై వృత్తాంతములన్నియు తెలిపి విష్ణువు తన హృదయమున దాచిన సిద్ధమంత్రమును తనకే తెల్పియుండెనని శివుడు నారదునికి చెప్పెను. అంత నారదుఁడా మంత్ర రహస్యమును తనకు తెలుపుమని శివునిప్రార్థింప శివుఁడు దానినాతనికుపదేశించి దాని మహిమాతిశయము వివరించెను. పూర్వము శివుఁడు త్రిపురములను దహించునపుడాతని దేహము నుండి స్వేదము

నదియై పాఱెను. శివునకు భీముఁడను పేరుకూడ నుండుటచే దానికి భైమి, భీమరథి అను నామములుకలిగెను. అది పొంగిపొరలుచు క్షేత్రమువైపు వచ్చుచుండఁగా చూచి క్షేత్రవాసులు వెఱచి మొఱపెట్టిరి. క్షేత్రపాలుఁడగు భైరవుఁడు దానినడ్డగింప భైమి విష్ణుని శరణు వేఁడెను. విష్ణువు దానికి అభయమొసంగి తనపాదముల మీదుగా ప్రవహింపఁజేసెను. అట్లు ప్రవహించిన తీర్థమే నరసింహతీర్థము, ఒక గోపిక కృష్ణునిగూర్చి ఘోరమైన తపస్సు చేయఁగా నతఁడామెకు ప్రత్యక్షమయ్యెను. అప్పటి సంభ్రమమున నామె కేశనీవీబంధములు శిథిలములయ్యెను. ఆమె కృష్ణుని చరణములను తనచేతులతో గట్టిగ పట్టుకొనెను. గంగ ఆమెవ్రేళ్ళ మీదుగ ప్రవహించి ముక్తకేశినీ తీర్థమయ్యెను. తరువాత శివుఁడు నారదుఁడడుగఁగా సుశీలపుత్రులు తల్లిదండ్రులు మరణించిన పిదప పాండురంగని భక్తులై పెక్కు సుఖముల ననుభవించి సశరీర స్వర్గము నొందిరని తెల్పెను. నారదుడంత "సంసార సముద్రమున మునుఁగుచు తేలుచునుండు వారికి విష్ణువు మోక్షమెట్లిచ్చెను? సంసారులకే ముక్తి లభించుచో నింక సన్యాసము వలన ప్రయోజనమేమి?" అని అడిగెను. శివుఁడు గృహస్థ ధర్మముకంటె వేఱొక యుత్తమ ధర్మము లేదనియు, ముక్తి సంసారులకుఁగూడ లభించుననియు తెలిపి దానికి నిదర్శనముగా నయుతనియుతుల కథ వివరించెను.

"ప్రయుతుఁడను మునికి అయుతుఁడు నియుతుఁడు అను నిరువురు పుత్రులుండిరి. వారగస్త్యమునికి ప్రియశిష్యులు. విద్యపూర్తి అయిన పిమ్మట వారికి పెండ్లిచేయనెంచి యగస్త్యుడు బ్రహ్మలోకమున కరిగి, గాయత్రి, సావిత్రి అను నతని నిరువురు పుత్రికలను దెచ్చెను. అయుతుఁడు గురు వెంతచెప్పినను సంసారము నంగీకరింపలేదు. అగస్త్యుఁడంత వారినిద్దరిని నియుతునికే యిచ్చి పెండ్లిచేసి అయుతుని తన యాశ్రమము నుండి పంపివేసెను. అయుతుడు దూరముగా పోయి ఘోరమైన తపస్సొనరించెను. ఇంద్రుఁడాతని తపమునకు భంగము చేయదలంచి వానప్రస్థునివేషమున సపరివారుఁడై అయుతుఁడున్న చోటికివచ్చి గృహస్థాశ్రమము స్వీకరింపవలెనని పెక్కువిధముల నతనికి హితోపదేశము గావించెను. కాని అయుతునికి సంసారాసక్తి కలుగలేదు. ఇంద్రుఁడు కుపితుఁడై యతనిని నిందించి కార్యమును సాధించుటకై వృద్ధగోరూపముననున్న కామధేనువు నట విడిచి వెడలిపోయెను. అది నీరసపడి చావసిద్ధముగానున్నట్లు నటింపఁగా నయుతుఁడు దానిని చూచి జాలిపడి దానికి పెక్కు విధముల సంరక్షణ మొనరింప మొదలిడెను. అతని కాలమంతయు నా గోరక్షణమందే గడచిపోవు చుండెను. అయుతుడిది గ్రహించి, దానిచే తనతపస్సునకు భంగమగుచున్నదని యెఱింగి, దాని మెడలో నొకతుండుకట్టి బలవంతముగ దానిని వనాంతరమునకు దఱుమ సాగెను. అది పరుగెత్తుచు తపోనిష్ఠలోనున్న వాధూలమునిని త్రొక్కెను. ఆ ముని తపోభంగమున క్రుద్ధుఁడై వెనుకకుఁజూచి గోవును దఱుముకొని వచ్చుచున్న అయుతుని కప్పవగు మని శపించెను. అయుతుఁడంత నాతని పాదలములపైఁబడి తన వృత్తాంతమంతయు నెఱింగించెను.

వాధూలముని తనతొందరపాటునకు వగచి యతనితో ‘నృసింహ దేవుని సేవింపుము, భేకాంగనయందు సంతానము పొంది పితౄణవిముక్తుఁడవై మోక్షము నొందఁజాలుదు”వని పలికెను. కామధేనువు తన కార్యము సఫలమగుటచే స్వర్గమున కేగెను. అయుతుఁడు పౌండరీక క్షేత్రమున కరిగి నృసింహదేవుని దర్శించి, వాధూలముని శాపముచే చిత్రవర్ణమైన భేకరూపము నొందెను. పూర్వజన్మ వాసనచే నాభేకము హరిదాసమను నామముతో నొప్పుచు, అచటనే భగవద్ధ్యాన తత్పరయై యుండెను. ఇట్లు కొన్నిసంవత్సరములు గడచిన పిమ్మట కాన్యకుబ్జ రాజకుమారి చెలికత్తెలతో పాండురంగని సేవించుటకై వచ్చి చిత్రవర్ణమున్న హరిదాసమును గాంచెను. ఆమెయు చెలికత్తెలును దానిని బట్టుకొనుటకై ఎన్నో ప్రయత్నము లొనరించిరి. చివరికి రాజపుత్రి దానిని బట్టుకొని కప్పయనిన భయపడు నొక బ్రాహ్మణునిపై విసరెను. ఆ బ్రాహ్మణుఁడు కోపించి వారినందఱిని భేకాంగనలగుఁడని శపించెను. వారట్లే మాఱి హరిదాసమును వలచి సంతానము గాంచిరి. సంతానోదయమై నంతనే అయుతుఁడు శాప విముక్తుఁడై మోక్షము నొందెను.”

శివుఁడిట్లు గృహస్థాశ్రమ ప్రాశస్త్యమును, దానిని దిరస్కరించువాఁడు పొందు పాట్లను నారదున కెఱింగించెను. నారదుఁడు సంతోషించి, శివునకు నమస్కరించి, పౌండరీక క్షేత్రమున కరిగి, భైమీనదిలో స్నానమాడి విష్ణువును సేవించెను. శౌనకాదిమహర్షు లీవిధముగా సూతుని వలన పాండురంగమాహాత్మ్యమును వినియానందించిరి.

పాండురంగమాహాత్మ్యము తీర్థక్షేత్రదైవతమాహాత్మ్యములను దెలుపు మహాకావ్యము. అందుచే నిందాయా క్షేత్రములయు, తీర్థములయు, దైవతములయు వర్ణనములు కావింపవలసిన యవసరమున్నది. రామకృష్ణుఁడు వానినన్నిటిని వర్ణించి పౌండరీక క్షేత్రము యొక్క మహిమాతిశయమునంతను వివరించెను. ఇట్టి తీర్థక్షేత్రాదిమాహాత్మ్యములు సాధారణముగా చదువరులకు విసుగు కలిగించును. కాని రామకృష్ణుడు తన వర్ణనావైదగ్ధ్యము చేతను, భాషాపాటవము చేతను, కల్పనాచమత్కారము చేతను అట్టి విసుగుదల కలుగకుండ కావ్యమంతయు తీర్చిదిద్దెను. పాండురంగని కేయే దిక్కుల నేయే తీర్థములున్నవో, యచట నేయే దైవములుందురో, ఆ క్షేత్రము యొక్క అంతర్బహిర్ద్వారము లెట్టివో వివరించి, యచట ముక్తులైన వారి కథలెన్నో సందర్భానుగుణముగ చెప్పియుండెను. శౌనకాదిమహామునులు సూతుని క్షేత్రదైవతతీర్థములు మూఁడును సమప్రధానములై యుండు స్థలమును గూర్చి తెలుపుమని యడిగిరి. అతఁడా విషయమును వారికిఁ దెలుపుచు అగస్త్యుఁడావిషయమునే కుమారస్వామి నడిగెననియు, కుమారస్వామి తనకు తోఁపక అగస్త్యాది మునులను శివుని కడకుఁగొనిపోయి యతని నా ప్రశ్నమే అడిగెననియు, నంతకుముందే పార్వతి కూడ తన్నా ప్రశ్నము నడుగుటచే శివుఁడువారి కందఱికిని పౌండరీక క్షేత్రమును గూర్చి తెలిపెననియు, కుమారుఁడును అగస్త్యాదులును శివుని వలన నా వృత్తాంతము నెఱింగి తిరిగిపోవుచుండగా

నారదుఁడు చూచి, శివునిదర్శించి, యతని వలన శివుఁడగస్త్యాదులకుఁ దెలిపిన వృత్తాంతము నెఱింగి, తనకుకూడ నట్టి పుణ్యక్షేత్రమును గూర్చి తెలుపుమని శివుని ప్రార్థింప శివుడాతనికా వృత్తాంతము వివరించె ననియుఁ దెలిపెను. ఈ విధముగా శౌనకాది మునులకును అగస్త్యాదులకును కుమారస్వామికిని పార్వతికిని నారదునికిని కలిగిన జిజ్ఞాస యొక్కటే. రామకృష్ణుఁడు వారందఱి సందియమును తీరునట్లుగ పౌండరీకక్షేత్ర మాహాత్మ్యమును తెలిపి కావ్యమును ముగించెను. అతఁడందందు ప్రవేశపెట్టిన వర్ణనములను, తీర్థాది మాహాత్మ్యములకు నిదర్శనముగా తెలిపిన కథలును మనోహరములై కావ్యమున కెనలేని సౌందర్యము చేకూర్చినవి. ఈ విధముగా నిందు పెక్కు విషయములును, కథలును చెప్పఁబడి యుండుటచే కావ్యమున వస్త్వైక్యముండుట కవకాశములేక పోయినది. ఆ కథావర్ణనముల నన్నిటిని సరిగూర్చు సూత్రము పాండురంగక్షేత్ర మాహాత్మ్యమే.

రామకృష్ణుఁడు ప్రబంధయుగమునకు చెందినవాఁడగుటచే క్షేత్రమాహాత్మ్యమునఁ గూడ ప్రబంధోచితములైన ఆయా వర్ణనములను ప్రవేశపెట్టి దానికి ప్రబంధ సౌందర్యము కల్పించెను. ప్రబంధము కాశీపురవర్ణనతో నారంభమైనది. అతఁడందలి కోటను, పరిఘను, చాతుర్వర్ణ్యమును, చతురంగ బలమును, వారసతులను ప్రబంధోచితముగ వర్ణించియుండెను. అచ్చట శివునాతఁడొక సితరోలంబముతో పోల్చెను.

**ప్రాలేయాచల కన్యకా వదన శుంభత్పద్మ సౌరభ్యమున్**
**గ్రోలం గల్గియుఁ దుష్టి లేక మునిహృత్ప్రోద్యాబ్జ సౌగంధ్యలీ**
**లా లాలిత్యముఁ గోరు నొక్క సితరోలంబంబు నైజాకృతిన్**
**డాలొందించుఁ బరాసులన్ భ్రమరకీట న్యాయరీతిన్ బురిన్.** 1-100

ఇందలి సితరోలంబము శివుడే. అతడు పార్వతీముఖ పద్మసౌరభమును గ్రోలియు తనివితీరక, మునిహృదయాబ్జ సౌగంధ్యలాలిత్యమును వాంఛించుచు, కాశిలో మరణించిన వారికి భ్రమరకీటన్యాయ మొప్ప తనయాకారము నొసంగును. మరణించునపు డచ్చటివారు శివునే తలపోయుచుండుటచే నతనిరూపమునే పొందుదురు. ఇచ్చట భ్రమరకీట న్యాయమును చొప్పించి రామకృష్ణుఁడు చేసినకల్పన అద్భుతముగా నున్నది. అచట చనిపోయిన వారెట్టి రూపమును పొందుదురో యతడీ క్రిందిసీసమున నత్యంతహృద్యముగా వర్ణించియుండెను.

**ఒకనాఁడుఁ దీరోపయోగి గాని శరుండు**
**నౌఁదల ధరియించు నభ్రగంగ;**
**నా ప్రొద్దు ప్రొయిరాఁజనట్టి నిర్పేదయు**
**భోగించు నైశ్వర్యము లెనిమిదియుఁ;**
**బుష్కరాక్షుల పొంతఁ బోని వర్షధరుండు**
**దేహార్ధమునఁ దాల్చుఁ దీఁగబోఁడి;**

**నాయుధ ప్రభఁ గాంచి యలఁగు భీరువుఁ బూను**
**వాఁడి ముమ్మొనముల వేఁడి యలుగు;**

**మలినవర్తనుఁడు సుధాలలిత మూర్తి,**
**మించి వర్తించు; మతిలేని మేదకుండు**
**మౌనివర్యులఁ జదివించు మట్టినీడఁ;**
**బంచముఖువీట మే నోసరించెనేని.** 1-101

ఒకనాఁడు కూడ తీర్థమున స్నానము చేయని మూఢుఁడు కాశిలో మరణించినచో తన తలపై ఆకాశగంగను ధరించును. అనఁగా శివుఁడగును. ఈ విధముగనే మిగిలిన పాదములయందును కాశిలో మరణించినవారెట్లు శివసారూప్యము నొందుదురో రమ్యముగా చెప్పబడినది. ఇందలి పూర్వోత్తరభాగములందు కానిపించు ప్రతియోగము (contrast) పద్యమున కపూర్వశోభ కలిగించు చున్నది. 'మొలక చీఁకటి జలజల రాల్పఁగా రాదె నెరులు మించిన వీరి కురులయందు...' (1-117) అను సీసము నందు వారసతుల కేశాధరస్తన ముఖ దృష్టి కటిమందగమనముల యందము వర్ణింపఁబడినది.

అగస్త్యుడు స్వామిమల కరుగునప్పుడు లోపాముద్రకు మాల్యవంతమును మతంగాశ్రమమును వర్ణించి చెప్పెను. ఈ వర్ణనమంతయు మున్యాశ్రమ వాతావరణమును చదువరుల కన్నులకు సాక్షాత్కరింపఁ జేయుచున్నది.

**హోమ ధూమాసిత ప్రభ నీ మహాత్ము**
**నాశ్రమంబొప్పు నీయద్రి యంతికమున,**
**వలుదయై మించు నప్పంట వలతి నెలఁత**
**చంటి కడనంటు మృగనాభి చర్చ వోలె** 1-134

మాల్యవంతము భూదేవి స్తనమువలె నున్నది. మతంగాశ్రమము అచ్చట జరుగు నిత్యహోమముల పొగచే నల్లనై ఆ స్తన పార్శ్వమున నంటుకొన్న కస్తూరిచర్చ వలెనున్నది. ఈ సందర్భముననే రామకృష్ణుఁడు తుంగభద్రానదిని కూడ వర్ణించి యుండెను. ఇతర నదులు మానవుల బాహ్యతాపమును మాత్రమే మాన్పఁగలవు. తుంగభద్ర వారి యంతర్గత తాపములను కూడ పోగొట్టఁజాలును. రామకృష్ణునికి నిత్యదర్శనస్నానానంద మొసఁగినట్టిదీ పవిత్ర తుంగభద్రా నదియే. అందుచే నాతడది సౌందర్యమహిమలచే నితర నదులు నతిశయించునని యీ పద్యమున హృద్యముగా వర్ణించెను.

**గంగా సంగమ మిచ్ఛగించునె, మదిన్ గావేరి దేవేరిగా**
**నంగీకార మొనర్చునే, యమునతో నానందముం బొందునే**
**రంగత్తుంగ తరంగ హస్తముల నారత్నాకరేంద్రుండు నీ**
**యంగంబంటి సుఖించునేని, గుణభద్రా! తుంగభద్రానదీ!** 1-139

భాగీరథీ తుంగభద్రల కభేదము చెప్పుటలో నతనికి తుంగభద్రపైఁగల యభిమానము వ్యక్తమగుచున్నది. సామిమల హంపికి సమీపముననున్న సాండూరు కొండయే. అచ్చట ప్రాచీనమైన కుమారస్వామి యాలయ మిప్పటికిని నిల్చియున్నదఁట. దానిని కూడ దనకావ్యమున చొప్పించుటకు రామకృష్ణుని దేశభక్తియే కారణము.

ఉమామహేశ్వరుల యుద్యానవిహారసందర్భమున మన్మథుఁడుమప్రాపున హరు నోడించుటకై యత్నించిన తెఱంగు కవి సరసముగా వర్ణించెను.

**పొదువు పరాగవృష్టి మొగమున్, శ్రమవారినిమేను భానుదీ**
**ప్తి దవులవెచ్చుచన్గవయుఁ,దేజము దాల్చెన కాని యొప్పుగుం**
**దదు నగపుత్రి కప్పు భసితంబున, వర్షముచేత, నగ్నిపైఁ**
**గదుగుట నద్దమున్, లతయుఁ గాంచన కుంభములున్ బెడంకునే.** 1-188

గిరిజమొగమున పరాగమును, మేన స్వేదమును, స్తనయుగ్మమున భానుదీప్తియు వ్యాపించినను వాని దీప్తి తగ్గలేదు. ఈ విషయమును కవి భసితముచే నద్దమును, వర్షముచే లతయు, అగ్నిపై గదురుటచే సువర్ణ కుంభములను జలించునా యని రమ్యముగా సమర్థించెను. దీనిని బట్టి పార్వతి మొగ మద్దమువలెను, మేను లతవలెను. స్తనములు కాంచనకుంభముల వలెను ప్రకాశించెనని తెలియుచున్నది.

ద్వితీయాశ్వాసమున పుండరీకునికి ప్రత్యక్షమైన శ్రీకృష్ణుని కవి పదునైదు పద్యములతో వర్ణించెను. సాధారణముగా ప్రబంధములందు స్త్రీ వర్ణనమే విస్తృతముగా నుండును. ఇచ్చటి కృష్ణవర్ణనము హృద్యమై ఆ దేవుని బాలరూపమును కన్నులకు గట్టుచున్నది. తరువాత పుండరీకుఁడు గావించిన దశావతారస్తుతి యున్నది. శ్రీనాథుడు, పెద్దన, తిమ్మన, శ్రీకృష్ణ దేవరాయలు తమ కావ్యములందు దశావతారస్తుతి కావించిరి. ఇందుకృష్ణావతార వర్ణనము లేని లోటును 'పొదలు నీపొక్కిటి పువ్వు కాన్పునఁగదా పెనుమాయ పిల్లలఁబెట్టుటెల్ల' (2-55) అను సీసపద్యము పూరించుచున్నది. శివుఁడు పౌండరీక దేవతల పూజావిధానమును పార్వతికి వర్ణించి చెప్పుచునే యేఋతువు నందెట్లెట్లు పూజ కావింపవలయునో వివరించి యుండెను. ఇందైదు సీసపద్యములు, ఆఱవది కందము. పౌండరీక తీర్థమును వర్ణించుఁచు గవి

**నిడువాలుఁ గనుచూపు నిగిడినచోనెల్లఁ**
**బేరెండ రేయెండఁ బెండ్లియాడ,**
**నిశ్వాస పవనంబు నెలకొన్నచో నెల్లఁ**
**బ్రామిన్కు నెత్తావు లాము కనియఁ**
**పొక్కిటి తమ్మి పుప్పొడి యొల్కు చోనెల్ల**
**బ్రహ్మాంకురంబులు పాదుకొనఁగ**
**నడుగు లేఁజిగురాకులంటినచోనెల్ల**
**వివిధ తీర్థ శ్రేణి వెల్లివొడువ**

**బర్హమణి బంధ మావెల్పు పచ్చలెదురు**
**గ్రచ్చకాయల తిత్తియుఁ గంబుశక్తి**
**గలిగి విహరించుఁ బౌండరీకంబునందు**
**నందులేఁ బట్టి; ప్రాలేయ నగమువట్టి;** 2–152

అను సీసమును వ్రాసెను. ఇందు సూర్యచంద్రులు విష్ణువు రెండునేత్రములగుటయు, అతని నిశ్వాసములే వేదరూపము నొందుటయు, అతని పొక్కిటితమ్మినుండి బ్రహ్మ యుదయించుటయు, అతని అడుగులనుండి గంగ ప్రవహించుటయు రమ్యముగా సూచింపఁ బడినది. తృతీయాశ్వాసమున 'గోమేధికోపలాంకుర మానితములు పుష్యరాగచ్ఛటా పుంఖితములు' (3–48) అను సీసపద్యమునందు నిగమశర్మ పట్టుకొనిపోయిన సొమ్ములన్ని వర్ణింపఁబడినవి. ఇందలి రత్నాలంకారములను చూడ సభాపతిసంపన్నత రాజుసంపద కంటె నేమియు తక్కువ కాదని తోఁపక మానదు. నిగమ శర్మ కాపుకోడలిని లేవనెత్తుకొని పోయిన నాడు, గాలిగంగలజాతర జరిగెను. దానిని రామకృష్ణుడు సూక్ష్మ వివరములతో వర్ణించెను. ఒక తెఱవ మేఘము క్రింద నసియాడు నైరావతివలె సిడిమ్రాని యందు వ్రేలెను; ఒక నెలత చెందమ్మికొలన రంజిల్లు హంసవలె నిప్పులలో దూకెను; ఒక యింతి తొలిసంజయెండలో వర్తిలు జక్కవవలె పందిరి గుండమున ప్రవేశించెను; ఒక అతివ జలనీలిపై నిక్కు కలువ మొగ్గవలె నరటియాకుపై నర్తించెను; ఒక కాంత మూపునఁ గండనిచ్చెను; ఒక అమృతవాణి మారుగాలును ఒక లలన నోరి తాళమును ఇచ్చిరి. ఇవన్నియు పల్లెటూళ్లలో జరుగు జాతర లందు గోచరించు దృశ్యములే. భూదేవి దుర్జనుల బాధను విష్ణువున కెఱింగింప శ్వేతద్వీపమున కరిగినప్పుడు వైకుంఠవర్ణనము కలదు. అందు వైకుంఠమునందలి సతులు విలయ హరిఁ దెచ్చి పెంచు విధ మీ క్రింది సీసమున వర్ణింపఁబడినది.

**జలధి వీచీ వాత్యఁ జవి దాఁకెఁగాయని**
**యక్కున నందంద యలమి యలమి,**
**ప్రామట్టి యాకొత్తి రాయిడి; బొందెఁగా**
**యని సన్న పొత్తులనునిచి యునిచి,**
**వాపోయి వాపోయి వసివాడి యాఁకటిఁ**
**బెగడెఁగా యని యుగ్గు పెట్టి పెట్టి,**
**పెనుజీఁకటులు గ్రమ్మ పెన్ బైట వసియించి**
**వెఱచెగా యని పుల్ల విఱిచి విఱిచి,**

**'మంచి లక్షణముల పుట్టుమచ్చ వాఁడు,**
**నేత్రములు నివ్వనట్టి యీ నెత్రుగందు**
**వఱదనేతెంచె నెవ్వారివాఁడొ;' యనుచు**
**విలయహరిఁ దెచ్చిపెనుతు రవ్వీటి సతులు** 3–156

ఇది అతిశయోక్తితో కూడిన దయ్యి నా సతులను శిశువులపైఁగల వాత్సల్యమును చక్కగా సూచించుచున్నది. రాధాదేవి చరిత్రమున నామె సర్వాంగములును భావగంభీరముగను ప్రబంధోచితముగను వర్ణింపఁబడినవి.

**కరికరంబులు త్వగ్దోష కల్మషంబు**
**నపనయింపంగ సతి యూరులై పొదమియుఁ**
**బుష్కరంబుల తగులంబుఁ బూనెఁ జరణ**
**దంభమునఁ; బూర్వవాసన దలఁగుటెట్లు;** 3–183

త్వగ్దోష కల్మషము తొలగించుకొనుటకై కరికరములు రాధయూరువులై పొదమియు చరణరూప పుష్కరముల తోడి సంబంధమును మానలేకుండెను. పూర్వవాసనలను తొలగించు కొనుట సులభము కాదని కవి యర్థాంతరన్యాసముచే సూచించెను.

చతుర్థాశ్వాసారంభమున రాధాదేవి తపోవర్ణనమున్నది. ఇందు కాళిదాసుని కుమార సంభవమునందలి పార్వతితపస్సు యొక్క ఛాయలు గోచరించుచున్నవి. కవి యిచ్చట షడృతు వులను వర్ణించెను. ఋతువుల వర్ణన పెక్కు ప్రబంధములలో నుండును. అందలి పద్యములు కథా సంబద్ధములు గాక ఎచ్చటనైన చొప్పించుటకు వీలుగనుండును. రామకృష్ణుఁడు ఇచ్చట ఋతువులను వానికిని రాధ రూపమునకు సన్నిహితసంబంధము కలిగించి యత్యంత మనోహరముగ వర్ణించెను.

**కెంజిగురాకు డాలు దులకించిన ధాతుపటంబు చాయఁజే**
**యం, జదురెక్కు పుప్పొడులనంటిన తేఁటులు భూతి భృజ్జటా**
**పుంజముఁ బోలఁగా, విపిన భూములలో మధులక్ష్మి పొల్చె, నీ**
**లాంజనవర్ణుఁ గోరి తపమట్లొనరించు మృగాక్షి కైవడిన్** 4–14

కెంజిగురాకులకాంతి కాషాయవస్త్రము వలెను, పరాగావృతములైన తుమ్మెదలు భూలిప్త జటలవలెను ఉండుటచే వసంతలక్ష్మి తపస్సు చేయుచున్న రాధను బోలుచున్నదని భావము. ఈ విధముగానే రామకృష్ణుఁడు ఋతువులన్నిటిని రాధా సంబంధము కలుగునట్లుగ వర్ణించి ఒక అపూర్వ వర్ణన విధానమును ప్రకటించెను.

పంచమాశ్వాసమున సిద్ధమంత్రస్వరూప ప్రభావములు వర్ణింపఁబడినవి. ఆ మంత్ర బలము చేతనే శివుని సెగకంటి మంటకెరయైన మన్మథుఁడు రుక్మిణికి కుమారుడుగా జన్మించెను. ఆ మరుని శైశవభాషణములను కవి యీ పద్యమున సాభిప్రాయముగా వర్ణించియుండెను.

**బలభిదారామ సంభవ లతాంతశ్రేణిఁ**
**బన్నుము నాకొక్క చిన్నతేరు;**
**కాళికెంగేలి చిల్కలరాజుఁ గొనితెచ్చి**
**నావెంటఁబడి వాగె నడవఁ బనుపు;**
**గగన చరద్రాశి గణవర్తి మకరంబు**
**బిరుదు టెక్కెముగ వేగిరమొనర్పు;**
**మదనగోపాలుండు మా తండ్రిచే నాకుఁ**
**జెఱుకుచే మలిపించు కఱకువిల్లు;**

**వనజహితు వేడి తమ్మితూపునకు దెమ్ము:**
**దివ్యములగాని సాధింప దీరదీశు**
**నంబ! నీ' వంచు రుక్మిణి నట్టునిట్టుఁ**
**దిగుచు శైశవచాపలార్జితుఁడు మరుఁడు.** 5–125

ఇందు మన్మథుఁనికిఁ గలుగఁబోవు పూలతేరు, శుకవాహనము, మకరకేతనము, చెఱకువిల్లు, తమ్మితూపు చక్కగా సూచింపఁ బడినవి. ఇందు చాపల్యము కంటె యథార్థమే యెక్కువగా నున్నట్లు కనిపించును. పై సాధనములన్నియు నున్న గాని ఈశుని సాధింపరాదని మన్మథుని భావము. 'లోకేశస్థితి లోకవాసకృతి సాలోక్యంబు...' (5–151) అను పద్యమున ముక్తకేశి పొందఁదలఁచిన చతుర్విధముక్తులును చక్కగా వర్ణింపఁబడినవి. అయుతనియుతుల కథలో నగస్త్యుఁడు తన శిష్యులకు తగిన కన్యలను దెచ్చుటకై బ్రహ్మకడ కరిగెను. బ్రహ్మ యతని నీ క్రింది పద్యమున ప్రశంసించెను.

**హుంకారములు లేవె! యుప పురందర హఠో**
**త్పాటనంబునకుఁ బాల్పడవు గాక**
**భ్రూభంగములు లేవె! యాభీల వింధ్యగ**
**ర్వ స్తంభనమునకు రావు గాక**
**చుళుకాకృతులు లేవె! జలరాశి నిశ్శేష**
**చూషణక్రీడకుఁ జొరవు గాక;**

**జాఠరాగ్నులు లేవె! జటితాపి వాతాపి**
**తను దాహమున కెదుర్కొనవుగాక;**

**నిష్ఠ నీమాడ్కి లోకప్రతిష్ఠ గుటిచి**
**దుష్టనిగ్రహశిష్ట సంతుష్టిహేతు**
**రోషభీషణ రేఖా నిగూఢగాఢ**
**లీలఁగ్రీడించు ప్రోడలు లేరు గాక!** 5–176

ఇందగస్త్యుఁ డొనరించిన అనన్యసాధ్యములైన ఘనకార్యములన్నియు వివరింపఁ బడినవి. ఇంద్రుఁడు వృద్ధమహీసుర వేషమున అయుతు నాశ్రమమునకు వచ్చి, గృహస్థాశ్రమ ప్రాశస్త్యమును చెప్పి "కీలారమున నుండి పాలింటి కేతేర బహుధాన్యములు చేలఁబండి యొరగ......... నిత్యనైమిత్తికములు నిర్నిద్రబుద్ధి నాచరించుచు హరిభుక్తమాత్మ భార్య భక్తినిడ బుక్తిగొనుచున్కి ముక్తిగాని నిదురవంటిది రాతివంటిదియుఁగాదు." (5–216) అని హితోప దేశము కావించెను. ఇంద్రుఁడు తపోభంగము చేయుటకై చెప్పిన మాటలైనను ఇవి యథార్థము లైనట్టివే, పంచమాశ్వాసమునందలి 238వ పద్యమున కామధేనుసేవాసక్తుడైయున్న అయుతునికి తపోభంగమెట్లు జరిగెనో చక్కగా వర్ణింపఁబడినది. అంతే 270వ పద్యమున (లలితకుంతలశైవలము ముఖైందవబింబమధురాధరప్రవాళాంకురంబు) లక్ష్మి తండ్రిని బోలినవిధము సర్వాంగ సుందరముగా వర్ణింపఁబడినది. "నిక్కమ్ముగఁ దండ్రి చాయగల కన్యలు ధన్యులుగారె" అను వసుచరిత్రోక్తి నిది తలపించుచున్నది.

పాండురంగ మాహాత్మ్యమునం దష్టాదశ వర్ణనములలో కొన్ని మాత్రమే కనిపించును. పైని పేర్కొనఁబడిన వర్ణనములను కాక యాతఁడు కొన్ని వ్యక్తి జంతు వస్తు వర్ణనములను గూడ గావించియుండెను. ఇవన్నియు ఏక ద్వి పద్య మాత్ర పరిమితములు. వీనిలో పెక్కు సీస పద్యములే. వీనియం దాతని ప్రకృతి పరిశీలనమును భావనాశక్తియు విస్పష్టముగా కనిపించును. ఇందుకు కుమారస్వామి వాహనమైన నెమలి (1–61), అతని ననుసరించిన ప్రమథులు (1–165), నారదుఁడు (2–172) కైలాసము (2–188), గాలిగంగల జాతరయందలి పామరప్రమదలు(3–74), పాండురంగ క్షేత్రపాలకుడైన కాలభైరవుడు

(4–287) (5–136), గృహస్థాశ్రమము (5–166), బ్రహ్మ (5–174), కామధేనువు (5–264) మున్నగువాని వర్ణనములు నిదర్శనములు. పెద్దన మనుచరిత్రలో గృహస్థాశ్రమ వర్తులకు ముక్తి కరతలామలకమని చెప్పు సందర్భమున గృహమేధిధర్మము కంటె మేల్తరమైన ధర్మము వేఱొండు లేదని ఈ క్రింది పద్యమున తెలిపియుండెను.

**పరిణీతయగు నింతి ప్రతికూలగాదేని**
**తనయుండు తన యాజ్ఞ దాఁటఁడేని**
**నిజ సహోదరులు వినీతులై మనిరేని,**
**కోడలోరుపు దక్కి గొణఁగ దేని,**
**కూఁతురీలువు నందుఁగొడవ చూపద యేని,**
**ఋణమను పాతకంబెనయదేని,**
**తేజోగరిమ పరాధీనతఁ జెడదేని,**
**నిందాంధ కారంబు నెరయదేని,**

**న్యాయమున మొల్లముల పెల్లు డాయునేని,**
**యతిథి సంతర్పణంబింట నమరునేని,**
**సముచితాచారమును గొనసాఁగునేని,**
**కలదె గృహమేధి ధర్మంబు కంటె మేలు!** 5–166

నిజమున కిట్టి వన్నియు సమకూడినచో గృహస్థాశ్రమ మైహికాముష్మిక ఫల ప్రదమగు ననుటలో సందేహము లేదు.

పుండరీక చరిత్రమున రామకృష్ణుడు దశావతారములను ప్రత్యేకముగ వర్ణించి చివర అన్ని అవతారములను కలిపి ఒక్క సీసపద్యమున వర్ణించెను. ఇందు దేవుఁడు భవార్ణవమును దాఁటించు పడవగను, దశావతారములు తదంగములుగను భావింపఁబడినవి.

**నీటిలోఁ జివుకక నిలిచి క్రుమ్మరుపూన్కి,**
**కఠిన కర్పరపుఁ జుక్కానుబిగువు,**
**దంష్ట్ర నెత్తిన మహీతలపు గాడుపుఁజీర,**
**యురుదారు కలనయం దుదయమగుట,**
**పరులకుఁ దనకట్ల బలిమిచూపు విధంబు,**
**పులిమిన నెత్రుగుగ్గిలపునూనె,**
**ద్వీపాంతరమునకుఁ దెగువమైఁ జనుపెంపు,**
**చేముట్టు నాగంటి జీనితగులు,**

**సౌగతాగమ మాలిమి శాస్త్ర సరణి,**
**వల్గు వల్గన చిత్ర ధావనముఁ గల్గు**
**నిన్నుఁ దరిచేసి, భవవార్ధి నిస్తరించి,**
**దరిఁ దఱియకున్నఁ గలదె మోదము? మురారి!** 2-66

చండాల స్త్రీయు దానివలనఁ బడసిన సంతానమును గృహదాహమున మరణించిన పిమ్మట నిగమశర్మ దీనుఁడై యడవిలో ఁదూలుచు ఁదూగుచు నరిగి చివరికి నృసింహా క్షేత్రము చేరి, సంగమ తీర్థమున స్నానము చేసి, యాదేవుని దర్శించెను. అతనికింక విష్ణు సాయుజ్య ప్రాప్తి లభింపనున్నది. అప్పుడు రామకృష్ణుఁ డతనియందు దశావతారములను స్ఫురించునట్లుగ నొక యద్భుతమైన పద్యము వ్రాసెను.

**ఒకయింత తెప్పవేయక చూచుఁ బెఱవారిఁ,**
**దల గొట్టుకొనిదుఃఖజలధి మునుఁగు;**
**బిలము తెఱవు మంచుఁ బృథివిలోఁ జొరఁ బారు**
**సమధిక స్తంభోద్భవము గమించు**
**దిరియువాఁడును బోలె దెసలకుఁ జెయి చాఁచుఁ**
**దొరగు నస్రాంబుధిఁదొప్పదోఁగు;**
**'హా! పోయితే!' యని యఱచు భార్య గుఱించి**
**బహుమదిరాసక్తి భ్రాంతిఁ బొందు!**

**జేరఁగారాని దర్శనస్థితి వహించు**
**బాడబస్ఫూర్తి లోఁగొన్న పగిది నుండు;**
**దానవారాతి కాఁబూని తదవతార**
**దశకమును మున్నె తాల్చెనా ధరణిసురుఁడు** 3-102

ఈ పద్యమున నిగమశర్మ యప్పటి వికృత చేష్టలను దశావతారకృత్యములతో సమన్వయించి చెప్పుట రామకృష్ణుని యపూర్వ ప్రతిభాశక్తికి తార్కాణము. ఇట్లే దశావతారములను స్ఫురింపఁజేయుచు నతఁడు రచించిన పద్యములు మఱికొన్ని కలవు. చతుర్థాశ్వాసమున పుండరీకుఁడు తనకుఁ బ్రత్యక్షమైన విష్ణువును వర్ణించునప్పుడు లయగ్రాహివృత్తమున సంబోధనాత్మకముగ (ఆగమ సముద్ధరణ రాగరసలంపట!...4-85) దశావతారములు సూచింపఁబడినవి. ఈ విధముగ రామకృష్ణుఁడీ కావ్యమునఁ గావించిన వివిధవర్ణనములు భావగంభీరములును, సందర్భోచితములును, సరసములునై యొప్పారు చున్నవి.

పాండురంగమాహాత్మ్యమున చిన్నవి పెద్దవియగు కథలెన్నో యున్నవి. అవన్నియు పాండురంగక్షేత్రమాహాత్మ్యము నుగ్గడించునట్టివే. వానిలో పుండరీకుని కథ యాక్షేత్రమునకు పౌండరీకక్షేత్రమను నామము కల్గుటకు కారణమైనట్టిది. ఇది కావ్యమున ద్వితీయ చతుర్థాశ్వాసములందు రెండుసార్లు చెప్పఁబడినది. అట్లే ముక్తకేశి, త్రిదంష్ట్రుఁడు మున్నగువారి కథలు కూడ పునరుక్తములైనవి. ద్వితీయాశ్వాసమున పుండరీకుఁడు తల్లిదండ్రుల సేవ చేయుచు వారు మరణించిన పిమ్మట శ్రీకృష్ణుని గూర్చి తపస్సొనరించెను. ఆ దేవుఁడతనికి ప్రత్యక్షమయ్యెను. పుండరీకుఁడతనిని లలితరూపముతో నచ్చట వసించి ఆ తీర్థ క్షేత్రములు తన పేరుతో ప్రసిద్ధములగు నట్లొనరింపుమని వేఁడుకొనెను. కృష్ణుఁడావరములిచ్చి యరిగెను. చతుర్థాశ్వాసమున పుండరీకుని తపస్సు విస్తృతముగా వర్ణింపఁబడినది. ఇచ్చట కూడ కృష్ణుఁ డాతనికి బ్రత్యక్షమయ్యెను. అతఁడా దేవుని బహువిధముల సన్నుతించెను. అపుడు బ్రహ్మాది దేవతలాతని గుణములను ప్రశంసించిరి. ఈ సందర్భమున కృష్ణుఁడు దేవతలకు భక్తులకు భక్తుల మహిమానుభావములను వర్ణించి చెప్పెను. ఇచ్చట కూడ పుండరీకుఁడు పూర్వమడిగిన వరములనే యడిగెను. రెండవ మారు చెప్పిన కథయందు కుండలినీశక్తి మూలాధారచక్రము నుండి సహస్రారచక్రమువఱకు పయనించు యోగవిధానము వర్ణింపఁబడినది. దీనివలన రామకృష్ణునికి యోగసిద్ధాంతములతోఁగల పరిచయము వ్యక్తమగుచున్నది. అతని యోగ జ్ఞానము వెల్లడించు పద్యములీ కావ్యమున మఱికొన్ని సందర్భములందు కూడ కానవచ్చు చున్నవి.

చతుర్థాశ్వాసమునందు రాధాదేవితపస్సు వర్ణింపఁబడినది. శరదృతువున కృష్ణుఁడామెకు ప్రత్యక్షమయ్యెను. అప్పుడామెకు సర్వజగమును విష్ణుమయమైతోఁచెను. కృష్ణుఁడామె ఎదుట నిలిచి "తపోనలజాయమానహృత్ఖేదము మానిపించి తన కేలను గేల్దెమలించి నిర్భరాహ్లాద మెలర్ప నయ్యువతి నర్ధశరీరమునట్లు" ప్రోచెను. ఈ కథ ఋణవిమోచనతీర్థప్రభావమును తెల్పుచున్నది. ఆ యాదవకిశోరుఁడు కృశోదరీసహాయుఁడై మాయా శబలితుఁడగు జీవపురుషుని విధమున వివిధ భోగపరాయణుఁడై ప్రవర్తించెను. భాగవతమున రాధా వృత్తాంతము లేదు. ఇందు కూడా రామకృష్ణుఁడా వృత్తాంతమును సంగ్రహముగనే వర్ణించెను. పుండరీకుని తపము వలన లోకములకుఁ గలుగు సంతాపమును, భూదేవి భారమును తొలఁ గించుటకై కృష్ణుఁడు దేవకీ వసుదేవులకు పుత్రుఁడై జన్మించెను. బ్రహ్మ అతనికి మనఃప్రీణనము గావింపఁదలచిఁ నిఖిలభువనమోహినియగు నొక శక్తిని బంపెను. ఆమె బ్రహ్మాదేశమున నందుని మఱఁదియగు శతగోపుఁడను గోపాలునకు కూరిమిపుత్రియై పుట్టెను. ఆమెయే రాధ. రాధాపుండరీకవృత్తాంతములు రెండును భక్తిమయములైనట్టివి. ఇవి శ్రీకృష్ణుని భక్తపరాధీనతను చక్కగా సూచించుచున్నవి.

పాండురంగ మాహాత్మ్యమునందలి పెద్ద కథలలో నిగమశర్మ కథ చాలా ముఖ్యమైనది. ఈ కథను రచించుటలో రామకృష్ణుడు చూపిన ప్రతిభ అనన్యసామాన్యము. నిగమశర్మ "ప్రాసఁగు విత్తువంటి నెఱపాఱు కొలంబునఁబుట్టి" వేదశాస్త్ర కళానిష్ణాతుఁడైన సభాపతి యను ఆహితాగ్నియగు బ్రాహ్మణుని భార్యకు "అతుల నిష్ఠ నింగి వేల్పులనేలకు, నేల వేల్పుఁ గొలంబునింగికి తెచ్చుచు గొలువఁగా" పుట్టిన పుత్రుఁడు. రామకృష్ణుఁడాతని బాల్యమునుగాని ఉపనయనవివాహాదులను గాని వర్ణించి యుండలేదు. అతఁడు మొట్టమొదట "వనితామానస సూనసాయకుఁడుగను, నూనూగు మీసాల లేగొనబుంభ్రాయపుఁదేజు కూనగను" సాక్షాత్కరించును. దైవవశమున అతఁడన్ని చదువులు చదివియు, మనస్సును తృతీయ పురుషార్థమునకే తార్చెను. అతఁడు క్రమముగ వ్యసనలోలుపుఁడై వైదికాచారములన్నింటిని మాని, తాత ముత్తాతలును తండ్రులును ఆర్జించిన విత్తమంతయు వమ్ము చేసెను. గురుజనమాతనిని శిక్షించిరి. ఆ శిక్ష యెట్టిదో మనకు తెలియదు. దానికి ఫలితముగా ఆతఁడు "గడుసువడి సడికోర్చి వంక పొరకచాటు" మానివైచెను. ఆతఁడు శిశ్నోదర పరాయణత్వమునకుఁ బాల్పడి యిచ్చ వచ్చినట్లు తిరుగుచుండెను. ఇట్లుండఁగా నాతని యక్క తమ్ముని సన్మార్గమునఁబెట్టుటకై భర్తతోడను బిడ్డలతోడను వచ్చి, తల్లిదండ్రుల నోదార్చి, గృహమును యథాపూర్వ మనోహరముగ ననుసంధించి, తమ్ముని రాకకై యెదురుచూచుచుండెను. ఒకనాఁడెక్కడనుండియో చుక్కతెగి పడిన వడువున నిగమశర్మ యాహార వాంఛచే నింటికరుదెంచెను. ఇంటిలో అక్క యున్నటు లాతనికిఁ దెలియదు. ఆతఁడామెకు నమస్కరించి దరికిఁజేర నాయక్క సీమంతపు పెండ్లి కొడుకవు గమ్మని యాశీర్వదించి, తన కుమారుని నిందమని చంక కిచ్చెను. ఆమె కనుసన్నచే నిగమశర్మ భార్య "వ్యాపృత నిజనిశ్వాసజతాపంబున కొంతకొంత తప్తమగునట్లుగ చల్లని నీటితో" భర్త పాదములు కడిగెను. అక్క యాతనికి రుచికరమైన భోజనము పెట్టెను. ఆమె భోజనానంతరమతని చెంత కూర్చుండి, అతని తల దువ్వి, అలకలు ముడివైచి, మఱదలిచ్చిన తాంబూలము నమలుచు, బిడ్డ చనుద్రావుచుండగా తమ్మున కిట్లుపదేశము నారంభించెను;

**ప్రారంభించిన వేద పాఠమునకున్ ప్రత్యూహమౌనంచునో**
**యేరా తమ్ముఁడ! నన్నుఁ జూడఁ జనుదే, వెన్నాళ్ళనో యుండి చ**
**క్షూరాజీవయుగంబు వాచె నినుఁగన్గోకున్కి; మీ బావయున్**
**నీరాకల్ మదిఁ గోరుఁ జంద్రు పొడుపున్ నీరాకరంబున్ బలెన్** 3-33

**శ్రీ లాలిత్యము నిత్యశుద్ధియు గుణోత్సేకంబునున్ గల్గి యు**
**ద్వేలస్ఫూర్తిఁ దలిర్చు తండ్రియను నబ్ధిన్ జంద్రుఁడై తోఁచినన్**
**బోలున్ గాక, భవాదృశుం డితరుఁడై పుణ్యంబులన్ బాసినన్**
**సాలగ్రామఖనిన్ జనించునె కదా! జాత్యల్పపాషాణముల్.** 3-34

ఆమె వంశ గౌరవమును గూర్చియు, తలిదండ్రుల వార్ధక్యమును గూర్చియు, గృహ పరిస్థితులను గూర్చియు, వారకాంతల కపటనాటకముల గూర్చియు దెల్పి, అవివేకము మానుమని తమ్మునికెన్నో విధముల బోధించెను. ఆ యుపదేశము విన్న తరువాత నెవ్వఁడైనను తన వర్తనమును మార్చుకొనక తప్పదు. అది నయముతోడను ప్రియము తోడను కూడి యుండెను. నిగమశర్మ రాజాలయమునకు రాకపోకలు చేయుటయు, మాసినచదువులు మరల చదువుటయు, అతిథుల నాదరించుటయు, నాచార్య జనుల సంభావించుటయు మొదలు పెట్టెను. ఇదంతయు చూడ పాఠకుల కాతఁడు సన్మార్గమునకు మాఱినాడేమో యనిపించును. కాని రామకృష్ణుడు పద్యము చివర “తేనెపూసినకత్తి ధాత్రీసురుండు” అని వాడిన మాటలతో నంతకు ముందు కలిగిన నమ్మకమంతయు వమ్మై యెగిరిపోవును. తరువాత నిగమశర్మ యందఱు నిద్రపోవుచుండఁగా నింటనున్న యాభరణములన్నియుఁగొని యిల్లు వెడలిపోయెను. ఇంటిలోని వారందఱును దుఃఖించిరి. మంచి మార్గమునకు వచ్చుననుకొన్న నిగమశర్మ యట్లు పాఱిపోయెననికాదు వారుదుఃఖించుట–తమ తమ యాభరణాదులు పోయెనని. తరువాత నిగమశర్మ నడవిలో దొంగలు చావఁగొట్టి సొమ్ము దోచుకొని పోయిరి. మృతప్రాయుఁడై పడియున్న అతనిని జూచి కాపొకఁ డతని నింటికిఁగొనిపోయి చికిత్స చేయించెను. నిగమశర్మ బాగుపడెను. ఆ కాపున కొక వికారపుఁగోడలు గలదు. ఇచ్చట వికార పదమునకు సౌందర్య రహితురాలని యర్థము కాదు. శీలరహితురాలని యర్థము. ఆమె నిగమశర్మను వలచెను. ఆమె చేయు చేష్టలచే కామశాస్త్ర కళాకోవిదుఁడైన యాతఁడామె వలపెఱింగెను. “తేరకు తేర బంగారపుకొండ తనకు దక్కె”నని యానందించి యాతడామెతోఁగొన్నాళ్ళు రహస్యముగాఁ గ్రీడించి గాలిగంగలజాతర నాఁడందఱును నిద్రపోవుచుండ కాపుగోడలిని లేవఁదీసుకొని పోయెను. వారొక యడవికేగి బోయలలో కలసిరి. కొన్ని నాళ్లకా కాపుకోడలు మరణించెను. ఆమె ఎందుకెట్లు మరణించెనో రామకృష్ణుడు చెప్పలేదు. తరువాత నిగమశర్మ ఒక చండాల కాంతను గూడి క్రీడించుచు నామె యందు సంతానముఁబడసెను. ఒకనాఁడాతఁడు వేఁటకు వెళ్ళిన సందర్భమున వారున్న కుటీరము కాలిపోవుటయుఁ నా చండాల కాంతయు, బిడ్డలును అందుఁబడి మరణించుటయు సంభవించెను. నిగమశర్మ యింటికి వచ్చి జరిగిన దంతయుఁజూచి యిట్లు విలపించెను:

**ఎల్లరు నెల్లచో ధనములిచ్చి మృగాక్షులఁగొంద్రుగాని యో**
**పల్లవపాణి! యేఁబరమ పావనవంశము నిచ్చి కొంటి నీ**
**నల్లని రూపు నిక్కమని నమ్మి! ధ్రువం బదిగాక నేఁడు వి**
**ద్యుల్లతికాధికాభినయ ధూర్వహమౌట నెఱుంగ నింతయున్.** 3-93

**ఈ కడజాతినాఁతి కిహిహీ! మహిదేవుఁడు చిక్కెనంచునన్**
**రాకకుఁ బోకకున్ జనపరంపర కెంపగు చూడ్కిఁ జూచి యం**
**బూకృత మాచరించుటకు బుద్ధిఁ దలంకఁ, గలంక ముక్త చం**
**ద్రాకృతిఁ బొల్చు నీ ముఖము నందమృతస్థితిగాంచి మించుటన్** 3–95

**పుత్రులు లేరె యెవ్వరికి భూమి? మదన్వయవర్ధనుల్ భవత్**
**పుత్రులవంటి వారు మునుపుట్టరు గాక! తదాస్య కాంతి, త**
**ద్గాఁత్ర వివృద్ధి, తద్భుజయుగ స్ఫురణంబు, తదుక్తి లక్ష్మి, త**
**న్నేత్ర సరోజ పత్ర రమణీయత చూపఁ జొక్కఁజేయవే !**

తరువాత నతఁడు అనుద్దిష్టప్రయోజనుఁడును నిర్భోజనుఁడునై యడవిలోఁ దిరిగి దిరిగి పూర్వసంస్కారఫల బలమున పౌండరీకక్షేత్రమునందు నృసింహదేవుఁడు నిత్య నివాసమొనరించు సంగమతీర్థము చేరి, యందు స్నానమాడి, యా దేవుని దర్శించెను. పిమ్మట నతఁడు మరణించెను. యమదూత లాతనిని నరకమునకుఁ గొనిపోవుటకై వచ్చిరి. ఆ దూతల బాధల కోర్వలేక నిగమశర్మ ఆక్రోశమొనరించెను. విష్ణుచక్రము వచ్చి అతని బంధములను ఖండించి యమదూతలను తఱిమివైచెను. అనంతరము విష్ణుదూతలరుదెంచి యతని గరుడ యానమున వైకుంఠమునకుఁ గొనిపోయిరి. అతఁడు విష్ణుసారూప్యమును పొంది పుండరీకుడను పేర విష్ణుపార్శ్వచరత్వము పొంది పరమభాగవతోత్తముఁడయ్యెను. ఈ కథలో రామకృష్ణుఁడు నిగమశర్మ వ్యసనపరాయణత్వమును దుర్వర్తనమును వర్ణించిన విధము చూడ నంతటి పాపి మఱియొక డుండఁడని తోఁచును. కాని వానికి పూర్వసంస్కార తపఃఫలము కూడ చాలఁగలదు. అతఁడు పూర్వజన్మమున మహాభక్తుడై, యిహలోకమున ప్రారబ్ధము ననుభవించి, వైకుంఠము నందినట్లు కనిపించును. ఎంత సత్కులములో పుట్టినవాఁడైనను, వ్యసనములకు లోఁబడినచో నెట్లు చెడిపోవునో రామకృష్ణుడు చక్కగా వర్ణించెను. అట్టివాడు కూడ సంగమతీర్థమున స్నానము చేయుట చేతను, నృసింహదేవుని దర్శించుటచేతను యమభటుల బారినుండి రక్షింపఁబడి పరమపదమును చేరఁజాలెను. ఇది యా క్షేత్రమాహాత్మ్యము. అక్క వచ్చి నిగమశర్మకు సదుపదేశము గావించిన విధాన మద్భుతముగా నున్నది. కొన్ని యిండ్లలో నాడుబడుచులిట్టి పెద్దఱికమును వహించుట యిప్పుడు కూడ మనము చూచుచునే యుందుము. ఆమె యుపదేశ మాదుష్టునియెడ ఫలవంతము కాని మాట నిజమేకాని యతని దుష్టత్వమెంత యధికముగా వర్ణించిన క్షేత్రమహత్త్వమంత యధికముగా భాసించునను నుద్దేశముతో రామకృష్ణుఁ డట్లాతని పాపకృత్యములను వర్ణించెను. క్షేత్రమహాత్మ్యమును దెలుపు కథయే అయినను ఇందు సాంఘికచ్ఛాయలు పెక్కుగలవు. శ్రీనాధుని గుణనిధియు, సుకుమారుఁడును, నిగమశర్మ నిట్లు తీర్చిదిద్దుటలో రామకృష్ణునికిఁ దోడ్పడియుండిరి.

చతుర్థాశ్వాసము నందలి సుశీలోపాఖ్యానము రచించుటలో గూడ రామకృష్ణుడెంతో ప్రతిభాసంపదను ప్రకటించెను. సుశీల పూర్వజన్మమున ధేనువు. అది కృష్ణుని మురళీధ్వని విని పారవశ్యమున పాలు కురిసెను. అందొక బిందువెగిరి శిఖిపింఛమౌళిశిరస్సుపైఁ బడెను. ఆ పుణ్యము వశమున ఆ ధేనువు బ్రాహ్మణునియింట సుశీలయై జన్మించెను. కృష్ణుఁడామెను పరీక్షింప నెంచి యా పరీక్షలో నామె ఎంత వఱకు నెగ్గునో చూచుటకై యామె భర్తను కఠినాత్మునిగను, లోభిగను, మహా క్రోధనునిగను రూపొందించెను. అతఁడు పొట్టి వడుగై భర్తలేని సమయమున నామె యింటి కరిగి చల్దియన్నమైనను బెట్టుమని యడిగెను. వంటచేసి పెట్టువఱకు నాగఁజాలనని యాతఁడు చెప్పుటచే సుశీల చల్దియన్నమేపెట్టెను. ఆ వడుగునకది చాలలేదు. ఆమె భర్త దాచియుంచిన భక్ష్యములన్నియును దెచ్చి పెట్టెను. భర్త వచ్చిన తరువాత నా భక్ష్యములు లేకపోవుట గాంచి తన్ను దండించునని యామె యెఱుంగును. ఐనను ఆమె వానిని ఆ వడుగునకు పెట్టకుండ నుండ లేక పోయెను. అవియు నాతనికి చాలలేదు. అప్పుడామె అగ్నిహోత్రుని ప్రార్థించెను. పలువిధములైన వంటకములు అగ్ని అనుగ్రహమున సిద్ధములయ్యెను. వటువు కృష్ణుడై, యామెకు దాను పరీక్షించుటకై వచ్చిన సంగతియు, నామెయొక్కయు తద్భర్తయొక్కయు పూర్వజన్మ వృత్తాంతములను దెల్పి, తొంటి కంటె సత్యశమార్జవాది గుణ సంపదకు స్థానమవై శ్రీ వైష్ణవుల సంభావింపుమని యుపదేశించి వెడలిపోయెను.

**సుచరిత్ర నేఁడు నీ చే**
**త చలిది భుజియింపఁ జాలదృప్తి యొదవెడిన్**
**బచరణ గా దీగతి మును**
**రుచియింపదు శబరి విందు, ద్రోవది విందున్.** 4-189

అని కృష్ణుఁడు ఆమెను ప్రశంసించెను. ఆమె భర్త పూర్వజన్మమున అకృతసత్క్రియుడను సార్థకనామధేయుఁడైన విప్రుడు. అతఁడు దుర్మార్గుఁడయ్యును వెలయాలితోగూడ పౌండరీక తీర్థమున కరుదెంచి యొకయుత్సవసమయమున పాండురంగనికి పెట్టిన నైవేద్యమును కన్నులార చూడఁజాలెను. ఆ పుణ్యముచే అతఁడుత్తమబ్రాహ్మణవంశమున జన్మించి సతీరత్నమైన సుశీలను పెండ్లియాడఁజాలెను.

**తరుణి మద్భక్త దర్శనోత్సవ సుకృతము**
**పాపవహ్నికి సలిలమై భద్రమొసగెఁ,**
**గాక లేకున్న నితఁడు ప్రాగ్జని నొనర్చు**
**కల్మషములకు నిష్కృతి గలదె యెందు.** 4-198

అని కృష్ణుఁడు సుశీల భర్త పాపరహితుఁడగుటకు కారణమును దెల్పెను. పాల బిందువు యాదృచ్ఛికముగా దేవుని తలపైఁబడి క్షీరాభిషేక మొనరించిన పుణ్యము కలిగించెను. నైవేద్య

దర్శనము అకృతసత్కృతుని పాపములన్నియు పటాపంచలు కావించెను. నిజమునకా రెండును అల్పిష్ఠములైన సేవలే. కాని యవి యొసంగిన ఫలము మాత్రము అత్యుత్కృష్టము. తరువాత సుశీల కైదుగురు పుత్రులు పుట్టిరి. ఆమె చిరకాలముజీవించి కుమారులకు సదుపదేశము గావించి కృష్ణునిదయచే మోక్షము నొందెను.

పంచమాశ్వాసమున ఆగస్త్యశిష్యులైన అయుతనియుతుల కథయున్నది. ఈ కథ పౌండరీక క్షేత్రమాహాత్మ్యమునే కాక గృహస్థాశ్రమ వైశిష్ట్యమును కూడా తెలుపును. అయుతుడు అగస్త్యుఁడు బ్రహ్మ నడిగి తెచ్చిన కన్యను వివాహమాడ నిరాకరించి గురువుచే నాశ్రమము నుండి వెడలఁగొట్టబడెను. నియుతుఁడిద్దరు కన్యలను పెండ్లియాడి వారితో సుఖముగా కాలము గడపెను. అయుతుఁడు తపమాచరించుటకై హిమవత్పర్వత ప్రాంతమునకేగెను. అతని హృదయమున గురుభక్తి లేకపోలేదు, కాని సంసారమనిన నాతనికి వైముఖ్యము.

**ఉర్వీధరము లెక్కి యుఱుకనే! కుచకుంభ**<br>
**యుగమొల్లఁగాక తానుఱుకుమనిన**<br>
**వాఁడికైదువులపై వ్రాలనే! నిడుచూపు**<br>
**డాలొల్లఁగాక తావ్రాలుమనిన;**<br>
**మున్నీట సుడివడి మునుఁగనే! నతనాభిఁ**<br>
**గన నొల్లఁగాక తామునుగుమనిన,**<br>
**బెడఁగారు కాలాహిఁ దొడుకనే! నూగారు**<br>
**తొడుసొల్లఁగాక తాఁదొడుకుమనిన**<br>
**జెప్పి గురుఁడేమి పనిచినఁ జేయలేనె !**<br>
**కావె తన సొమ్ము మామకకాయ గతులు!**<br>
**గదిసి మొట్టోయనంగ లింగంబుగట్టు**<br>
**జంగమన నంగనలఁ గూర్పఁజనదుగాక!** 5-184

అను పద్య మతని గురుభక్తి విశేషమును, వనితాసంగమ వైముఖ్యమును సమముగా సూచించుచున్నది. అతని తపస్సు ముల్లోకములకు తాపము కలిగించెను. ఇంద్రుఁడాతని తపస్సునకు భంగము కలిగించుటకై వృద్ధ మహీసురవేషము దాల్చి శిష్యులును కామధేనువును వెంటరాఁగా నతని యాశ్రమమున కరుదెంచెను. రామకృష్ణుఁడన్నట్లు "తపము గావించు వారి గనిన నాఖండలునకు తల యేర్చును." అతఁడయుతుని వలన నతని వృత్తాంతమంతయు నెఱింగి, ప్రయోజనాంతరముచేనైనను గృహస్థాశ్రమము యొక్క వైశిష్ట్యము నెఱింగించి, గురువును ధిక్కరించినందు కాతని నించుక నిందించెను. అయుతుఁడు గృహస్థధర్మము బూడిద బొట్టు వంటిదనియు యౌవన మశాశ్వతమనియు తన యభిప్రాయమును తెల్పి

**కందర్పాస్త్రములంచు, నంచిత తటిత్కాండంబులంచున్, సుధా**
**మందస్పందములంచుఁ, గాంచనలతామత్తల్లులంచున్, సుధీ**
**బృందంబుల్ ధ్వనినిందలన్ దెగడు నీ బింబోష్ఠ లందెల్ల నా**
**నందాభాసమె కాక, భాసిత చిదానందంబు పెంపొందునే!** 5-225

అని అతని యుపదేశమును బెడచెవిని బెట్టెను. ఇచ్చట నయుతుఁడు చెప్పిన వాక్యములలో నతనికి తపోబ్రహ్మచర్యములందుఁగల నిష్ఠ తెలియవచ్చుచున్నది. తరువాత నింద్రుఁడు కార్యసాధనకై కామధేనువు నచ్చట విడిచి వెడలిపోయెను. కామధేనువు బడుగై పడియుండుట చూచి అయుతుఁడు దానికి సేవచేయ మొదలిడెను. అందువలన నతని తపోవిధానమున కాటంక మేర్పడెను. కొన్ని నాళ్లైన తరువాత నయుతుఁడు కపటగోచరితము నెఱింగి దాని మెడకొక తుండుకట్టి ఆశ్రమము వెడలునట్లుగ తఱిమి వైచెను. అది పరువెత్తుచు వాధూలమునిని త్రొక్కెను. అంత నాతఁడా యావును దానిని తఱుముకొని వెంటవచ్చు నయుతుని గాంచి కుపితుఁడై యయుతుని కప్పవు గమ్మని శపించెను. అంత నయుతుడాతని శాపమును బాపుమని ప్రార్థించి తన వృత్తాంత మంతయు నతని కెఱింగించెను. వాధూలముని యతని నపాపునిగా నెఱింగి, పశ్చాత్తప్తుఁడై గృహమేధి ధర్మము నేవగించుటచే నట్టి కొదవ యొదవెనని తెల్పి, పౌండరీక క్షేత్రమునందలి నృసింహ దేవుని సేవింపుమని హితబోధ కావించెను. అతఁడతనికి దర్దురాంగన వలన సంతాన సిద్ధియగు ననియుఁ దద్ద్వారా పితౄణ విముక్తితోపాటు శాపవిముక్తియుఁ గలుగుననియు నెఱింగించెను. అయుతుడు పాండురంగని సేవించి నృసింహుని దర్శించెను. వెంటనే యతని మనమున మునీశ్వర శాప వికారము నశ్వర దుశ్చేష్టితాభినయ మొనరించెను.

**నీర ప్రాంగణ కర్కటీ బిలమునన్ నిద్రింప, మృత్స్నామయా**
**హారంబుం గబళింపఁ, బెల్లలువ, నిట్టట్టున్ ఱ్లుతంబుల్ కొనన్,**
**దూరాయాస్యదహీంద్ర భీతి హతి గొందుల్ దూఱఁగోరున్ మదిన్**
**సారాపేత మనోబలంబగు భవిష్య ద్భేకముచ్ఛేకమై.** 5-275

అను పద్యమున నావికార మద్భుతముగా వివరింపఁబడినది. అయుతుఁడు ధైర్యముతో నృసింహదేవుని నుతించెను. అతనియందు పూర్వవాసన బలీయమై యుండెను. చిత్రవర్ణవపు రుజ్జ్వలమైన ప్లవముగా మాఱిన పిమ్మట కూడ నాతఁడు భగవత్సేవమానలేదు. తరువాత కన్యాకుబ్జరాజుకూఁతురు చెలికత్తెలతో వచ్చి, కప్పను బట్టుకొనుటయు, దానినొక విప్రునిపై వైచి తచ్ఛాపవశమున చెలులతోఁ గూడ భేకత్వమందుటయు రామకృష్ణుఁడు సంగ్రహముగనైన నత్యంత రమణీయముగ వర్ణించెను. రాజకన్యయు చెలులును మధువిహ్వాలలై చేసిన చేష్టలు వారిని శాపపాత్రులఁ గావించెను. వారు హరిదాస ప్లవమునకు భార్యలైరి. విషమశరుని తూపులకన్న వాధూలముని శాపవాక్కు లెక్కువ వాండ్లగుటచే నతని మనస్సు వారియందు

తగుల్కొనెను. ఇచ్చట నింకొక కవియైన నా కన్యల విహారమును విచ్చలవిడిగా వర్ణించి లభించిన యవకాశమును సంపూర్ణముగా వినియోగించుకొని యుండును. రామకృష్ణునికి పాపరహితుఁడైన అయుతునికి శాపవిముక్తి తొందరగా కలిగింపవలెనను కోరిక యుండుటచేఁ గాఁబోలు వివరములు విడువకుండనే కథను చెరచెర నడిపించెను. ఈ సంగ్రహీకరణ మతని కథాకథన కౌశలమునకు నిదర్శనము. అయుతునకు రాజకన్య యందు కుమారుఁ డుదయించెను. అతని హృదయాకాశమున జ్ఞానచంద్రుఁడుదయించుటచే శాపపు విరులు విరిసిపోయెను. రామకృష్ణుఁడీ కథయందు గృహమేధి ధర్మమర్మమును చక్కగా విశదీకరించెను.

పాండురంగమాహాత్మ్యమున చిన్నకథ లనేకములున్నవి. ముక్తకేశి మధురభక్తితో కూడినది. ఇది రెండుసార్లు చెప్పఁబడినది. మొదటిది ముక్త కేశీ క్షేత్రమేర్పడుటకును, రెండవది ముక్తకేశీతీర్థమేర్పడుటకును కారణములు. చతుర్థాశ్వాసమున కాక, హంస, శుక, సర్ప, మధుకరముల కథలున్నవి. ఇవియే తరువాత సుశీలకు పుత్రులుగా జనించినవి. కాకి యొకటి విఠ్ఠల గృహాంగణ భూమియందలి బలిపీఠముపైఁగల మెదుకులు మేయుటకై శీఘ్రగతి నెగురుచుండ దాని ఱెక్కలగాలిచే నచ్చటి దుమ్ము పోయెను. అందుచే దానికి దేవాలయ సమ్మార్జన సుకృత విశేషము కలిగెను. ఒక హంస విఠ్ఠలాలయ సమీపమునందలి సరస్సు నందలి నీటిలో నీది, ఎండకు భయపడి, గుడిలోనికి వచ్చి తనఱెక్కలు విదిలించెను. ఆఱెక్కల గాలులచే అందుండి జాఱిన నీటి బిందువులచే నచటి దుమ్ము తొలఁగిపోయెను. అందువలన దానికి పాండురంగాలయ గర్భగేహోపలేపన సుకృత పరిపాకము కలిగెను. పాండురంగని గుడిలో పెరుగుచున్న యొక చిలుక నచ్చటి పరిచారిక ప్రీతితోఁ బెంచుచుండెను. ఒకనాడది యామె స్నానమునకేగిన సమయమున నామె ముత్యాల హారము కఱచికొనిపోయెను. ఆ చిలుక పాండురంగని యాలయము నందలి దండెముపై వ్రాలి ముక్కుతో నొక్కొక్క ముత్యమును బీకి క్రింద పడునట్లు చేసెను. ఆ ముత్యములన్నియు కలసి దేవాలయమున మణిరంగ వల్లిని కల్పించెను. అందుచే దానికి పాండురంగని అనుగ్రహము లభించెను.

**గిరికానుషక్త బుద్ధిను**
**పరిచరునిం బోలు నొక్క పన్నగ మొకనాఁ**
**డురవడి నెచ్చట నుండియొ**
**మురమర్దను దివ్యభవనమున కేతెంచెన్.** 4-242

పాండురంగని గుడియందలి చిట్టెలుక యందలి యాసక్తితో నొక పాము గిరిక యందాసక్తుఁడైన ఉపరిచరుని వలె నెచ్చటి నుండియోవచ్చి యాలయము ప్రవేశించెను. అపుడు,

**యమదండ చండమగు భుజ**
**గమునకు వెఱచఱచి యాఖు కన్యక కమలా**
**రమణాంఘ్రిఁజేరె గరుభీ**
**త మతికి నాముక్త మాల్యదకు నెన యగుచున్** 4-244

ఆ యెలుకపిల్ల పామునకు వెఱచి తండ్రి తన్నెవరికైననిచ్చి పెండ్లిచేయునేమో యని భయపడిన యాముక్తమాల్యదవలె కమలారమణపదమును జేరెను. పాముచటికివచ్చి పాండురంగని పాదములపై నున్న మొగలి పువ్వులోని పరాగము నాఘ్రాణించి, యా యానందమువలన పడగ విప్పెను. అప్పుడందున్న మణి ప్రకాశించి దేవునికి దీపారాధన మయ్యెను. ఆ పుణ్యమున నది మరుసటి జన్మమున సుశీలకు పుత్రుఁడై పుట్టెను. కవి సర్పము నుపరిచరునితోడను, ఎలుక నాముక్తమాల్యద తోడను పోల్చెను. ఈ పద్యములను బట్టి రామకృష్ణుఁడు వసుచరిత్రను ఆముక్తమాల్యదను జూచి యుండునని విమర్శకులు తలంచుచున్నారు. దేవాలయ సమీపోద్యానము నందలి మధుకర సమూహము నందలి యొక తుమ్మెద భగవంతుని కర్పింపఁబడిన అర్ఘ్యజలముతోఁ గూడిన యొక పుష్పములోని మకరందము నానెను. అందువలన దానికి భగవత్స్నానతీర్థము గ్రోలిన ఫలమబ్బెను. ఈ యైదు కథల వలన పాండురంగనితో నెట్టి స్వల్పసంబంధము కలవారికైనను సుగతి లభించునను విషయము వ్యక్తమగుచున్నది. బోయచే కొట్టఁబడిన జింక సంగమతీర్థమున మునిగి విద్యాధర రాజత్వము పొందెను. బోయ కూడ నందు స్నానముచేసి, తజ్జలము త్రాగి పాపరహితుఁడై దివ్యత్వమును పొందెను. సుశర్మకథ పై కథలన్నిటికంటె కొంచెము వింతగ నుండును. అతఁడొకనాడు వేఁటకేగి దప్పిగొని పద్మతీర్థమున స్నానముచేసి అందలి నీరు త్రాగెను. ఆ పుణ్యముచే నతఁడొనరించిన పాపము లన్నియు, చిత్రగుప్తుఁడు వ్రాసియుంచిన పట్టికలోని వ్రాఁత యంతయు చెఱిపి విష్ణువు ఆతని పాపములన్నియు నశింపజేసెనని యొక్క వాక్యము మాత్రము వ్రాసెను. చిత్రగుప్తుఁ డాశ్చర్యపడి ఆ విషయము యమునికి తెలిపెను. అదిచూచి యముఁడాతని గౌరవించెను. అతఁడు స్వర్గమున కేగి, భోగము లనుభవించి, మరల భూలోకమున జనించి, పాండురంగని దేవాలయము నూడ్చెను. ఆ పుణ్య విశేషముచే నతఁడు చంద్రలోకమున కరిగి, యనేక సౌఖ్యముల ననుభవించి, పిమ్మట సుకీర్తియను రాజుగా పుట్టి, భక్తుఁడై, వార్ధక్యము రాకముందే సన్యసించి చివర మోక్షము పొందెను. బ్రహ్మమానస పుత్రుఁడైన సనందనుని యుపదేశము ననుసరించి ధర్మరాజు పౌండరీక క్షేత్రమున కరిగి సంగ్రామమున బంధుమిత్రాదుల వధించిన పాపము పోఁగొట్టుకొనెను. ఈ విధముగ పై కథలన్నియు క్షేత్ర తీర్థ దైవతమాహాత్మ్యములను దెలుపునట్టివి. ఇవిగాక గంధర్వుని కథయు, పాండురంగఁడు త్రిదంష్ట్రుని సంహరించిన కథయు చతుర్థ పంచమాశ్వాసములందు కలవు. గంధర్వుఁడు విమానము నెక్కి విఠ్ఠలాలయముపైఁ బోవుచుండ క్షేత్రపాలుఁడైన కాలభైరవుడు

కోపమున పై కెగిరి యాతని క్రింది కీడ్చి చంపఁబోయెను. పాండురంగఁ డడ్డుపడి యతనిని వారించి గంధర్వునిఁ గాపాడెను. ఇది పాండురంగని యపారకరుణా విశేషమును తెలుపును.

రామకృష్ణునికి కథాకథనమునఁగల కౌశల మనన్యాదృశమైనట్టిది. అతఁడేకథలో నైనను అత్యావశ్యకములైన విషయములనే వర్ణించును. కొన్నివిషయముల నాతఁడు పఠితల యూహలకు విడిచి వేయును. నిగమశర్మ యక్కకు తమ్మునిదుర్వర్తన మెట్లుతెలిసెనో యాతడు చెప్పి యుండలేదు. అట్లే కాపు కోడలు మరణించుటకు హేతువేమో యాతఁడు తెలిపియుం డలేదు. ఊరక యొక నాఁడామె మరణించెనని చెప్పెను. నిగమశర్మ చండాలకాంత మరణ మునకై యేడ్చెను కాని, యామె మరణించి నప్పుడొక్క కన్నీటిబొట్టైన విడిచి యుండలేదు. ఆమె వికారపుఁ జేష్టలు అంతకంటె వికారుఁడైన యతనికిఁ గూడ నేవగింపు కలిగించెనేమో! నిగమశర్మ కథలో నతని దౌర్భాగ్యమును సౌభాగ్యమును కూడ రామకృష్ణుఁడెంతో రమణీయముగ వర్ణించి యుండెను. కథలో నంత ప్రధానపాత్ర వహించిన యాయక్క పేరాతడు చెప్పనేలేదు. ఆమె చేసిన బోధన నిగమశర్మ మనసున కెక్కక పోవుట యామెరాక యందలి ప్రాధాన్యము తగ్గించుచున్నది. సుశీలను కృష్ణుఁడు పరీక్షించిన విధమును, వడుగై యాతడు చేసిన చిలిపి చేష్టలను రామకృష్ణుఁడద్భుతముగా వర్ణించెను. సుశీల భర్త యందలి క్రౌర్యము సహజసిద్ధమైనది కాదు. అది కృష్ణుఁడు కావలెనని కల్పించినట్టిది. అతని దౌష్ట్యమంత యధికముగ నున్నఁ గాని ప్రతియోగముచే సుశీల సౌశీల్యము వన్నె కెక్కదు. సుశీల పుత్రులకు చేసిన యుపదేశము వారికే కాక పఠితల కందఱికిని శిరోధార్యమైనట్టిది. రాధాదేవి చరిత్రము నాతఁడు చివర మిక్కిలి సంగ్రహించెను. లేనిచో నా సందర్భమున మధురమో విధురమో అయిన శృంగారమును వర్ణింపవలసి వచ్చియుండెడిది. అయుత నియుతుల కథ అద్భుతముగా నున్నది. సావిత్రిగాయత్రుల పెండ్లి యాడి సుఖముగా కాలము పుచ్చుచుండిన నియుతుని ప్రసక్తి కవి మరల తెచ్చి యుండలేదు. గృహస్థాశ్రమ ప్రాశస్త్యమునాతఁ డిందు పెక్కు విధముల వర్ణించెను. ఇంద్రుఁడు దానిని స్వార్థమునకై వినియోగించుకొనుట రమ్యముగా నున్నది. జ్ఞానవంతుఁడగుటచే నియుతుఁడు గోసేవచే తన తపస్సునకు భంగమగుచున్నదని సులభముగా గ్రహించెను. వాధూలముని తపస్సు చేయుచుండఁగా నాతనిపై పుట్టలు పెరిగెను.

కామధేను వాతని త్రొక్కఁగనే

**మట్టిన, బిట్టు మట్టి పడి మౌని సముత్థితుఁడయ్యె, మేనిపైఁ**
**బెట్టిన పుట్ట నెట్టవిసి బీటలువాఱ, శ్రవశ్శకుంతముల్**
**చట్టుపలెత్తి ముందరికి సాఁగఁదలంప, జటాచ్ఛటాచ్ఛవిన్**
**దుట్టెలుగట్టి నిద్రిలు మరుద్భృగధీశ కులంబు మేల్కనన్** 5–249

ఈ వర్ణనమునుబట్టి యాతడెన్నినాళ్ల నుండి తపస్సొనరించుచుండెనో పాఠకులూహించు కొనవలయును. కప్పయైన పిమ్మటంగూడ నయుతుండు భగవద్ధ్యానమును విడువకుండుట యతని పూర్వవాసనా విశేషమును తెలుపుచున్నది.

పాండురంగమాహాత్మ్యము భక్తిబోధకమైన గ్రంథము. అందుచే నిందలి ప్రధాన రసము శాంతము. పుండరీకుండు రాధాదేవి కావించిన తపముల వర్ణనలయందు శాంతమే గోచరించును. తీర్థక్షేత్రదైవతముల సేవించిన జంతువుల కథలు కూడ శాంత పర్యవసాయులు గానే యున్నవి. ఇంక నవాంతర కథలలో వివిధ రసములు గోచరించును. ఉమామహేశ్వరుల ఉద్యానవనవిహారము జగత్పితృసంబంధి యగుటచే దివ్యమైన శృంగారమున కునికిపట్టు. నిగమశర్మ శృంగార మంతయు పరకాంతలతో సంబంధించినది. అతడు లాలితాకారయైన యిల్లాలివంక నక్కగారు వచ్చినప్పుడొక్కమాఱు చూచెనేమో! కాపు గోడలితోడను చండాలకాంత తోడను అతడు వర్తించిన విధము ధర్మేతరమగుటచే నాభాసము వలెనే కనిపించును. రాధాదేవి చరిత్రమున నిర్మలశృంగారమును వర్ణించుట కవకాశమున్నది కాని రామకృష్ణుడట్లు చేసియుండలేదు. ఆమె వర్ణనమునందు మాత్రము శృంగార చ్ఛాయలు గోచరించును. అయుతుడు భేకమైన పిమ్మట తిర్యగ్గతమగుటచే ఆభాసముగనే పరిగణింపందగియున్నది. నిగమశర్మ యక్క తమ్మునికి చేసిన యుపదేశములో కరుణరసచ్ఛాయలున్నవి. అతండు చండాలకాంతయు, పుత్రులును మరణించినప్పుడు పొందిన వేదనయు దరువాత ననుభవించిన దైన్యమును కరుణరస నిర్భరములు. సుశీలభర్త యామెయెడ వర్తించిన విధము కూడ కరుణరసాకరమే కాని యది కృష్ణుండు కావలయునని కల్పించిన దగుటచే కరుణరసాభాసము గనే కనిపించును. అయుతుని కథ చివర రామకృష్ణుండది అద్భుతరసమయ మని వర్ణించెను. అగ్ని వంటకములు సిద్ధము చేయుట సుశీల యెదుట వటువు కృష్ణుడుగా మాఱుట అద్భుతరసమును సూచించుచున్నవి. క్షేత్ర పాలకుండైన కాలభైరవుండు విమానగామియైన గంధర్వుని క్రిందికీడ్చి చంపబోంవు సందర్భమున రౌద్రరసమును, అగస్త్యుడయుతుని యాశ్రమము నుండి వెడలంగొట్టు సందర్భమునను, వాధూలుండతనిని శపించు సందర్భము నను క్రోధరసమును గోచరించుచున్నవి. కన్యాకుబ్జ రాజకన్యయు నామె చెలికత్తెలును దివ్యక్షేత్ర ములను మలినీకరించుటలో బీభత్సము తొంగిచూచుచున్నది.

రామకృష్ణుండు హాస్యమునకు పెట్టినది పేరు. అతనికి సంబంధించిన కథలలో హాస్యరసము నిండారి యుండును. కావ్యమునందు కూడ పెక్కుచోట్ల నా హాస్యము 'నేనున్నా' ననియే యనిపించుచుండును. "స్వభావోదురతిక్రమ్యః" యని కదా పెద్దలందురు. పుండరీకుం డు దశావతారములను వర్ణించు సందర్భమున 'ప్రతిదిన కేశలుంఠనపురాయిడి నెట్టన బట్టగట్టి' (2-64) అను బుద్ధావతార వర్ణనము హాస్యపూరితమై యున్నది. భగవదవతారమును కూడ పరిహసించుట కాతండు వెనుదీసి యుండలేదు. సుశీలకథలో వటువెంత తినియును

చాలదనుట సుశీల యెడ సానుభూతిగల పాఠకులకుఁ గూడ హాస్యరసాన్వితము గనే కనిపించును. నిగమశర్మ యింటిలోని వస్తువులన్నియు మూటగట్టుకొని పోఁగా నతని భార్య తప్ప మిగిలిన వారందఱును విచారించి 'శోకించు వృద్ధ భూసురుడాత్మ పితృదత్త దర్భ ముద్రికకు చిత్తంబు కలగి....... క్రొత్తగా చేయించుకొన్న ముక్కరకునై యడలు దుర్వారయై యాడుబిడ్డ.....' (3-50) అను పద్యమున నెవరెవరెందుకు విచారించిరో చెప్పఁబడినది. పనిగట్టుకొని తమ్ముని బాగుచేయుటకై వచ్చిన యక్క ముక్కరకై విచారించెను గాని తమ్ముఁడు భ్రష్టుఁడై పోయెను గదా యని విచారింపలేదు. ఇచ్చట రామకృష్ణుని హాస్యస్వభావము గోచరించుచున్నది. అక్క నిగమశర్మ పాదములు కడుగు మని మఱఁదలికి కనుసన్న చేసెను. అప్పుడాపైదలి 'ప్రాణేశ్వరు శ్రీపాద ద్వయముగడిగె శీతల వారిన్ (3-25). ఇచ్చట రామకృష్ణుఁడు శ్రీపాదములని ప్రయోగించుట యధిక్షేపము కొఱకేకాని యవి శ్రీశోభితములనికాదు. ఇట్టి ప్రయోగములాతని గ్రంథము నిండ కనిపించును. కుమారస్వామి తండ్రి నడిగి సందేహము తీర్చుకొనుటకై ప్రమథాదులతో బయలుదేఱెను. ఆ ప్రమథులయలంకారము లందఱెఱిఁగినవే. అందులో విభూతియొకటి. వారొడలఁబూసికొన్న యావిభూతి బూజుపట్టినట్లున్నదట. కొన్ని నాళ్ళు తానును దానిని ధరించినవాఁడే యగుటచే తత్సౌందర్య మాతఁడు బాగుగా నెఱుంగును. పుండరీకునికి కృష్ణుఁడు ప్రత్యక్షమయ్యెను. అప్పుడాతఁడు చలిదిచిక్కమును, పచ్చవెదురును మఱచిపోకుండ వెంటఁదెచ్చుకొనెను. ఆ చిక్కమెట్లున్నది? "ముని మీనగుటం బట్టమునులు వైచిన బత్తివల" వలెనున్నది. నారదునితలపై నున్న యెఱ్ఱని జడలు సుషుమ్నా నాడి యీనిన పిల్లల వడువున నున్నదఁట! అప్రయత్నముగనే యతని నోట నిట్టి హాస్యచ్ఛాయ గల వాక్కులు వెలువడుచుండును. ఇతరులెంత యత్నించినను అట్లు చెప్పఁజాలరు.

రామకృష్ణుఁడు పాత్ర చిత్రణమునం దప్రతిమానుఁడు. అతని పాత్రలు పఠితలకు కొన్ని రోజుల వఱకు కన్నులయెదుట మెదలుచునే యుండును. పుండరీకుఁడు భక్త శిఖామణి; పితృసేవాతత్పరుఁడు. "ఆపాద మస్తంబు నంటు నూనియఁగాచి" (2-19) అను పద్యమతని పితృశుశ్రూషా తత్పరతను దెలుపును. చతుర్థాశ్వాసమున నతఁడు యోగిపుంగవుఁడుగా కనిపించును. అతనిలో కుండలినీశక్తి లలాటమధ్యసంజనిత సుధామయూఖ సుధ గ్రోలఁ జాలినది. కుమారస్వామి స్కాంద పురాణమును రచించిన వాఁడైనను అగస్త్యుఁడడిగిన ప్రశ్నకు తనకు సమాధానము తోఁచుటలేదని గర్వరాహిత్యము ప్రకటించినాడు. ప్రకటించిన పితృ భక్తియు వినయమును కుమారులందఱికిని శిరోధార్యము. పార్వతి ప్రౌఢ. "విమల మయూఖ రేఖయు నవీనతరోత్పలపత్రమున్ బ్రవాళ మణియు నొక్కతీవె యబలా! ప్రబలాధృతిదాల్చె" నని శివుఁడు వ్యంగ్యగర్భముగ ప్రసంగింప నామె విభ్రమ శిథిలాంగి యయ్యుఁగుచభార నితంబకపోలగోపన క్రమకలనాకులాత్మయయి యతనిఁ గన్నులతో నదలించెను. రాధ సౌందర్యమూర్తి యయ్యు భక్తిప్రవణమానస. ఆమె తపస్సుచే కృష్ణుని మెప్పించి యాతని

వాల్లభ్యమును బొందఁజాలెను. పాండురంగడు దయాసముద్రుఁడు. ఆతఁడు కాపాడనిచో ప్రచండమూర్తియైన కాలభైరవునిచేత విద్యాధరుఁడు మడిసెడివాఁడె. రామకృష్ణుడు కృష్ణునిందు చల్దిచిక్కముతోడను, గచ్చకాయల జాలెతోడను, ఆలనుదోలు పచ్చవెదురుతోడను గూడిన బాలమూర్తిగా వర్ణించెను. ఆతఁడు వడుగై సుశీలను బరీక్షించిన విధము తీవ్రమయ్యును హాస్యగర్భితమై యున్నది. సుశీల మహాపతివ్రత. క్షమాధాత్రి. ఆమె భక్తి పాతివ్రత్యములకు మెచ్చియే కృష్ణుఁడనన్యలభ్యమైన తన దివ్యదర్శన మామెకొసంగెను. పుత్రులకుఁ జేసిన యుపదేశమామె హృదయనైర్మల్యమునకుఁ దార్కాణ. ఆమె భర్త క్రౌర్య కార్యములామెను పరీక్షించుటకై కృష్ణుఁడు కల్పించినట్టివి. తరువాత నాతఁడా దేవుని యనుగ్రహముచే మార్పు చెందెను. అయుతుని పట్టుదలయు, బ్రహ్మచర్యనిష్ఠయు నసాధారణములు. వివాహమాడుమని గురువు చెప్పినప్పుడాతని మాట నిరాకరించినను అతఁడు నిర్దోషి. ఆగస్త్యుడాతని నడిగి కన్నెను తీసికొని రాలేదు. అందుచేత నతఁడాతని నాశ్రమము నుండి వెడలఁగొట్టుట మృదుహృదయులకు బాధ కలిగించును. కామధేనుసేవాతత్పరుఁడై యతఁడు కొంతకాలము తపోదూరుఁడయ్యును వివేకియగుటచే వెంటనే తన లోపము తెలిసికొనెను. వాధూలుఁడు కోపశీలుఁడై ముందాతని శపించినను దరువాత నతఁడు నిష్పాపుఁడని యెఱింగి పశ్చాత్తప్తుఁడై శాపమోక్షము నెఱిఁగించెను. అగస్త్యుఁడు బ్రహ్మచే గూడ స్తుతింపఁ బడుటకుఁ దగిన మహిమ కలవాఁడు. కాని యతనికిఁ దన పంతము నెగ్గించుకొనవలెనను పట్టుదల యున్నది. ఇంద్రుఁ డాత్మపదభంగభీరువు. కన్యాకుబ్జరాజ తనయయు నామె చెలికత్తెలును యౌవన గర్వముచే క్రిందు మీఁదెఱుఁగక వర్తించి తత్ఫలితము ననుభవించిరి. రామకృష్ణుఁడు నిగమ శర్మ పాత్రను అతని అక్క పాత్రను అద్భుతముగ చిత్రించెను. నిగమశర్మ చేయని పాపము లేదు. యమదూతలు "లలనాధరోష్ఠ లాలాజలా విలముగఁ గ్రోలె మద్యము పేరి కొలమునెల్ల" (2-105) అని ఆతఁడొనరించిన కొన్ని పాపములు పేర్కొని మిగిలిన వానిని చెప్పలేక 'యితర పాతకములు చేసెనెన్నియేని' అని యా పాపముల పట్టిక నితరశబ్దముతో పూర్తిచేసి యుండెను. అతఁడు తార్తీక పురుషార్థమునకుఁజిక్కి తన వంశమును గాని, తల్లిదండ్రులను గాని, యిల్లాలినిగాని, చదువు సంధ్యలను గాని లెక్క చేయక యెన్నో దుష్కృత్యముల నొనరించెను. అక్కమాటలు వినినట్లే విని యాతఁడామె సొమ్ములు గూడ తీసికొని యిల్లు వెడలెను. ఈ విధముగ నాతఁడు మొదటి నుండియు హృదయహీనుఁడుగా కనిపించును. అంతవఱకును మఱగున పడియున్న యాతని మానవత్వము చండాలకాంతయు బిడ్డలును అగ్నిలోఁబడి మరణించినప్పుడు అగ్నిపర్వతము వలె ప్రేలి కరుణరసమును ప్రసరింపఁజేసెను. అతఁడెంత దుష్టుఁడైనను పూర్వవాసనా బలముచే పరమపదమున విష్ణు పార్శ్వచరత్వము పొందఁజాలెను. ఇంక నాతని యక్క తమ్ముని మందలించిన విధమపూర్వము. ఆమె భర్తతో బిడ్డలతో వచ్చి రూపు చెడియున్న యిల్లంతయు చక్కగ సవరించి తమ్ముని లాలించి ఎన్నో విధముల హితోపదేశము కావించెను. "తమ్ముడా! నీవు యజ్ఞము చేయుచుండఁగ నేను

పూజ్యురాలనై వేది నలంకరింతు” నని పలువురితో చెప్పుచుందునని యామె తెల్పునప్పుడు పాఠకుల హృదయము కరcగి తీరును. ఆమె వేశ్యల కపటనాటకము వర్ణించి చెప్పెను. హరికౌస్తుభమైన తెచ్చియిచ్చెదనను వాగ్దానము చేసెను. “విప్రకన్యామణులన్ సహస్రమైన వరియించి రమించరాదె”అని ఆమె అనcగూడని మాటగూడ ననిచూచెను. ఈ విధముగా నామె నయము ప్రియము వ్యక్తమగునట్లుగ తమ్ముని బోధించి ఉపలాలించెను. అతcడు మారినట్లు నటించి పూర్వపుమార్గమునే అనుసరించెను. రామకృష్ణుcడు తెల్పలేదుకాని యది యామె హృదయ నిర్భేదము కావించియుండును. ఈ విధముగ రామకృష్ణుడు పాత్రలను చిత్రించిన విధము అనన్య సాధారణమును, అద్భుతమునై యున్నది.

రామకృష్ణుని వికట కవితాప్రథ ఆతని పాండిత్యమును కప్పిపుచ్చినది. సంస్కృతమును దెనుcగుగను తెనుcగును సంస్కృతముగను జేయcగల చతురమతి యాతcడు. శైవ వైష్ణవ పురాణావళీ నానార్థములాతనికి కరతలామలకములు. పెద్దన, భట్టుమూర్తి, ధూర్జటి మున్నగు విద్వత్కవులను గూడ నదరcగొట్టెనన నాతc డెంతటి పండితుcడై యుండవలయును? కేవల పండితుcడే కాదు; అతcడు యోగశాస్త్ర విజ్ఞానసంపన్నుcడు కూడను. కుండలినీ శక్తి షట్చక్రభేదన మొనరించి సహస్రార చక్రమును జేరుట యాతcడెరుంగును. అతcడు మొదట శైవుcడు. వైష్ణవ మతమునవలంబించిన పిమ్మట కూడ నాతని నావాసన వదలలేదు. అతని కావ్యమందలి అగస్త్యుcడు పరమ శైవోత్తంసుcడు. వైష్ణవశేఖరుcడైన పుండరీకుcడు భస్మోద్ధూళన పాండురాంగుcడు. చివరికి తపస్సు చేయు రాధకుcగూడ నాతcడింత విభూతి నలది యుండెను. పౌండరీకక్షేత్రపాలకుcడు కాలభైరవుcడు. నిజమున కాతcడు శైవవైష్ణవ భేదమునంతగా పాటించినట్లు కనcబడదు. శివుcడు మూర్తిత్రయైక నిలయుcడయ్యెను దనుజరిపు ప్రసాదజనిత ప్రతిభానిధి; వైష్ణవోత్తముcడు. పాండురంగక్షేత్ర మాహాత్మ్యము చెప్పిన వాcడతcడే. రామకృష్ణుడు కావ్యారంభమున వినాయకుని విడిచినను శివపార్వతులను స్తుతించుట మానలేదు. వేసవిని వర్ణించు సందర్భమున నతcడు “వ్యావహారిక సత్యత్వంబు ప్రకటించు ప్రపంచంబు చేత వంచితులగు నెఱుక లేని కఱటుల కరణి హరిణంబులు మరీచికా వీచికాపాన వివశంబులై దిశలcబరిభ్రమించె” నన్నాcడనియు, నది అద్వైతులే కాని విశిష్టాద్వైతులాడవలసిన మాటలు కాదనియు శ్రీమాన్ అనంతకృష్ణశర్మ గారు తెల్పియున్నారు. అతcడు కవిస్తుతిలో వాల్మీకివ్యాసులను ప్రత్యేకముగ పేర్కొని తెలుcగు కవులనందఱిని “నన్నయభట్టాది కవుల” నను సమాసమున నిఱికించివైచెను. ప్రత్యేకముగ వారిని నుతించుట అవసరమని యాతనికి తోcచియుండదు.

రామకృష్ణుcడు తన కావ్యమున సమకాలిక పరిస్థితుల నందందు సూచించి యుండెను. నిగమశర్మ కథ యందలి గాలిగంగలజాతర యిందు కొక నిదర్శనము. వ్యసన పరాయణులైనచో భ్రష్టులైన అగ్రవర్ణములవారు కూడ నెట్టి దుష్కృత్యము లాచరింతురో అతcడా కథలో

వివరించినాఁడు. "భ్రష్టస్య కావాగతిః" అను అనుభవజ్ఞుల మాటలకు నిగమశర్మ పరమ నిదర్శనము. కవి సామాన్య బ్రాహ్మణ గృహస్థ జీవితమును "తలఁగఁడు గంగ మర్దనము, ధౌతపటావరణంబు" (3-8) పద్యమున చక్కగా వర్ణించినాఁడు. నిగమశర్మ దిన వెచ్చమునకుఁ దన మేనఁగల సొమ్ము బచ్చింటఁ గుదువ పెట్టెను. మిండవడ్డీకి నోర్చి మృత్యురూపములైన సాహులచే ఋణగ్రాహి యయ్యెను. స్త్రీలు పసుపు లేకుండ నప్పుడు స్నానము చేసెడి వారు కారు. స్నానమునకు పసుపాడుట యనియే పేరు. పసుపారోగ్యదాయకమే కాక రోమహరము. పుండరీకుఁడు తండ్రి యుపాసనకగ్ని వెలిఁగించి అతనికి విష్ణు సహస్రనామ పారాయణమునఁ దోడ్పడుచుండెను. అప్పటి వైష్ణవబ్రాహ్మణులు సంధ్యావందనమైన పిమ్మట విష్ణు సహస్రనామ పారాయణము తప్పక చేయుచుండెడివారు. రామకృష్ణుఁడు ఋతువులను వర్ణించు సందర్భమున నప్పటి యాచారములు పెక్కు సూచించెను. నిగమశర్మ కథలో

> **"అతఁడు కళింగోద్భవుఁడగు**
> **కతముననో, వ్రేలఁజూప కసుగందక, యో**
> **గ్యతమ స్వీకారమునకు**
> **నితరుండై యుండె మునికులేశ్వర వింటే"** 3-17

అని యొక్క పద్యము వ్రాసెను. దీని వలన అప్పటి రాజకీయ పరిస్థితులవలన విజయ నగరసామ్రాజ్య వాసులకు కళింగోద్భవుల యెడ నెంతటి 'గౌరవ' ముండెడిదో తెలియుచున్నది. రామకృష్ణుఁడు బహురాజాస్థానములందు మెలఁగిన వాఁడగుటచే నందలి యాచారము లన్నియు నెఱుంగును. కుమారస్వామి కైలాసమున కరిగినప్పుడు వాహనము దిగి తత్పుర సవిధవన విహారాసక్తమైన సైన్యము 'నోహో! నిలు' మని నిల్పెను. అతఁడు తండ్రియే కదాయని శివుని కడకు వెంటనే పరుగెత్తక కంచుకులచే తన రాక నెఱింగించి, యతని యనుమతి వడసెను. తరువాత వీడియం బెడలించి, నీరు పుక్కిలించి యుమిసి, బంగరువ్రాఁత హొంబట్టువలె వాటు సడలించి కటిస్థలిని జుట్టి, సేవకునిచేత నున్న కానుక తానే గ్రహించి, అంగుళసంజ్ఞచే సంయముల ముందు లోనికి పంపి, తరువాత తానరిగి తండ్రికి మ్రొక్కెను. పిమ్మట నతఁడు తండ్రికి దివ్య ముక్తామణిని కానుకగా నిచ్చెను. ఆ ముత్యము చరిత్ర చాల విస్తృతమైనది (1-202). దానిని శివుఁడు శిరమునను చెవిపైని ధరించెను. రాజాదుల దర్శనమునకు వట్టి చేతులతో పోరాదను సంప్రదాయమున్నది కదా! అది యిప్పటికిని ఇంకొక విధముగా సాగుచునే యున్నది.

పాండురంగమాహాత్మ్యమునందు నిగమశర్మాదుల కథలన్నియు క్షేత్రమాహాత్మ్యమును తెలుపునట్టివే. క్షేత్రమాహాత్మ్య గ్రంథములు ఆయా క్షేత్రముల యొక్కయు, తీర్థముల యొక్కయు మహిమను, స్వరూపస్వభావములను వర్ణించున వగుటచే కొంతనీరసములుగా నుండుట కవకాశమున్నది. కాని ప్రతిభావంతులైన మహా కవులు వట్టి క్షేత్రమాహాత్మ్యములను కూడ

రసవన్మహాకావ్యములుగ తీర్చిదిద్దఁగలరు. అందుకు వారి భావనా మహిమయు, రచనా చమత్కారమును కారణములు. తెలుఁగున మొదట క్షేత్రమాహాత్మ్యమును వ్రాసిన వాఁడు ఎఱ్ఱాప్రెగ్గడ. శ్రీనాథుఁడు, ధూర్జటి, రామకృష్ణుఁడు తరువాతి వారు. వీరు ప్రబంధోచితములైన సరసవర్ణనములచే వట్టి శుష్క గ్రంథములలో గూడ కావ్యతా సౌరభము గుబాళింపఁజేసినారు. వారి గ్రంథములు చదువుచుండ నేదో మహత్తర విషయము చదువుచున్నట్లే యుండును గాని వట్టి మహిమలను చదువుచున్నట్లుండదు. రామకృష్ణుని రచన యందు శ్రీనాథుని ప్రభావము చాలా గోచరించును. అతని యందే కాదు, తరువాతి ప్రబంధకవులు పలువురాతని పదభండారమునుండి సుందరములైన పదములను పదబంధములను ఎరవు తెచ్చుకొన్నట్టివారే. 'సూత్రవతీదేవి సొబగు పాలిండ్లపై, మలుపచ్చి గంధపు వలపుతోడ'; 'ధరణీభరముఁ దాల్చు దన చేవయంతయు, భుజపరిఘంబుల బొంక పఱిచి' (1-9), 'గోర్వెచ్చ చమురంటికొనిరి మస్తకములు, జలకమాడిరి నిశామిళిత వారి', 'దినవెచ్చమునకునై తన మేనఁగల సొమ్ము కొదుకక బచ్చింట కుదువ వైచు' (3-16) మున్నగు పద్యములలో శ్రీనాథుఁడు తొంగి చూచుచున్నాఁడు. సిగ్గువాసినకటి, పొగలేనిముర్మురములు, వాలారుచూపులు, కొంగు బంగారము, నిఱుపేదనడుము మున్నగునవి ఆంధ్ర వాఙ్మయమునకు శ్రీనాథుఁడు ప్రసాదించిన పదబంధా లంకారములే. శ్రీనాథుని వలెనే పెద్దనను, తిమ్మనను, భట్టుమూర్తిని, రాయలవారిని తలపించు పద్యములు పాండురంగమాహాత్మ్యములో పెక్కు గానవచ్చును. కుమారస్వామి కానుకగా నిచ్చిన ముత్యము శివుఁడు శిరమందును చెవియందును, పార్వతి 'కచాళిఁగర్ణమునఁ గేలను' వహింపనది వారు డెందములనేది యభిలషించిరో ఆ రూపమును ధరించెనని రామకృష్ణుఁడు వర్ణించెను. ఇది పారిజాతా పహరణము నందలి 'అళినీలాలక! నీవు నీపతి' అను పద్యమును స్మృతికిఁ దెచ్చుచున్నది. రాయలవారివలె రామకృష్ణుఁడు పెక్కు సంస్కృత వాక్యములను తెలుఁగు పద్యములలో చొప్పించుచుండును. ఒక పద్యము కొంచెమించుమించుగ సంస్కృత మయమైనట్టిదే గలదు (4-303). "ప్రహ్లాదనారద పరాశర పుండరీక" అను భక్తుల పట్టికను దెల్పు శ్లోకమునతఁడు "సురకర్మంది, హిరణ్య దైత్యసుతు" (4-104) అను పద్యమునందనుసరించెను. "మాద్రికి మీరు నంచ వెలిమావు పయిన్ మురులైన జోదుచే, భద్రమయాత్మచే (1-3)" అను పద్యమునందువలె ప్రతివిశేషణము తరువాతను విభక్తిప్రత్యయములు చేర్చుట రామకృష్ణుఁడు శ్రీనాథునినుండి నేర్చుకొన్నదే. "వద్దు మ్రొక్కోయనంగ లింగమును కట్టకడుగ" నను ఆముక్తమాల్యదయందలి పద్యమును చూచియే కాఁబోలు రామకృష్ణుఁడు "కదిసి మ్రొక్కోయనంగ లింగమును గట్టు జంగమన నంగనలఁ గూర్పఁ జనదుగాక" అను పద్యమును వ్రాసియుండెను. భావనా పటిమ యందును, పద ప్రయోగము నందును సమాసముల కూర్పునందును రాయలవారికిని ఇతనికిని చాలా సామ్యములు కన్పించును. ఇతరులనుండి తెచ్చికొన్న యిట్టి పదములు కాక రామకృష్ణుడు తాను స్వయముగ వాడిన సుందర పదబంధములును కొన్ని కలవు. పిల్లిశీలము, ప్రాసఁగు

విత్తువంటి, నెఱపాఱుగొలము, మీనుమీసమువంటి, యొంటిజందెము, తనకుఁ బోదు నాకుఁ బోదని కాలీచవడఁ జరింపుదు, కంపలఁబడ్డ కాకి, పదు పడుకకు చెప్పక, చుక్క తెగిపడిన చందము మున్నగునవి యిందుకు తార్కాణములు. "పదము దివిచిన కస్తూరి, ప్రాచియలరు, పాయఁబారిన కూడు, నీర్వట్టు మడుఁగు, గళిత మణియగు సొమ్ము, నైకానఁబడియె, దుర్విదగ్ధుఁ డు గౌరవదూరుఁడగుచు (3-22)" అను బద్యము నందలి పదములన్నియు రామకృష్ణుని స్వయం సృష్టులే.

రామకృష్ణుని వ్యక్తిత్వమంతయు నతని భావస్వాతంత్ర్యమునందును కల్పనా కౌశలమునందును గానవచ్చును. ఆతఁడు పెక్కు చోట్ల ఈ భావము నాదే యై యుండవలెనని యనుకొని వ్రాసినట్లు వ్రాయును."మారుతాహతిరాలు నారికేళ ఫలాళి విరిసి జల్లించు పుండ్రేక్షురసము" మున్నగు పద్యములలోని కల్పనలు స్వతంత్రములై అతి సహజములుగ నుండును. "ఇట్టివి సృష్టించుటలో నొక్క రాయలు తప్ప రామకృష్ణునితో పోటీకి నిల్చువారెవ్వరు నులే"రని శ్రీనారాయణాచార్యులవారు చెప్పినమాటలో నెంతో సత్యమున్నది. వెండికొండ అతని దృష్టికొక గోరాజము; చంద్రశేఖరుఁడు దాని మూపురము. దాని చెంతఁబాఱు అచ్యుతచరణాబ్జ మరందధారయైన గంగ యాగోవునకు గంగడోలు. రామకృష్ణునిపై సంస్కృత మహాకవుల ప్రభావము పెక్కుచోట్ల కనిపించును. 'పద్మినీపద్మాతపత్రంబు శిథిలపత్రాగమై రాయంచ యాశ్రయించె' (1-136) అను పద్యము సంస్కృత నాటకములలో నంకాంతము లందు కాలసూచనకై రచింపఁబడు శ్లోకములను తలపించుచున్నది. 'చదువుల పుట్టినిండ్లు శమసంపద యిక్కలు పుణ్య లక్ష్మికిన్ మొదలి దివాణముల్' (1-109) అను పద్యము సంస్కృత కవి యెవరో వ్రాసినట్లున్నది. "పాపట తెఱువున... ప్రథమోద బిందుపటలము నిగిడెన్" (4-27) "ప్రకృతి మధురంబులకు వేషరచనలేల" (5-150) "నిమ్నాభిముఖమై నీటినెవ్వాఁ డోపు..." (5-229) మున్నగునవి కాళిదాసున కనుకరణములు.

రామకృష్ణుఁడు సందర్భానుగుణముగ రచనను మార్చుచుండును. ఒక్కొక్క చోట అందములైన తెలుగుపలుకులను కుప్పవోయును. "గంగ కాటుక కొండ గప్పు నొప్పిదము దల్కొత్త నావులపాలనోలలార్చి' (2-109) మున్నగు పద్యము లిందుకు నిదర్శనములు. నిగమశర్మ విష్ణుపార్శ్వచరత్వమును పొందినప్పుడు రామకృష్ణుఁడు వ్రాసిన ఉత్తాలఫణి భుగ్గరుత్తాల వృంతాని లాచాంత ఘర్మాంబువయ్యె మేను" (3-10) అను పద్యమును, 'కఠిన కంఠీరవాక్షత నఖక్షత జరత్ కరిశిరశ్శుక్తి శార్కరిలతలము' (3-83) అను పద్యమును ఆతని సంస్కృత భూయిష్ఠమైన రచనకు నిదర్శనములు. అతని పదముల కూర్పే ఒక వైలక్షణ్యముతో కూడి యుండును. "దామోదరుఁడు యశోదాస్తన్యమానెడునని మ్రొక్కు విరిగుత్తినలి భ్రమింప' (5-299) అను పద్యమున మధుమద విహ్వలలైన కన్యల ప్రలాపములు చక్కగ వర్ణింపబడినవి. 'అలమిగుడి మ్రింగు వానికి తలుపు లప్పడములు కాకుండెనె' (5-29). 'బీదబలిసి బంది

కాఁడగు, విధంబున' (5–239) 'ఈరు దివియ పేసురాకున్నె., 'బండిమీఁదఁబోవుచున్నాఁడు' (4–126, 127) 'మఱుఁగు సగము మైలయు సగమే' (5–220) అనునవి రామకృష్ణుఁడు విరివిగా వాడిన లోకోక్తులలోఁ గొన్నిమాత్రమే. "కాళరాత్రీశుఁడగు నీకుఁగడిఁది తమము పుండరీకాక్షుఁడగు నీకు భూరితమము సత్కృపాంభోధియగు నీకు సత్త్వభృతియు ననుగుణంబులు మూర్తిత్రయైక నిలయ (2–197) అను పద్య మతని సాభిప్రాయ పద ప్రయోగమునకు మచ్చులు.

రామకృష్ణుఁ డచ్చుటచ్చుట వాడు శబ్దార్థాలంకారములు సుందరములై యతని లోకపరిశీలనమును, పాండితీ ప్రకర్షను చాటుచుండును. "పలుకుం దొయ్యలి మోవి కాంతికెనయౌ బాగాలు, నయ్యింతి చెక్కుల బోలుం దెలనాకులు" (1–29) "ముని మీనగుటఁ బట్టి మునులు వైచిన బత్తివలఁ బోలెఁజిక్కమౌఁదలఁ దలిర్ప" (2–14) "మధురమదిరా రసామోదమైత్రి నలరు పొలంతినెమ్మోము వలపాను భోగివోలె" (4–248) మున్నగునవి యతని యుపమాన ప్రయోగ సౌందర్యమునకు నిదర్శనములు. మూడవ దానియందలి భోగిశబ్దప్రయోగ మద్భుతము. ఇచట నుపమేయము భుజంగభర్త. భోగి భుజంగశబ్దములు రెండును కొంచె మించుమించుగా రెండర్థములందును సమానములే. నిగమశర్మ యక్క చేటికానీత పీఠికాసీన యగుచుఁ బద్మకర్ణికఁ గొలువున్న పద్మవలె నుండెనఁట. ఇచ్చటి యుపమ యామె ఠీవిని పవిత్రత్వమును ప్రదర్శించుచున్నది. రామకృష్ణుఁ దర్థాంతరన్యాసములెన్నో వాడుచుండును. అవి యతని లోకానుభవమునకు నిదర్శనములు. "సంపదలపై మఱియున్ జనియించు సంపదల్' (2–7) "భాగ్య మొదవెనేని ప్రాపించుఁదనుదాన పుణ్యలక్ష్మి నిధియుఁ బోలెఁ బురుషు" (4–28) అనునవి వానిలో రెండు మాత్రము. ఇందు రెండవది యుపమాలంకార సంబద్ధమై యత్యంత రమణీయముగా నున్నది.

**అంతరాయాంధకారంబు లలమికొనిన**
**నడఁచు నిజ ధైర్య సూర్యోదయంబు చేత**
**దాన వారిన గుఱిచేసి తనకుఁ బోదు**
**నాకుఁ బోదని నమ్మి సుశ్లోకుఁడతఁడు** 2–29

**కలి హిమవేళ శోభనపుఁ గుమ్మవిరుల్ సకలంబుదుల్చి భూ**
**వలయవనంబుఁ గప్పికొని వర్తిలి జాడ్యపుటీఁద పర్వఁగా** 2–65

**భార్య పాలిండ్లు రిక్తకుంభములు, రోయి**
**వెలఁది చనుదోయి నిండు కుండలు, నిజాప్త**
**తరుణి ఫాలంబు చవితి చందురుఁడు, వేశ్య**
**నుదురు వానికిఁ బ్రతిపదిందుండునయ్యె** 3–11

అనునవి అతని రూపకములకు దృష్టాంతములు.

**పూవుఁ దేనియఁ దడిసిన మావిచిగురు**
**మీఁదనంటి చలించు తుమ్మెద తలిర్చు**
**సమయమగుటయు నసినెయ్యి సమరిమరుఁడు**
**త్రుప్పువోఁదోము నీలంపుఁ దునుకయనఁగ** 1-182

మావిచిగురు పూతేనెచే తడిసినది. తుమ్మెద యాతేనెను గ్రహించుటకుఁ గాని దానిని విడిచి వెళ్ళుటకుఁ గాని సమర్థము కాక యచ్చటనే యుండెను. ఆ చిగురు మన్మథునికి బాణము. అతఁడు విరహులపై దాడి వెడలుటకు సమయమగుటచే తన ఆయుధమునకు చమురు రాసి దానికి పదునుపెట్టుటకు తోము నల్లరాతి ముక్కయేమో యన్నట్లా తుమ్మెద యుండెనని యుత్ప్రేక్ష. ఇందలి కల్పన యపూర్వమై యొప్పారుచున్నది. ఇట్టివే రామకృష్ణుడెన్నో యుత్ప్రేక్షలను వాడియుండెను. అతఁడు శ్లేషను వాడిన సన్నివేశము లనేకము లున్నవి. ఆ శ్లేషలు సుకుమారములై పఠితల కెట్టి క్లేశమును కలిగింపక పరమ రమణీయములై యుండును. అవి తఱచుగా నుపమలతోఁ గూడి యానందము కలిగించు చుండును. నిగమశర్మ అక్క తండ్రి నబ్ధితోడను తమ్ముని చంద్రునితోడను పోల్చెను. శ్రీలాలిత్యము, నిత్యశుద్ధి, గుణోత్సేకము, ఉద్వేలస్ఫూర్తి అనునవి ఆ యిరువురికిని అన్వయించును.

**సర్వ తీర్థ ప్రవేశ ప్రశస్త మతికిఁ**
**గాంచిఁ దవులుట దన కర్తవ్యమంచు నొక్కొ**
**తవులు పడి యుండె వరుణ దంతావళంబు**
**పడఁతి యురిఁ జేసి మెడఁ జుట్టు పసిడిఁరచన** 5-310

ఇందు కాంచి యనఁగా కంచిక్షేత్రమని యొక యర్థము. రశనయని యింకొక యర్థము.

**హరిభక్తియు గురుభక్తియు**
**నురు రక్తియుఁ బుటము గాఁగ యోగీంద్ర శిఖా**
**భరణము ముక్తామయతా**
**స్ఫురణము భువన ప్రశస్తముగ జిగిమీఱెన్.** 2-13

ఇచట పుండరీకుఁడు-యోగీంద్ర శ్రేష్ఠుఁడు. యోగీంద్రులకు శిరము నందలి ఆభరణము-అను రెండర్థములు నున్నవి. తదనుగుణముగా ముక్తామయత్వమను పదము ముత్యములతో నిండియుండుట, విడువఁబడిన రోగము కలవాని తనము అను రెండర్థముల నొసంగుచున్నది.

**ఒకఁడు నిరూఢ కృష్ణరుచి, యొక్కఁడు నిర్మల మానస ప్రియుం**
**డొకఁడు ప్రయత్నయోగ్య ఫలుఁ, డొక్కఁ డనాదృత బంధకంచుకుం**
**డొకఁడు రసానుకూలమతియుక్తుఁడునై విలసిల్లి రింతి పు**
**త్రకు, లిలనెట్టి వారలకుఁ దప్పునె తొల్లిటి జన్మ వాసనల్** 4-214

ఇది సుశీల యైదుగురు పుత్రుల వర్ణనము. పూర్వ జన్మమున వారు వరుసగా కాకి, హంస, చిలుక, సర్పము, మధుకరమునై యుండిరి. ఆ పూర్వ వాసన యిందలి విశేషణములలో ధ్వనించుచున్నది. ధ్వని కావ్యమున కాత్మ కదా! "బహుళ ధ్వని పరీతంబగు సత్కవిత్వంబు బోలి" యని రామకృష్ణుఁడే యొక్కచో (3-76) సత్కవిత్వ లక్షణము చెప్పియున్నాఁడు, ఇట్టి ధ్వనిమంతములైన వాక్యము లాతని కవిత్వమునందు పలుపట్టుల కానవచ్చును. "కలుగకుండిన నేమి కడిమి పువ్వుల తావి ననిచిన మరువ మెంతటికి నోపదు" (4-42) అను శరద్వర్ణన మందలి పద్య మత్యంత హృద్యము.

రామకృష్ణుని కర్థాలంకారము లందువలెనే శబ్దాలంకారము లందును కించి దాసక్తి కలదు. అతఁడనుప్రాసములను, యమకములను, అంత్యానుప్రాసములను అందందు వాడుచుండును. వచనములలో నవి మఱింత యధికముగా గోచరించును. తన యాలిని దనయాలిని (3-123) ఇల్లాలి నిల్లాలితాకార నొల్లవైతి; చాలఁబఱచవై సంతోష పఱపనైతి (3-36) అనునవి యమకమునకు నిదర్శనములు. "నీలంబు, భక్తానుకూలంబు, హరిదంత చేలంబు, నవనీత లోలము" (4-187) అను పద్యము నందంత్యానుప్రాసము కలదు. ఇంక ననుప్రాసములు కుప్ప తెప్పలుగాఁ గలవు. ఈ యలంకారము లన్నియు నప్రయత్న సిద్ధములగుటచే రామకృష్ణుని ధారాశుద్ధి కెచ్చటను ఆటంకములు కాలేదు.

పాండురంగమాహాత్మ్యమున నేడెనిమిది పెద్ద వచనములున్నవి. అవి ప్రాయికముగా వర్ణనాత్మకములును, శ్లేష శబ్దాలంకార భూయిష్ఠములునై, కొన్ని చోట్ల సంస్కృత సమాసములతోడను, కొన్నిచోట్ల తెలుఁగుపలుకులలాలిత్యము తోడను గూడి యింపు నింపుచున్నవి. ప్రథమాశ్వాసమందలి (147) వచనము కుమారస్వామి నగస్త్యుఁడు పూజించిన విధము తెల్పుచు శ్రీనాథుని వచనముల శైలిని పుడికి పుచ్చుకొనుచున్నది. తృతీయాశ్వాసమున నొక వచనము నిగమశర్మ అక్క పుట్టింటికి వచ్చి దానిని సరిదిద్దిన విధమును వర్ణించుచున్నది (24). అందే పాలకడలి వర్ణనము శ్లిష్టోపమలతోఁ గూడి బాణుని వచనమును తలపించుచున్నది. రాధాదేవి వర్ణన మతి దీర్ఘయయ్యు నామెసర్వాంగసౌష్ఠవమును ప్రకటించుచు నద్భుతముగా నున్నది (3-179). ప్రబంధ యుగమున స్త్రీ వర్ణనమును వచనమున కావించుట యరుదు. చతుర్థాశ్వాసమున వేసవి వర్ణనమున్నది. ఇందు రామకృష్ణుఁడు మల్లియల పెల్లుకన్నడ కవితావితానంబునుంబోలె షట్పదవృత్త విలాసభాసురంబై యుండెనని తెల్పెను. కన్నడమున పలువురు కవులు షట్పదీవృత్తమునభిమానించిరి. రామకృష్ణుడా షట్పదులను గూడ చదివి

యుండును. షట్పద మనఁగా తుమ్మెద యను నర్థము కూడ నున్నది. అందేకల బాలకృష్ణుని వర్ణనము (4–118) సంస్కృత సమాస భూయిష్ఠమై అత్యంత ప్రౌఢముగా నున్నది. శుక వర్ణనము (4–233) వృత్త్యనుప్రాస భూయిష్ఠమై దాని యుద్దీనమును కన్నులకు కట్టుచున్నది. "సజ్జన వితరణంబులగతి మహిత భాజన నిహితంబులు ననురక్త వధూహృదయంబుల పగిది నతిస్నేహపిచ్ఛిలంబులు" (4–179) అనునది రామకృష్ణుని వచన రచనకు చిన్న యుదాహరణము.

రామకృష్ణుఁడు ఛందోవైవిధ్యము నంతగా ప్రదర్శించి యుండలేదు. కాని చతుర్థాశ్వాసమున పుండరీకుఁడు కృష్ణుని నుతించు సందర్భమున మాలిని, భుజంగ ప్రయాతము. స్రగ్విణి, లయగ్రాహి, తరల మున్నగు వృత్తములను వాడియుండెను. ఇచ్చటనే యొక దండకము కూడ నున్నది (4–77). ఇది నగణద్వయముతో నారంభించు భాగములతో కూడియున్నది. పృథ్వీ, స్రగ్ధరాది వృత్తములు క్వాచిత్కముగా కనిపించును. పెక్కుచోట్ల నొకే వృత్తమునో, పద్యమునో రామకృష్ణుఁడు పుంఖానుపుంఖముగా వ్రాయుచుండును. సీసము లందతనికి ప్రీతి హెచ్చు. శ్రీనాథునివలె నతఁడు సీస గమనమున నెంతో వైవిధ్యము ప్రకటించెను. విశ్వనాథ కవిసమ్రాట్టు రామకృష్ణుఁడు సురారామగజమని తెల్పుట యీ సీసములను జూచియే. చిత్ర కవిత్వము జోలికతఁడు పోయి యుండలేదు.

రామకృష్ణుని పద ప్రయోగము విచిత్రముగా నుండును. అతఁడందఱును సామాన్య ముగా వాడు పదములను వాడఁడు. అందును ఆతఁడు స్వీయ ముద్ర వ్యక్తీకరించెను. కద్రూజాంగదుఁడు (శివుఁడు), బ్రహ్మగర్భుఁడు, గాంగేయుఁడు, కాసూధరుఁడు (కుమార స్వామి), కొమ్ముతేజు (ఎద్దు), వాకతాల్పుఁడు (శివుఁడు) ఉత్పిబము (చాతకము), ఉగ్రశత్రువు (మన్మథుఁడు), ఆదికవి (ఆదిదేవుఁడు), వీణాముని (నారదుడు), త్రాటిగట్టు (విప్రుఁడు), వార్మణి, నీటికెంపు (కౌస్తుభము), క్షుల్లకాసిక్యము (జాలె సంచి), ఫలాయతనము (స్వర్గము), గోచికట్టు (బ్రహ్మచారి), రాతికొడుకు, వరుణ దంతావళము (కప్ప), ముయ్యాడు (పరిపూర్ణత), అనునవి వానిలో కొన్ని, శ్రీనాథుని వలె నతఁడు పాణింధమ శబ్దమును ప్రీతితో వాడుచుండును. పసిగాపు వయసాకె (గోపతరుని) గొనబుంబ్రాయపుఁ దేజుకూన (యువకుఁడు) తొలుకారు కలఁకపులుఁగు మావురావుత్తు=(బ్రహ్మ) చక్షుశ్శ్రోత్ర కన్యలు (నాగకన్యలు) మందప్రోయాంద్ర కూరిమి మ్రానిపండు (కృష్ణుఁడు) అనునవి అతని వింత ప్రయోగములు. వ్యాకరణమును బట్టి స్వతంత్రము లనిపించు, కొల్నిలో; కుచరజ; అచ్ఛభాగ; కొన్గినిసి; నుయిదాఁటే వానికిన్; సుధామత్తల్లులు; చతుర్ముఖ వంచిత ధూర్తకీర్తి; దినవెచ్చము; వ్రాయస ప్రవృత్తి; కందాళయప్ప; కూడాఁడుజుమీ; కంచంత; వసుమతి నుండే తెంచెన్; కావుకావనుట; వెండిన్ (వెండియున్), బచ్చింట వంటి ప్రయోగము లతని కావ్యమునఁ గలవు, వీనిలోఁగొన్ని పూర్వకవి ప్రయుక్తములై ప్రౌఢవ్యాకర్త యంగీకరించినవే.

ఈ విధముగా రామకృష్ణుఁడు పాండురంగమాహాత్మ్యమున తన కవితాకౌశలము నంతను లెస్సగా ప్రకటించి యిహపరములు రెండును సాధింపజాలెను. అతని భావనాశక్తి అపూర్వము; పదప్రయోగనైపుణ్య మప్రతిమానము; ధారాశుద్ధి అమోఘము; పాండిత్య మఖండము, రచనలో నతనికున్నంత ఆత్మవిశ్వాసము పూర్వ కవులందే యెందఱిలోనో కనిపింపదు. అందుచేతనే అతడు వేదాద్రిచే,

**ఉదయంబస్త నగంబు సేతువు హిమవ్యూహంబునుం జుట్టిరా**
**విదితంబైన మహిన్ మహాంధ్ర కవితా విద్యాబలప్రౌఢి నీ**
**కెదురేరీ, సరసార్థ బోధ ఘటనా హేలా పరిష్కార శా**
**రద, నీరూపము రామకృష్ణ కవి చంద్రా! సాంద్ర కీర్తీశ్వరా.**

అని యనిపించి తృప్తినందెను.



## సాహిత్యరసపోషణ రామరాజభూషణ

# వసుచరిత్రము

ఆంధ్ర ప్రబంధ సంతతికి తలమానికమై అవతరించినదాది మొన్నమొన్నటి వఱకు కవిపండితుల మనోభావములపై నసాధారణమైన ఆధిపత్యము సాగించిన అపూర్వ మహాకావ్య రత్నము వసుచరిత్రము. పదప్రయోగౌచితీవ్యంగ్య వైభవభావగాంభీర్య ప్రౌఢతాసౌందర్యము లందు దానితో సాటికి పోటికి రాఁగలిగిన కమనీయ కావ్య మింకొకటి యాంధ్రముననేకాక యితరసారస్వతములందు సైతమరుదనుటలో నతిశయోక్తి లేదు. అందుచేతనే యది తమిళ సంస్కృత భాషలలోనికి పరివర్తనమగుటయు, దాని ననుసరించి పెక్కు పిల్లవసుచరిత్రలు బయల్వెడలుటయు సంభవించినది. దానిని రచించినవాఁడు రామరాజభూషణాపరనామధేయ ప్రసిద్ధుఁడైన భట్టుమూర్తి. నిజమునకు రామరాజ భూషణుఁడనునది యాతని బిరుదమే కాని నామము కాదు. అతఁడు కృష్ణదేవరాయల అల్లుడైన రామరాయల కొలువున కలంకార భూతుఁడై యతనిచే రత్నహారహయవేదండాగ్రహారాది సత్కారములందిన మహానీయుఁడు; శతలేఖినీ పద్యసంధానధౌరేయుఁడు; ఘటికాశతగ్రంథకరణ ధుర్యుడు, ఆశుప్రబంధ బంధాభిజ్ఞుడు. బహుపద్యసాధితవ్యస్తాక్షరీధురీణుఁడు. అతని ప్రతిభాసామర్థ్య ములను దెలుపుబిరుదము లింకను పెక్కున్నవి. వసుచరిత్ర గద్యమున నాతఁడు "శ్రీరామచంద్ర చరణారవిందవందన పవననందన ప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకషచతుర్విధకవితానిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణ ప్రణీతమైన వసుచరిత్ర" మని వ్రాసికొని యున్నాఁడు. ఉత్తరహరివంశ కర్తయైన నాచన సోమనాథునికి కూడ సాహిత్య రసపోషణుఁడను బిరుదమున్నది. భట్టుమూర్తి సాహిత్య రసపోషణత్వమునకు తోడు సంగీతకళారహస్యనిధిత్వమును కూడ సంపాదించి సరస్వతీదేవి మాతృత్వమును పూర్తిగా ననుభవించినవాఁడు.

**నను శ్రీరామపదారవింద భజనానందున్, జగత్ప్రాణనం**
**దనకారుణ్య కటాక్ష లబ్ధకవితాధారా సుధారాశి సం**
**జనితైకైక దిన ప్రబంధ ఘటనా సద్యశ్శత గ్రంథక**
**ల్పను సంగీత కళారహస్య నిధిఁ బిల్వంబంచి పల్కెం గృపన్** 1–16

అని వసుచరిత్రను తనకు కృతి యిమ్మని యడుగు సందర్భమున తిరుమలరాయలు తన్నుఁ బిల్వఁబంపెనని యాతఁడవతారికలోఁ దెల్పి యున్నాడు. అతఁడు బట్టుకులమునకుఁ జెందినవాఁడనియు, నతనిపేరు మూర్తియనియు, నింటిపేరు ప్రబంధాంకమువారనియు

దెలియుచున్నది. అతనివలెనే యతని పూర్వులుకూడ శ్రావ్యముగను అర్థవంతముగను ప్రబంధములను బఠించు శక్తి కలిగియుండిన వారగుటచే వారికి ప్రబంధాంకమువారను సార్థకమైన యింటిపేరు కలిగియుండునని విమర్శకులు తలంచుచున్నారు. అతనితాత తిమ్మరాజు; తండ్రి సూరపరాజు. హరిశ్చంద్రనలోపాఖ్యానమున" శ్రీకరమహాప్రబంధాంక తిమ్మరాయ ప్రియతనూజ ధీర సూరపాత్మజుఁడ రామనృపభూషణాఖ్యసుకవి" ననియు, నరస భూపాలీయమున "ప్రబంధాంక సింగరాజసుత తిమ్మరాజపుత్ర ప్రసిద్ధ నరసవేంకట రాయభూషణ సుపుత్రు"ననియు నుండుటచే సూరపరాజపుత్రుఁడైన భట్టుమూర్తియు, మూర్తికవియు భిన్నులను నొకవాదము బయలుదేఱినది. కొందఱిరువురు మూర్తులొకరేయని తెల్పుచు నాతండ్రులిరువురిలో నొకరు కన్న తండ్రియనియు మఱొకరు పెంచుకొన్న తండ్రియనియు సమర్థింపఁజూచిరి. మఱికొందఱు భట్టుమూర్తికి రామరాజభూషణుఁడను బిరుదమున్నట్లే యతనితండ్రియైన సూరపరాజునకు వేంకటరాయభూషణుఁడను బిరుదముండి యుండుననియు, నందుచే సూరపరాజును వేంకటరాయభూషణుఁడును అభిన్నులనియు, నట్లే తత్పుత్రులైన మూర్తినామధేయులును అభిన్నులనియు నిర్ణయము కావించిరి. ఈ నిర్ణయము పలువురు విమర్శకుల అంగీకారమును బొందినది. అచ్యుతరాయల కుమారుఁడైన యీ వేంకటరాయలు విద్వన్నిధి యని శాసనములలోఁ బ్రశంసింపఁబడియున్నాఁడు.

భట్టుమూర్తి నివాస మేదియను విషయమునఁగూడ భిన్నాభిప్రాయములున్నవి. అతడు బట్టుపల్లె నివాసియనియు, శ్రీకృష్ణ దేవరాయలవారాగ్రామమును ప్రబంధాంకమువారికి దానముచేసి యుండిరనియు కొందఱి యభిప్రాయము. ఈ గ్రామము బళ్ళారి జిల్లాలోని పాలమండలము సమీపమున నున్నదని కొందఱును, కడప మండలములోని పులింవెదల చెంతఁగలదని కొందఱును, జటప్రోలు దగ్గఱ నున్నదని కొందఱును అభిప్రాయపడుచున్నారు. అతని నివాసము కృష్ణాజిల్లాయందలి మోదుకూరని కొందఱు తలంచుచున్నారు. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారు భట్టుమూర్తి పులివెందల తాలూకాలోని కసుమూరు గ్రామమున వీధిబడి చెప్పుకొనుచు రేనాటిరెడ్ల సాయమున రాయల సర్వసేనానియైన పెమ్మసానిరామలింగ నాయని యనుగ్రహమును సంపాదించి తద్వారా రాయలయాస్థానమునఁ జేరియుండెనని వ్రాసి యున్నారు.

శ్రీ కృష్ణదేవరాయల భువనవిజయసభ నలంకరించిన అష్టదిగ్గజ మహాకవులలో రామరాజభూషణుఁడు కూడ నుండెనని ప్రతీతి. కాని యతఁడు రాయలకాలమున వయసునచిన్నవాఁడై విద్యాభ్యాసము కావించుచుండెననియు నష్టదిగ్గజముల పాండితీకవితా ప్రదర్శనములనాతఁడు చూచియుండినను వారిలో నొక్కఁడై విరాజిల్లుటకుఁ దగిన యవకాశము లేదనియు పలువురు విమర్శకుల యభిప్రాయము. రాయల మరణానంతరమాతఁడు విద్యాభ్యాసము పూర్తిచేసి రామరాయల మేనల్లుఁడైన తొఱగంటినరసరాజు నాశ్రయించి

యాతనికంకితముగా కావ్యాలంకారసంగ్రహమను నామాంతరముగల నరసభూపాలీయమును రచించెను. తరువాత పేరునకు సదాశివరాయలను విజయనగరసింహాసనమున చక్రవర్తిగా ప్రతిష్ఠించి నిగ్రహానుగ్రహసమర్థుఁడును శత్రుభయంకరుఁడునై సామ్రాజ్యమును పరిపాలించుచుండిన రామరాయల యండఁజేరి యాతని యనుగ్రహము సంపాదించెను. అప్పుడే అతఁడు రామరాజభూషణుఁడయ్యెను. బహుశః ఆ సమయముననే అతఁడు వసుచరిత్ర మహాకావ్యరచనకు శ్రీకారము చుట్టియుండును. దానినతఁడు సర్వాంగ సుందరముగా తీర్చిదిద్దుటకు చాలాకాలము పట్టియుండును. అది ముగియకపూర్వమే తళ్ళికోట యద్ధమున (రాక్షస తంగడి) రామరాయలు మరణించుటచే భట్టుమూర్తి యాతని తమ్ముఁడైన తిరుమల రాయల నాశ్రయించెను. వసుచరిత్ర పీఠికలో నతఁడు రామరాయలకును శ్రీరామునికిని అభేదాధ్యవసాయము కల్పించి పద్యములు వ్రాసెను. శౌరి రవికులము నలరించుటకై శ్రీరాముడుగా నుదయించినట్లు చంద్రవంశమును పవిత్రీకరించుటకై రామరాయలై జనించెనని యతని భావము (1-42). గ్రంథములోఁగూడ నతఁడభిరామరామాది శబ్దములచే రామరాయలను బెక్కుచోట్ల సూచించెనని శ్రీమాన్ నారాయణాచార్యులవారు వివరించి యున్నారు. (వసుచరిత్ర సాహితీసౌరభము పుట 83 మొదలు) అతఁడు వసుచరిత్రమును తొలుత రామరాయలకే యంకితము చేయవలెనని సంకల్పించి యుండును. కాని విధివిధానము వేఱైనది. అందుచే నతఁడు దానిని తిరుమలరాయలకంకితము చేయవలసివచ్చెను. వసుచరిత్రయందలి యవతారిక గ్రంథరచనానంతరము వ్రాయఁబడినట్టిదే. అందు భట్టుమూర్తి తిరుమలరాయలు పెనుగొండను రాజధానిగాఁజేసి సామ్రాజ్యమును బాలించుటయు, నతని కుమారుల పరాక్రమమును, శ్రీరంగరాయలు యౌవరాజ్య పట్టాభిషిక్తుడైన వృత్తాంతమును (1572) మూఁడవకుమారుఁడు వేంకటపతిరాజు చంద్రగిరి రాజధానిగాఁ జేసికొన్న విషయమును సూచించియున్నాఁడు. ఈ రాజకీయాంశములనుబట్టి వసుచరిత్ర కృతిప్రదానము 1572-75 సంవత్సరముల నడుమ జరిగెనని భావింపవచ్చును. తరువాత భట్టుమూర్తి హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచించెను. దానిని 1580వ సంవత్సరమునాఁటికి పూర్తి చేసియుండును. పై విషయముల నాధారముగాఁ జేసికొని భట్టుమూర్తి క్రీ.శ. సుమారు 1510 నుండి 1585 వఱకు జీవించెనని చెప్పవచ్చును.

భట్టుమూర్తిరచించిన గ్రంథములు మూఁడిప్పుడు లభ్యము లగుచున్నవి. అవి నరసభూపాలీయము, వసుచరిత్రము, హరిశ్చంద్రనలోపాఖ్యానము అనునవి. నరసభూపా లీయము విద్యానాథుని ప్రతాపరుద్రీయము ననుసరించి వ్రాయఁబడిన లక్షణ గ్రంథము. వసుచరిత్రము శ్లేషధ్వని వైభవోపేతమైన శృంగార ప్రబంధము. హరిశ్చంద్రనలోపాఖ్యానము హరిశ్చంద్రనలమహారాజుల చరిత్రములను రెండింటిని శ్లేషగావర్ణించు ద్వ్యర్థికావ్యము. ఈమూఁడు గ్రంథములను మూఁడు భిన్న మార్గములకుఁజెంది భట్టుమూర్తి ప్రతిభా

పాండిత్యములను జక్కగా వ్యక్తము చేయుచున్నవి. "శ్రీరామ క్షితిపున్ మదగ్రజు జయశ్రీలోలు నానాకళాపారీణున్ బహుసంస్కృతాంధ్రకృతులన్ బల్మాఱుమెప్పించి" (1-17) అని తిరుమలరాయలు చెప్పుటనుబట్టి భట్టుమూర్తి పైగ్రంథములనేకాక బహుసంస్కృతాంధ్ర గ్రంథములను కూడ రచించినట్లు తెలియుచున్నది. కాని యవి యేవియు నిప్పుడు లభ్యములు కాకుండుట మనదురదృష్టము.

భట్టుమూర్తి అల్లసాని పెద్దనార్యునకు శిష్యుఁడై యుండెనని చెప్పుదురు. మండ లక్ష్మీనరసింహాచార్యులు తన యాంధ్రకౌముదియందు "ముప్రత్యయాభావస్య అల్లసాని పెద్దనార్య శిష్యేణ భట్టుమూర్తి మహాకవినా విరచితే వసుచరిత్రే" యని తెల్పి "రాజహంసలుగాని రాజహంసలుగా" రను సీసపద్య పాదమునుదాహరించి యున్నాఁడు. ఇదెంతవఱకు సత్యమో తెలియదు. కాని కాలమును బట్టిచూచిన నందసంభావ్య మేమియులేదు. పెద్దనార్యునికంటె రాయలవారును, రాయలవారికంటె భట్టుమూర్తియు వయస్సునఁ జిన్నవారై యుందురు. భట్టుమూర్తి పాండితీవైభవ మసాధారణ మైనట్టిది. అతఁడు వ్యాకరణాలంకార శాస్త్రములందేకాక సంగీత జ్యోతిరాది శాస్త్రములందును అప్రతిమానమైన పాండిత్యము సంపాదించెను. అతనికనేక నిఘంటువులు కంఠస్థములై యుండెనని చెప్పుదురు. అతని శ్లేషకవితా ప్రీతికిదియే కారణమై యుండును. "అతఁడు వీధిలోఁ బోవుచుండఁగా వేదపండితులుగూడఁ దమతమ యధ్యాపనము లాపుచుండిరట! ఈ కథ యాతని పాండిత్య ప్రకర్షకు ద్యోతకముగా నల్లఁబడియుండును."

నరసభూపాలీయరచనము వఱకును భట్టుమూర్తి యంత సంపన్నుఁడు కాకపోయినను తరువాత నైశ్వర్యముతోఁ దులతూఁగుచు నైశ్వర్యమునకుఁ దగిన యౌదార్యముకూడ ప్రదర్శించి యుండెనని తెలియుచున్నది. హరిశ్చంద్ర నలోపాఖ్యానములో నతఁడు "వసుచరిత్రాది కావ్యప్రీత బహునృప్రాపితానేక రత్నప్లవుండ, శాశ్వత శ్రీవేంకటేశ్వరానుగ్రహ నిరుపాధికైశ్వర్య నిత్యయశుఁ డ" (1-53) నని వ్రాసికొని యున్నాఁడు. అతఁడొక గ్రామమును బ్రాహ్మణుల కగ్రహారముగానొసంగి దానికి రామచంద్రపురమను పేరుపెట్టెననియు, దేవాలయముకట్టించి యందు శ్రీరాముని ప్రతిష్ఠించెననియు రామసరస్సనుపేర నొకతటాకము నిర్మించెననియు ఆ గ్రంథము నందలి యవతారికనుబట్టి తెలియుచున్నది (1-14) నరసభూపాలీయ గద్యమున నతఁడు శ్రీహనుమత్ప్రసాదలబ్ధ సారసారస్వతాలంకారుఁడనని వ్రాసికొని యున్నాఁడు. తరువాత నాహనుమంతునికే యుపాస్యుఁడైన శ్రీరామచంద్రునికూడ నాశ్రయించినాఁడు. వసుచరిత్రమున "నను శ్రీరామపదారవింద భజనానందున్" అని చెప్పుకొని సంతృప్తి ప్రకటించినాఁడు. హరిశ్చంద్రనలోపాఖ్యానమును శ్రీరామునికేయంకితముచేసి యందారంభమున నితరదేవతాస్తవము నాచరింపక శ్రీరామపంచాయతనమును మాత్రమే స్తుతించినాఁడు. వసుచరిత్రారంభము నందలి యాశీర్మంగళాశాసనము సీతారామపరముగనే యున్నది.

తిరుమలరాయలు సప్త సంతానములలో కృతియేశ్రేష్ఠమని ప్రశంసించి,

**కేవలకల్పనాకథలు కృత్రిమరత్నములాద్యసత్కథల్**
**వావిరిపుట్టురత్నములవారిత సత్కవికల్పనావిభూ**
**షావహపూర్వవృత్తములు సానలఁదీరిన జాతిరత్నముల్**
**కావుననిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పుపెంపునన్** 1–19

అనికోరి భట్టుమూర్తిని తాంబూలజాంబునాదంబరాగ్రహారాదులతో సత్కరించెను. దీనిని బట్టి భట్టుమూర్తికి కావ్యవస్తువుల యెడఁగల యభిప్రాయము తేటతెల్లమగుచున్నది. కేవలకల్పనాకథలు కృత్రిమరత్నములనియు, పురాణకథల పరిష్కృతములైన పుట్టురత్నము లనియు, కల్పనామిళితములైన పూర్వకథలు సానపెట్టిన జాతి రత్నములనియు నతని యభిప్రాయము. ఇందలి మొదటి వాక్యముచే నతఁడుత్పాద్యవస్తుసమలంకృతమైన పింగళసూరన కళాపూర్ణోదయమును కృత్రిమ రత్నముగా నిరసించెనని చెప్పుదురు. అందుచేతనే యతఁడు భారతాదిపర్వమునం దత్యల్పముగా నున్న వసువృత్తాంతమును గ్రహించి దానికి నిజప్రతిభా సముత్పాదితములైన కల్పనలు జతచేసి వసుచరిత్రమును జాతిరత్నముగా రూపొందించెను.

వసుచరిత్రయందలి కథాశరీరము మిక్కిలి పరిమితమైనది. నైమిశారణ్యమున శుకశౌనకాది మహర్షులు సౌతిని దివ్యచిహ్నధరుఁడై మహీమండలమేలిన రాజేంద్రుని కథ తెల్పుమనియడుగ నతఁడు వానికి వసుచరిత్రమును దెల్పెను. అధిష్ఠానపురమును వసువనుపేరుగల మహారాజేలుచుండెను. అతఁడొకనాఁడు హిమవత్పుత్త్రుఁడైన కోలాహల నగాధీశుఁడు శుక్తిమతి నదిలో వ్రాలి దాని ప్రవాహమును నిరోధింపఁగా దానిని కాలిబొటన వ్రేలితో గవ్వనువలె నెగమీటి దీనమైపడియున్న యా కొండను దనకేళిశైలముగ స్వీకరించెను. పర్వతమును శాసించిన యాతని పరాక్రమమునుమెచ్చి యింద్రుఁడాతనితో చెలిమి వాటించెను. ఆతఁడిట్లు సుభిక్షముగా రాజ్యము నేలుచుండ వసంతర్తువు వచ్చెను. అప్పుడుద్యానపాలు రాతనిదర్శించి, వసంతారామవైభవము వర్ణించి, తద్దర్శనమునకై రమ్మనివేడుకొనిరి. రాజును దద్దర్శనోత్సుకుఁడై రథమునెక్కి, యుద్యానవనమునఁజేరి యందలి విశేషముల నానందమున నీక్షించెను. అప్పుడొక నగాగ్రముననుండిన కిన్నరద్వయ మాతనికొక శుభమాసన్నమై యున్నదనిపల్క కోలాహలపర్వతాగ్రమున కరిగెను. తదావలోకనప్రీతివలన రాజునకు కోలాహల పర్వతమున లీలావిహారము కావింపవలెనను నుత్సాహముదయించెను.

అప్పుడు నర్మసచివుఁడు రాజున కాకసమునందలి నల్లమబ్బుల్లోఁగనిపించు వృక్షములు చూపి యవి నాకభూజములని పల్కెను. రాజది తమకేళీపర్వతమనియు నాచెట్లందలి వృక్షములనియుఁ దెల్పి, తదద్రిసంపద తిలకించుటకై యా నర్మసచివునితోనరిగెను. నర్మసఖుఁ

డాపర్వతమందలి విశేషములన్నియు రాజునకు వర్ణించి తెల్పెను. రాజాపర్వతమునెక్కి యందున్న యొక చంద్రకాంతమణి వేదికపై విశ్రమించిన సమయమున మాధురీధుర్యమైన కలనాదమొకటి వినవచ్చెను. రాజానాదమేమై యుండునని యచ్చెరువొందుచుండ నర్మసచివుడది విని యెవ్వరో వీణపైఁ బాడుచున్నారని తెల్పెను. ఆ సంగీతధ్వని తన మనమునకు బ్రీతినొసంగ రాజు వారెవ్వరో, యచ్చట పాడుచుండుటకుఁ గారణమేమో తెలిసికొని రమ్మని నర్మసఖునిఁ బంపెను. అతఁడా పర్వతమునందలి ప్రదేశములన్నియుదిరిగి యొక్కచో కిన్నరీ నినాదానుకారి శారీశుకాదిఘోషఘుమఘుమితమైన యొక కోనఁగాంచెను. అచ్చట నిరుపమానమైన దివ్యమందిర మొకటుండెను. అందొక తన్వి చంద్రశాలాతలమునందలి నీలమణివేదిపై వీణావాదన ప్రౌఢిచేఁ జెలులను రంజింపఁ జేయుచుండెను. నర్మసచివుఁ డామెను గాంచి, యామె కాంతిగుణకళాభిరూప్యము లెఱింగించి రాజు నచ్చటికిఁదెచ్చునుద్దేశముతో నతనిజేరి, యా యలివేణి సర్వాంగ సౌందర్యమును వర్ణించి, యామె వాయించు వీణ కలనాదమే తమకు వినిపించెనని తెల్పెను. మున్ను కిన్నర విహంగయుగము పల్కిన పల్కు మదిఁదాఁక రాజు నర్మసచివుఁడు త్రోవచూప నచ్చటి కరిగెను. అతఁడచ్చటి తీఁగలచాటుననిల్చి యా కాంతను బరికించి తదపూర్వ సౌందర్య శోభకలరి పరవశుఁడయ్యెను. నర్మసచివుఁడాతనిఁ జేరి “నేను యతివేషమున నరిగి యామె వృత్తాంతమంతయు నెఱిఁగి వచ్చెదను పంపు”మని పలికెను. రాజంగీకరించెను. నర్మసచివుడచ్చటి కల్పవృక్షముల శాఖాపల్లవ వల్కలాదులచే దండశాటీయోగపట్టాదులు సంతరించుకొని జడధారియై యక్షసరముఁ ద్రిప్పుచు నామందిరము చేరనరిగెను. అప్పుడు “గంధగజయాన గీతప్రబంధకలన నలయతి లియ్యమై వచ్చునరిది మగువలార కనుఁగొంటిరే” యను చెలి వాక్యమొకటి వినరాఁగా నదేసమయమని నర్మసఖుఁడు చాటుననుండి “లతాంగీ! నీ పలుకు మెచ్చితిని. యతి వచ్చుజాడ నేరీతి నెఱుంగఁ జాలితివి? మీచెలి విపంచీరవామృతము చిత్తమునోఁకినవారెవ్వరైన నీమెనుజూచి దీవన లొసంగకపోవరు సుమా” యని పలికెను. అచ్చటి స్త్రీలాపలుకులువిని “ఎచ్చటనుండియో యొక యతీంద్రుఁడు వచ్చె” నని యాశ్చర్య సంభ్రమములొందుచు గద్దెదిగిరి. అంతలో నా తపోధనుఁడును అచ్చటికి వచ్చెను. వారాతనికి నమస్కరించిరి. మాయాయతి యాశీర్వదించి వారు చూపిన పసిఁడిగద్దె నధివసించెను. వారును నుచితాసనములఁ గూర్చుండిరి. అంత వారిలో సమంజస వచనచాతురీధురీణయగు మంజువాణి దోసిలియొగ్గి “యతివరా! తామెచ్చటనుండి యెచ్చటకేగుచు నిచ్చటి కరుదెంచినారు? మీ శుభ నామధేయమేమి? తెల్పి మమ్మానందింపఁజేయుఁ”దని యడిగెను. నా పేరు గౌతముఁడు. వసునాధుని (సూర్యుని) సేవించి తన్మంత్ర శక్తిచే నీ యనాదిమునిభావము గడించినాఁడను. చిన్నతనము నుండియు నా మహనీయుని యంఘ్రిసేవ చేయుచుండుటచే నతఁడు ప్రసన్నుఁడై తన్ననుసరించి తిరుగుశక్తినొసంగెను. వనవిహారతత్పరుడైన మాస్వామితో బయలుదేఱి, మేరుకైలాసములను, మానససరోవరమును, రంభాదుల నృత్యములను, చంపకారణ్యసేతు కేదారాది క్షేత్రములను

దర్శించి యాతఁడీపర్వతము పజ్జనిలువ నతనికుపాయనముగా పద్మినీసముదయమును సమకూర్చుటకై యిటకరుదెంచితిని. ఈ మీ చెలిని జూడఁగనే నాకు వాత్సల్యమును ననుకంపయుఁ గలుగుచున్న"వని పలికి యామె కులగోత్రాదుల నెరింగింపుమని యడిగెను. అప్పుడు మంజువాణి "యతివర్యా! సమస్త లోకపూజ్యుఁడగు నా మహనీయునిఁ గొల్చు మీకు సర్వ ప్రపంచకథలును కరతలామలకములై యుండును. అయినను మీ దయ వలన నీలతాంగి జననక్రమ మెఱింగించెదను. వినుఁడ"ని పల్కి గిరికాజననాది వృత్తాంతమునిట్లు వివరించెను. "వసువను మహారాజొకఁడు గలడు. అతని కధిష్ఠానపురము రాజధాని. దానిచెంత శుక్తిమతియను నది ప్రవహించుచున్నది. ఆ నది నదులన్నియుఁ దన్నుఁగొల్వ ప్రతిదినమును నలువ కొలువునకేగుచుండును. ఆమె యొకనాఁడు బ్రహ్మ కొలువునకేగి తిరిగివచ్చుచుండగా బ్రహ్మ సభాభవనమున కరుగు కోలాహలుఁడనునొక ధరాధీశుఁడామె కెదురయ్యెను. అతనిని జూచి శుక్తిమతి ప్రక్కఁగాఁ దొలఁగెను. ఆమెసౌందర్యమును జూచి యాతఁడు మోహితుఁడై యానాఁటికెట్లో యింటికరిగెను. తరువాత అతఁడు మదనవేదన భరింపఁజాలక యామె నెట్లైనఁ గవయ నిశ్చయించి వివిధభూషణాలంకృతుడై యొకనాఁడు శుక్తిమతిని సమీపించెను. ఆమెయు నతని కెదురేగి యుచిత పూజలొనరించి మీ రిచ్చటి కరుదెంచుట నామీఁది యభినవానురాగ సంపద చేతనేకదా" యని పలికెను. అతఁడు మందహాసమొనరించి "నీవు సకలనదులతోఁ గూడి బ్రహ్మనుగొల్చి యేగు సమయమున నీ సరసతాగాంభీర్యముఁ నారసి నిన్నే యెప్పుడును మానసమున భావించుచుందును. నీ పొందుగోరి దవ్వనక వచ్చితిని. నా కోరిక దీర్చి నన్ను ధన్యునొనరింపు"మని పలికెను. శుక్తిమతి తన యల్పతయు నాతని ఘనతయు నెఱింగించి యందుకియ్యకొనదయ్యెను. అతఁడు వలపు నిలుపలేక యామెను బట్టుకొనెను. ఆమె సంభ్రమించి మోము త్రిప్పుకొనెను. అతఁడు మొగము జేవురింప పట్టరాని తమకమున నామెను నిరోధించెను. అంతనానది "ఓ వసుమహారాజా! నన్ను రక్షింపు"మని మొఱపెట్టెను. జలపక్షులు కలఁతనొంది రొదచేసెను. నదీసలిలోపప్లుతులైన భూజనులు నివాసశూన్యులై ఘోషించిరి. ఈ కోలాహల విజృంభణమునకు కారణమేమి యని తలంచుచు వసురాజు లోకరక్షణోత్సాహియై యుండ నానాగ్రామ పట్టణములనుండి యరుదెంచిన జనులు కలిగిన యుపద్రవ మాతనికిఁ దెల్పి రక్షింప వేడుకొనిరి. వసురాజు కోపారుణలోచనుఁడై యా పర్వతమును శిక్షింప బయలుదేఱెను. ఆతనివెంట చతురంగ సైన్యము నడచెను. వసురాజు నదీజలమును నిరోధించిన కోలాహలపర్వతమును గాలిగోటితో నాకసమున కెగమీటెను. సురలును ప్రజలును సంతోషించిరి. శుక్తిమతీనది ప్రవాహము తక్షణమే తీసిపోయెను. కోలాహలము నేలవ్రాలియు నయ్యేటికే గ్రుక్కిళ్ళు మ్రింగుచుండెను. ఆకాశమున రంభాద్యప్సరసల మృదంగధ్వను లెసంగెను. ఇంద్రుడు వసురాజును మెచ్చి దిక్పాలురుగొల్వ నతనికుచిత మగుపారితోషికమీయ నరుదెంచెను. అతఁడు తనకుమ్రొక్కిన వసురాజును లాలించి, యతనికి మణిప్రభాసమానమగు నొక విమానము జూపి తద్గుణమహిమాదు

లెఱింగించి "రాజా! ఈ విమానము నెక్కి మావీటికి రాకపోకలు కావింపుచుండ"మని పల్కి యొసంగెను. వసురాజు దాని నానందమున గ్రహించెను. ఇంద్రుఁడు తనలోకమున కరిగెను. అచటి మునులు వసురాజున కుపరిచరనామంబొసంగిరి. అతఁడు పురమునకు మరలివచ్చి విమానమునెక్కి నానాలోక వనానీకములు చూచుచు నిష్టాపూర్తములు నిర్వర్తించుచు శుక్తిమతీనది విహార-దీర్ఘికయు, కోలాహలము లీలాచలమునుగా జనరంజకముగా రాజ్యము పాలించుచుండెను. వసురాజు రాకచే నలజడి యుడుగ ప్రసన్నయైన యేటికి గర్భము తేటపడెను. ఆమె తరువాత నొకపుణ్యలగ్నమున నొక కుమారుని, కుమారికను ప్రసవించెను. వసుపాదము శైలావరోధము వారించి తన్ను రక్షించెనని తలంచి శుక్తిమతి కుమారునకు వసుపదుఁడని పేరుపెట్టెను. అచ్చటిమౌను లాకుమారికకు గిరిక యను నామధేయమొసంగిరి. గిరిక పెరిగి పెద్దయై విద్యాబుద్ధులు నేర్చి వీణ పలికించుటయు గీతములు పాడుటయు నభ్యసించి గేయవిశారద యయ్యెను. కోలాహలపర్వతము కూఁతునకు మాణిక్యమందిరము కట్టించెను. ఆ గిరిక యీమెయే. ఈ పర్వతముపైఁగల మణిగృహములు, సరస్సులు, నికుంజములు ఈమెకు విహార రంగములు.

మంజువాణి చెప్పిన గిరికావృత్తాంతమును విని మాయాయతి సంతసించెను. లతలచాటుననుండి యీ మాటలన్నియు వినుచున్న వసురాజు హితుని నేర్పును, బోటి వచనప్రాగల్భ్యమును, కన్య యున్నతగోత్రోద్భవమును తలంచి యామె నాత్మవిత్తముగా భావించెను. మాయాముని కొంతసేపు ధ్యానమగ్నుఁడై యున్నట్లు నటించి మంజువాణిని జూచి "నేనంతరదృష్టితోఁ జూచితిని. వసుమహారాజు మీ చెలిని బెండ్లి యాడును. వారిరువురును బూవునుదావియువలె నేకమై వెలయఁగా గన్నులారఁగాంచు వేడుక మీకు వేగమే కలుగు"నని పలికెను. మంజువాణి "ఆ రాజీ గాధీశుఁజూచుటకై యెప్పుడు వచ్చును? వచ్చి మా చెలినెప్పుడు కాంచును? కాంచి యామెనెప్పుడు గౌరవించును? మా కోరిక లెప్పటికీడేరు"నని యడిగెను. యతి "లలనా! మీచెలిని వసురాజుతప్పక పెండ్లాడును. ఇది నీవు నమ్మనిచో నిప్పుడా మహారాజును మంత్రప్రౌఢిచే రప్పింతు"నని తెల్పి మాయా జపము కావించినట్లు నటించి, దెసలాకర్ణించి "మజ్ఝూ" యనెను. ఇదంతయు లతలచాటునుండి వినుచున్న వసురాజిదే సంధింపఁగ వేళ యని తలంచి లతలచాటునుండి బయటికరుదెంచి వారియెదుట నిల్చెను. అతనిని జూచి లతాంగులెల్లరును నిలబడిరి. రాజు యతి యిచ్చు దీవనలుగైకొని, చెలులుచూపిన బంగారుపీఠముపై గూర్చుండెను. గిరికావసురాజు లొండొరులపై ననురాగ దృష్టులదరించిరి. అంత మంజువాణి రాజురాకను బ్రశంసించి గిరికావృత్తాంతమాతని కెఱింగించెను. యతి యా రాజునకును ఆ కన్యకకును అమూల్య కల్యాణ సమృద్ధి కావలయునని దీవించి, బయటికేగి యతి వేషము విడిచి యథాపూర్వవేషముతో రాజునన్వేషించు క్రమమున క్రమ్మఱ నేతెంచి, రాజు సమీపమున నిలబడెను. అచ్చటి

కన్యలాతని పలుకుబడియు, మోము చాయయుఁగాంచి తొంటి యతియేనని గుర్తించి రాజే యాతని నచ్చటికిఁ బంపియుండునని తలంచిరి. తరువాత చెలికత్తెల మేలపుమాటలకు గిరిక తెరవెనుక కరిగెను. ఇంతలో కలహంసియను శుక్తిమతివయస్య వచ్చి తల్లి గిరికను బిలువఁ బనిచెనను వార్త తెలిపెను. చెలికత్తెలు రాజుకడ సెలవు గైకొని యామెను దోడ్కొనిపోవుచుండ నతఁడామెవంక సానురాగదృక్కులు ప్రసరింపఁజేసెను. గిరికయు వెనుకకుఁ దిరిగి యాతనిఁ జూచుచు నరిగెను. తరువాత రాజామె యేగిన జాడనే యేగుచు నా యాప్రదేశములు కాంచుచు మదనవేదనకు గుఱియై పొగులుచుండ నర్మసచివుఁడతని నోదార్చి యింటికిఁ గొనిపోయెను. అక్కడ నాతఁడు నిరంతరము గిరికనే తలంచుచు నాహారవిహారములుమాని వియోగవేదన ననుభవించుచుఁ గాలము పుచ్చుచుండెను.

అట గిరికయు వియోగబాధ భరింపజాలక తన యుద్యానవనమున కరిగి యచ్చట వేదన మఱింత యధికము కాఁగా సహకారకోరక మూరుకొని మరణింప నిశ్చయించెను. చెలులామెనింటఁగానక యుద్యానవనమునకేగి యామెనొంటరిగా నిటకేల వచ్చితివని మందలించిరి. మంజువాణి యామెనోదార్చి మన్మథపూజ చేయుటకై తీసికొనిపోయెను. చెలులుబుసుపోవుటకై యామె కుపవనమునందలి నానాసూనసంపదలు వర్ణించితెల్పిరి. తరువాత వారు కొంతసేపు పుష్పాపచయ మొనరించిరి. పిమ్మట జలక్రీడ కావించిరి. అనంతరమలంకృతాంగులై వారొక పుప్పొడి తిన్నెమీఁద పూసెజ్జ ఘటించి యందు పద్మకర్ణికపై కస్తూరితో మన్మథుని భావమువ్రాసి యతని వామాంకమున రతిని, మ్రోల చంద్రవసంతులను, ప్రక్కల పవనమరాళ కోకిలాదులను లిఖించి షోడశోపచారములతో మన్మథపూజ కావించిరి. అప్పుడు మన్మథుఁడెదురనిల్చినట్లు తోపఁగా గిరిక మైమఱచి మూర్ఛిల్లెను. చెలులామెకు శీతలోపచారములు గావించి మన్మథుని మరలఁ బ్రార్థించి యామె మూర్ఛతేఱినపిమ్మట నోదార్చుచు విహారభవనమునకుఁ గొనివచ్చిరి.

సూర్యాస్తమయమయ్యెను. సంధ్యాగమనానంతరము చీకటులు వ్యాపించెను. నక్షత్రములుతోఁచెను. చంద్రుఁడుదయించెను. వెన్నెల నల్దెసల ప్రసరించెను. చంద్ర మన్మథ మలయమారుత విజృంభణము గిరిక యోర్వఁజాలదని చెలులు భయపడుచుండ మంజువాణి "నేను వసురాజుకడకేగి గిరిక యుత్తలము తెల్పి యాతని చిత్తమరసి వత్తు"నని పల్కి గిరికహారము గ్రహించి యేగెను. గిరిక చంద్రుని మలయపవనుని నుపాలంభించి వెన్నెలవెల్లి డాయలేక యెల్గెత్తి యేడ్చెను. చెలులు వసురాజు తప్పక నిన్ను గారవింప నొప్పులకుప్పవై యలరారెదవని యోదార్చి వసురాజుకడకరిగిన మంజువాణి యేల యాలస్యమొనరించు చున్నదని చింతించుచుండ మంజువాణి యరుదెంచి వసురాజిచ్చిన యుంగరము గిరిక యెదుటఁబెట్టి తన వృత్తాంతమిట్లుచెప్పెను.

"వసురాజు చిత్తమరసి రమ్మని మీరు పంపఁగానే నాకాశ యానమున నధిష్ఠాన పురమునకరిగి, యా మహారాజు భవనమునారసి, మాయాబల తిరోహితాంగినై చనుచు, హేమలతా మాధవులను నిరువురుకాంతలు 'రాజారామమున కేగినప్పటినుండియు నిద్రా సౌఖ్యములు మానినాఁడేమి' యని మాటలాడు కొనుచుండఁగావింటిని. తరువాత భవనా భ్యంతరముచొచ్చి యొకమంచముపైఁ బరుండి చిత్రఫలకమును జూచు నారాజును గాంచితిని. ఆ చిత్రము నందలి కాంత మనచెలియా లేక యన్యయా యెఱుంగు నుద్దేశముతో నేనచ్చటి గంధతైల భాజనములైన దీపికలచాటునఁబొంచి యుంటిని. రాజంత మదనవేదనా దూయమాన మానుసుడై చిత్రగతయైన కాంతనుగూర్చి పల్కుమాటలాలించి యామె మనచెలియేయని గ్రహించి పరమానందము నందితిని. తరువాత నాతని బల్కరించి వనితామణి యున్కి తెల్పుదమనియెంచి నృపమంచ సమంచితయంత్ర పుత్రికామండలిలో నొకమణి పుత్త్రికనై నవ్వుచు "రాజా! బాలిక నేలదూఱెదవు. ఇంతులు పరతంత్రలుకదా! కాంతలెచ్చటనైనఁ దమంతఁదాము వరింతురా? ఆమెను మదనుబారికగ్గము చేసి కనికరింపని నేరము నీదేకదా!" యని పల్కితిని. ఆ మాటలువిని అతఁడు తనమూలమున చెలిదయ్యుట యెఱింగి చింతచే తల్పమున నొఱగెను. నేనంత నాచేతనున్న హారము నాతనికంఠమున నుంచితిని. అతఁడు కన్నులు తెఱచి యా హారమచ్చటికి వచ్చుటకచ్చెరువంది, యది గిరిక హారమేయని గుర్తించి, చెలి క్షేమవృత్తాంతము తెల్పుమని దానినడిగెను. పిమ్మట నాతఁడు రత్నపుత్రికనైన నన్ను పల్కుమని కోర నేనునిజరూపముదాల్చి, నా నామముతెల్పి, గిరికపడుచున్న వేదన నెఱింగించితిని. ఆతఁడు మీచెలి యభిప్రాయమెట్లున్నదో తెలియక సందేహమున నిన్నినాళ్ళూ రకుంటిని. నేఁటి సంధ్యాకాలమున నింద్రుని పరిచారికవచ్చి "ఇంద్రుడు నాభావమెఱిఁగి వివాహము సంఘటించుటకై పర్వతరాజును కన్యను వేడుటకై వెళ్ళు"నని యెఱింగించినది. ఆ తియ్యని మాటవిని యూఱటచెంది ప్రాణములు నిల్పుకొని యున్నవాఁడను. నీవేగి మీచెలి నూఱడింపు"మని పల్కి యీ ఉంగరము నొసంగెను. నేను వెంటనే బయలుదేఱి వచ్చితిని" అని పల్కి మంజువాణి యాఉంగరమును గిరిక కొసంగెను. చెలులీ విషయమునంతను శుక్తిమతీ కోలాహలుల కెఱింగించిరి. ఇంతలో వేగుఁజుక్క పొడిచెను. చంద్రుఁడస్తమించెను. సూర్యుఁడుదయించెను. గిరిక కాలకృత్యము లొనరించి, గురుని భజించి ప్రీతితోనుండెను.

తరువాత కోలాహలపర్వతరాజాత్మకన్యోపలాలనాయత్త హృదయుఁడై యుండ నింద్రుడు దిక్పాలురతోడను గంగాదేవితోడను గూడి యాతనికడ కరుదెంచెను. అతఁడెదురేగి యథోచిత పూజలొనరించి గిరికచే వారికి మ్రొక్కించెను. గంగ గిరికను గౌఁగిలించి దీవించెను. కోలాహల పర్వతము పలికిన యుపచారవాక్యము లాలించి యింద్రుఁడు గిరికను తనమిత్రుఁడైన వసురాజున కిమ్మని యర్థించెను. కోలాహల మానందమున నంగీకరించెను. అంత నదీకాంతలు గొల్వ శుక్తిమతి యింద్రుని గొల్వ నచ్చటి కరుదెంచెను. నదులు, పర్వతములు

వివాహమహోత్సవము నారయుటకై యరుదెంచెను. మేనకాహిమవంతులును పార్వతియు వచ్చిరి. వచ్చిన వారినందఱిని గౌరవించి యింద్రుఁడు కోలాహల పర్వతమున కాస్పదముగా నచ్చటనొక నూతన మహానగరము నాత్మఁదలంచెను. వెంటనే వనమంతయు సుందరనగర మయ్యెను. బృహస్పతి యింద్రుని కోరికపై నారాత్రి యొక శుభముహూర్తము నిర్ణయించెను. ఆ విషయ మింద్రుఁడు కోలాహలమున కెఱింగించి వసురాజునకుఁ దెల్పుటకై యధిష్ఠాన పురమునకు వచ్చెను. వసురాజాతని నెదుర్కొని పాదాభివందన మొనరించెను. ఇంద్రుఁడాతని పెండ్లికొడుకవు కమ్మనిదీవించి "నిన్న రాత్రి సభాస్థలమున సింహాసనముపై గూర్చుండి యచ్చరల నాట్యమును, కిన్నరుల వీణావాదనమును చూచి విని యానందించు సమయమున మిత్రుఁడైన వసురాజేలరాలేదని నిన్నుఁదలంచితిని. తరువాత నీ మనస్సునందలి చింత యెఱింగి, యుదయముననే కోలాహల పర్వతమును కన్యనిమ్మని వేడి, పెద్దలను పుణ్యావాహినులను బెండ్లికి రా నియమించి, యాపర్వత రాజున కొకనగరమును నిర్మించి, నేఁడే సుముహూర్తమనుటచే నిన్ను పెండ్లికొడుకును జేయుటకై వచ్చితి" నని పలికెను. ఆ మాటలువిని మంత్రి పురోహితాదులు నగరము నలంకరించుటకుఁ దగినవారి నియోగించిరి. పట్టణ మంతయు నలంకరింపఁబడెను. సకలదేశాధీశులకును సందేశములు పంపఁబడెను. ఇంద్రుఁడే పెండ్లిపెత్తన మొనర్చుచుండుటచే నతని యనుగ్రహము నెఱింగి సురాంగనలు వసురాజునకుచితములైన సేవలుచేయఁదొడంగిరి. వారాతని స్నానము చేయించి యలంకరించిరి. వరుణుఁడాతని కొక ముక్తాహార మర్పించెను. నలకూబరుఁడు కెంపుల పెండేరము నొసంగెను. దేవేంద్రుఁడాతనికి దివ్యసరోజదామము కానుకగా నొసంగి దాని గుణగణములు వర్ణించెను. వసురాజా యమ్లాన సరోజమాలికను ధరించి రెండవ యింద్రుఁడువలెఁ బ్రకాశించెను. అట కోలాహలనగరమున కాంతలు స్నానానంతరము గిరిక నలంకరించిరి. ఆమె వివాహవేదికకరుదెంచెను. శచీదేవి యామెకు సఖులచే కల్పకుసుమ మాలికలు పంపించెను. ఇంతలో సూర్యుఁడస్తమించెను. నక్షత్రములు తోఁచెను. చంద్రుఁ డుదయించెను. బృహస్పతి ముహూర్తము సమీపించెనని హెచ్చరింపఁగా వసుమహారాజు వెల్లయేనుఁగు నెక్కి కోలాహలపురమున కరుదెంచెను. ఆ సమయమున పురస్త్రీ లతనిపై మంగళాచార లాజలు చల్లిరి. కోలాహల పర్వతరాజతని నమ్రతాపగా ముఖ్యపురంధ్రీజనులతోవచ్చి యెదుర్కొనెను. రాజేనుఁగు దిగి ప్రధానజనులు చూపిన మార్గమున కల్యాణవేదికకడ కరుదెంచెను. వివాహము యథావిధిగా జరిగెను. ఇంద్రుఁడు దివ్యమణులను నానావిధ దివ్యాంబరములను రాజునకు కట్నముగా చదివించెను. కోలాహలుఁడల్లునకు రథగజతురగ కన్యా గంధద్రుమ మాణిక్యాదులను కట్నముగా నిచ్చెను. శుక్తిమతి యాతనికిఁ దనయందున్న రత్నములన్నియు నొసంగుటేకాక తనకుమారు నతనిపాదము చేర్చెను. వసువాతని సేనాధిపతిగా నియమించెను. అంత చంద్రుఁడస్తమించెను. సూర్యుఁడుదయించెను.

అష్టదిక్పాలురును వసురాజున కభిమత వరము లొసంగిరి. తరువాత నింద్రుఁడతనికి దివ్య వేణుదండము నొసంగి, దాని గుణగణము లెఱింగించి, నిజనివాసమున కరిగెను. పెండ్లికి వచ్చినవారందఱు తమతమ యిరువుల కరిగిరి. శుక్తిమతీ కోలాహలులు కూఁతునకు హితవుచెప్పి బెగడవలదని యూఱడించి వసురాజుతో పంపిరి. వసురాజు రత్నరథాధిరూఢుడై గిరికతోఁగూడ నిజపురమున కరిగెను. పురస్త్రీలు వారి దాంపత్యమును బలువిధముల శ్లాఘించిరి. ఆ ప్రశంసలు వినుచు వసురాజు గిరికహస్తమును నవలంబించి నిజసద్మము ప్రవేశించెను. తరువాత నతఁడొకశుభముహూర్తమున కన్నియలకు కామశాస్త్రరహస్య ప్రకాశనమొనర్చునట్లుగా నిర్మింపఁబడిన నర్మభర్మహర్మ్యమున కరిగెను. సఖీజన నీయతయై గిరికయు నచ్చటికరుదెంచెను. తరువాత వారిరువురు నభిమతక్రీడల ననుభవించిరి. ఆరాజు ధర్మమార్గమున భూమిపాలించుచుండ ప్రజలు సర్వవైభవ సమృద్ధి నలరారిరి.

వసుచరిత్రయందలి కథకు మూలము భారతాదిపర్వమునఁగల యుపరిచర వసుమహారాజు వృత్తాంతము. వ్యాసుని జననియైన మత్స్యగంధి జననమునకు కారణభూతుడీ మహారాజే. భారతమునందాతనికథ యత్యల్పముగా నున్నది. భట్టుమూర్తి దానిని గ్రహించి కొన్ని మార్పులు కావించి యద్భుతములైన కల్పనలచేతను వర్ణనలచేతను పెంచి వసుచరిత్ర మహాప్రబంధమును రూపొందించెను. భారతమునందు బీజప్రాయముగా నున్న చిన్న కథ యాతనిచేత కల్పనాస్కంధ శోభితమును, బహువర్ణన శాఖావిరాజితమును, శ్లేష ధ్వని చమత్కారపత్ర పుష్పఫలపరిపుష్టమును, రసవాసనాభాసితములైన ప్రబంధ మహావృక్షముగా పరిణమించినది. అయ్యును ఇందు కథాపుష్టికంటె వర్ణనాది సౌందర్యమే హెచ్చు. మూలమున వసువు వేటకరిగి యొకముని యాశ్రమమున నిర్వేదమునొంది సన్యస్త శస్త్రుఁడై తపస్సొనరించుచుండ నింద్రుఁడాతనికడకరిగి ‘నీ వర్ణధర్మప్రతిపాలనమునకును ధర్మమునకును మెచ్చితిని. నీవు నాయొద్దకు వచ్చుచుఁబోవుచు మహీరాజ్యము చేయుచుండు”మని పలికి యాతనికి దేవత్వమును, కనకరత్నమయమైన విమానమును, ఇంద్రమాల యనుపేరుగల యమ్లానకమలమాలికయును, దుష్టగ్రహ శిష్టపరిపాలనక్షమమైన వేణుయష్టిని నొసంగెనని యున్నది. భట్టుమూర్తి వసుమహారాజు తపోవృత్తాంతమును విడిచివైచెను. ఆతఁడు వసుచరిత్రలో రసాస్వాదన పరాయణుఁడైన యువకుఁడు. ఇంద్రుఁడాతనికి శుక్తిమతిని నిరోధించిన కోలాహలపర్వతమును కాలిగోటితో మీటినపుడు విమానమును, పెండ్లికుమారుని చేయుసందర్భమున నమ్లానకమలమాలికను, వివాహానంతరము కానుకగా వేణుయష్టిని ప్రీతిపూర్వకముగా నొసంగెనని భట్టుమూర్తి వర్ణించెను. ఇంద్రుఁడు గిరిభేది. వసురాజు కోలాహలమును గోటమీటుట యతనికి ప్రీతికరమైన కార్యము. అందుచే నాతఁడు సంతోషించి యా సందర్భమున నతనికి విచిత్రమైన దివ్యవిమానము నొసంగెను. వసుచరిత్రలో గిరికావసురాజుల వివాహము సందర్భమున నింద్రుఁడే సర్వకార్యభారమును వహించెను.

గిరికా విరహవేదనాసంతప్తుడైఁ మిత్రుని వంత తొలఁగించుటకై యాతఁడు కోలాహలముకడకు స్వయముగానేగి వసువునకు కన్యనిమ్మని యర్థించెను. తరువాత వసువును పెండ్లికుమారుని జేయుటకై యధిష్ఠానమున కరిగెను. వివాహము దగ్గఱుండి జరిపించెను. ఈ సందర్భమున నాతఁడు వసురాజునకు కమలమాలికా వేణుయష్టులను ప్రీతిపూర్వకముగా నొసంగెను. ఈ మార్పులు చాల సముచితముగా నున్నవి. వసురాజింద్రునివరమున నేవురుకుమారులను బడసెననియుఁ దరువాతనే కోలాహల నిరోధము తొలఁగించి శుక్తిమతి కుపకారమొనరించె ననియుఁ బర్వత సమాగమమునఁ దనకుదయించిన కుమారుని గుమారిని శుక్తిమతి కృతజ్ఞతా పూర్వకముగా వసువునకుఁ గానుక యిచ్చెననియు, వసువా పుత్రికను ధర్మపత్నిగను కుమారుని సేనాపతిగను జేసికొనెననియు భారతము చెప్పుచున్నది. భట్టుమూర్తి తాను కావ్యమున వర్ణింపఁ దలఁచుకొన్న శృంగారరసపూరితమైన ప్రణయవృత్తాంతమున కనువుగా వసురాజున కింద్రవరమున నేవురు పుత్రులుకలిగిన విషయమును విడిచివైచెను. శుక్తిమతి గిరిక నాతనికిఁ గానుకగా నిచ్చినట్లుగాక యతఁడే యామెనుజూచి వలచి వలపించుకొన్నట్లు మార్చి వారి ప్రణయమును, వివాహమును, రమణీయముగా వర్ణించెను. ప్రబంధము నందలి ప్రధాన కథాభాగమిదే. వివాహసందర్భమున శుక్తిమతి వసుపదుని వసురాజు పాదమునఁజేర్ప నాతఁ డాతని తన సేనాపతిగాఁ జేసికొనెనని భట్టుమూర్తి వర్ణించెను. ఈ మార్పులుకూడ మిక్కిలి యౌచిత్య శోభితములుగా నున్నవి. భట్టుమూర్తి గిరికావసురాజుల వివాహముతోడనే కావ్యమును ముగించుటచే ఋతుమతియైన గిరికకు మృగమాంసమును దెచ్చిపెట్టుమని పితృదేవతలు చెప్పఁగా వసువు మృగవధార్థమరిగెనని భారతమునఁగల వృత్తాంతమాతఁడు చెప్పవలసిన యవసరము లేకపోయినది.

శుక్తిమతిని కోలాహలుఁడడ్డగింప వసువాతని పాదమునఁదలఁగఁ ద్రోచిన వృత్తాంతము భారతమున సూచ్యమాత్రముగా నున్నది. భట్టుమూర్తి దానిని రమ్యముగాఁబెంచి మంజువాణిచే మాయాయతివేషమున తమకడ కరుదెంచిన నర్మసచివునికిఁ జెప్పించెను. ఈ ఘట్టమున నదీపర్వతములందు నాయికానాయకత్వారోపణముచేసి భట్టుమూర్తి కావించిన వర్ణన యద్భుతముగా నున్నది. నిజమునకు వసుచరిత్రయందలి కథ గిరికాజననవృత్తాంతముతో నారంభింపవలసియున్నది. భట్టుమూర్తి యట్లుచేయక దానిని ద్వితీయాశ్వాసమధ్యమునఁ బ్రవేశపెట్టి కథాసంఘటనమునఁగూడ చమత్కారమును బ్రదర్శించెను. దీనిని దానుజెప్పక యతఁడు మంజువాణిచేఁ జెప్పించుటకూడ నాటకోచితమై యింపునింపుచున్నది. ఈ సన్నివేశమును కల్పించుటలో నతఁడు కాళిదాసుని యభిజ్ఞానశాకుంతలమున చెలికత్తెలు శకుంతలాజననవృత్తాంతమును దుష్యంతుని కెఱింగించిన దృశ్యము నొజ్జబంతిగా గ్రహించినాడు. మంజువాణీ నర్మసచివుల నిరువురిని భట్టుమూర్తి క్రొత్తగా కల్పించి కథా సంవిధానమున వారికధికమైన ప్రాధాన్యము ప్రదర్శించినాఁడు. మాయాయతివేషమున

నర్మసచివుఁడు నిర్వహించిన కార్యమును, వసురాజు కడకరిగి హారమునొసంగి యుంగరమును దెచ్చుటలో మంజువాణి నిర్వహించిన కార్యమును అల్పసన్నివేశకమైన కథావస్తువునకించుక పుష్టి చేకూర్చినవి. కాని వివాహసందర్భమున కవి వారిని విస్మరించుట మాత్రము శోచనీయముగానున్నది.

వివాహసంఘటనమున నింద్రుఁడు నిర్వహించిన కార్యమాతనికి వసురాజు నెడగల ప్రీత్యాదరములను సూచించుచున్నది. అతఁడు కోలాహలగిరి కొకనగరమును నిర్మించి యిచ్చుట కవికల్పితము. వివాహము ప్రధానముగా స్త్రీప్రాధాన్యముగల సంఘటనమగుటచే కాళిదాసు కుమారసంభవమున నరుంధతినివలె భట్టుమూర్తి యిచ్చట గంగను ప్రవేశపెట్టి యౌచిత్యము ప్రదర్శించియున్నాఁడు.

భట్టుమూర్తి శ్రీరామ హనుమంతుల భక్తుఁడు. రామాయణమున హనుమంతుఁడు శ్రీరామునిముద్రికను గొనిపోయి సీతకిచ్చి యామెకడనుండి చూడామణినిదెచ్చి రామునికెంతో యూఱట కలిగించెను. దానిని మనసున నుంచుకొనియే కాఁబోలు భట్టుమూర్తి వసుచరిత్ర మున మంజువాణి గిరికాహారమును గొనిపోయి వసువున కిచ్చినట్లును వసువునుండి యుంగరమును గొనివచ్చి గిరికకానందము కల్పించినట్లును ఒక రమ్యమైన సన్నివేశమును గల్పించెను. ఈ యంశమునే యతఁడు తృతీయాశ్వాసమున చెలికత్తె లుద్యానవన విశేషములను గిరిక కెఱిఁగించునప్పుడు "అనిలకుమారకుండు మరుదధ్వ నిరోధిపలాశమండలీ ఘనవనరాశిలో" (3-139) అను పద్యమున శ్లేష మూలమున సూచించియుండెను.

భట్టుమూర్తి వసుచరిత్రలో వసురాజునింద్రునితోడను సూర్యునితోడను బోల్చుచుండును. దీనిని బురస్కరించుకొని కొందఱీప్రబంధమందలికథ వట్టికథ కాదనియు సంకేతముతోకూడి యున్నదనియు భావించుచున్నారు. మహాభారతమందలి వసురాజు వృత్తాంతమునకు మూలము ఋగ్వేదమందలి వృత్రాసురుని కథ యనియు, వృత్రాసరుఁడాకసమున మేఘము రూపముననో చీకటి రూపముననో జలమునో వెలుఁగునో బంధింపఁగా నింద్రుఁడో సూర్యుఁడో వానిని భేధించి లోకమునకు జలమునో వెలుఁగునో ప్రసాదించెననియు, నావృత్తాంతమే వసుచరిత్రలో సాంకేతికముగా చిత్రింపబడినదనియు వారిభావము. వారి ననుసరించి వసువింద్రసూర్య స్థానీయుఁడు. కోలాహలుఁడు వృత్రస్థానీయుఁడు. శుక్తిమతీగిరికలు జలాలోకస్థానీయలు. మఱియు వసువనఁగా జలము, వెలుఁగు అనునర్థము లుండుటచే జలాలోకముల కథ యనుస్ఫూర్తి కలుగుటచే భట్టుమూర్తి తన ప్రబంధమునకు వసుచరిత్రయను పేరు పెట్టియుండెననియు వారి యభిప్రాయము. ఈ గాథ ప్రబంధమున నంతర్గతమై సాగుచున్నదని యూహించుటకు భట్టుమూర్తి ప్రకృతి సంబంధులైన నదీపర్వతముల నుపకథలోనైన నాయికానాయకులుగా గ్రహించుటయే కారణము. అతని ప్రకృతిపరిశీలనము చాల నిశితమైనది. కావ్యమునందంతట నాతఁడు దానిని బహుముఖముల వర్ణించియున్నాఁడు.

భట్టుమూర్తికి పెనుగొండతో సంబంధమున్నది. పెనుగొండచెంత ముత్యాలవంక యనునొకవాగును దానిని నిరోధించుచున్నట్లున్న యొక కొండయును గలవఁట. ఆ వాగు శుక్తిమతీ రూపముననను, ఆ కొండ కోలాహలరూపముననను వసుచరిత్ర కెక్కినవని కొందఱి యభిప్రాయము. కాని శుక్తిమతీకోలాహలుల వృత్తాంతమల్పముగనైనను భారతమందే యున్నది. పెనుగొండ దాపునఁగల యాదృశ్యము భట్టుమూర్తిని ప్రత్యేకముగా నీ వస్తువును గ్రహించుటకు ప్రేరేచి యుండవచ్చును.

వసుచరిత్ర వైభవము కథాకథనమునఁగాక వర్ణనములందును శ్లేషధ్వని చమత్కారము లందును అధికముగా గోచరించును. అది సర్వలక్షణ సమగ్రమైన యుదాత్తప్రబంధము. భట్టుమూర్తి వర్ణనములం దందెవేసినచేయి. అతఁడు వసుచరిత్రమున పురవర్ణన రెండుచోట్లఁ గావించినాఁడు. ఒకటి అధిష్ఠానపురవర్ణనము. రెండవది కోలాహలపురవర్ణనము. అధిష్ఠాన పురమునందలి కోటను, పరిఖను, అందలి నాలుగు వర్ణముల ప్రజలను, రథగజతురగ పదాతులను, స్త్రీలను, పూతోటలను పుష్పలావికలను అతఁడు మనోహరముగా వర్ణించి యున్నాడు. ఆ పట్టణముచెంత శుక్తిమతీనది ప్రవహించుచుండెను. అందలి నీరు జలకేళిసల్పు కాంతల వక్షోభాగములందలి పునుఁగు వాసనలతోఁగూడి కాల్వలద్వారా రాజనపు చేల కరుగుటచే నా ధాన్యముకూడ పునుఁగు వాసనలతో గుబాళించుచుండెనఁట.

**వలనగు నమ్మహీతటిని వారి నవారిత హేళిసల్పు కాం**
**తల చనుమిట్టలం దొఱఁగు దట్టపుఁ దట్టు పునుంగు వాసనల్**
**చిలుకుచు వీటి రాజనపుఁజేలకు దిద్దిన కాల్వ వెంట రా**
**దళముగ నాని యప్పునుఁగు తావులె వల్చుఁదదీయధాన్యముల్** 1–113

కోలాహలనగరమింద్రసంకల్ప కల్పితమైనట్టిది. పర్వతమందలి వస్తువులే నగర వస్తువులుగా నెట్లు మాఱెనో యాతఁడిందు చక్కగా వర్ణించియున్నాఁడు. పర్వతమునందలి కురంగములు తురంగము లయ్యెను. శరదములరదములయ్యెను. ప్రథమాశ్వాసమున వసంతర్తు వర్ణనమున్నది. భట్టుమూర్తి యిందు వాసంత ప్రకృతి నత్యంతమనోజ్ఞముగా వర్ణించియున్నాడు. ఉద్యానపాలురు వసంతశోభను జూచుటకై రాజును రమ్మని వేడిరి. సాధారణముగా రాజులు దుష్టమృగబాధనుండి ప్రజలను రక్షించుటకై వేటకరుగుదురు. ఇచ్చట నట్టి మృగబాధ యేదియు లేదు. గంధవహుని ధౌర్త్యము మాత్రమున్నది. నిజముగానది విలాసమేకాని ధౌర్త్యముకాదు. దానిని ధౌర్త్యముగా నిరూపించుచు కవి యిట్లు వర్ణించియున్నాఁడు.

**ఏపారు పొదరిండ్ల నాపాటలాశోక**
**దీపార్చి కనక కలాప మరసె**
**సాలావలులు దాఁటి యేలాలతావార**
**బాలాతతి పరాగ పటములూడ్చె**

**నానామధుప నవ్యగానామృతము మెచ్చి**
**సూనాసవము లెల్లఁ జూఱలిచ్చె**
**శంకారహిత ధీరహుంకార శుకభటా**
**హంకారముల ఫలాహతి యొనర్చె**

**ననుచు నాగంధవహుని ధౌర్త్యములు తెలుపు**
**లీల విరిసిన విరులు, రాలిన రజంబు,**
**లొలికిన రసంబు, ఉరలిన ఫలము లధిపు**
**మ్రోల నిడి పల్కి రుద్యానపాలు రపుడు** 1-134

అట్లే ఉద్యానవనమునందలి లతావృక్షములను, దోహదక్రియలను, పూపొదరిండ్లను, మకరంద ప్రవాహములను కవి చక్కగా వర్ణించి యున్నాఁడు.

నర్మసచివుఁడు రాజునకు గిరికాసౌందర్యమును వివరించుచు ఆమెను నఖశిఖా పర్యంతము వర్ణించెను. భట్టుమూర్తి ముక్కు తిమ్మన నుండి గ్రహించెనను ప్రతీతికి పాల్పడిన ముక్కును వర్ణించు "నానాసూనవితాన వాసనల" నిత్యాది పద్యమీ సందర్భమునందలిదే. స్త్రీల యూరువులను రంభాస్తంభములతోడను, ఏనుఁగు తొండముల తోడను కవులు పోల్చుచుందురు. ఏనుఁగులు కదళీవనములను భంజించుట సహజము. ఏనుఁగులకు కదళీ కాండములపై వైరము కల్గుటకు కారణము కవి యిట్లు తెల్పుచున్నాఁడు.

**సతియూరుద్యుతి పొందఁగోరి నిజదుశ్చర్మాపనోదక్రియా**
**రతిఁబాథోలవపూరితోదరములై రంభేభహస్తంబులు**
**న్నతటిన్ వీడెమరుద్విభూతిఁగదళిం ద్వగ్దోషమాచంచలో**
**ద్ధతశుండాతతిఁబాయదయ్యె, నదెవో తద్వైరమూలంబిలన్** 2-37

ఈపద్యము రంభాకాండములకంటెను గజహస్తములకంటెను గూడ గిరిక యూరువులే సుందరతరములని సూచించుచున్నది.

**త్రిజగతీ సుదతీరూప విజయకీర్తి**
**కలుగునని యింతి ఫాలభాగమున వ్రాసి**
**నలువ యాశుభవాచకంబులకు శ్రీల**
**మొదలఁదుది నిల్పెననఁ గర్ణములు దనర్చు** 2-49

శుభ విషయసూచకముల పత్రములకాద్యంతములందు శ్రీకారముల నుంచుట సంప్రదాయము. బ్రహ్మ గిరికఫాలమున నామె ముల్లోకము లందలికాంతల సౌందర్యమును జయించి కీర్తినార్జించునని వ్రాసి యారంభాంతములందు శ్రీకారములనుంచెనో యననామె

వీనులలరారుచుండెను. చెవులను శ్రీకారములతోఁబోల్చుట కవులకు పరిపాటి. తరువాత రాజు గిరికను గాంచినప్పుడు మరలనామె యవయవముల యపూర్వ సౌందర్యమును వర్ణించియున్నాఁడు.

శుక్తిమతీ కోలాహలముల ప్రణయగాథను వర్ణించుటలో భట్టుమూర్తి చూపిన నేర్పనన్య సాధ్యమైనట్టిది. జడములైన నదీపర్వతము లందాతఁడు నాయికానాయకత్వముల నారోపించిన తీరద్వితీయము. "సుమనోధివాస భాసురశిఖోన్నతివాఁడు, ఘనసారతిలక వాసనలవాఁడు" (2-108) అనుసీసము కోలాహలధరాధీశుని వర్ణనము. ధరాధీశుఁడనఁగా పర్వ తేంద్రుడు, రాజేంద్రుఁడు అనునర్థములు రెండును గలవు. కవిపద్యమునందలి విశేషణము లన్నియు నాయిరువురికి నన్వయించునట్లు నిపుణముగా ప్రయోగించియున్నాఁడు. కోలాహలుడు తనకడకరుదెంచినప్పుడతని నుచితరీతి గౌరవించి శుక్తి మతి యిట్లు పల్కుచున్నది.

**అతుల శైవలవతీశతములీనెడు మీకు**
**నాయిచ్చు విమలార్ఘ్య తోయమెంత**
**ప్రాలేయ నిలయ సంభవముగాంచిన మీకుఁ**
**బన్నీటనొనరించు పాద్యమెంత**
**సరస మందారమంజరుల రంజిలు మీకుఁ**
**బెనఁచి పూదండలర్పించుటెంత**
**గోరత్నసందోహ గురులక్ష్మిగలమీకు**
**నుపదగా మణివర్ణ మొసఁగుటెంత**

**యనఘ! యెవ్వారలైన గొండంతవారి**
**కవనిఁగొండంతపూజ సేయంగగలరె**
**భక్తినేనిచ్చునీ పుష్పపత్రతోయ**
**మాత్రములుగైకొనుటెకాక గోత్రతిలక** 2-122

తాను సేయు సపర్య యల్పమైనదని శుక్తిమతి చెప్పుచున్నది. అంతరార్థమును బరిశీలించినచో నిందించుక హేళన కూడ గోచరించును. అతని యందుండు నదులు శైవలవతులు. నాచుతోఁగూడినవి. తానిచ్చు నర్ఘ్యము విమలతోయము. ఈ విధముగనే యన్నిపాదములందును ఆమె సపర్యయాధిక్యము ధ్వనించును. గోత్రతిలకుఁడన భూమిని రక్షించు పర్వతములలో శ్రేష్ఠుఁడని యర్థము. ఆ సంబోధనమున భూమిని రక్షించు వాడన్య కాంతలను గామింపవచ్చునా యనునాక్షేపమున్నది. వసురాజు గోటమీటిన పిమ్మట కోలాహల పర్వతము తీరిట్లుండెను.

**మొక్కల్వోయిన తెక్కమొక్కగమితో మూర్ఛాలసత్వంబుతోఁ**
**జిక్కుల్వడ్డ లతా ద్రుమావళులతో శీర్ణోపలశ్రేణితో**
**నక్కోలాహలముర్వి వ్రాలియును నెయ్యంబొప్పనయ్యేటికే**
**గ్రుక్కిళ్మింగుచునుండె నండనె వసుక్షోణీధవ త్రస్తమై** 2–155

ఇది పర్వతవర్ణనమేయయ్యు కలఁతపడిన పురుషుని స్వరూపమును గూడ స్ఫురింపఁ జేయుచున్నది. తెక్కలు బాహువులు, లతలు కేశములు, ద్రుమములు కాళ్ళు, శిలలు శీర్షాదులు. మూర్ఛ యిరుపక్షముల సమానమే. అతఁడట్లు నేలవ్రాలియు నా యేటికే గ్రుక్కిళ్ళు మ్రింగు చుండుట కాముకలక్షణము నద్భుతముగా నిరూపించుచున్నది. "నాళీక ముఖికి నెన్నడుము కానఁగనయ్యెఁదనరు నెత్తఱుల బిత్తరము తరలె"(3–20) అను సీసము గర్భవతియైన శుక్తిమతిని వర్ణించుచున్నది. నదికిని స్త్రీకిని సమానముగా నన్వయించునట్లు కవికావించిన యీవర్ణనమాతని పాండితీలోకానుభవ విశేషములను వేయివిధముల వ్యక్తము చేయుచున్నది.

తృతీయాశ్వాసమున విరహపీడితయైన గిరికకుఁ బ్రొద్దుబోవుటకై చెలులుపవనము నందలి విశేషములను వర్ణించి చెప్పిరి. ఇచ్చటి పద్యములు ప్రౌఢములును, ప్రకృతిరహస్య పరిపూర్ణములును, అలంకార బంధురములునై కవి భావనాశక్తిని బ్రస్ఫుటము చేయుచున్నవి. తరువాత పుష్పాపచయజలకేళీ వర్ణనములున్నవి. ఈ క్రింది పద్యము జలకేళియందలిది.

**కరముల మూఁపులూఁదుకొని కన్నెలు చన్నులబంటి నొండొరుల్**
**బరిగొనినిల్వఁ దత్పరిధి ప్రాంశుదృగంశు కలాపపూరితాం**
**తరమయిపొల్చె భావభవ దైవతభావిత హేమకుంభసం**
**భరిత మృణాళమండలిత పద్మమయప్లవ మండలంబనన్** 3–156

స్త్రీలు స్తనదఘ్నమైన నీటిలో వలయాకారముగ నిలఁబడి యుండిరి. చేతులతో వారు మూఁపులనూఁది పట్టుకొనిరి. వారిస్తనములు హేమకుంభముల వలెను, బాహువులు మృణాలములవలెను ఉండెను. వారి నేత్రకాంతి మండలాంతరమున ప్రసరించుచు మన్మథునికై కల్పింపఁబడిన హేమకుంభ సంభరితమును మృణాళ మండలితమునైన పద్మమయ ప్లవమండలమువలె నొప్పారెను. ఇచ్చటి కవి భావన అపూర్వమై యానందము నావహించు చున్నది.

చతుర్థాశ్వాసమున సూర్యాస్తమయ సంధ్యాతమోనక్షత్రచంద్రోదయాదుల వర్ణన మున్నది.

**హరిదంభోరుహలోచనల్ గగనరంగాభోగ రంగత్తమో**
**భర నేపథ్యము నొయ్యనొయ్య సడలింపన్ రాత్రి శైలూషికిన్**
**వరుసన్ మౌక్తికపట్టమున్, నిటలమున్, వక్త్రంబునుం దోఁచెనా**
**హరిణాంకాకృతివొల్చె రేకయి సగంబై బింబమై తూర్పునన్** 4–17

దిక్కులను కాంతలు గగనమను సారంగమున చీఁకటి యను తెర తొలగింపఁగనే రాత్రియను నటికి వరుసగా మౌక్తికపట్టమును, ఫాలమును, ముఖము దోఁచెనాయన్నట్లు తూర్పున చంద్రబింబము రేకయి, సగమై, బింబమై గోచరించెనని భావము. ఇచ్చట చంద్రుఁడు రాత్రినటి ముఖముగా నుత్ప్రేక్షింపఁబడినాడు. ఈ వర్ణన సహజమై కవికాలము నాఁటి రంగస్థలయవనికా స్వరూపమును వ్యక్తము చేయుచున్నది. మంజువాణి వసురాజు నుంగరమును గొనివచ్చి గిరికకిచ్చిన పిమ్మట చంద్రాస్తమయమును ప్రాతఃకాలమును వర్ణింపబడినవి.

**ఒకనాఁడింద్రుని యంతవేలుపు మదీయోక్తిన్విడంబించి తా**
**నొకకాలం బెతిఁగింపవచ్చి మునిశాపోద్వృత్తి పాలయ్యె మా**
**మక శబ్దంబిది యల్పమే, త్రిముని సంభావ్యత్రికాలీ విబో**
**ధకమన్ రీతిఁద్రిభంగిగా మొరసెఁ జెంతం దామ్రచూడౌఘముల్** 4–126

కోడి కూఁత ఘనతయందు వివరింపఁబడినది. అది త్రిముని సంభావ్యము, త్రికాల బోధకము.

గిరికా వసురాజుల వివాహమునకు ముందు చెలులు వారిని స్నానము చేయించుట వర్ణింపఁబడినది. ఇది భట్టుమూర్తి కాలమునాఁటి సంపన్నుల యిండ్ల స్నాన విధానమును సూచించుచున్నది.

**సురభికురంగ నాభికలచొక్కపు గుంకుమఁగప్పి, కుంకుమ**
**స్ఫురిత మహోష్మఁగప్పురపు సోఁకులమానిపి కప్పురంపుఁజ**
**ల్మిరి మెఱుఁగుం జవాదినెడలించి కదంబము గూర్చి నెచ్చెలుల్**
**తరుణి కలందిరన్నియునుఁ దత్తనువాసనఁ బూవుగట్టుచున్** 5–121

ఈ పద్యమాకాలమువారి సుగంధ ద్రవ్యప్రీతిని దెల్పుచు వానియన్నిటి కంటె గిరిక మేనే యెక్కువ సువాసన గల్గియుండెనని సూచించు చున్నది. చివరి యాశ్వాసమున వివాహ సంభోగవర్ణనములున్నవి. వివాహవర్ణన సందర్భమున కవి తెరయెత్తుట, వధూవరులకు పురోహితుఁడు రక్షాబంధముకట్టుట, మాంగళ్యసూత్ర బంధనము, తలఁబ్రాలు, లాజహోమము. వధువుచే సన్నెకలు త్రొక్కించుట, అరుంధతీ దర్శనము, మామయు బంధువులును వరునకుఁ గట్నములొసంగుట మున్నగు కార్యములన్నియు వివరముగా వర్ణించెను. గిరిక యత్తవారింటికరుగునప్పుడు శుక్తిమతీ కోలాహలులామెకు సదుపదేశము కావించి ధైర్యము కలిగించిరి.

**పతికృతధర్మ కౌశలము పట్టునఁదోడగు నారినారి, దాఁ**
**బితృశరణప్రచింత మదిబెట్టక యీశ నివేశితాత్మయౌ**
**సతిసతి, రాశికెక్కి యిన సత్కృతిఁ గైకొను కన్యకన్య, శా**
**శ్వతమతినిట్లుగా మనని వామయె వామ గదమ్మ కోమలీ!** 6-57

అనునది తండ్రిగావించిన యుపదేశము. వామయనఁగా స్త్రీయనియు వ్యతిరేకముగా వర్తించునది యనియు రెండర్థములున్నవి. ధర్మము, నారి, సతి, ఈశుఁడు, ఇనుఁడు కన్య యనుపదముల నీపద్యమున కవిశ్లేషగా వాడియున్నాఁడు. వసురాజు నర్మహర్మ్యమున "కన్నియలకుఁగాను నిగమరహస్య ప్రకాశమొనర్చునట్లు"గా చిత్రాదులు లిఖింపఁబడినవి. సంభోగవర్ణన సందర్భమున గిరిక లజ్జయు వసువు రసజ్ఞతయు చక్కగా ప్రకటితములైనవి.

**సతి సాహిత్యరహస్యమీశువలనన్ సాధించితోడ్తోన త**
**త్పతికిం బ్రత్యుపదేశమిచ్చెనతుల ప్రౌఢిన్ ధ్వని వ్యక్తిత**
**ఛ్ఛ్రుతులం జొన్పుచు లోచనాంజనరస ప్రోన్మేషము ల్తన్ముఖో**
**ద్గతముల్ సేయుచు బ్రత్యలంకరణ మౌఖర్యంబు దీపింపఁగన్** 6-94

గిరిక పురుషాయితక్రీడయిందు వర్ణింపఁబడినది. రెండవ పక్షమున సాహిత్యరసము వెల్లడింపఁబడినది. ధ్వని, రసము, అలంకారములు మున్నగునవి సాహిత్యమునఁ బ్రాధాన్యము వహించును. వానియందు భట్టుమూర్తి చాలాదిట్ట. అతఁడీపద్యమున నన్యాపదేశముగాఁ దన కవిత్వమునందలి ముఖ్యలక్షణములు చెప్పియున్నాఁడు. ఈ విధముగా భట్టుమూర్తి వసుచరిత్రమున ప్రబంధోచితములైన పెక్కు వర్ణనముల ప్రౌఢసుందరముగా సంతరించి యపూర్వము నినన్యసాధ్యములైన తన ప్రతిభాసంపదను చక్కగా ప్రదర్శించియున్నాఁడు.

వసుచరిత్రమందలి ప్రధానరసము శృంగారమే. ఇందు శుక్తిమతీ కోలాహలుల వృత్తాంతమున శృంగార రసాభాసమును, తృతీయ చతుర్థాశ్వాసములందు వియోగశృంగారమును, షష్ఠాశ్వాసమున సంభోగశృంగారమును గోచరించుచున్నవి. కోలాహలుఁడు శుక్తిమతిని ప్రేమించెను. శుక్తిమతి మాత్రమతని ప్రేమించియుండలేదు. అనురాగమేకత్రనిష్ఠమగుటచే నిచ్చట శృంగారమాభాసమైనది. అతఁడు తనవలపు తెలిపినప్పుడామె "సకల క్ష్మాపుణ్య దేశాళింగాంచి తపఃస్ఫూర్తి మెయిం గృశించి వనరాశింజెంద మాబోంట్లనుద్ధతిచేఁ గ్రమ్మగనేల" యని వారించినది. అతఁడు ధృతిగోల్పోయి నన్నేలుమని వేడుచు తన దీర్ఘభుజశాఖచే "సతి కమలాలిపట్టు" పట్టుకొనెను. అప్పుడామెకుఁ గలిగిన సంభ్రమమును భట్టుమూర్తి యిట్లు వర్ణించెను.

**వేణి చలింపఁ గంపిత నవీన మృణాళ భుజాగ్రకంకణ**
**శ్రేణి నటింప, లోల శఫరీ నిబిరీస కటాక్ష కాంతి వి**
**న్నాణముచూప, హంసక గణక్వణనంబులు మీఱ, సైకత**
**శ్రోణి నివర్తితాబ్జ ముఖశోభితయై కడు సంభ్రమించినన్** 2-138

సంభ్రమముతోపాటీపద్యమామె కలఁతను వైముఖ్యమునుగూడ సూచించుచున్నది. షష్ఠాశ్వాసాంతమున సంభోగశృంగారవర్ణన మున్నది. వసురాజు కోలాహలపురమును జేరునప్పుడతని క్రీడాసౌధములనుండి చూచిన పురస్త్రీల వర్ణనము శృంగారరసమయముగా నున్నది. కావ్యమునందలి పెక్కు వర్ణనములు శృంగారరసానుకూలముగనే చేయఁబడినవి. అధిష్ఠానపురమున జట్టికాంద్రకును పుష్పలావికలకును జరిగిన సంభాషణమును వివరించు "పొన్నపూవొడినేల పొదిలితే చెలి యది పొడమె బల్దీవిపైఁ బొదువవలె" (1-109) అను సీసమిందుకుఁదార్కాణము. తృతీయా శ్వాసమున నర్మసచివుని మంత్రమున కనుకూలముగా వసురాజు గిరికాదుల చెంతకు వచ్చెను. అప్పుడు

**అనుపమకాంతి వైభవ సమన్వితునా వసురాజుగాంచి ప**
**ద్మిని సరసాంతరంగమున మించె వినూతనరాగ కందళం**
**బొనరె నఖండవాసనలు నుత్కలికల్ విలసిల్లె నల్ల న**
**ల్లన నిగిడెం బ్రమోద తరళస్థితులై తమిఁజూపు తుమ్మెదల్** 3-48

ఇందు శృంగారమునకు సంబంధించిన సాత్త్వికానుభావసంచారీభావములు వివరింపబడినవి. గిరిక చెలికత్తెలతో వెడలిపోయిన తరువాత రాజు"ననవిల్తుఁదేప మానికవుగోనలలో నెలమావికానలో" సంచరించెను. "కనుఁగొంటి లతకూనననని డాయుఁ గాకున్న నభినవతరలతాప్తిఁజూపు (3-82)" నిత్యాది పద్యమున నాతని తరళతాపరితాప విభ్రాంతులు చక్కగా వర్ణింపఁబడినవి. తరువాత నతఁడు భవనమునకరిగి పూసెజ్జపైఁ బరుండి వియోగవేదన ననుభవించెను.

**గిరికన్య మేన నేకీభవించినఁగాని**
**తియ్యవిల్తుని నిరోధింపరాదు.....**

**నేర్పున నటంచు నృపతి యానెలఁత దలఁచి**
**తలఁచి సగమగు, సాత్త్వికోదయ దశాను**
**భావములఁజెందు, మన్మథ ప్రసవబాణ**
**బాణమగ్నతఁ గాంచుఁ, దాపము వహించు.** 3-94

అను పద్యము శ్లేషార్థముతోఁగూడి వసురాజనుభవించిన బాధను భావములను జక్కగా వివరించుచున్నది. తరువాత గిరికావిరహము రసభావపూరితముగా వర్ణింపఁపడినది. ఆమె పొందిన కార్శ్యమును

**పూట పూట శరత్కోటి పొడముకతన**
**విన్ననై యన్నదీకన్య వేణి దూల**
**సన్నగిలియున్న గతి నెన్నఁజనునె యకట**
**యూర్మికలు కంకణాకృతి నొనరెనపుడు”** 3–109

అను పద్యము చెప్పక చెప్పుచున్నది. ఉంగరములామెకు కంకణము లయ్యెను. ఈ పద్యమున నదీపరమైన యర్థముకూడ నున్నది. ఊర్మికలన తరంగములు! కంకణములన నీటి బిందువులు, వియోగబాధ భరింపలేక గిరిక “శృంగారవనికి నరుగ నన్నియుఁ జక్కనౌనని” యచ్చటికేగెను. అచ్చట “ప్రసూనాంబక ధాటీశుక ఘోటీ నికరాటీకనము” వెగ్గలమగుటచే నామె మరణింప నిశ్చయించెను. “పవమాన మానవప్లవమాన కైరవచ్యవమానరజము మైనంటఁదివురు (3–108”) అను పద్యమున కవి “గిరిక పంచశరభూత పరిభూత పంచభూతములఁ దదీయ స్థలంబులఁ గలుపు కరణి”ఁ జేసిన ప్రయత్నము వర్ణించి యున్నాడు. కలువపుప్పొడి, పద్మమకరందము, ఆమ్రకోమలచ్ఛదనార్చి, మలయానిలము, అళిశింజితము అనునవి పృథివ్యప్తేజో వాయ్వాకాశములను పంచభూతములకుఁ జెందిన వస్తువులు, మేను, కన్నీరు, చూపు, ఊర్పు, చెవి అనువానిని గిరిక క్రమముగా పై వానితోఁ గలిపి వేయుటకు యత్నించెను. ఈ పద్యము గిరికావిరహముతోపాటు భట్టుమూర్తి పాండితీభావ గౌరవములను గూడ చక్కగా విశదము చేయుచున్నది. పుష్పాపచయమును జలకేళియు నైనపిమ్మట చెలికత్తెలు మన్మథపూజ కావించి గిరికను రక్షింపుమని యావలరాజును ప్రార్థించిరి. వారాతని నిట్లు శ్లాఘించిరి.

**లోకత్రయీ జగోత్సేకంబుఁ దెల్పు నీ**
**పడగ నారాయణ ప్రథమమూర్తి**
**రెండంటఁ జేయు నీ కాండ చాతురికి నా**
**ద్య నిదర్శనంబు వామార్ధజాని**
**కాంతలననెంత నీయంత ఘనునకింక**
**నళిచికురఁ బ్రోవవయ్య పద్మాక్షిఁగావ**
**వయ్య, శుకవాణిఁ గరుణింపవయ్య పూర్ణ**
**చంద్రముఖి నేచకయ్య యో చక్కనయ్య** 3–177

అనుపద్యము భావపూరితమైనది. గీతమునందలి విశేషణములన్నియు సాభిప్రాయములు. అళులు, పద్మములు, శుకములు, చంద్రుఁడు మన్మథునికిఁ జాల సన్నిహితులు. ఆ సంబంధమును బురస్కరించుకొని యైన తత్సదృశ్యములైన చికురనేత్ర వాఙ్ముఖములుగల తమ చెలిని బ్రోవవలసినదని చెలికత్తెలిందు మన్మథుని ప్రార్థించియున్నారు. మన్మథుఁడు

వచ్చి యెదుట నిల్చినట్లు కనఁబడఁగా గిరిక మూర్ఛిల్లెను. చెలికత్తె లుచితములైన పరిచర్యలొనరించిరి. 'చతుర్థాశ్వాసమునఁగల మన్మథచంద్ర మారుతముల యుపాలంభము గంభీర భావశోభితమై యున్నది.

**రాజీవాక్షుల నేచు పాతకివిచంద్రా! రాజవానీవు నీ**
**రాజత్వంబునఁ జక్రముల్ మనియెనా రంజిల్లి సత్సంతతుల్**
**తేజంబందెనొఁ డిందెనో యహిభయోద్రేకంబు తాఁజెల్లరే**
**రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే రాజౌట దోషార్థమే** 4-27

అనునది చంద్రోపాలంభము. ఇందలి రాజీవాక్షులనుపదము సాభిప్రాయము. శ్లేషపూర్వకముగానిందు చంద్రుని రాజత్వము నిరర్థకమని సూచింపఁబడినది.

**శంబరవైరి వీవు పటుశంబర పోషణశాలి యాతడ**
**బ్జాంబకధారివీవు మథితాబ్జుఁడతండు, నిశాట ఝాటద**
**ర్పంబడఁగించు బల్లిదుని పట్టివి నీవు నిశాటుఁడాతఁడో**
**యంబుచరాంక నీకుఁదగునా హరిణాంకుని తోడికూటముల్** 4-39

ఇది మన్మథోపాలంభము. శ్లేషసామర్థ్యమున నిందు మన్మథ హరిణాంకులకు గల వైరుధ్యము చక్కఁగా సూచింపఁబడినది. ఇట్లే యీ సందర్భమందలి మలయమారుతో పాలంభము కూడ సరసమును భావ పూరితమునై యలరారుచున్నది. నాయికానాయకుల విరహతాపమును వారనుభవించిన భావము కవి చాలచక్కగా వివరించియున్నాఁడు.

ద్వితీయాశ్వాసమున కోలాహలము శుక్తిమతి నడ్డగించినప్పుడు 'నానాజనపద కటకాశ్రయు'లైన జనులరుదెంచి జరిగిన యుపప్లవోపద్రవము నెఱిగించు సందర్భమున కరుణభీభత్సములున్నవి. వారి మొరవిని వసురాజు ససైన్యముగానేగి దుందుభి కబంధుని మీటిన రామునివలె "వనాభ్యంతరరోధకమైన యా మహాద్రిని" నభమున కెగమీటెను. ఇచ్చట వీరాద్భుతములు ద్యోతితములగుచున్నవి. "నావిని నవముని పరమాద్భుత కలనావినివేశమున" మించెనని కవియే యిచ్చట సూచించియున్నాఁడు. ఇట్లే ఇంద్రుని సంకల్పమున వనము పట్టణమైన (5-46) సందర్భమునను, మంజువాణి నభోయానమున నధిష్ఠానపురమున కరిగిన సందర్భమునను (4-59) గూడ నద్భుతరసము స్ఫురించుచున్నది. వసురాజును గిరిక ప్రేమతోఁ జూచు సందర్భమునొక చెలి "ఈ నృపమణి రాకచే నలరి యీగిరికాననమిప్పుడెంత చొక్కపు సిరిఁదాల్చె చూడుఁ"డని మేలమునఁబల్కెను. అప్పుడు గిరిక సిగ్గును రాగపుదమియును మించ ప్రియుని కుచాంచలహారధారలోఁజూడ మొదలిడెను. చెలికత్తెలది గమనించి చిఱునవ్వులొలికించిరి. ఈ సన్నివేశమునందును, పంచమాశ్వాసమున చెలులు గిరిక

నలంకరించునపు డొకకాంత రాగమంఘ్రుల నలరించి "చూచితిరె కొమ్మలు తమ్ము వినాంఘ్రి రాగకందళిఁదగు ధాత్రి నీ యరిదితమ్ము వినోజ్జ్వలమౌళి రంజనాకులము"లని పల్కు సందర్భమునను చమత్కారగర్భితమైన హాస్యము గోచరించుచున్నది. నర్మసచివుఁడు యతివేషము వహించిన సందర్భమున శాంతరసాభాసమున్నది. భట్టుమూర్తి కావ్యాలంకార సంగ్రహమును రచించి రసధ్వన్యాది కావ్యంగములనుగూర్చి నిశితముగాఁ బరిశీలనము కావించిన లాక్షణికుడు. అందుచే నతఁడీకావ్యమున ప్రధానరసమైన శృంగారమును విభావానుభావాది భావముల సమ్యగ్వర్ణనముచే నుదాత్తముగాఁ బోషించి యుండెను.

వసుచరిత్రమందలి పాత్రలలో గిరికావసురాజులును శుక్తిమతీ కోలాహల పర్వతములును, మంజువాణీ నర్మసచివులును, ఇంద్రుఁడును ముఖ్యులు. వసురాజిందతిలోక పరాక్రమశాలిగను, ప్రజానురంజకుఁడైన ప్రభువుగను, గురుదేవతా భక్తిసంపన్నుఁడుగను, మిత్రప్రియుఁడుగను, రసజ్ఞశేఖరుఁడుగను గోచరించును. లాక్షణికుల ధీరోదాత్త లక్షణములన్నియు నీతనియందున్నవి. గిరిక యిందెక్కువగాఁ బ్రసంగింపదు. ఆమె కార్యశూరురాలు. సిగ్గును రాగపుఁదమియుఁగల శృంగారవతి. చెలికత్తెలు హాస్యము చేసినప్పుడామె యించుకకోపమున వారలగదిమి తెరవెనుక కేగెను. ఇదంతయు రాజు చూచుచుండెను. అందుచేతనే "ఆ నగరాజభేదియును నానఁగరాని మనోరథంబుతో మానిని నాత్మనిల్పి" యని కవి మానినీశబ్దము ప్రయోగించి నాఁడు. శయ్యాగృహమున కరిగినపుడు చెలులు గిరికను వీడి యరిగినపిమ్మట నామె "వ్రీడావయస్య వధూటీ లలితాంతరంగచిర సఖ్యాభ్యాస బంధమున నిల్చె" (6-77) నని కవి యామెలజ్జా శీలమును సూచించినాఁడు. చివరికామె "సాహిత్య రహస్య మీశువలనసాధించి తోడ్తోనాతనికి బ్రత్యుపదేశ మొసఁగి" యతుల ప్రౌఢిని బ్రదర్శించెను. మొత్తముమీఁద మనుచరిత్ర పారిజాతాపహరణములను బఠించునప్పుడు వరూధినీప్రవర సత్యాశ్రీకృష్ణులవలె వసుచరిత్ర పఠించినప్పుడు గిరికావసు రాజులు విలక్షణమైన వ్యక్తిత్వముతో పఠితల హృదయముల నాకర్షింపఁజాలరు. మంజువాణీ నర్మసచివుల పాత్రలను నిర్మించుటలో భట్టుమూర్తి చాలనైపుణ్యము ప్రదర్శించెను. వారిరువురును అతనిచే కల్పింపఁబడిన పాత్రలే. మంజువాణి సార్థక నామధేయ. మాయాయతితోడను వసురాజుతోడను ఆమె ప్రసంగించిన తెఱంగిందుకుఁ దార్కాణము. గిరికపై నామెకుఁగల ప్రేమ యపారము. విరహవేదనాదోదూయమానయై వనరునపుడు గిరిక నామె నోదార్చిన విధమును వసురాజుకడకేగి హారము నాతనికొసంగి యుంగరమును దెచ్చినవిధమును ఆమె సమయోచిత ప్రజ్ఞాకార్యకరణ నైపుణ్యములను ప్రదర్శించును. నర్మసచివుఁడు వాక్చాతుర్యమును సమయస్ఫూర్తియుఁ గలవాఁడు. అతని వాఙ్నైపుణ్యములు గిరిక చెలికత్తెల కాశ్చర్యము కలిగించెను. అతఁడు మంత్రప్రభావమున వలె వసురాజును గిరికాదులున్న యెడకు రప్పించుట యపారమైన నేర్పునకు నిదర్శనము. కోలాహలపర్వతరాజు శుక్తిమతిని జూచినతోడనే యామెను

కామించి దానికిఁ దగినశిక్ష ననుభవించెను. తరువాత నింద్రుఁడు గిరిక నడుగుటకై తనదగ్గఱ కరుదెంచినప్పు డాతఁడంగీకరించి యౌచిత్యమును ప్రదర్శించెను. అందుచేతనే

**లోకత్రయ్యభినందనీయ విమలాలోకుండు, సుశ్లోకుఁడా**
**లోకాలోకధరాధురీణుఁ, డతఁడల్లుండయ్యెడిన్ నీతపః**
**పాకంబెట్టిదొకాని పాదనిహతిం బైకొన్న వాఁడంఘ్రి నా**
**ళీక ద్వంద్వ నతుండుగా నెరపఁగల్గెం గల్మియున్ బల్మియున్** 5-25

అని యింద్రుఁడాతని బ్రశంసించెను. శుక్తిమతి విమలవర్తనము కలది. ఆమె కోలాహలుని కోరికనెఱింగి యది యుచితము కాదని హెచ్చరించెను. ఆతఁడు తన్నుఁ జూచుట కరుదెంచినప్పు డామె యుచిత సత్కారములొనరించెను. వసురాజు తనకుఁ జేసిన యుపకృతిని స్మరించి యామె తనసుత నాతనికర్పించుట యామె కృతజ్ఞతను సూచించుచున్నది. వసుచరిత్ర యందలి యుత్తరభాగమున నింద్రున కమితమైన ప్రాధాన్యమున్నది. గిరికావసువుల వివాహమునకు సంధానకర్త యతఁడే. వసురాజునెడ నాతనికిఁగల యాదరగౌరవములు మేదురములైనవి. భక్తపుంజప్రియుఁడని భట్టుమూర్తి వాడిన విశేషణమునాతఁడందు సార్థకమొనరించెను. మిత్రునికి ప్రీతి నాపాదించుటకై యాతఁడు శత్రువుకడకేగి కన్యనర్థించెను. గిరికా జన్మవృత్తాంతమును దానుగాఁజెప్పక మంజువాణిచేఁ జెప్పించుటయందు భట్టుమూర్తి అభిజ్ఞానశాకుంతలమునందలి విధానము ననుకరించియుండెనని యిదివఱకుఁ జెప్పఁబడినది. అట్లే యాతఁడు మంజువాణి వసురాజుకడకేగిన వృత్తాంతమును స్వయముగాఁ జెప్పక తిరిగివచ్చిన పిమ్మట నామెచేతనే చెప్పించెను. వసుచరిత్రమున నాతఁడు నాటకరీతులను జొప్పించిన సందర్భములు కొన్ని యున్నవి. విదూషక పాత్రను సృష్టించుటయు, నాతని మాయాయతివేషమున గిరికాదుల కడకుఁ బంపుటయు నందు ముఖ్యములైనవి. "కనకవల్లి మతల్లికల పెంపు జడగుంపు పుష్పరాగ సంభూతిభూతి" 2-79 ఇత్యాది సీసపద్యమాతఁడు గడిదేరి జడదారి యెట్లయ్యెనో విశదముగా వర్ణించుచున్నది. ఆతఁడు గిరికాదులతో సమయోచితముగ సంభాషించి, మంత్రబలముచే రాజును రప్పించెదనని పల్కి, దెసలాకర్ణించి, మజ్ఝూ యనిన వెంటనే వారి సంభాషణమంతయు లతలచాటుననుండి వినుచు

**"ఇది సంధింపఁగ వేళయంచు వసురాజేంద్రుండు నీరంధ్ర నీ**
**రద వారప్రతిసీర వెల్వడిన తారాభర్త లీలన్ లతా**
**చ్ఛద సంఛాదికఁబాసి....."** 3-45

వారియెదుట నిల్చుట సరిగా నాటకమునఁ బాత్ర ప్రవేశించునట్లున్నది. మఱియు నర్మసచివుఁడు "తదీయ ఘటనావైభవాభంగ రంగ ప్రదేశంబునకుం బూర్వరంగంబు రసోత్తరంబగుట యెరింగితిరి గదా (3-62)" అని చెప్పుట యందలి రంగపూర్వరంగ

పదప్రయోగము కవి నాటక విధానాభిమానమును జెప్పక చెప్పుచున్నది. మంజువాణి వసురాజు భవనమున గంధతైలభాజన భవనప్రదీపకల చాటున దాగుటయుఁ దరువాత నృపమంచస మంచిత యంత్రపుత్రికామండలిలో నొకపుత్రికగా మాఱి పకపకనవ్వి రాజుకంఠమున హారమువైచుటయు, ననంతరము నిజరూపమును దాల్చుటయు నాటకీయ సన్నివేశములను దలపించుచున్నవి. చంద్రోదయమును వర్ణించుచుఁ గవి "హరిదంభోరుహలోచన"లను పద్యమున నాటక సంబంధియైన యుపమానము నొసంగుటకూడ నాతని నాటకాసక్తిని వెల్లడించుచున్నది. ఎడనెడఁ గానవచ్చు సంభాషణలును రాజు వచ్చినపిమ్మట గిరిక చెలికత్తెల హాస్యోక్తులకించుక కుపితయై తెరవెనుక కరుగుటయు, మన్మథ పూజయు, నతని నాటకీయ సన్నివేశకల్పనకౌశలమునకు మఱికొన్ని తార్కాణములు.

నాటకములయందు ప్రస్తావనాంతముననేకాక యంకముల యందుఁగూడ నూతనపాత్ర ప్రవేశము సూచింపఁబడుచుండును. భట్టుమూర్తి వసుచరిత్రమున నట్టిపాత్ర ప్రవేశసూచన చక్కగాఁ గావించియున్నాఁడు. విదూషకుఁడు యతివేషమున గిరికాదుల చెంత కరుగుటకు ముందు,

**గంధగజయాన గీత ప్రబంధకలన**
**నలరి యతి లియ్యమై వచ్చునరిది మగువ**
**లార! కనుఁగొంటిరే యను నాళివాక్య**
**మొకటి విననైన.................** 2-81

అను పద్యమునందలి యతి లియ్యమైవచ్చుట యను ఛందఃశాస్త్రమునకు సంబంధించిన యతిపదముచే మాయాయత్యాగమనము సూచింపఁబడినది. అట్లే గిరిక సిగ్గుచే తెరవెనుకకరిగి "ఈ వనజాతములో మదీయఖేలనములకెల్లఁ దోడయిమెలంగఁగ నా కలహంసి రాదొకో జనని వయస్య" 3-71 యని యనుకొనుచుండఁగనే యా కలహంసి వచ్చుట సంభవించెను. వసురాజుద్యానశోభనుగాంచి యానందించు సందర్భమున భట్టుమూర్తి "కిన్నరద్వయ మన్నిఖిలోక్తివేది కన్యదురాసదమైన యాసన్న శుభంబు"తెల్పి కోలాహల పర్వతమున కరిగెనని వర్ణించి ముందు జరుగఁబోవు గిరాకావసురాజుల వివాహమును సూచించియున్నాఁడు.

"శ్రీ భూపుత్రి వివాహవేళ" అను నారంభ పద్యమునందలి "శుభక్రమాకలనచేఁ దద్రత్నముంగప్పు" అను పదములు వసురాజు కాలిబొటనవ్రేలి గోటిచే కోలాహలమును మీటి వేయుటను సూచించుచున్నవని వ్యాఖ్యాత విశదము చేసియున్నాఁడు.

భట్టుమూర్తి యలంకార శాస్త్రముతోడనే కాక సంగీత జ్యోతి ర్వైద్య భూగర్భాది శాస్త్రములతోఁ గూఢ గాఢమైన పరిచయము కలవాఁడనుటకు వసుచరిత్రమున దృష్టాంతము లనేకములున్నవి. తిరుమలరాయలు తన్నుఁ బిల్వఁబంచెనని చెప్పు సందర్భమున 'సంగీత

కళారహస్యనిధి'నని యాతఁడే చెప్పుకొని యున్నాఁడు. ఆతఁడు రచించిన పద్యములు పెక్కు శ్రవణపేయమైన గమనసౌందర్యముచే నాతని సంగీతకళారహస్యనిధిత్వమును వెల్లడి చేయుచుండును. గిరిక "జాబిల్లి వెలుంగువెల్లికల డాయన్ లేక కాంభోజీరాగ విపంచికా రవ సుధాపూరంబు తోరంబుగా" నేడ్చెనని యాతఁడు చెప్పి యున్నాఁడు. కాంభోజీరాగము కన్నడ, భూపాల మొదలగు వానివలె దైన్యమునే తెలుపదనియు,నది యెంత దీనమో యంత గంభీరమనియు, నందుచేతనే భట్టుమూర్తి గిరికను కాంభోజీ రాగమున నేడ్పించెనని యనభిజ్ఞులు చెప్పుచున్నారు. ప్రథమాశ్వాసమందలి,

> **అరిగాఁబంచమ మేవగించి నవలాలవ్వేళ హిందోళ వై**
> **ఖరిఁజూపం బకజాతమాత్మరవభంగ వ్యాకులంబై వనీ**
> **ధర నాలంబిత పల్లవ వ్రత విధుల్ దాల్పం దదీయ ధ్వనిన్**
> **సరిగాఁ గైకొని యెన్వసంతము మహాసంపూర్ణ భావోన్నతిన్** 1-130

అను పద్యమతని సంగీతకళాపాండిత్యమును చక్కగా విశదీకరించు చున్నది. హిందోళరాగమును శిశిరవసంతసంధిలో బాడుదురఁట! అందలి యారోహణావరోహణములు రిషభ పంచమస్వర వర్జితములు. అందుచేఁ గోకిలలు తమ పంచమస్వరమందు నిషిద్ధమగుటకుఁ జింతించి యాలంబిత పల్లవ వ్రతవిధిని దాల్చెను. ఇంతలో వసంత మరుదెంచి షడ్జరిషభగాంధారములతోఁ గూడిన వసంతరాగము నాదరించెను. అరిగా ననఁ గా శత్రువుగాననియు, రిషభరహితముగాననియు రెండర్థములున్నవి. అట్లే సరిగా ననఁగా నుచితమగునట్లుగా ననియు, రిషభసహితముగాననియు నర్థద్వయమేర్పడుచున్నది. పంచమాశ్వాసమందలి 71వ పద్యమున భట్టుమూర్తి పుణ్యపురంధ్రికామణులు సింధుకన్యకాప్రకట విరహగీతికలు పాడిరని వర్ణించెను. ఇందలి సింధుకన్యకా పదముచే సైంధవరాగము సూచింపఁ బడినది. అట్లే తృతీయాశ్వాసమున వసురాజు గిరికాదుల యెదుటికివచ్చి నిల్చిన సందర్భమున "సారంగరాగ భ్రమన్మద భృంగీరుతి వందిమాగధ కథామాధుర్యమును" దెల్పెనని చెప్పి భట్టుమూర్తి సారంగ శబ్దముచే సారంగనామక రాగవిశేషమును సూచించెను. ఈ విధముగా నాతఁడు పెక్కుచోట్ల వసుచరిత్ర కావ్యమున తన సంగీత కళారహస్యనిధిత్వమును బ్రకటించియుండెను.

> **ఆళి హస్తావలంబనంబదర నడచు**
> **కన్యఁదదధీనవృత్తియై కాంచునట్టి**
> **వసుపతినిరంతరాలోక వైభవంబు**
> **సొగసీదయ్యెఁ గన్నీటిజడి గడంగి** 3-77

అను పద్యము గిరిక చెలికత్తెలతో వెడలిపోవుచున్నప్పుడు రాజు నేత్రములనుదయించిన కన్నీటిచే నామెను జూడఁజాలకపోయెనని చెప్పుచున్నది. సూర్యుఁడు కన్యారాశిలో హస్తానక్షత్రమున నున్నప్పుడు తప్పక జడివాన కురియునని జ్యోతిశ్శాస్త్రవేత్తల సిద్ధాంతము. దానిని పురస్కరించుకొని భట్టుమూర్తి సఖీహస్తము నవలంబించి నడచు గిరికను దదేకతత్పరుడై చూచు వసురాజు చూపును గన్నీరుదయించి సాగనీయలేదని వర్ణించియున్నాఁడు. ఇచ్చట వసుపతియనఁగా సూర్యుఁడని యర్థాంతరము. ఈ సందర్భమునందలి కన్నీరు వసుమహారాజు నకు విరహాతిశయముచే నుదయించిన బాష్పమను సాత్త్విక భావమునుగూడ సూచించు చున్నది.

**రాజకరానుషంగమున రామకరాంబుజమొప్పఁగన్యకా**
**రాజితహస్తయోగమున రాజకరంబు నతిప్రకాశమై**
**రాజిల, రక్షగట్టుక్రియ రాజముఖీ కరపంకజంబునన్**
**రాజకరంబునం గురుఁడొనర్చె సమంత్రక కౌతుకాంకముల్** 6-25

అనుపద్యముకూడ భట్టుమూర్తి జ్యోతిశ్శాస్త్రపాండిత్యమును బ్రకటించుచున్నది. చంద్రకరానుషంగముచేఁబద్మము ప్రకాశింపదు. అట్లే కన్యారాశిలో హస్తానక్షత్రమునఁ జంద్రుడున్నప్పుడతని కధిక ప్రకాశముండదు. అయినను నారెండును సంఘటిల్లునట్లు బృహస్పతి వధూవరులకు రక్షాబంధనమును గట్టెననియుఁ, గన్యకారాజితహస్త యోగమున ననుటచేఁ జైత్రశుద్ధచతుర్దశినాఁడు వివాహము జరిగెననియు, నతఁడు సూచించియున్నాడు. రాజకరమునకుఁ గన్యకారాజిత హస్తయోగమప్పుడే వచ్చును. ఇట్లే గిరికావసురాజుల వివాహము మిథునలగ్నమున జరిగెనని భట్టుమూర్తి వర్ణించియున్నాఁడు. మిథునము యుగ్మరాశి. దాంపత్యము దాని చిహ్నము. "అళిఘటమీనకేసరి శరాసనగోమకరంబులన్" అనుపద్యమున మిథునలగ్నమే యేల కావలసివచ్చినదో యాతఁడుచక్కగా సూచించియున్నాడు. ఈ విధముగా నితరసందర్భములందుఁగూడ నాతఁడు తన జ్యోతిశ్శాస్త్ర వైశారద్యమును బ్రకటించియున్నాఁడు. తృతీయాశ్వాసమున.

**అళినీలాలక కంటె చిల్కభవదీయాలాప లీలాప్తి నిం**
**పలరంగోరి విపక్వదాడిమతరువ్యాలంబి శాఖాఫల**
**జ్వలనావాఙ్ముఖమై తపంబు సవరింపన్ సాఁగె, నేలబ్బెడిం**
**దలక్రిందైన ననూన వాగ్గ్రహణమేధాశక్తి బింబాశికిన్** 3-143

అనుపద్యము సఖులు దానిమ్మపండుపైఁ దలక్రిందుగఁగనిపించుచున్న చిలుకను వర్ణించుచున్నారు. అది గిరికాలాపలీలాప్తిఁ బొందఁగోరి తపము చేయుచున్నట్లున్నదని కవిభావన. బింబాశి యనఁగా దొండపండునుదినునట్టి చిలుక. బింబాశులకు మేధాశక్తి సన్నగిల్లునని వైద్యశాస్త్రము తెలుపుచున్నది. దానిని బురస్కరించుకొని చిలుక యెంతతపస్సు చేసినను గిరికావాగ్విలాసమును బొందఁజాలదని కవి రమణీయముగా వర్ణించియున్నాఁడు.

**కంజ నయనావిలోకన**
**ఖంజనయుగ మెదకు వ్రాలఁగని వసువాలో**
**రంజిలుట దెలిసి శంబర**
**భంజనుఁడతి నిశిత విశిఖపంక్తినగల్చెన్** 3-108

అనుపద్యము గిరికావిరహవేదనను వర్ణించునట్టిది. కాటుకపిట్టలజంట రతిక్రీడకు వ్రాలినచోట భూమిలో బంగారపుగని యుండునని భూగర్భ శాస్త్రజ్ఞుల సిద్ధాంతము. వసువనగా వసుమహారాజు, బంగారమునను రెండర్థముల నున్నవి. విరహవేదనాతిశయమున గిరిక తలవంచి వక్షమును జూచుచుండుట కాటుకపిట్టల జంట యెదకు వ్రాలినట్లున్న దని కవి కల్పన. ఇచట 'నెదకు' అనుపదమునువాడిన విధ మతిరమణీయముగానున్నది. ఆ దృశ్యముజూచి శంబరభంజనుఁడు (మన్మథుఁడు, వ్యాధుఁడు) నిశితబాణముననుసరించి యిటభట్టుమూర్తి కల్పించిన భావమత్యంత మనోహరమై గిరిక యనుభవించిన వేదనా తిశయమును నిశితముగా వ్యక్తము చేయుచున్నది.

శ్లేషకును ధ్వనికిని గొంతభేదమున్నది. శ్లేషమున రెండర్థములును బ్రకృతములే అందు దేనినిగాని విడిచివేయుటకు వీలులేదు. ధ్వనిలో వాచ్యార్థము ప్రకృతమైనను బ్రాధాన్యము వ్యంగ్యమునకే యుండును. ఇచ్చట రెండవయర్థమును సరిగాఁబరిశీలించకపోయినచో రామణీయకాతిశయమే లోపించునుగాని వైయర్థ్యము చేకూరదు. ఈ కారణముచే వసుచరిత్రము నందుఁ బెక్కు పద్యములలో నర్థద్వయము గోచరించినను ధ్వనికావ్యమే కాని శ్లేషకావ్యము కాదని విజ్ఞులు చెప్పుదురు. అందలి రెండవ యర్థమునొప్పరికించినను బ్రకృత వస్తువునకు సంబంధించిన కథ సాగిపోవుచునే యుండును. భట్టుమూర్తి వసుచరిత్రమున శ్లేషధ్వన్యర్థముల సంఘటించుచు నపూర్వములైన భావములను వ్యక్తముచేసియున్నాడు. ఒకటిరెండు దాహరణము లొసఁగెదను.

**అఖిల భువననిరోధకాహార్యరాజ**
**గంధనిర్గంధనునిరాక కలిమినలమి**
**కొన్న యలజడి యుడుగఁ బ్రసన్నయైన**
**యేటికొయ్యన గర్భంబు దేటపడియె** 3-19

భువనమనఁగా జలము, ప్రపంచము. భువననిరోధకమైన వింధ్యపర్వతము గర్వము నపహరించినవాఁడు అగస్త్యుఁడు. అగస్త్య నక్షత్రోదయము కాఁగానే వర్షాకాలము పోవుటయు, శరత్కాలము వచ్చుటయు, నదులు ప్రసన్నసలిలలై కొంతసన్నగిల్లుటయు వాని గర్భముననున్న శిలాదులు బయల్పడుటయు సంభవించును. ఇది వ్యంగ్యార్థము. శుక్తిమతీ జలమును నిరోధించిన కోలాహలపర్వతము యొక్క విజృంభణము నడంచిన వసురాజురాకచేఁ బ్రజలకుఁ గలిగిన యలజడి యుపశమించెననియుఁ దత్పర్వత సంపర్కమువలన శుక్తిమతి గర్భవతి యయ్యెననియు నిందలి ప్రకృతార్థము.

**పతికృతధర్మ కౌశలము పట్టునఁదోడగు నారినారి, దాఁ**
**బితృశరణ ప్రచింతమదిఁ బెట్టక యీశ నివేశితాత్మయౌ**
**సతిసతి,రాశికెక్కి యిన సత్కృతిఁగైకొను కన్యకన్య, శా**
**శ్వతమతినిట్లుగా మనని వామయెవామగదమ్మ కోమలీ!** 6-57

అను పద్యము గిరిక వసురాజుతోనత్తవారింటికేగునపుడు తండ్రి యైన కోలాహల పర్వతరాజు కావించిన యుపదేశముతోఁ గూడి యున్నది. ఇచ్చట ధర్మము,నారి,ఈశుఁడు, సతి,ఇనుఁడు,కన్య,వామ అను పదములకుఁగల యర్థమును బురస్కరించుకొని కవి యద్భుత మైన భావమును బ్రకటించి యున్నాఁడు.

**పదమెత్తం గలహంసలీల యధరస్పందంబు సేయన్ శుభా**
**స్పదమౌ రాగకదంబకంబు శ్రుతిచూపన్ శ్రీవిలాసంబు కే**
**ల్గదలింపన్ సుకుమార పల్లవ నవైలాలక్ష్మి వీక్షింప ష**
**ట్పదియుం బొల్చు తరంబె కన్నెఁగొనియాడ న్గేయ వాక్ప్రౌఢిమన్** 3-59

అను పద్యము శ్లేషసంయుక్తమై గిరిక యంగసౌందర్యసంగీత కళా కౌశలములతోపాటు భట్టుమూర్తి సాహితీ సంగీత పారంగతత్వమును గూడ చాటుచున్నది.

వసుచరిత్రమునందలి పద్యములలో నూటికిఁదొంబదియైదిట్టి శ్లేషధ్వన్యర్థ శోభితములైనట్టివే. అర్థాంతరముతో సంబంధము లేకుండ నాతఁడు అద్భుతమైన భావమును బ్రకటించిన పద్యములు కూడఁ బెక్కులున్నవి.

**పంకజపాణి శంఖపరిభావక కంధర తల్లి యేలకో**
**సంకులు గట్టెనంచుఁ గులశైల సుతాగ్రణి పాయఁ ద్రోచి ర**
**త్నాంకితహారముంప బరువానునొ బిడ్డకివేల కర్క శా**
**లంకృతులంచు హల్లక కలాపములుంచు నదీలలామయున్** 3-31

అను పద్యమున శ్లేషసంబంధము లేదు. అయినను అర్థమెంతో సహజ రమణీయమై భాసించుచున్నది. శుక్తిమతి పసిపిల్లయైన గిరిక కంఠమున శంఖములపేరు వేసెను. ఆమె మెడయే శంఖమును బరిభవించు చుండగా మరల నీ శంఖహారముంచెను. పసిబిడ్డ యీ ఊలబరువు సహింపఁ గలదాయని శుక్తిమతి దానిని దీసి హల్లక కలాపములుంచినది.

**ఆ తన్వంగి యనంగ ఝాంకరణవజ్యాముక్తచూతాస్త్ర ని**
**ర్ఘాతంబోర్వక తమ్ములంచుఁ దటినీ గర్భైక సంజాత కం**
**జాత వ్రాతము మాటుచెంద నవియేచన్ సాగెమున్మున్నుగా**
**జ్ఞాతిశ్ఛేదనలేన కిమ్మనెడి వాచారూఢి సత్యంబుగన్** 3-101

గిరిక మదనచూతాస్త్రనిహతి సైఁపఁజాలక తమ్ములు (సోదరులు, పద్మములు) కదాయని శుక్తి మతీ నదీసంజాత పద్మముల శరణు చొచ్చెను. అవి యామె నంతకుముందే వేధించుటకు మొదలుపెట్టెను. జ్ఞాతియున్నచో నింక వేఱే యగ్నితోఁబనియేమి యను లోకోక్తికిది తార్కాణము. ఇచట తమ్ములను పదము శ్లేషగా వాడి భట్టుమూర్తి యపూర్వమైన భావమును సాధించినాఁడు.

**కొండఁట విల్లు వేదలల కుండలి రాజఁట నారి, యమ్మనం**
**తుండఁట బైటి పల్లియలు దున్మిన వాఁడఁట యొండు రెండు భ**
**ర్గుండిది నిండు పౌరుష మొకో యని గెల్వవె ముజ్జగంబు లు**
**ద్దండత నొక్కతుంట విలుఁదాలిచి యంటినఁ గందు తూపులన్** 3-174

అను పద్యమున గిరిక చెలికత్తెలు పరాక్రమవిషయమున శివునికంటె మన్మథునికిఁ గల యాధిక్యమును వర్ణించియున్నారు. ఇచ్చట బైటి పల్లియలు, ఒండు రెండు, నిండు పౌరుషము అను పదములను వాడిన తీరు అపూర్వ ప్రతిభాశోభితమైనది.

**ఏమేమీ జగతిం గఠోరములు శైలేంద్రంబు లౌఁగాఁ, దదీ**
**యామేయస్మయ భేది యంతకుఁ గఠోరాకారుఁ డౌనేకదా!**
**యామేటిన్ ధృతి వాపి చూపులనె యాటాడించు వారెంతవా**
**రో మీనేక్షణ దానెఱుంగదె తదారూఢ ప్రభావోన్నతుల్** 4-113

అను పద్యమున వసురాజు గిరికవలనఁ దానెంత వేదన ననుభవించు చుండెనో మంజువాణికిఁ దెలుపుచున్నాఁడు. శైలములుకఠినములు, తద్వర్గభేది (వసురాజు) అంతకంటె గఠినుఁడు. అతనిని ధృతివాపి చూపులచేతనే కలఁతనొందఁజేయువారు (గిరిక) ఇంకెంతవారో, చెప్పనలవికాదని యాతని భావము. ఇది యాధారాతిశయసాంప్రదాయముగా, నుచితోత్తరంబుగా, ఘనరసభావ బోధకముగాఁగిలికించితంబుగాఁ" జెప్పఁబడినదని భట్టుమూర్తి యంతకుముందున్న పద్యమున సూచించియున్నాఁడు.

**సిరులు హరింప దంపతులు చెంత నరుంధతిఁ జూచుచోఁబర**
**స్పర నయనాంతముల్ గదియ బాలిక చూపులు పర్వెనప్పుడ**
**ప్పరమసతీ పదాబ్జములపై భవదీయ సువాసినీత్వ వై**
**ఖరిఁ గరుణింపుమంచు విరి గల్వలఁ బూజలు సల్పెనోయనన్** 6-33

వివాహసందర్భమున గిరికావసురాజులు అరుంధతిని దర్శించిరి. అరుంధతి పదాబ్జములపైఁ బడిన గిరిక చూపులు భవదీయ సువాసనీత్వ వైఖరిఁ బ్రసాదింపుమని యామె పూజచేసిన విరిగల్వలవలె నుండెనని యిందలి భావము. చతుర్థాశ్వాసమున వసురాజు మంజువాణి తనకంఠమున వైచిన హారమునుద్దేశించి "కమనీయద్యుతి ధామమా! విమల

ముక్తా రామమా! సేమమా!(4-100)" ఇత్యాదిగాఁ జెప్పిన పద్యములుఁ భావముల విషయమునసేగాక గమన పదప్రయోగముల విషయమునఁ గూడ నసాధారణ సౌందర్య శోభితములై యలరారుచున్నవి. ఈ విధముగా భట్టుమూర్తి గంభీరములు మనోహరములునైన భావములెన్నో వసుచరిత్రమునఁ వ్యక్తము చేసియున్నాఁడు. ఉదాహరణమునకై మూఁడు నాలుగు మాత్రమే సూచింపఁబడినవి గాని యతని పద్యమేదైనను సరసగంభీర భావశోభితమై యుండుననుటలో నతిశయోక్తి లేదు.

మన్మథపూజ చేయు సందర్భమున మన్మథుఁడగ్రభాగమున వచ్చి నిలిచినట్లు తోఁపఁగా గిరిక మారుతపాతితవల్లికాభయై నేల కొఱఁగెను. అప్పుడు చెలులు సంభ్రమించి

**మోహోపదేశ తమోముద్రితములైన**
**కనుఁదమ్ముల హిమాంబులనుపరాదు**
**శ్రమబిందు తారకాగమ ఖిన్న కుచకోక**
**ములఁ జంద్రనామంబుఁ దలఁపరాదు**
**శీర్యదాశావృంత శిథిలితాసులతాంత**
**మసియాడ వీవనల్ విసరరాదు**
**పటుతాప పుటపాక పరిహీణతను హేమ**
**మింకఁ బల్లవపు టార్చిడగరాదు**

**లలన కానంగ కీలికీలా కలాప**
**సంతతాలీఢ హృదయ పాత్రాంతరాళ**
**పూరితస్నేహ పూరంబు పొంగిపొరలఁ**
**జల్లని పటీర సలిలంబుఁ జల్లరాదు.** 3-180

అని పల్కిరి. ఈ పద్యము శబ్దార్థాలంకార సౌందర్యమునకు, శ్లేషకు, ధ్వనికిఁ గూడ నుదాహరణమై యుద్భృతముగానున్నది. గిరికకు నిజముగా శీతలోపచారములు గావింపవలయుననియే చెలికత్తెల యభిప్రాయము. కాని శ్లేషసామర్థ్యముచే వారు వానిని నిషేధించుచున్నట్లీ పద్యమున గోచరించుచున్నది. మోహమను తమముచేఁ గన్నును తమ్ములు ముద్రితములైనవి. పద్మములకును హిమమునకును వైరుద్ధ్యము. హిమపాతముచేఁ బద్మముల శోభ తఱుగును. హిమాంబురూపమైన శీతలోపచార మాచరించినచోఁ గనుఁదమ్ములకు మఱింత హాని చేకూరుననియు, నందుచే నా శీతలోపచారము చేయవలదనియుఁ జెలికత్తెలను చున్నారు. నిషేధముచే నిట విధ్యర్థము వ్యంజితమగుచున్నది. ఇట్లే యన్నిపాదములు నన్వయించుకొనవలెను. ఇందు రూపక కావ్యలింగా లంకారములున్నవి. సలముల నెక్కువగా వాడి భట్టుమూర్తి యీ పద్యమునకొక శ్రవణపేయమైన గతి సమకూర్చినాఁడు. ఇట్లే దృష్టితోఁ

జూచినను హృదయమునకాశ్చర్యానందము లొదవించు పద్యములు వసుచరిత్రమున శతాధికములుగా నున్నవి.

భట్టుమూర్తి తనకుఁబూర్వులైన మహాకవులరచనల ననుకరించియో వానియెడ స్పర్థ వహించియో రచించిన భాగములు వసుచరిత్రలోఁ బెక్కు కనిపించును. గిరికాయవనికాపసరణము శృంగార నైషధమునందలి దమయంతి యవనికాపసరణమున కనుకరణము. ఇంద్రుఁడు విమానమును వసురాజునకొసంగుచుఁ గావించిన వర్ణనము పారిజాతాపహరణము నందలి పారిజాతప్రసూన వర్ణనమును దలపునకుఁ దెచ్చుచున్నది. "ఈసునఁ బుట్టిడెందమున" అను పారిజాతాపహరణమందలి పద్యమునకును "ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల"అను వసుచరిత్ర పద్యమునకును గొంత సామ్యమున్నది. ఇంక మనుచరిత్ర యందలి పెక్కు పద్యములను మించవలెనను స్పర్థతో భట్టుమూర్తి వ్రాసిన పద్యములు వసుచరిత్రలో చాల గోచరించును. "అతను భూతిఘటింపదయ్యెనే చదలేరు" (2-176) "తరువుపొంతఁ బొంచి వసుధావర మిత్రుఁడు గాంచె'' (2-25); ''పవమాన మానవ, ప్లవమాన''(3-118) "ఒకనాడింద్రునియంత" (4-126) మున్నగు పద్యములిందుకుఁ దార్కాణములు. భట్టుమూర్తి పెద్దనకు శిష్యుఁడైనమాట సత్యమే యైనచో "సతి సాహిత్యరహస్యమీశువలనన్ సాధించి తోడ్తోన తత్పతికిం బ్రత్యుపదేశ మిచ్చె"నను పద్యమువలన నతఁడు తనకృతి మనుచరిత్ర కృతికిచ్చిన ప్రత్యుపదేశములను సూచించు చున్నాఁడేమో యనిపించును.

భట్టుమూర్తికిఁగల ప్రతిభా ప్రాభవమువలెనే పదప్రయోగాధికారమును జాలగొప్పది. అతని పాండిత్య మప్రతిమానమైనది. అతఁడు రసభావములచే పాఠకులమనస్సులకాహా పుట్టించునట్లే పదప్రయోగ చాతుర్యముచే నచ్చెరువు కలిగించి వారిచే నోహోయనిపించును. శబ్దార్థాలంకారములకుఁ బ్రాధాన్య మొసంగు కవిత్వము మూఁడవ తరగతికిఁ జెందునని లాక్షణికులు నిర్దేశించియున్నారు. అందుకొంత సత్యము లేకపోలేదు. కాని శబ్దార్థాలంకారములను దనివితీర వాడుచునే రసభావముల కుద్దీపనము కలిగింపఁజాలు మహాకవులు కొందఱున్నారు. అట్టివారిబంతిలో నగ్రస్థానమొసఁగఁదగినవాఁడు భట్టుమూర్తి. ఆర్థికమో శాబ్దికమో యైన యలంకారము లేకుండ నాతఁడు పద్యము వ్రాయఁడు. ఆ యలంకారప్రీతిచే రసభావములకు పుష్టి చేకూరునేకాని నష్టిచేకూరదు. ఇరువంకల పదునుగల కత్తివంటి దాతని ప్రతిభాశక్తి. శబ్దాలంకార ప్రయోగముచే సాహిత్యమునకు సంగీత సౌందర్య మావహించిన మహాకవి యాతఁడు.

**లలనాజనాపాంగ వలనావసదనంగ**
**తులనాభికాభంగ దోః ప్రసంగము** 1-126

అనుమధుమాసవాసర వర్ణనాత్మకమైన పద్యమునెవ్వరో వైణిక శిఖామణులు వీణపై లయబద్ధముగా వాయించిరని ప్రతీతి. "ఏపారుపొదరిండ్ల నాపాటలాశోక దీపార్చి

కనకకలాపమరసె" (1–134); పవమాన మానవప్లవమానకైరవ చ్యవమానరజముమై నంటఁ దివురు'' (3–117) "ఒకచాయ ననపాయ పికగేయ సముదాయ మొకసీమ నానా మయూరనినదము'' (2–7) ''స్వామియై నిగమాతిభూమియై సురపురోగామియై యబ్ధిజకామియుండ" (4–36) మున్నగు పద్యము లన్నియు నిట్టివే. షష్ఠ్యంతముల యందలి

**ఉద్ధతరిపు విద్ధతపన**
**పద్ధతి కరిభవన దవనిపట దంబుధి సం**
**పద్ధరణ సముద్ధరణ స**
**మిద్ధరణరజో వ్రజోద్య దిభమదస్సృతికిన్** 1–80

అనుపద్యమునందలి ధ్వని, మృదంగ నినాదానుకారియై యానందము గొల్పుచున్నది. 'అరిభవనత్' 'అవనిపటత్' అను ప్రయోగములు కవి వ్యాకరణ పాండితీ ప్రౌఢికి నిదర్శనములు, అనుప్రాసయమక ప్రయోగమాతనికి వెన్నతోఁబెట్టినవిద్య.

**శత పత్రేక్షణ వెంట నంటిన వసుక్ష్మాపాలకా లోకముం**
**బ్రతిరోధింపఁగఁజాలదయ్యె భవన ప్రాంతోరు కాంతార వే**
**ల్లిత వల్లీవలయంబు తచ్చికురపాళీ నీరదాళీ మిళ**
**న్నృతి కేళీరస కేకిలోక గరుదున్మీలన్మరుల్లోలమై** 3–75

**మెఱుగొప్పు నెఱిగొప్పు నెఱగప్పు తఱిగప్పు**
**జలద మాలిక చొప్పు తెలుపలేదొ** 3–69

**వీనుల విందై,యమృతపు**
**సోనలపొందై,యమంద సుమచల దళినీ**
**గానముక్రందై యాస్వన**
**మానంద బ్రహ్మమైన నధిపతిపలికెన్** 2–14

**నాళీకాకర తీర సారకదళీ నారంగ పూగావళీ**
**పాళీవాసితమైన కోనఁ గని** 2–29

మున్నగు ననంఖ్యాకములైన పద్యములాతని యనుప్రాసప్రయోగ ప్రావీణ్యమునకు నిదర్శనములు :

**ఏమంద మేమి సేయుద**
**మేమందని మందలింత మేమందమొ యిం**
**దేమందయాన నడుగుద**
**మేమందఱ మనుచుఁ దరళ హృదయాంబుజ లై.** 3–181

**మొనయంగనకా కటకట**
**మొనయం గనకాద్రి ధరుఁడె ముదిత నుపవనా**
**తనుపవనాహతి కొసఁగక**
**తనుపవనా మదన నీయుదంచిత కరుణన్** 3-176

మున్నగు పద్యములు యమకముతోఁగూడి యాసందర్భమునందలి సఖీజనుల హృదయయాందోళనమును చక్కగా విశదీకరించుచున్నవి. ఇట్లు శబ్దాలంకారములపై ప్రీతి ప్రకటించినను అతఁడెచ్చటను ఒక్క వ్యర్థపదమునైన ప్రయోగింపఁడు. అతఁడు పదములను తూచివాడును. సాభిప్రాయపదప్రయోగమున నాతనితో సరివచ్చు వారెందఱో యుండరు. "ధ్యానంబు హృదయవాస్తవ్య కుటుంబికి నావాహనము జగద్వ్యాపకునకు" (3-170) అను సీసమున మన్మథునికి వాడఁబడిన విశేషణములన్నియు గిరికాదులుచేయు నుపచారముల కనుగుణముగా వాడఁబడినవి. "వాతాందోళిత చందనాగురులతా శీతాంశోరమృతార్పణమ్మను క్రియం జేకొమ్ముచేతోభవా" (3-172) అనుపద్యమున చేతోభవాయను సంబోధనము మిక్కిలి సార్థకమైనట్టిది. అది శీతాంశోరమృతార్పణమ్మను లోకోక్తికిఁదగియున్నది. శీతాంశుఁడైన చంద్రుడుఁను చేతోభవుఁడే. భామాశబ్దమునకు కోపపడునది (భామతి కుప్యతి ఇతిభామా) యని వ్యుత్పత్త్యర్థము. అందుచేతనే భట్టుమూర్తి కావ్యారంభపద్యమున సీతాభామాపతియని భామాశబ్దమువాడియున్నాఁడు. సీత నిజమంజీర రత్నమందు ప్రతిబింబితమైన తనయాకృతిని జూచి రామపాదరేణుభవకన్యయని భావించి కోపముచెందెను. "చనవొప్పన్నగి పల్కి... 1-159" అను పద్యమున దోహదక్రియలు వర్ణింపఁబడినవి. వానినాచరించిన కాంతల కందంగ నా శబ్దము ప్రయోగింపఁబడినది. ప్రశస్తములైన యంగములు కలవారే యంగనాశబ్దమున కర్హులగుదురు.

**పుడమి నచలేంద్రులెచ్చట**
**జడవాహిను లెచట, నెచటిసఖ్యము, వినఁజొ**
**ప్పడదు పొడవదరు, మీయెడ**
**నెడపక మారసము లెచటి కెక్కు మహాత్మా!** 2-133

అనుపద్యమున శుక్తిమతి తమకు సఖ్యముకుదరదని కోలాహలునితో చెప్పుచున్నది. కోలాహలుఁడచలేంద్రుఁడు. శుక్తిమతి జడవాహిని. సాప్తపదీనమైన సఖ్యము జడస్వభావము కలవారికి సమకూడఁ జాలదని యాపదములే సూచించుచున్నవి. "అనుకూలఖేలనాయత్తజీవనమైత్రి నదరి నర్మదబోటియై భజింప' (2-106) అనుసీసమున నలువకొలువున కరుగు శుక్తిమతిని గొల్చునదులపేర్లు చెప్పఁబడినవి. ఇందునర్మద, బాహుద, వేత్రవతి, సరస్వతి యను నదులొనరించు సేవలు వారి నామములకుఁ దగియున్నవి.

**అని యఖిలంబుదెల్పి రమణాంగుళి ముద్రిక మంజువాణి యి**
**చ్చిన, నవలా, విలాసమునఁ జేకొని, కైశ్యపయోదపద్ధతిం**
**దనరఁగజేయు, నేత్రనలినంబుల నొత్తు, ఘటించునున్నత**
**స్తనయుగళీ రథాంగములఁ దద్రవితేజము నేకతంబునన్** 4-122

ఇచ్చట ప్రియుని యుంగరము రవితేజము, అనఁగా సూర్యునియొక్క కాంతివంటి కాంతికలది. పయోదపద్ధతి, నలినములు, రథాంగములు అను శబ్దములిందు తదనుగుణమ్ముగా వాడఁబడినవి. ఇట్లాతని సాభిప్రాయ పదప్రయోగమున కెన్నియైన నుదాహరణము లొసంగవచ్చును.

**తమ్ములఁబంపుదు న్మణిశతమ్ములఁబంపుదు రాజహంసపో**
**తమ్ములఁబంపుదుం బరిచితమ్ములఁగానన దేవతాళిజా**
**తమ్ములఁ బంపుదున్ ద్రుతగతమ్ముల నేనును సారణీ ప్రపా**
**తమ్ముల వత్తు విశ్వవిదితా ముదితా మదితాప మేటికిన్.** 6-60

ఈ పద్యమున నత్తవారింటి కేగు కూఁతును శుక్తిమతి తమ్ములనంపెదనని యోదార్చు చున్నది. ఆమె పంపెనోలేదోకాని భట్టుమూర్తి పద్యముననెందఱినో 'తమ్ముల'ను బంపియున్నాడు. 'తమ్ముల' అను నక్షరముల పౌనరుక్త్యముతోఁ గూడిన ఈ పద్యము శబ్దాలంకార పూరితములైన వసుచరిత్రమందలి పద్యములలో సుప్రసిద్ధమైనది. ఇంద్రుఁడు కన్య నడుగుటకు వచ్చునని వయస్యలెఱిఁగించినపుడు భట్టుమూర్తి "పొంగె జనయిత్రి మిన్నందె భూమిధరము" (4-124) అని నది పొంగెననియు పర్వతము మిన్నందెననియు వ్రాయుట పరమౌచిత్య భాసురమైయున్నది. రెండు క్రియలకును సంతోషించెననియే యర్థము.

**అఱమి రమాకుమారుఁడపు దగ్రతలంబున వచ్చి నిల్చిన**
**ట్లతి ముఱిఁదోఁచినన్..............** 3-179

ఈ పద్యమున రమాకుమారుఁడనుపదమువాడుటలో భట్టుమూర్తి ప్రదర్శించిన చమత్కారమనిర్వర్ణనీయమైనది. రమాకుమారుఁడు, మాకుమారుఁడు, కుమారుఁడు, మారుడు, రుఁడు-అను పదము లన్నిటికిని మన్మథుఁడను నర్థమున్నది.

భట్టుమూర్తి వసుచరిత్రమునఁ బెక్కుచోట్ల శాబ్దికములైన చమత్కారములను బ్రదర్శించియున్నాఁడు.

**స్వైరవిహారధీరలగు సారస లోచనలున్న చోటికిన్**
**భోరున లాతివారు చొరఁబూనినచో రసభంగమంచు నేఁ**
**జేరక పువ్వుఁదీవియలచెంతనె నిల్చి లతాంగి రూపుక**
**న్నారఁగఁజూచివచ్చితి నవాంబురుహాంబక నీకుఁదెల్పఁగన్** 2-55

స్వేచ్ఛావిహార తత్పరలగు సారసలోచనలున్న చోటి కన్యలు హఠాత్తుగానేగినచో రసభంగమగునంట! 'సారసలోచనలు' అను పదము నుండి 'రస' పదమును దొలంగించినచో సాలోచనలనుపదమేర్పడును. అనంగా నప్పుడాకాంతలు సాలోచన లగుదురని భావము. లతాంగి రూపు అనుచో రూపనంగా రూపమను నర్థమేకాక అవివాహితలైన కన్నెలుధరించు నాభరణవిశేషమను నర్థముకూడంగలదు. గిరిక రూపు తాను జూచితినని నర్మసచివుండు చెప్పుటచే నామె యవివాహిత యను విషయము సూచింపంబడినది. నవాంబురుహాంబక అను సంబోధనమునకు 1 క్రొత్త పద్మములవంటి నేత్రములు కలవాండా 2 నూత్న మన్మథుడా (పద్మములు బాణములుగాం గలవాండు) 3 పద్మాక్షుండా (విష్ణువా) 4 అగ్ని నేత్రముగాం గలవాండా (శివుండా) పద్మము అంబక (తల్లి)గాం గలవాండా (బ్రహ్మ) అను నర్థములు చెప్పవచ్చును.

**తనకప్పునెతి గొప్పునవె పూని గౌరీస**
**మాఖ్య మించంజనించి నట్టియార్య**
**తన చాపలము చూపులనె చూపి సిరులెల్లం**
**గడంజల్లవచ్చిన కమలపాణి**
**తన పాండిమము నవ్వులనె యుంచి**
**గాంధర్వ మవనికిం దెచ్చిన హంసయాన**
**తనయదృశ్యత నడుమనెతాల్చి**
**సాంగయై మొనసిన యతను సమ్మోహ విద్య**
**గావలయు నీవెలంది దీని కాంతి గుణక**
**ళాభిరూప్యంబులెతీంగించిం యా మహేశు**
**నానగోద్ధారకుని ప్రజాధినాథు**
**నాజగన్మోహనునిందెత్తు ననుచుంజనియె** 2-27

అను పద్యమున గిరిక పార్వతి యనియు, లక్ష్మియనియు, సరస్వతి యనియు, నతను సమ్మోహవిద్యయనియుం జెప్పంబడినది. తదనుగుణముగా గీతమున మహేశ, నగోద్ధారక, ప్రజాధినాథ, జగన్మోహన శబ్దములు ప్రయుక్తములైనవి. ఇందు రూపకోత్ప్రేక్షావిశేషోక్తి పరికరాలంకారములున్నవి. పై శబ్దములన్నియు వసురాజునకుం గూడ నన్వయించును. పైవర్ణన కనుగుణముగా నుండుటకే భట్టుమూర్తి స్వైరవిహారధీరలగు ననుపద్యమున రాజునకు "నవాంబరుహాంబక" యను ననేకార్థస్ఫూర్తిగల సంబోధనవాడి యున్నాండు. పంచమాశ్వాసము నందలి

**జాతికి నెల్ల రాజపరిచర్యయు గాలికి నెక్కుడన్నవి**
**ఖ్యాతియు రాఁ గురంగములు గట్టుననేమి తపంబొనర్చెనో**
**యాతత శృంగ భార రహితాత్మ మహోముఖ కాంతతాప్తినొ**
**రా తనరారె నన్నియుఁ దురంగములై తదభీష్టసంపదన్** 5-43

అను పద్యమున కోలాహల పర్వతముపైఁగల కురంగములు తురంగము లౌట వివరింపఁబడినది. కురంగములు తురంగములగుటకు కకారము తకారముగా మాఱవలెను. ఆతతశృంగభార రహిత..... ఉకారరహిత మైన తమ కురంగశబ్ద ముఖవర్ణమైన కకారము యొక్క (అంతము) లోపము గల తకార ప్రాప్తిచేత నవి తురంగములయ్యెనని భట్టుమూర్తి సమర్థన. కొమ్ములులేని తమ మహోముఖముల యొక్క సౌందర్యప్రాప్తిచేనవి తురంగములయ్యెనని యర్థాంతరము. అట్లే శరదము లరదము లగుటకు విచిత్ర విగ్రహ విశంకటభావము పూనెనని తరువాత పద్యమున నాతఁడు వ్రాసియున్నాఁడు. శరదమునందలి శవర్ణము లోపించినచో నరదములను పదమేర్పడును. దానికై భట్టుమూర్తి యా సమాసమునకు విచిత్రమైన విగ్రహము నిట్లు చెప్పుచున్నాడు.

వి+శ్+అంక+ట అని పదవిభాగ మొనర్చినచో విగతమైన శవర్ణము చిహ్నముగాగల ధ్వని అనునర్థము సమకూరును. టఁ అనఁగా ధ్వని అనునర్థము నానార్థరత్నమాలలో నున్నది. శరదము లందలి శవర్ణము లోపించినచో నరదములు శేషించును. ఈవిధముగా నాతఁడు పదప్రయోగ విషయమునఁగావించిన చమత్కార మపూర్వమై యాశ్చర్యము కలిగించును.

భట్టుమూర్తి ఉపమ, రూపకము, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, కావ్యలింగము, అర్థాంతర న్యాసము, శ్లేష మున్నగునర్థాలంకారములను విరివిగా వాఁడెను. అతని దాలంకారికమైన శైలి. ఇవన్నియు నాతని రచనలో నప్రయత్నముగా సిద్ధించెనని చెప్పఁజాలము కాని ఆతఁడు వానిచేఁగావ్యమునకుఁగలిగించిన ప్రౌఢతా సౌందర్యములు మాత్ర మపారములైనవి. విజ్ఞులు వానికుచితములైన యుదాహరణములను గావ్యమునందంతటను గాంచవచ్చును. పల్గొమ్మలఁ జెందువారలు తగుల్విరి యాటలు నేరకుందురే, భాగ్యాయత్తముల్గా సిరుల్నిక్కమ్ముగఁ దండ్రి చాయగల కన్యలు ధన్యలుగా వసుంధరన్, సంకల్పసిద్ధుల్ గొనన్బలు మేరున్నిరసింప లేజిగురుగొమ్మంజేవ కాకుండునే, వనితావల్లభ జీవితంబులు సఖీవాక్య స్థితంబుల్గదే" మున్నగు నర్థాంతర న్యాసము లత్యంత మనోజ్ఞములు. "ఎవ్వరైనఁ గొండంతవారి కవనిఁగొండంత పూజసేయంగఁగలరె" "శీతాంశోరమృతార్పణమ్మనుక్రియన్" "జ్ఞాతిశ్ఛేదనలేన కిమ్మనెడి వాచారూఢి" మున్నగు లోకోక్తులనుసామెతలను కవి సందర్భోచితముగను సరసముగను బ్రయోగించియున్నాఁడు.

ఎన్ని యలంకారములతోడను చిత్ర చమత్కారములతోడను గూడియున్నను భట్టుమూర్తి శైలి మృదుమధురమును ధారాశుద్ధిశోభితమునై యింపు నింపుచుండును. ప్రతి పద్యమునను

అతని పనివానితనము పుష్కలముగా గోచరించును. రచనా విషయమున నాతఁడు ప్రదర్శించిన శ్రద్ధయు జాగరూకతయు నింతింతని చెప్ప నలవికాదు. అతనిపద్య మొక్కొక్కటియు కమ్మెచ్చునుండి తీగ సాగినట్లు సాగుచుండును. ఆ విషయమున నతఁడుచేసిన సాధనయు సాధించిన సిద్ధియు ననన్యసాధ్యములై నట్టివి. అతని రచన యథేచ్ఛముగాఁ బెరిగి యలిబిల్లిగ నల్లుకొను వనలతల బలుపునుగాక నిత్య పరిశీలనమున తీర్చిదిద్దఁబడు నుద్యానలతల సౌష్ఠవమును దలపించును. అయ్యును సహజత్వమును గోల్పోకుండుట యందలి వైశిష్ట్యము. భట్టుమూర్తి వసుచరిత్రమున నాలుగైదు దీర్ఘవచనములు రచించెను. అవన్నియు వర్ణనాత్మకములైనట్టివి. 1.కోలాహలపర్వతవర్ణన 2.కోలాహలము శుక్తిమతిని నిరోధించుట 3. సరోవరవర్ణన 4. వెన్నెలవర్ణన 5. కోలాహలపురవర్ణన. అవి దీర్ఘసమాసములతోడను, గంభీర భావములతోడను, శబ్దార్థాలంకార సమృద్ధితోడను గూడి యాతనిపాండితీ శౌండీర్యమును పదప్రయోగపాటవమును బ్రదర్శించుచున్నది. వసుచరిత్రమున వృత్తవైవిధ్యమంతగాఁగానరాదు. పుష్పాపచయ సందర్భమున మాత్రము శబ్దాలంకార చమత్కారముతో గూడిన వృషభగతి రగడ యున్నది.

వసుచరిత్ర మసాధారణ సౌందర్యశోభితమును, ప్రతిభా పాండిత్య మండితమును, సర్వలక్షణ లక్షితమునైన ఆదర్శమహా ప్రబంధము. భట్టుమూర్తి కవితా తపస్సు పరిపక్వ ఫలమది.

**భావంబెక్కడ లేక వృత్తనియమాపాయంబుఁ జింతింపకెం**
**దేవర్తించి పరార్థవంచనలచే దీపించి మూర్ఖాళి సం**
**భావింపం గుకవిప్రణీత కృతిసామాన్యాకృతింబూని పై**
**పై వన్నెల్ పచరింప దానిఁ దిలకింపంబోరు ధీరోత్తముల్** 1-11

అని యాతఁడొక విధముగా కుకవినింద గావించెను. భావసంపూర్ణమై వృత్తనియమ జాగరూకమై, సహజార్థశోభితమై, విద్వజ్జనసంభావ్యమై, సుకవి కావ్యము సాధ్వీచరిత్రమువలె నంత సౌందర్యము వెలువరింపవలెనని యాతనియాశయము. ఆ యాశయము వసుచరిత్రలో సమగ్రసిద్ధి పొందినది.

**ముదమున సత్కవికావ్యము**
**నదరఁగ విలుకాని వట్టినమ్మును బరహృ**
**ద్భిదమైతలయూపింపని**
**యది కావ్యమె మఱియుఁబట్టినదియున్ శరమే**

యనునది నన్నెచోడుఁడు "కింకవే స్తస్యకావ్యేన!" అను శ్లోకమునకుఁ గావించిన యాంధ్రానువాదము, శ్లేషధ్వన్యాదులచే నించుక క్లేశము కలిగించినను నిపుణుఁడైన విలుకాని యమ్మువలె హృదయము చొచ్చి తలయూపింపంగల మహాకావ్యములకుఁ దలమానికము వసుచరిత్రము.



ప్రతిపద్యచమత్కృతి చేమకూరవేంకటకవి

# విజయవిలాసము

దక్షిణాంధ్రసారస్వతోద్యానమున ప్రతిపద్యపుష్పమునుండి శబ్దార్థచమత్కృతి సౌరభమును వెదచల్లి విద్వజ్జనమనోబంభరముల కాప్యాయనమొదవించు మనోహర ప్రబంధ పాదపరాజము విజయ విలాసము. ఆకృతిని జిన్నదయ్యు నందచందముల మిన్నయై యది రాయలయుగమునందలి మహాప్రబంధముల బంతిని నిలువఁజాలినది. దానిని రచించినవాడు లక్ష్మణామాత్యతనూజుఁడును, వినయధురీణుఁడును, సకలకళాప్రవీణుఁడునైన చేమకూర వేంకటకవిరాజు. ఇతఁడు తంజాపురాంధ్ర నాయకరాజులలో మకుటాయమానుఁడని చెప్పదగిన రఘునాథభూపాలుని యాస్థానమున కలంకారమై యుండెను. ఈ రఘునాథ నాయకుఁడు శ్రీకృష్ణదేవరాయలవలె సాహిత్యసమరరంగముల రెంటను సార్వభౌముఁడై యవక్రమైన పరాక్రమమునకును. ననన్యసాధారణమైన రసికత్వమునకును బేరుగాంచి యుండెను. ఇతఁడు పలువురు కవిరాజులను బోషించుటయేకాక స్వయముగాఁ బండితుడును గవియునై పెక్కు రసవంతములైన కావ్యములను రచించి యభినవ భోజరాజను సార్థకమైన బిరుదము వహించెను. గోవింద దీక్షితుని పుత్రుఁడును, సాహిత్యరత్నాకరాలంకారరత్నాకర, రఘునాథభూపాలీయములను సంస్కృతగ్రంథములకుఁ గర్తయు నగు యజ్ఞనారాయణదీక్షితునికి గురుత్వము నెఱపెననుటయే యితని పాండిత్యపాటవమును జెప్పక చెప్పుచున్నది. ఈ మహారాజు మన్ననలకుఁబాత్రుఁడై, యాతనిచే హస్తముక్తాకటకాదులగు ననేక బహుమాన ములంది కృతజ్ఞతాపూర్వకముగఁ దారచించిన కావ్యముల నన్నిటి నాతనికే యంకితమొనర్చిన కవిరాజు వేంకటరాజు. కలనయినను రఘునాథునిఁగాక యన్యుఁగొలువననియు, గృతుల నితరులకీక యాతనికే యంకితము చేసెదననియుఁ బలికి జీవితాంతమువఱకు నాతఁ డాప్రతిజ్ఞ చెల్లించియే యుండెను. రఘునాథభూపాలుఁడు 1614 నుండి 1633 వఱకుఁ బరిపాలించియుండుటచే వేంకటకవి కూడ నాకాలముననే అనఁగా 17వ శతాబ్దిపూర్వార్థమున నివసించెనని చెప్పవచ్చును.

వేంకటకవి కులగోత్రములనుగూర్చి మన కంతగాఁ దెలియదు. పూర్వులైన యితరాంధ్ర కవులవిషయము వలెనే యాతనిచరిత్రయు నెఱుంగుట కూహతక్క నన్యశరణము లేదు. ఇతనితండ్రి లక్ష్మణామాత్యుఁడనియు, నితనిపేరు వేంకటరాజనియు నాశ్వాసాంత గద్యలలో వివరింపఁబడియున్నది. కృతిగ్రహించు సందర్భమున రఘునాథ భూపాలుఁడు "క్షత్త్రధర్మమ్మెకద నీకుఁ గలదు మొదల" నని చెప్పినట్లున్నది. వీనిలో మొదటిదానివలన నీతఁడు నియోగిబ్రాహ్మణుఁడనియు, రెండవదానివలన క్షత్రియుఁడనియు దెలియుచున్నది.

ఇది యిట్లుండ నితఁడు భట్రాజనియు, భోగినీసంజాతుఁడనియుఁ జెప్పువారు కొందఱుగలరు. ఇందేది యథార్థమో నిర్ణయించుట కనువగు నాధారాంతరములు కానవచ్చుట లేదు. ఇతఁడు శ్రీసూర్యనారాయణ వరప్రసాదలబ్ధ సారస్వతసుధాసారజనిత యశోలతాంకూరుడని గద్య చెప్పుచున్నది. అందుచేతనే యితఁడు కృత్యాదియందుఁ "దేజోనిధి రఘునాథాధీశు దేజోనిధి నొనరించుఁగాక" యని కృతిపతికి హితమాపాదించు దైవతములలో సూర్య భగవానునిఁగూడ బేర్కొనియుండెను. (1-5) వినయమును, ప్రభువునెడ భక్తివిశ్వాసములును నితనికి సహజముగా వచ్చిన గుణవిశేషములు. ఈ విషయమే

**వాసించు కవితచెప్పిన**
**వీసరవోవొకట భక్తి విశ్వాసంబుల్**
**నీసొమ్ములు సామాన్యుఁడ**
**వే సూర్యవర ప్రసాది విజ్జగ మెఱుఁగన్** అవతారిక - 49

అను పద్యమునఁ జెప్పఁబడినది. కృత్యవతారికలో నీతఁడు రఘునాథునిఁగూర్చి రచించిన పద్యములు రసభావాంచితములై యా మహారాజునెడ నాతనికిఁగల భక్తివిశ్వాస ములను వేనోళ్లఁ జాటుచున్నవి. ఆ పద్యములు మెఱమెచ్చులకై మొగముచూచి చెప్పినట్టివికాక సహజ భక్తిభావప్రేరితములైనట్టివిగాఁ గానవచ్చుచున్నవి. మానవులైన కృతినాయకులయెడ నింత నిసర్గనిర్మలమైన భక్తి ప్రదర్శించిన కవులెందఱో లేరు. ఈ భాగము రఘునాథరాయల విమల యశోవిశేషమునకెత్తిన యుజ్జ్వల వైజయంతికయై యలరారుచున్నది.

విజయవిలాసమందలి కథ సర్వసుపరిచితమైనట్టిది. ఇంద్రప్రస్థపురమును పాండవాగ్రజుఁడైన ధర్మరాజు పరిపాలించుచుండెను. అతనికి భీమార్జున నకులసహదేవులను జన్మలు. వారిలో నన్నలయెడను దమ్ములపట్లను సముఁడైఁ నృపకోటిలో వన్నెయు వాసియుఁ గల్గి ధార్మికుఁడైన యర్జునుఁడు తనరారుచుండెను. ఒకనాఁడు యదువంశభవుఁడైన గదుఁడు కృష్ణుఁడు పంపఁగా కుశలమారయుటకై వచ్చి, ద్వారకయందలి కన్నెల చక్కఁదనములెన్నుచు నేకాంతసమయమున నర్జునునియెదుట సుభద్రసౌందర్యమును వర్ణించి చెప్పెను. అర్జునుఁ డావర్ణనవిని పట్టరానియనురక్తితో నావరవిలాసిని నెప్పుడు చూడఁగల్గుదునో యని తమకించుచుండెను. ఆసమయమున బ్రాహ్మణుఁడొకఁడు తనధేనువును చోరులు హరించిరని మొరపెట్ట నర్జునుఁడు విల్లమ్ములు తెచ్చుటకు ధర్మజుకేళిమందిరమున కరిగెను. ఆకారణముచే పూర్వము చేసికొన్న నియమము ననుసరించి నతఁడొకయేఁడు భూప్రదక్షిణముచేసి రావలసివచ్చెను. అర్జునుఁడావిషయము నెఱిఁగింపఁగా ధర్మజుఁడు గోప్రదక్షిణ మూర్వీ ప్రదక్షిముతో సమానమేకావున నట్లొనర్చి నియమపాలనముచేయుమని పల్కెను. అర్జునుఁడు మానక తన్నుపంపవలెనని ప్రార్థించుటచే ధర్మరాజు తన పురోహితుఁడైన ధౌమ్యునితమ్ముని కుమారుఁడగు విశారదుని, కొందఱు పరిజనులను, ఆవశ్యకవస్తువులను నొసంగి యతని

బంపెను. అర్జునుఁడు బయలుదేఱి పుణ్యతీర్థములఁ గ్రుంకులిడుచు గంగానదినిచేరి యందు స్నానము చేయుచు, దానధర్మము లొనరించుచు, హరికథాశ్రవణ పరాయణుఁడై కాలము పుచ్చుచుండెను. భోగవతినుండి యెప్పుడును భాగీరథికడ కరుదెంచు' నులూపియను నాగకన్య యర్జునునిజూచి, యాతని సౌందర్యము గొనియాడి, రాత్రిసమయమున నతని దమపురము నకుఁగొనిపోయి, మాయయచ్చుపడ నిజాంగణమున నిల్పెను. అర్జునుఁడు జపము సల్పి, కన్నులుతెఱచి, యులూపినిజూచి "నీవెవ్వరిదానవు? పేరేమి? ఇచ్చట నొంటరిగా నివసించుటకుఁ గారణమేమి" యని యడిగెను. ఉలూపి తన వృత్తాంత మెఱిఁగించి యాతని విలాసముగని వరించి తోడ్కొనివచ్చినట్లు తెల్పెను. అర్జునుఁ డచ్చెరువంది "వ్రతినై భూప్రదక్షిణముచేయఁబోయెడి నన్ను గామించితెచ్చుట పాడియా యనియడుగనామె" సాటిలేని విలాసరేఖచే ముల్లోకముల కాంతలను అలయించుటయే నీ వ్రతమా? నీవు భూప్రదక్షిణము చేయవచ్చుటకుఁ గారణమెఱుఁగుదును. మదనుబారికివెఱచి నీ మఱుఁగుఁ జేరితిని. నన్ను జేపట్టి మనుపుము. వలచిన నెలఁత నలఁచుట న్యాయము కాదు. ఎలజవ్వనమంతయు నీకు జన్నియపట్టియున్న కన్యను నేను. నా కోరిక తీర్చి నన్ను మన్నింపుమని పలికెను. అప్పుడర్జునుఁడు "నీవు ఫణిజాతివి నేను మనుజజాతిని, అన్యజాతిఁ బ్రవర్తించుటుచితమగునా" యని పలుక నామె కుశుండు కుముద్వతిని, పురుకుత్సుఁడు నర్మదను బెండ్లియాడిన యుదంతము లెఱిఁగించి తన్ను ధన్యురాలి నొనరింప వేడుకొనెను. అర్జునుఁడంత "నోయింతీ! నావ్రతముచందము తెల్పితినంతేకాని నీ చక్కఁదనము చూచినపిమ్మట నిముసమైనను నిలుపోప శక్యమగునా"యని పలుక నామె యించుక సిగ్గుపడెను. అర్జునుఁడు పర్యంకముమీఁదనే యామె కరగ్రహణమొనరించి యామెతోఁ గ్రీడించెను. ఆమెకు సద్యోగర్భమున నొక కుమారుఁ డుదయించెను. అర్జునుఁ డాతని కిలావంతుఁడను పేరొసంగి, తనకొఱకు హితులును తైర్థికులను నెదురు చూచుచుందురు కావున తానప్పుడే యరుగవలెనని తెల్పెను. ఉలూపి యాతని గంగకడకుఁ గొనివచ్చి మరలి మరలి చూచుచు వెడలిపోయెను. అర్జునుని చూచి యాప్త పురోహితాదులందరు నానందించిరి. అర్జునుడు విశారదునితోఁదన్నులూపి నాగలోకమునకుఁ గొనిపోవుటయు, నామె సౌందర్యమును, భోగవతి యందలి వస్తుచయాభోగమును వర్ణించి చెప్పెను. తరువాత నాతఁడు తన పరివారముతోఁగూడ హిమవత్పర్వతమును జూడనరిగెను. అచ్చట నుండి యతఁడుత్తర దక్షిణ దేశములఁగల పెక్కు తీర్థక్షేత్రములను దర్శించి, దాన ధర్మములొనరించి, పదుమూఁడవనెల పాండ్యరాజగు మలయధ్వజుఁడేలు మణిపురము చేరనరిగెను.

మణిపురమునఁ జెలులతో వనవిహారముఁగావించు పాండ్యరాజకన్యనుజూచి, యామె సౌందర్యమున కలరి యర్జునుఁడామెను విశారదునికిఁ జూపెను. విశారదుఁ డామె మలయ ధ్వజుని కూఁతురైన చిత్రాంగద యని తాను విన్న సంగతి తెల్పెను. ఇంతలో సాయంకాల మయ్యెను. అర్జునుఁ డావనమందలి యొక మామిడిచెట్టుక్రింద కూర్చుండి విరహవేదన

ననుభవించుచుండెను. తరువాత నాతఁడు "మలయధ్వజక్షితీశ కమలహితునకు మామకాఁ గమన వార్త తెలుపు" మని విశారదుని బిలిచి పంపెను. విశారదుఁ డరిగి మంత్రితో నర్జునుని రాక యెఱింగించెను. మలయధ్వజుఁ డెదురువచ్చి యర్జునుని పురమునకుఁ గొనిపోయి యతఁడల్లుఁడైన మిక్కిలి కీర్తికల్గునని భావించుచుండెను. తరువాత నర్జునుఁడు విశారదునితో "శోభనప్రసంగమును సూచించి రాజు తలంపుతెలిసికొని రమ్మ"ని తనభావము తెలిపెను. విశారదుఁడు రాజు కొల్వైయున్న సమయమున నేగి. యాతనిచే సత్కృతుఁడై, యాతఁడు మీరాజేమనినాఁడని యడుగ, నతఁడు మీతో బాంధవమొనరింప గోఱుచున్నాఁడని యెఱిగించెను. అప్పుడు మలయధ్వజుఁడు "మీరాజునకు మా కూఁతును దేవేరిగ నొసఁ గుటకంటె భాగ్య మేమున్నది? తొల్లి మావంశకర్తయైన ప్రభాకరుఁ డనపత్యుఁడై శంకరునిగుఱించి తపమొనరింప నా దేవుఁడు కుమారుఁడొక్కొకఁడుగాఁ గల్గుచుండునని వరమొసంగెను. అప్పటినుండియు మా వంశమున నొక్కొక్క కుమారుఁ డుదయించుచుండెను. నాకుమాత్ర మిప్పుడు కూఁతు రుద్భవించెను. ఆమెకుఁ బుట్టిన కుమారుని మాకులమునకు నాథునిగాఁజేసి కొనవలయును, ఇది మీరు కాదనరాదు. నా దుహితను మీరాజునకు పెండ్లిచేసి నాకు హితమొనగూర్పు"మని పలికెను. విశారదుఁడా మాటలర్జునునికిఁ దెలుప నతఁడందు కంగీకరించెను. వివాహ ముహూర్తము నిశ్చితమయ్యెను. వివాహము వైభవోపేతముగా జరిగెను. అర్జునుఁడామెతోఁ గ్రీడించుచు కాలము గడుపుచుండ నామె గర్భవతి యయ్యెను. నెలలు నిండినపిమ్మట నామెకొక కుమారుఁడుదయించెను. తాతతండ్రులాతనికి బభ్రువాహనుఁ డను పేరు పెట్టిరి. తరువాత నర్జునుఁడాకుమారుని చిత్రవాహనునకు వంశకరునిగా నొసంగి, అతనిని వీడ్కొని తీర్థయాత్రాభిరతుఁడై యరిగెను.

అర్జునుఁడట్లు దక్షిణపుణ్యభూమిఁగనుచు సౌభద్ర తీర్థమున స్నానమొనరించుటకుఁ బోఁగా నచ్చటి మును లిదియాదిగా పంచతీర్థములందును నూఱేండ్లనుండి యుగ్రములైన మకరములు నివసించుచున్నవి. ఎవరికి నిందుఁ జేరరాదు. మీరును బోవల"దని వారించిరి. ఆమాటలువిని, తీర్థములాడవచ్చి యాడకుండ వెనుకకుఁ బోవుట పౌరుషము కాదని యెంచి, యర్జునుఁడందు స్నానమాడఁబోయెను. వెంటనే యాతని నొక మకరము పట్టుకొనెను. అతఁడెడమ కరముతో దానిని బయటి కీడ్చివేసెను. అది మొసలిరూపువిడిచి కోమలియై నిల్వ నర్జునుఁడామె యట్లు మకరమై పడియుండుటకుఁ గారణమేమని యడిగెను. అప్పుడామె "నేను నందయను నచ్చరను. నాకు లలిత, పద్మ, సౌరభేయి, సమీచియను నలువురు సఖులు కలరు. మేము త్రిలోకయానేచ్ఛఁజని యొకవనమునారసి యందొక మునితపమాచ రించుచుండ విఘ్నమాచరింపదలఁచి యాతనిముందు సవిలాసముగా నాట్యమాడుచు నిలఁబడితిమి. అతఁడు కుపితుఁడై మకరులు గండని మాకు శాపమొసంగెను. మేము భయపడి యాతని పాదములపైబడి ప్రార్థించితిమి. అతఁడు జాలిపడి "మీచే గృహీతుఁడై మిమ్మెవ్వడు నీటి నుండి వెల్వరించునో యాతడే మీకు శాపమోక్షకరుడగునని చెప్పిపంపెను. మేమును

తాపమొందుచుఁబోవు చుండ నారదుఁడెదురుపడి మా శోకమునకుఁ గారణమేమని యడిగెను. మేము జరిగినందతయుఁ దెల్పితిమి. ఆతఁడు "మునిశాపమనుభవింపక తీరదు. మీరు దక్షిణాబ్ధితీరమందలి పంచతీర్థములందు గ్రాహరూపములతో శతాబ్దములున్న పిమ్మట నర్జునుండు తీర్థ యాత్రాపరుఁడైవచ్చి మిమ్ముఁ గడతేర్చు"నని పలికి యరిగెను. మే మాతనివలని మాశాపమునకు నూఱేండ్లు పరిమితి యని ఎరింగి, యీ తీర్థములందు మకరాకృతులతో నవయుచు మీరాకకై యెదురు చూచుచున్నాము. మా భాగ్యవశమున మీరరుదెంచి నన్నిట్లు మన్నించితిరి. నా చెలులకుఁకూడ శాపమోక్షమునొసంగి వారలం కృతార్థుల నొనరింపు" డని నిజవృత్తాంత నివేదన పూర్వకముగా వేడుకొనెను. అర్జునుఁ డాతీర్థములకుఁగూడ నరిగి వారికి గూడ శాపవిమోచనమొనరించెను. వారైదుగురు శుభాకారములతో నరుదెంచి యెదుట నిల్వ నర్జునుఁడు వారి చెలువుగని యానందించెను. వారాతని కృతజ్ఞతాపూర్వకముగా ప్రశంసించి

**నీకుఁ కల్యాణమౌ కమనీయరూప**
**నీకు వంశాభివృద్ధియౌ నృపకలాప**
**నీకు జయమగు సాహస నీతిభరిత**
**నీకు సామ్రాజ్యమౌ మహనీయచరిత** 2-75

అని దీవించిరి. అర్జునుఁడు వారినివీడ్కొల్పి, గోకర్ణేశ్వరునిగొల్చి, పశ్చిమసముద్రప్రాంత పుణ్యస్థలులు కాంచుచు, ప్రభాసతీర్థముల కరిగెను. అచ్చటికి ద్వారకానగరము చేరువని విని, సుభద్రను జేపట్టు వాంఛతో, యాదవులు యతులకు విధేయులనియు తన్నన్యులెరుంగ కుండ నుండవలెననియుఁ దలఁచి యతఁడు యతివేషము ధరించెను. తనకోరికకు హలాయుధుఁ డనుకూలుఁడు కాకపోయినను అఘటన ఘటనా సమర్థుఁడైన హరి యున్నాడుకదా యని ధైర్యము వహించి యాతఁడు తత్పాదపద్మము లాత్మఁ దలపోసెను. వెంటనే కృష్ణుఁడాతని యెదుటవచ్చి నిలిచెను. అర్జునుడాఁతని పాదములకు ప్రణమిల్లెను. కృష్ణుఁడాతని కౌఁగిలించుకొని రథముపై ద్వారకకుఁ గొని వచ్చి రైవతకారామవాటియం దాతని విడియించెను.

కొన్నిదినములైన తరువాతఁ గృష్ణుఁడు "రేపు రైవతకాచలోత్సవము జరుప" వలెనని మంత్రులతోఁ బలుక వారన్ని యేర్పాటులును గావించిరి. యాదవులందఱు స్త్రీలతోఁగూడ రైవతకోత్సవమున కరిగిరి. ప్రద్యుమ్నుఁడు, బలరాముఁడు, కృష్ణుఁడు తమతమ కాంతలతోఁ జనినపిమ్మట సుభద్రకూడ బంగరుపల్లకిపై నచ్చటికివచ్చి, ధనంజయుని బతిగాఁదలంచుచు నా దేవత కర్చనలు కావించెను. అర్జునుఁడిష్టసఖులతో వినోదగోష్ఠినున్న యామెనుగాంచి, యామె సౌందర్యమును లోఁ గొనియాడుచుండ, బలరాముఁ డామెను బురమునకనిపి, యర్జునునికడ కరుదెంచి, యాతనివలన నతఁడుకన్న తీర్థక్షేత్రముల విషయమంతయు

నెఱింగెను. పిమ్మట నతఁ డర్జునుని చాతుర్మాస్య మచ్చటనే గడుపవలెనని వేడ నర్జునుఁ డందు కంగీకరించెను. అంతలో కృష్ణుఁ డచ్చటికి రాఁగా బలరాముఁడు తాను స్వాముల నచ్చటనే యుండవేడిన విషయ మెఱిఁగించి వారి నుపవనమున నునిచి సేవకు సుభద్రను నియోగింపుమని పల్కెను. కృష్ణుఁడంత "వీరు యౌవనమున నున్నారు. కన్నెను సేవకు నియోగించుట తగునే" యని పలుక బలరాముఁడు "మున్ను సంయములకు కన్యలే కదా శుశ్రూష యొనరించిరి. సంశయింప కట్లు చేయు" మని పలికెను. కృష్ణుఁడంత మాయాయతిని ద్వారకకుఁ దోడ్కొనివచ్చి సుభద్ర నాతనిసేవకు నియోగించెను. కృష్ణుఁడాయతి యర్జునుఁడే యని రహస్యముగా రుక్మిణీసత్యభామలకు మాత్రము తెల్పెను. అర్జునుఁడు శ్రీకృష్ణుని నగరిచెంతఁగల కన్యాంతఃపుర కేళీవనమున నివసించుచుండ సుభద్ర యాతని కుచితములైన సపర్యలొనరించుచుండెను. అర్జునుఁ డామెనుబట్టఁ దివురుచు సమయమునకై వేచియుండెను. ఒకనాఁడు సుభద్ర భోజనము తెచ్చి వడ్డింపఁగా నారగించి యర్జునుఁ డామెను గాంచి

**చెలువ నిను రాజకీరంబు చెట్టవట్టెఁ**
**గలికి నిను రాజహంసంబుకాలుద్రొక్కె**
**మంచి శకునంబులివిగొ నామాటచూడు**
**కన్నె యీలోనఁ బెండ్లిగాఁగలదు నీకు** 2-159

అని పలికెను. సుభద్ర తాను జేయుసేవకు మెచ్చి వారట్లుపల్కిరని సంతసించి, వారేయే ప్రదేశములు చూచిరో యెఱుఁగఁగోరి,

**మీ రింద్రప్రస్థము గని**
**నారా, పాండవులఁ జూచినారా, సుఖులై**
**వారందఱు నొకచో ను**
**న్నారా, వీరాగ్రగణ్యు నరు నెఱుఁగుదురా!** 2-163

యని యడిగెను. మాయాయతి తాను సర్వతీర్థక్షేత్రములను జూచెననియు, నర్జునునిఁ గూడఁ గనుఁగొనెననియు "ఒక యించుకభేదము లేక యాయనే మేమయి యున్నవారము సుమీ" అనియు పలికి యామె యాతని విషయము గ్రుచ్చి గ్రుచ్చి యడుగఁ దానే యర్జునుడనని తెల్పి తనకోరిక యీడేర్పుమని వేడెను. ఆమె సిగ్గున నటనుండి వెడలిపోవ నర్జునుడు వెంటనంటి యామె కరాంబుజము పట్టుకొనెను. ఆమె యాతఁడు చిలుకతో సుభద్రను జేకూర్చి తన్ను బ్రతికింపుమని పల్కినమాటకు జవాబుగా చిలుకతోడనే" మీ యంత వారిట్లు చేయుట తగునా? పెద్దలెరిఁగి వారే పెండ్లిచేయఁగలరు. వేగిరపాటు వలదని విన్నవింపు" మని పలికెను. అర్జునుఁడు తానాలస్యము సైపలేనని పల్కుచుండ సుభద్ర సఖులరుదెంచు చున్నారని మిష పెట్టి చేయివిడిపించుకొని తప్పించుకొని యంతిపురి కరిగెను. అర్జునుఁడు వియోగవేదన ననుభవించుచు సుభద్ర సౌందర్యమును, చేష్టలను దలంచుచు నెట్లో కాలము పుచ్చుచుండెను.

అట నంతిపురమున సుభద్రయు విరహవేదన నొందుచుండ కృష్ణుని యష్టమహిషు లామెనుగాంచి మేలములాడిరి. సత్య సుభద్రచెలులకా రహస్యమంత యెఱింగించెను. వారు సుభద్రకు శీతలోపచారము లొనరించిరి. సుభద్ర తాపము మఱింతహెచ్చ చెలులు "మరుల్ మరున్మృగాంక మత్తకోకిలాదుల" నుపాలంభించి సుభద్ర నూఱడించిరి. పిదప వారా విషయము దేవకీ దేవి కెఱింగించిరి. కృష్ణుఁ డీవార్త ముందేయెఱిఁగి తల్లిదండ్రులను దమ్ములను ఆత్మజులను బిల్చి వారికి కిరీటి యతియైవచ్చుటయు సుభద్ర యాతనిపై మరులుగొనుటయుఁ దెల్పి "ఈ వివాహము బలరాముఁడెఱుఁగఁ జేయరాదు. అతఁడు సుభద్రను దన శిష్యుఁడైన దుర్యోధనుని కీఁదలఁచి యుండుటచే నిందుకంగీకరింపడు. రేపటినుండి యిరువదినాళ్ళు పశుపతి పూజోత్సవములు జరుగును. నేఁటి కెనిమిదవనాఁడు పెండ్లి ముహూర్తము. వధూవరుల కీవిషయము తెల్పి వివాహవిధులన్నియు నొనరింపుఁడు. లగ్నవేళకు నేనరుదెంతు" నని పలికి పశుపతిపూజకు నంతటఁ జాటఁబంచెను. అందఱును అంతర్ద్వీపమునకరిగి యిందుమౌళి పూజలాచరించుచుండిరి.

ద్వారకయందు దేవకీరుక్మిణులు పెండ్లిపెద్దలై సుభద్రార్జునులను బెండ్లికూఁతురును బెండ్లికొడుకును గావించిరి. సూర్యాస్తమయ మయ్యెను. చంద్రుఁడుదయించెను. కృష్ణుఁడింకను రాలేదేమని సుభద్ర యనుకొనుచుండఁ గృష్ణుఁ డరుదెంచెను. వసుదేవసాత్యకి సారణాదులు కూడా నరుదెంచిరి. అర్జునుఁడు తలఁచినంతనే యింద్రుఁడు కూడ మహర్షులు, శచి, అరుంధతి, అచ్చరలు మున్నగువారుతోడుగా నచ్చటి కరుదెంచెను. వసుదేవుఁడు కూఁతు నర్జునునకు ధారవోసెను. అర్జునుఁడు సుభద్రమెడ మంగళసూత్రము కట్టెను. సుభద్రార్జును లొండొరులపై తలంబ్రాలు పోసికొనిరి. అర్జునుఁడు శచీపురందరులకు మ్రొక్కెను. దేవకి సిగ్గుపడుచున్న సుభద్రచేఁగూడ వారికి మ్రొక్కించెను. దేవకీకృష్ణులా దేవతాదంపతులను వీడ్కొలిపిరి. తరువాత ధనుష్కాండ రథ హయాదులనొసఁగి కృష్ణ దర్జునుఁ బయనముచేసి ధర్మరాజున కొక లేఖవ్రాసి పంపెను. పిమ్మట నతఁడేమియు నెఱుఁగనట్లరిగి బలరామునికడ నుండెను. దేవకి యత్తవారింటికేగు సుభద్ర నూరార్చి, దీవించిపంపెను. చెలులు కొందరఱు దెంచి సుభద్ర నర్జునుఁడున్న రథముపై నెక్కించిరి.

సుభద్రార్జునులు రథమెక్కిపోవుచుండ పృథుశ్రవుఁడాదిగాఁ గల నగరరక్షకులు వారి నెదిరించిరి. అంత నర్జునుఁడు సుభద్రను దేరుగడప నియమించి విల్లమ్ములు గ్రహించెను. పృథుశ్రవుఁడు మొదలగు వీరయోధులు కృపాణపాణులై ధనంజయు నెదిరించిరి. అర్జునుడు వారల నందఱ శరపరంపరలచే వెంపరలాడెను. యాదవ యోధులు భయవిహ్వలులై పరువెత్తిరి. కొందరాయుధములు విడిచి కిరీటికి మ్రొక్కిరి. అర్జునుఁడు సుభద్ర సారథ్యకౌశలమునకు మెచ్చి, యామెనుగౌఁగిలించి విశారదా ద్యాప్త పరివారముఁగలసికొని, కృష్ణ సూచితమార్గమున నింద్రప్రస్థమున కరిగెను. చారులవలన నాతని రాక నెఱింగి ధర్మజుఁడనుప నకులసహదేవు లాతని నెదుర్కొనిరి. తరువాత నర్జునుఁడింద్రప్రస్థమును జేరి, సుభద్ర నంతిపురి కనిపెను,

వారు పెద్దల కభివందనములు గావించి యాశీర్వచనములు గైకొనిరి.

ద్వారకాపురమున సభాపరిపాలకుఁ డర్జునోదంతము యాదవులందఱికిఁ దెలియునట్లు హజారమున భేరి చరపించెను. ఆ శబ్దమువిని యాదవులందఱు పురికరుదెంచి సభాసీనులై యర్జునుని కపట విధానము దెగడి పలికిరి. బలరాముఁడు కోపోద్రిక్తుఁ డయ్యెను. యాదవ యోధులందఱును మహామత్సరులై విజృంభించిరి. అంతఁ కృష్ణుఁడు బలరామునిఁజూచి, యర్జునుని పరాక్రమాదు లుగ్గడించి,కన్యను సేవ చేయుటకుఁ బనుపవలదని మొదటనే చెప్పియుంటినిగదా! ఇప్పుడైనను లోపమేమి? క్రీడితో సమానులీ యిల నెవ్వరున్నారు? అతడే సుభద్రకుఁ దగిన వరుఁడు. ధర్మజుఁడు మిమ్మెంతో గౌరవించును. మన మింద్రప్రస్థమున కేగుదముర౦"దని పలికెను. బలరాముఁడందు కంగీకరించి ప్రయాణమయ్యెను. కృష్ణుఁ డీవృత్తాంత మంతకుముందే ధర్మజునకెఱిఁగించెను. ధర్మజుఁడు తమ్ములు దాను నెదురువచ్చి బలరామునకుఁ బ్రణామములు గానుకలు నర్పించెను. భవనమున కరిగిన పిమ్మట ధర్మరాజు ప్రియభాషణముల బలరాముఁగొనియాడ నాతఁడెంతయు సంతసించెను. అర్జునుని బెండ్లికుమారునిగను, సుభద్రను బెండ్లికూతురుగను జేసిరి. వివాహమహోత్సవము వైభవముగా జరిగెను. అయిదునాళ్ళు గడచినపిమ్మట సుభద్రార్జునులు గృహాభ్యంతర దేవతల కెరగి కృష్ణునకు మ్రొక్కిరి. అతఁడు మీరిటు లెల్లకాలమును శోభనము మీఁదనె శోభనమై మింతురుగాక యని దీవించెను. తరువాత నర్జునుఁడు కేళీగృహమున కరుగ, సఖులు సుభద్ర నలంకరించి యచ్చటికిఁ గొనివచ్చి, కన్నియహస్తము నర్జునుని హస్తమునఁ జేర్చి యొక్కొక్క రొక్క మిషతో వెడలిపోయిరి. సుభద్రార్జునులు యథేచ్ఛముగాఁ గ్రీడించిరి. కొన్నాళ్లకు సుభద్ర గర్భవతి యయ్యెను. నెలలు నిండినపిమ్మట నొక శుభలగ్నమున నామె యొక కుమారునిఁగాంచెను. అర్జునుఁడు శుభలేఖ పంపఁ కృష్ణుఁడు సాత్యకి బలరామాదులతో నింద్రప్రస్థమున కరుదెంచెను. అర్జునుఁడు కుమారుని కభిమన్యుఁడని పేరుపెట్టెను. కృష్ణుఁడు చెల్లెలికిని మఱఁదికిని మేనల్లునకును ననర్ఘమణిమయాభరణములు గానుకగా నొసంగెను. అభిమన్యుడు క్రమముగా యౌవనము పొంది, తన తండ్రుల వలన సమస్తవిద్యల నెఱింగి, విద్వజ్జనగేయుడై యలరారెను.

విజయ విలాసమునందలి యీ కథకు మూలము భారతాదిపర్వములోని సుభద్రా వివాహము. అర్జునుఁ డులూపి యనునాగకన్యను, చిత్రాంగద యను మణిపురాధీశ్వరుని కుమారిని, శ్రీకృష్ణ సోదరియైన సుభద్రను వివాహమాడి అనుభవించిన విలాసమే యిందలి వృత్తాంతము. ఈ విలాసమునకుఁ బ్రసక్తానుప్రసక్తముగా సౌభద్ర తీర్థమాదిగాఁగల పంచతీర్థములలో మునిశాపవశమున మొసళ్ళై పడియుండిన నందాదులకాతఁడు శాపవిమోచన మొసంగిన విక్రమమో విలాసమోకూడఁ జేర్చఁబడినది. ఏతత్కథా చతుష్టయముతోఁ గూడిన విజయవిలాసమున నా నాల్గింటనుగూడ నర్జునుఁడే నాయకుఁడై యుండుటతక్క వేఱొక్క యైక్యములేదు. రమణీయములైన యీకథారత్నములనర్జునుఁడను సూత్రమున జారుతరమైన

హారముగాఁ గ్రుచ్చఁబడినవి. భారతమునఁగూడ నీ కథ లీవిధముగానే యున్నవి. కాని వేంకటకవియందు సుమారుగా నొకవంద సంఖ్య గల పద్యములను మనోహరవర్ణనాదులచేఁ బెంచి సార్థషట్ఛత పద్య పరిమితమైన హృద్యప్రబంధముగా సంతరించెను. మూలమునందలి కథకు వన్నెచేకూర్చుటకై వేంకటకవి కావించిన మార్పులు కొన్ని గలవు. అందుముఖ్యమైనది కావ్యమునందలి వస్తువునకొక విధముగా నైక్యసంధానము గావించుట కుపయోగించు గదకృత సుభద్రావర్ణనము. ఈ ప్రసంగము మూలమునఁగూడ నత్యల్పముగా నున్నది. పంచతీర్థముల నచ్చరలకు శాపమోక్షము కావించినపిమ్మట నర్జునుఁడు ద్వారక కరుగుటకు రెండు కారణములందు సూచింపబడినవి. అందొకటి యర్జునుఁడు మిత్రుడైన యరవిందనాభునిఁ గాంచి జన్మము సఫలమొనరించుకొనుట. రెండవది "మున్ గదుఁడనువానిచేఁ దిలోత్తమకంటె రూపవతియు, సద్గుణాన్వితయు" నని వినియున్న మేనత్తకూఁతురైన సుభద్రను జూచువేడుక, దిఙ్మాత్రముగా సూచింపబడిన యీ విషయమునకుఁ బ్రాధాన్యము కలిగించి వేంకట కవి కథారంభమునఁ బురచాతుర్వర్ణ్యాదుల వర్ణనమైన యనంతరము కృష్ణప్రేషితుఁడై గదుడింద్రప్రస్థపురంబున కరుదెంచి "యేకాంతము వేళ ద్వారవతి యందలి వార్తలుదెల్పుచున్ దటిత్కాంతి మనోహరాంగులగు కన్నెల చక్కఁదనంబు లెన్ను సందర్భమున" సుభద్రా సౌందర్యమును సమగ్రముగా వర్ణించు ప్రసక్తి కలిగించెను. గదుఁడు సుమారు పదిపద్యములలో సుభద్ర రామణీయకమును వర్ణించి యందు శతాంశమైనఁ జెప్పఁజాలకపోతినిగదా యని విచారించెను. ఆ యఱగొఱవర్ణనము నాలించియే యర్జునుఁ "డంగన ముంగలనిల్చినట్లును దాగనుఁగొనినట్లును భావించి డెందమునందుఁ బట్టఁజాలని యనురక్తి నవ్వరవిలాసినినెన్నఁడు చూడఁగల్గుదునో యని తమకింప" మొదలిడెను. సరిగా నాసమయముననే చోరహృత భూమీదివిజధేను ప్రసంగమువచ్చుటయు నాతఁడు కోదండసాయకాహరణమునకై ధర్మజు కేళిమందిరము దండకేగ పూర్వక్లిప్తసమయ న్యాయానుకూలముగా నొకయేఁడుర్విప్రదక్షిణం బరుగు నుద్యోగమునకుఁ బూనుటయు సంభవించెను. లేనిచో నాతడేదో మిషకల్పించి గదునితోడనే ద్వారకకుఁ గదలియుండునేమో!

విజయవిలాసమున మూలకథానుసారముగా నాలుగు కథలు చెప్పఁబడినను అందుఁ బ్రధానమైనదియు నర్ధాధికభాగ వ్యాప్తమైనదియు సుభద్రా వివాహప్రసంగమే. అర్జునుని జీవితమునందువలెనే విజయవిలాసమునందుఁగూడ నత్యంత ప్రాముఖ్యముగల దీవృత్తాంతము. వేంకటకవి దీనినే యిందుఁ ప్రధానముగా వర్ణింపఁదలఁచి మూలమున నున్నవికదా యని ప్రసంగవశమున నితరవిలాసములను గూడ నుపకథలుగా ముందు చొప్పించెను. అందుచేతనే యాతఁడు సుభద్రార్జునుల ప్రణయవల్లికకు బీజమైన సుభద్రా సౌందర్యవర్ణనముతోఁ గావ్యము నారంభించి దానికి ఫలమని చెప్పఁదగిన యభిమన్యు జననముతో దాని నంతమొందించెను. ఈ విధముగా వేంకటకవి యీ కావ్యమున నైక్యానుసంధానము కలిగింప ప్రయత్నించినను ఏ తత్కావ్యకథా సంవిధానమును

బురస్కరించుకొని చూచినచోఁ గొంచెము దీర్ఘతరములుగానే గోచరించు నులూపీచిత్రాంగదా వివాహవృత్తాంతములు సుభద్రాసౌందర్య వర్ణనము బీజావాసమునకును సుభద్రాదర్శనమను నంకురోద్భేదమునకును సహింపరాని వ్యవధానము నాపాదించుచునేయున్నవి, ఇట్లుగాక యా వృత్తాంతములను సూచించి మాత్రము విడిచినచో నీకావ్యవస్తువున నైక్యము మఱింత ప్రశంసనీయముగా నమరి యుండును. విజయనాయకత్వముచేఁ గలుగు నైక్యమే చాలునని తృప్తిపడినచో మొదట యాక్షేపణమున కవకాశ ముండదు.

వేంకటకవి కావించిన రెండవమార్పు విశారదపాత్ర ప్రవేశనము. అర్జునుఁడు వేదాంగవిశారదులైన బ్రాహ్మణులను వివిధకథాకథన దక్షులైన పౌరాణికులను దనకు సహాయులుగా దీర్థయాత్రకు బయలుదేఱెనని మూలముచెప్పుచున్నది. విజయవిలాసమున ధర్మజుఁడర్జునునితోఁ "దనదు పురోహితుండయిన ధౌమ్యుని తమ్ముని గారవంపు నందనుని విశారదున్ సకలధర్మ విశారదువెంటఁ బోవఁగా నొనరిచి కొందఱన్ బరిజనోత్తములన్ నియమించి, యాదరంబెనయ సమస్తవస్తువులు నిచ్చి," యాతనిఁ బ్రయాణముచేసె నని వర్ణింపబడినది. పురోహితానుజ తనూజుఁడైన యీవిశారదుఁడు కేవలము ధర్మ విశారదుఁ డేకాదు. నర్మవిశారదుఁడు కూడను. అతఁడు హావభావ పరిణామవిదుఁడైన సరసాగ్రేసరుఁ డని వేంకటకవి చిత్రణము. ఈతఁడు చిత్రాంగదా వివాహసందర్భమునఁ గొంతదౌత్యము నెఱపెను. సంస్కృతనాటకమందలి విదూషకులు నాయకులకువలెనే యీతఁడిందు నాయకుఁ డైన యర్జునునికి మనోరథప్రాప్తివిషయమునఁ జాలవిధములఁ దోడ్పడెను. సంస్కృత నాటకములందలి విదూషకులకు సాధారణములైన మూర్ఖతాకుక్షింభరిత్వములు వినాగా నితరగుణ గుణములన్నియు నీతనియందున్నవి. అమూలకమైన యీ పాత్ర ప్రవేశమునకు విజయవిలాసమునందలి యీ ఘట్టమునకుఁ గొంత సొంపు చేకూర్చినది.

అర్జునుఁడు చిత్రాంగదా వివాహానంతరము బభ్రువాహన జననమునకుఁ బూర్వము మణిపురమునకు సమీపమునఁగల సముద్రతీరమునందలి తీర్థములఁ జూడనరిగి యటనందాదులకు శాపమోక్ష మొసంగి తిరిగి మణిపురంబున కరుదెంచి చిత్రాంగదయందు బభ్రువాహనునిఁ గాంచెనని భారతమునఁ గలదు. విజయవిలాసమున నాతఁడు బభ్రువాహన జననాంతర మతనిఁ జిత్రవాహనునకు వంశకరునిగా నొసంగి, వారిచేతఁ బంపకముగాంచి తీర్థయాత్రోద్యోగమును గొనసాగించుచు నందాదులకు శాపమోక్షము నొసంగెనని చెప్పఁ బడినది. వారిని శాపవిముక్తుల నొనరించినపిమ్మటఁ నతఁడు మరల మణిపురమున కరిగియుండలేదు. విజయవిలాసమునందు ప్రధానమైన యీ కథను సంగ్రహించు నుద్దేశము చేతను అర్జునుఁడు విలాసలాలసుఁడై తిరిగి మణిపురమునకరుగుట తీర్థయాత్రా చరణమున నాతనికిఁ గల యభినివేశమునకు లాఘవము కలిగించునను నుద్దేశము చేతను వేంకటకవి యీ మార్పుచేసియుండును. మణిపురమునకు రాకముం దర్జునుఁడు గోదావర్యాదుల దర్శించెనని నన్నయ కావించిన వర్ణనము సంస్కృతభారతమున లేనిదగుటచేఁ గాఁబోలు వేంకటకవి విడిచివైచెను.

నన్నయభట్టు రచనమున నులూపి యర్జునుఁని బ్రభాత సమయముననే నాగపురము నకుఁ గొనిపోయెనని కలదు. అతఁడప్పటినుండి మఱునాఁటి యుదయమువఱకు నచ్చటనే యుండినట్లు దానివలనఁ దెలియుచున్నది. ఇందౌచిత్యమును సహజత్వమును గొఱవడియుండుటచే వేంకటకవి యామెయర్జునుని "మాపటివేళం గను బ్రామి చొక్కుఁ జల్లిన యనువున నందఱు వితాకులై యుండగన్" తన పురమునకుఁ గొనిపోయెనని వర్ణించెను. ఉలూపి యర్జునునిఁ దననగరమునకుఁ గొనిపోయిన ప్రయోజనమును బురస్కరించుకొని చూచినచో నీమార్పెంతయుఁ బ్రశంసనీయమై యొప్పారును.

వేంకటకవి భారతమునందలి కథకుఁ బ్రబంధోచితములైన వర్ణనాదులు చేర్చి దానిని జాలఁబెంపొందించెనని మొదటనే చెప్పఁబడినది. ఈ పెంపు సుభద్రార్జున వివాహఘట్టముననే యధికముగాఁ గాన వచ్చుచున్నది. అందును యతియైన యర్జునునకును సుభద్రకును జరిగిన సంభాషణమును వేంకటకవి సరసగంభీరభావములతోఁ బెంచి నిసర్గ రమణీయముగా సంతరించెను. "నేనే యర్జునుఁడ"నని యర్జునుఁడు తన్ను సుభద్ర కెఱింగించినభాగము మూలమున నతిసంక్షిప్తమై యొక్క మాటతో ముగిసిపోయినది.

ఈ విధముగా వేంకటకవి విజయవిలాసమున భారతకథ కనేక విధముల వన్నెచేకూర్చెను. నిజముగా నర్జునుఁ డింద్రప్రస్థమునుండి బయలు దేఱినది ప్రాయశ్చిత్త రూపమైన తీర్థయాత్రాచరణము కొరకె కాని విలాసానుభవముకొఱకు కాదు. కథయుఁ జోరహృత భూదివిజ ధేనూదంతముతోనె యారంభించుచున్నది. అదిలేనిచో నర్జునుఁడు భూప్రదక్షిణ మేగవలసిన యక్కఱగాని యాసందర్భమున నీవిలాసము లనుభవించుట కవకాశముగాని కలుగకయే యుండును. ఇంత ప్రధానమైన యీ విషయమును మరల నల్పముగానైన సూచింపక కవి కావ్యమును ముగించుట యావృత్తాంతము సమగ్రముగా విడిచివైచి నట్లున్నది. కావ్యాంతమున సంవత్సరపరిమితమైన యాప్రాయశ్చిత్తము కూడ ముగిసెనని చెప్పియుండినచోఁ గడుంగడు నుచితముగా నుండి యుండును.

విజయవిలాసమను పేరుగల యీ కావ్యమున నందాదుల శాపవిమోచన వృత్తాంతమునకుఁ దగినంత ప్రసక్తియే లేదు. ఇది యొక విధముగాఁజూసిన విక్రమమేకాని విలాసముకాదు. అర్జునుఁడు సౌభద్ర తీర్థమున గ్రుంకఁబోఁగనే మకరాకృతికన్న నంద యాతనిఁ బట్టుకొనెను. అంత నాతఁ "డెడమ కరముననే యయ్యెడ మకరముఁబట్టి" బైటి కీడ్చివైచెను. అంత నది మకరరూపమువిడిచి యచ్చరయై తన యొక్కయుఁ దన చెలులయొక్కయు వృత్తాంతము లెఱింగించి వారికిఁకూడ శాపమోక్షము ప్రసాదింపుమని ప్రార్థించెను. అర్జునుఁడామెకోరిక నెఱవేర్చెను. అట్లచ్చరల యాకృతులుగాంచిన యా యైదుగురు నతని ననేకవిధముల నుతించి దీవెనలొసంగి యమరనగరమున కరిగిరి. ఈ కథ యెంతసంక్షిప్తముగానుండిన నంత యౌచిత్యము శోభిల్లి యుండును. కాని యొకందుకు

మనము సంతోషింపవలయును. వేంకటకవి యర్జునుఁ డర్ష్వయోవిలాసములుగల మచ్చెకంటులు లభించుచోఁ దన రసికత ప్రదర్శింపక విడిచిపెట్టు వాఁడుకాడు. నంద కోమలియై యెదుట నిలఁబడఁగానే యతఁడిది యచ్చరప్రోయాలో కాకల్ల మరునియాలోయని యామె సౌందర్యమును బ్రశంసింప నారంభించెను. మఱియాయచ్చర తనచెలికత్తెల పాటు నెంచి తల్లిడపాటు నొందుచుండుటచేఁ గాబోలు నాతని విలాసలాలసతకు దోహద మొసంగినదికాదు. ఆమె చెలికత్తెలును శాపవిముక్తులై నందంగూడి కృతజ్ఞతాపూర్వకముగా నాతనిస్తుతించి శుభోదర్కములగు దీవెనలొసంగి వీడ్కొనిరి. లేనిచో విజయవిలాసమున నున్న యామూఁడు విలాసములకు మఱి యైదు విలాసములు కూడ మనమెనిమిది విలాసములుచదివి విచారింపవలసిన వారమై యుందుము.

విజయవిలాస మనఁగా విజయుని విలాసముల నధికరించి వ్రాయఁబడిన కావ్యమని యర్థము. విజయుఁ డులూచీ చిత్రాంగదా సుభద్రలను వివాహమాడి వారితోఁగావించిన విలాసములే యిందలి ప్రధాన విషయము. అతఁడు నందాదులకు శాపమోక్షమొసంగుటయు నొక విలాసమే. అందుచే కవి శ్రీనాథుని హరవిలాసమును దృష్టినిడుకొని తన కావ్యమును విజయవిలాసమని పేరుపెట్టెను. ఉపసంహృతి యందలి విషయమునుబట్టికూడ కావ్యమునకు పేరుపెట్టవచ్చును. అర్జునుఁడు కావ్యాంతమున యాదవవీరులనోడించి విజయ విలాసముతో నొప్పారెను. అదియుఁగవి కావ్యమునకీ పేరు పెట్టుటకుఁ గారణమై యుండవచ్చును. అతడు తన కావ్యమునకుఁ బేరుపెట్టు సందర్భమున నర్జునుఁడుగాంచిన వినయమును స్మృతియందుంచుకొని యర్జుననకుఁగల పదిపేరులలో విజయనామమును గ్రహించెను. వియజవిలాసమనునప్పుడు ‘వి’ వర్ణ పునరుక్తిచేఁ గలుగు శ్రుతిసుభగత్వముగూడ నాతని నీనామమునుగ్రహించుటకుఁ బ్రేరేచియుండును. అదిగాక రాయలవారిసభకు భువన విజయమను పేరున్నట్లే రఘునాథనాయకుని సభకు విజయభవనమను పేరుండెనట! రఘునాథ నాయకాభ్యుదయమునందలి “విజయ చిహ్నములచే వెలయుచుచున్న విజయభవన రాజవేదికాస్థలిని” అను వాక్యమును, విజయవిలాసమునందేకల “చెలులు ప్రసంగవశంబున నలరెం గడు విజయభవనమనిన న్నవలా తెలియ వినున్” (3–26) అను వాక్యమును, ఈ విషయమును సమర్థించుచున్నవి. రఘునాథనాయకుఁడు పాండ్యతుండీరనేపాళచోళ రాజ్యములపై దండెత్తి విజయముగాంచిన పిమ్మట విజయభవనమున నీకృతిని గైకొనియుండుటచే నావిజయమును, ఆ విజయభవనమును స్మృతికిఁదార్చునట్లుగా వేంకట కవి తనకావ్యమునకు విజయవిలాసమని పేరు పెట్టియుండునను విమర్శకుల యూహ సమంజసముగానే యున్నది. వేంకటకవి యీ కావ్యమునఁ బెక్కుచోట్ల ధర్మజునితో,

నర్జునునితో, రఘురామునితో, రఘునాథనాయకుని కభేదాధ్యవసాయము తోఁచునట్లు పద్యములు రచించియున్నాఁడు.

అన్ని ప్రబంధములవలె విజయవిలాసమును వర్ణనప్రధానమైన కావ్యమే. అది యింద్రప్రస్థపుర వర్ణనముతో నారంభించుచున్నది. కవి యందలి చాతుర్వర్ణ్య ప్రాకార, పరిఖా, సౌధ, గజ, తురగ, పదాతి, మరు, త్పుష్పలావికా, వేశ్యా, వృక్షాదులను మనోహరముగా వర్ణించియున్నాడు. ఇందునాయికానాయక వర్ణనము నాలుగైదు చోట్ల నున్నది. గదుడింద్రప్రస్థమున కరుదెంచి యర్జునుని యెదుట సుభద్ర సౌందర్యమును వర్ణించెను. అర్జునుఁ డులూచిని జూచినప్పుడామె ముఖనేత్రనాసికా ద్యంగముల చెలువు వర్ణించి తరువాత మరల విశారదుని కామెసౌందర్యమును వివరించెను. వనవిహారమొనర్చు చిత్రాంగదను జూడఁ గనే అర్జునుఁడామెను వర్ణించెను. చిత్రాంగద పెండ్లికూఁతురై వచ్చినప్పుడు చూపరులామె యందమును గొనియాడుచు

**హరిపతి నడుమునకోడెన్**
**గరువపు నడవునకునోడె గజపతి యిఁకనీ**
**నరపతి లోనగు టరుదే**
**వరవర్ణిని మెఱుఁగువాడి వాల్చూపులకున్** 2-17

అని పల్కిరి. హరియనఁగా గుఱ్ఱము సింహము అను రెండర్థములు నున్నవి. ఈ పద్యమున నశ్వపతి, నరపతుల మువ్వురి ప్రసక్తియు నున్నది. ఆమె మధ్యగత్యాలోకములచే మువ్వురిని జయింపఁజాలెను. నరపతి యన నర్జునుఁడని ప్రకృతమైన యర్థాంతరము. నంద మొసలిరూపమును విడిచి కాంతరూపము నొందగనే యర్జునుఁడామె సౌందర్యము పొగడెను. రైవతకాచలోత్సవమున కరుదెంచిన సుభద్రను జూచి యర్జునుఁడు మున్ను గదునివలనఁ దాను విన్నదియు నప్పుడు స్వయముగాఁగన్నదియు నొక్కతీరైయుండుట కాశ్చర్యమొంది యామె యందము కొనియాడఁదొడగెను. సుభద్ర పట్టువిడిపించుకొని పోయిన తరువాత నర్జునుడు విరహబాధ నొందుచు 'అర్జునుండను నేనెయని తెల్పినంతనే మట్టిమీనైపడె మెలఁతచూపు, (3-12) అని యామె వీక్షణాదులను వర్ణించిన పద్యమద్భుతముగా నున్నది. తృతీయా శ్వాసాంతమున గర్భవతియైన సుభద్ర వర్ణనము కలదు (228). అర్జునుని వర్ణనము కూడ కావ్యమున నాలుగైదుచోట్లఁ గానిపించును. ఈ వర్ణనములందు శబ్దచమత్కార నవ్యతయే కాని భావవైవిధ్యము లేదు. ఇందుకావర్ణనల పునరుక్తియే కారణము. కవి యర్జునుని సన్యాసి వేషమును,

**మృగనాభి తిలకంబు బుగబుగల్గల లలా**
**టముపై మృదూర్ధ్వ పుండ్రంబు దీర్చి**

**యుండెఁబో శాంతరసమెల్ల నుట్టిపడఁగ**
**నంగనల పొందు రోసి సన్న్యాసి యగుట**
**గద యుచిత మెందునా నవ మదనమూర్తి**
**యంగనామణిఁగోరి సన్న్యాసియయ్యె** 2-81

అని వర్ణించెను. ఈ పద్యమునందలి యెత్తుగీతిలోని భావము చాల రమణీయము గానున్నది. అర్జునుఁడు భూప్రదక్షిణముచేయ నేగుచు మొదట గంగానదిని గాంచెను. ఈ సందర్భమున గంగావర్ణనమున్నది. గంగ పాండవులకు ముత్తాత భార్యయగుటచే నర్జుననకును ఆమెకును గొంత బాంధవ్యముకూడ నున్నది. అందుచే నర్జునుఁడామెను

**పువ్వారు బోఁడివై సరి**
**యెవ్వారనఁ భీష్ముఁగాంచి యింపొందితి వీ**
**వవ్వావి యెఱుఁగుదువె మా**
**యవ్వా! పోషింపఁ బాడియగు నను నీకున్** 1-51

అని చనువుతో రక్షింపుమని ప్రార్థించెను.

**తాసైరింప కపర్ది యుండఁగ భవద్గర్భంబునందాల్చి తే**
**జోఽసహ్యు న్సరజన్ముఁగాంచి యల నీహార క్షమాభృత్కు మా**
**రీసాపత్న్యము గన్న మోహపుఁ బురంధ్రీరత్నమౌదీవ కా**
**వే సర్వజ్ఞుఁడు నిన్ను నేల తలపై నెక్కించుకో జాహ్నవీ** 1-49

అనుపద్యమున సర్వజ్ఞుఁడయ్యు శివుఁడు గంగనుఁ దలపై నెక్కించుకొనుటకుఁ గారణము చక్కగా నుగ్గడింపఁబడినది. నాగలోకమునుండి వచ్చినపిమ్మట నర్జునుఁడు తైర్థికులతో హిమాచలమున కరిగిన సందర్భమున నొకే సీసమున నాపర్వతము వర్ణింపఁ బడినది. ఈ కావ్యమున వివాహము మూఁడుచోట్ల వర్ణితమైనది. మూడుచోట్లను బెండ్లి కొడుకర్జునుఁడే. అతఁడు చిత్రాంగదను వివాహమాడిన వృత్తాంతము సంగ్రహముగా నున్నది. సుభద్రార్జునుల వివాహము ద్వారకలో నొకమాఱును ఇంద్రప్రస్థమున నొకమాఱును జరిగినది. ద్వారకలో జరిగిన వివాహమును వర్ణించు నప్పుడు కవి తన నాఁటి వైవాహికాచారములను విశదముగాఁ దెలిపియున్నాఁడు. ఉలూపీ కరగ్రహణము పాన్పుపైనే జరిగెను. అందుచే నచ్చట నాచారాది వర్ణనమునకుఁ దావులేకపోయినది. అర్జుననకును యాదవవీరులకును జరిగిన యుద్ధము తృతీయాశ్వాసమున సంగ్రహముగా వర్ణింపబడినది, "మూపులు మూడగున్ రిపుచమూపులఁగన్నపుడే కిరీటికిన్" (3-170) అనికృష్ణుఁడాడినమాటలో నసత్యములేదు. కావ్యమున ప్రథమాశ్వాసమున నొకపద్యమందు ప్రాతఃకాల వర్ణనమును, (139) రెండు పద్యములలో సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనములును గలవు (144, 145). అచ్చటనే వసంతవాయుపికభ్రమరాదు లతిసంగ్రహముగా వర్ణితములైనవి. వేంకటకవి తన కావ్యమున

నవసరములైన వర్ణనములనే కావించెను. ఆ వర్ణనము లైనను నాతిదీర్ఘములవలె కొన్ని యాధునిక ప్రబంధములలోపలి వర్ణనమునకు మార్గదర్శకములైనవి. విజయవిలాసము దక్షిణాంధ్రయుగమున వెలసినదగుటచే దద్యుగలక్షణానుగుణముగా నందు శృంగారవర్ణనము కొంతమేర మీఱినది. మొత్తముమీద నన్ని వర్ణనములందు శబ్దచమత్కారమునకుఁ బ్రాధాన్య మెక్కువ.

వేంకటకవి కావ్యారంభమందలి యాశీ:పద్యములలో గంగాదేవిగూడ రఘునాథ భూపాలుని కైశ్వర్యము నావహింపవలెనని చెప్పుచు

**ప్రకట శ్రీహరి యంఘ్రిఁబుట్టి, హరుమూర్ధంబెక్కి, యాపాదమ**
**స్తకమున్ వర్ణనకెక్కు దేవి సహజోదంచత్కులోత్పన్న నా**
**యకరత్నంజని యచ్యుతేంద్ర రఘునాథాధీశ్వర స్వామికిన్**
**సకలైశ్వర్యములు న్నిజేశువలనన్ దాఁగల్గగాఁ జేయుతన్** 1-8

అను పద్యమును రచించెను. గంగానది దివ్య, దివ్యుల నాపాదమస్తకముగా వర్ణింప వలెనను సంప్రదాయమును గవి చక్కగా సూచించి యున్నాడు.

విజయవిలాసమునందలి ప్రధానరసము శృంగారమే. కవి యర్జునుఁడు మువ్వురు నాయికలను వివాహమాడి వారితోగావించిన శృంగార విలాసములను వర్ణించెను. ఈ మూడు చోట్ల సంభోగ శృంగారమే కానవచ్చును. ఉలూపీ చిత్రాంగదల విషయమున విరహమును వర్ణించుట కవకాశము లేకపోయినది. నిజమునకుఁ గవిదృష్టిలో నర్జునుఁడు సుభద్రతోఁ గావించిన విలాసమే ప్రధానమైనది. ఈ సందర్భమున నాయికాఁనాయకులిరువురు పొందిన విరహవేదనయు వర్ణింపఁబడినది. ద్వితీయాశ్వాసాంతమునను తృతీయాశ్వాసారంభమందును నర్జునుఁడు పొందిన విరహాతిశయము సుభద్రా సౌందర్యచేష్టాస్మృతి పూర్వకమై సరసముగా నున్నది. తరువాత సుభద్రపొందిన విరహతాపమును గాంచి యామర్మమెఱిఁగిన సత్యభామ

**క్రాఁగియున్నది మిగుల సంగంబు చూడఁ**
**గలవరించుచు నున్నది కలదొ యేమొ**
**సోఁకుడల్ల సన్యాసికే చూపవలయు**
**భామను.....** 3-36

అని చమత్కారగర్భముగాఁ బలికెను. చెలులు శీతలోపచారములు కావించిరి. తత్ఫలితముగా తాపము మఱింత హెచ్చెను. అంతఁజెలులు మన్మథుని, వాయువును, చంద్రుని, కోకిలాదులను నుపాలంభించిరి. సుభద్రయు తాపము భరింపలేక వారిఁ దెగనాడెను. ఈ సందర్భము నందలి ఈ క్రొవ్విరులు గ్రోలు నెలతుమ్మెదలు చెక్కు చెమరింపకున్నవా చిగురుబోఁడి (3-62) అను పద్యమునందలి భావ మద్భుతముగా నున్నది. ఈ ఘట్టమున కవి విరహశృంగారము నతినిపుణముగా వర్ణించియుండెను.

విజయవిలాసమునందలి మూఁడు కథలలోఁగల ముప్పురు నాయికలును మూఁడు తెగలకుఁ జెందినవారు. ఉలూపి ప్రౌఢ; చిత్రాంగద ముగ్ధ; సుభద్ర మధ్య; "ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజిత మన్మథా; లజ్జా మన్మథ మధ్యస్థా మధ్యమోదిత యౌవనా, స్మరమందీకృతావ్రీడా ప్రౌఢా సంపూర్ణ యౌవనా" యని ప్రతాప రుద్రీయకారుఁ డీముప్పురు నాయికలకు నిచ్చిన నిర్వచనములు. ఉలూపి యర్జునునిఁజూచి వలచి యాతని యనుమతితోఁ బనిలేకుండానే మొదట నాతని నాగలోకమునకుఁ గొనిపోయినది. సాహిత్యదర్పణమునఁ జెప్పినవిధమున "నామె స్మరాంధ, గాఢతారుణ్య, దరవ్రీడ, ఆక్రాంతనాయిక." నాగలోకముల కరిగినపిమ్మట నర్జునుఁడు మరల మానవలోకమునఁ బడుటకై యామె కోరిక మన్నించవలసివచ్చెను. చెలికత్తెలు సుభద్ర నర్జునునికడఁజేర్చి యెన్ని గడియలయ్యెనో చూచెదనని యొకతెయు, నామె యింకను రాలేదే మని వేఱొకతెయు, చెల్లెలినిఁ బిలిచెదనని యింకొకతెయు నీ విధముగా నేదో యొక సాకుచెప్పి వెడలిపోయిరి. "అచ్చెలియల వెంటనే సగము సిగ్గరిగెం దరుణీలలామకున్." ఆమె మొదట గాఢాలింగన విముఖయై, నవోఢయయ్యెఁ, దరువాతఁ గ్రమముగాఁ బ్రియుని శిక్షణమున నన్నియునేర్చి ప్రౌఢగా బరిఢవిల్లెను. చిత్రాంగద

> **"డాసిన నింగితం బెఱిఁగి డాయఁగ నేరక, తత్తరంబునన్**
> **జేసిన చేఁతకుం బదులు సేయ నెఱుంగక"** 2-34

వ్రీడావశమై యుండెను. వేంకటకవి యామెసిగ్గు నీ క్రిందిపద్యమునఁ జక్కఁగా వర్ణించెను.

> **ఇగ్గెడు వెన్కకుం బయికినీడ్చినఁ బైటఁ దొలంగజేయఁగే**
> **లొగ్గెడు, రెమ్మిపోక ముడియాడ్చినఁ గ్రుంగిలి రెండుకొంగులున్**
> **బిగ్గన డించుచున్విడిచి పెట్టదు, బాల ననం బనేమి యా**
> **సిగ్గుకు సిగ్గులేదిటులఁ జేసినపిమ్మట నుండవచ్చునే!** 2-30

రసికజనశేఖరుఁడైన యర్జునుఁ సరససంభాషణములు పల్కి "వల పెఱిఁగి యేలుకోగదే కలికి యనుచు" నెట్లో యాముద్దరాలిని గేలి కెలయించెను. ఇట్లు వేంకటకవి యీ ముప్పురియందు నాముప్పురు నాయికలఁ బ్రదర్శించి యర్జునుని విలాసమునకు వైవిధ్యము కలిగించెను.

విజయవిలాసమున వీర రౌద్ర కరుణ హాస్యశాంతము లంగరసములుగ నున్నవి. అర్జునుఁడు యాదవ వీరులతోఁ బోరునపుడు వీరమును, అర్జునుఁడు సుభద్రను గొనిపోవుట యెఱింగినపుడు బలరామాదులు కోపోద్రిక్తులైనపుడు రౌద్రమును గోచరించును. అర్జునుని తేరు సుభద్ర నడపవలసి వచ్చుట యచ్చటి వీరమును శృంగార మిళితము కావించినది. శాపమునకు గుఱియై నందాదులు వంతనొందునప్పుడు కరుణరసము స్ఫురించును. అర్జునుడు యతివేషము వేసి కొన్నప్పుడు 'శాంతరసమెల్ల నుట్టిపడుచుండె నని కవి వ్రాసినను అచ్చట" శాంతముకాక తదాభాసమే గోచరించును. సుభద్ర విరహ వేదన ననుభవించు నపుడు మిత్రవిందాదులు పల్కిన పల్కులందును, సత్యభామ

**లెంకగ నేలుకోఁగలదులే మగనిం దరితీపువేసి మీ**
**నాంకుని పాదమాన, మనమాదటవేడిన మాఱువల్కఁగాఁ**
**గొంచెదునంచు మీరిపుడు గోలని చూడకుడమ్మ నేర్చుఁబో**
**చంకల బిడ్డ లూడిపడ సారసలోచన మాటలాడఁగన్** 3-34

ఇత్యాదిగా మేలమాడిన సందర్భమందును హాస్యము పోషింపఁబడినది. ఈ విధముగా నాయా సందర్భములందా యా రసములను బోషించుట యందు వేంకటకవి చాలనేర్పు ప్రదర్శించియున్నాఁడు.

విజయవిలాసమునఁగల పాత్రలలో నాయికా నాయకులును విశారద శ్రీకృష్ణులును ముఖ్యులైనవారు. శ్రీకృష్ణపాత్ర చిత్రణమునఁ గవి యెంతో నేర్పుజూఁపెను. ఆతఁ డతని లోకజ్ఞతను వ్యవహార దక్షతను జక్కఁగా సూచించెను. బలరాముఁ డెఱుఁగకుండ సుభద్రార్జునులకు వివాహము చేయింపవలెనని కృష్ణుఁడు మొదటినుండియుఁ బ్రయత్నము చేయుచుండెను. బలరాముఁ డర్జునుని నిజమైన యతియనియే భ్రమించి చాతుర్మాస్య మచ్చటనే సలుపవలెనని ప్రార్థించెను. అర్జునుఁ డందుకంగీకరించెను. బలరాముఁడు సుభద్ర నాతని శుశ్రూషకు నియమింపుమని పలుకఁ కృష్ణుఁడు

**వయసువారును జక్కనివారు వీరు**
**మనసు మర్మంబులేవియు మనకుఁ దెలిసి**
**యున్న యవిగావు సేవకు నునుపఁ దగునె**
**కన్నె నదియేమొ తెలిసికొ** 2-119

మ్మని పలికెను. "సంయములకు మున్ గోరిక వెలయఁగఁ గన్యలెకారా శుశ్రూష చేయఁగఁ దగువార"లని పల్కి బలరాముఁడు సంశయింపక యట్లె యొనరింపుమని చెప్పఁ గృష్ణుఁడు సంతోషమున నట్లే యొనరించెను. పిమ్మట నాతఁడాయతి యర్జునుఁడేయని రుక్మిణీ సత్యభామలకుఁ దెలిపెను. దరువాత సుభద్రార్జునుల వివాహమునకుఁ దగిన యేర్పాటులన్నియుఁ గావించి యందఱితోపాటు తానును బశుపతి పూజకరిగెను. వివాహము వేళ కరుదెంచి యాతఁడే దానిని సక్రమముగా జరిగించెను. అర్జునుఁడు సుభద్రతో వెడలి పోయిన సంగతి యెఱింగి బలరామాదు లాగ్రహావిష్టులై యున్న సమయమునఁ కృష్ణుఁడు పల్కినపల్కు లాతని కార్యాచరణ సామర్థ్యమును వేనోళ్ళఁ జాటుచున్నవి. అతఁడు బలరామునికి నర్జునుని యసామాన్య బలపరాక్రమాదులు వివరించి

**మాలిమిలేదుగాన ననుమానము నామదిఁ దోఁచె నప్పుడే**
**బాలిక సేవసేయఁ బనుప న్వలదంటినిగాదె దానికే**
**మీలువుగల్గు మేనమఱఁదింతయె యాతఁడు నైన దైనదే**
**లోలత నింక నాగవలిలోపల నిష్ఠురమేల పల్కఁగన్** 3-171

అనిపల్కి సుభద్ర కన్నివిధముల నర్జునుఁడే తగినవరుఁడని నిరూపించి యాతనితోఁ గూడ నింద్రప్రస్థమున కరిగెను. బలరాముడుకూడ నింద్రప్రస్థమునకేగి చెల్లెలివివాహము యథావిధిగా జరిగించెను. వేంకటకవి యీపాత్రను బోషించుటలో మిగులనేర్పు ప్రదర్శించెను. అర్జునునియందీ కావ్యమున ధార్మిక కాముక ప్రవృత్తులు రెండును కనిపించును. బ్రాహ్మణుడు చోరులు తన ధేనువును హరించిరని మొఱపెట్టఁగానే యాతఁడు సంభ్రమమున విల్లమ్ములకై యరుగుట యాతని బ్రాహ్మణభక్తిని, శరణాగతరక్షణ పరాయణతను జాటు చున్నది. నియమపాలనయందుఁగూడ నాతని కభినివేశమెక్కువ. తొందరలో నాతఁడు ధర్మజు కేళీమందిరమున కరిగి పూర్వక్షిప్త నియమానుసారముగా భూప్రదక్షిణమున కేగనెంచెను. ధర్మజుఁడెంత చెప్పినను ఆతఁడా పూనికనుండి మానలేదు. తీర్థక్షేత్ర దర్శనము లందును అతనికిఁగల యాసక్తి యిందు వర్ణింపఁబడినది. కృష్ణునియందాతనికిఁ గల భక్తి యపారమైనది. అతఁడు తలపోయఁగనే కృష్ణుఁడాతని యెదుటి కరుదెంచుట యిందుకుఁ తార్కాణము. అతని పరాక్రమ మతిలోకమైనది. యాదవ వీరులందఱి నాతఁ డొక్కఁడే జయింపఁగల్గెను. "నన్నెవ్వనిఁగాఁ జూచితి.... చూడుము. చెండెద భిన్నాభిన్నములుకాఁగ సేనల నెల్లన్" (3-145) అని పలికి యాతఁడట్లే కావించెను. పంచతీర్థములం దుగ్రములైన మకరము లున్నవని మునులు చెప్పినను, వినక యాతఁడందు స్నానమాడ నరుగుటయు నందు మకరము తన్నుఁ బట్టుకొనఁగా నెడమకరమున దానిని భూమికి విసరివేయుటయు నతని నిర్భీకతా సాహసములను వెల్లడి చేయుచున్నవి. నందసఖులకుఁ గూడ శాపమోక్షము కలిగించుట యతని కరుణాశీలమునకుఁ దార్కాణ. ఆతఁడు ప్రాయశ్చిత్తమునకై భూప్రదక్షిణము చేయ బయలుదేఱి ముబ్బురు కాంతలను బెండ్లియాడుట యాతని కాముకత్వమును విలాస లాలసత్వమును సూచించుచున్నది. కాని యందేడాదిలోపల జరిగినదులూపీ సంగమమొక్కటి మాత్రమే. మణిపురమున కేగునప్పటికి పదుమూడవనెల వచ్చెనని కవి సూచించెను. మొదటి మాస ములూపీ ప్రేరితమగుటచేతను, తరువాతి విలాసములు నియమకాలానంతరము జరిగినవగుటచేతను అర్జునునియందు దోషము లేదని కవి భావించెను గాఁబోలును. ఎట్లైనను అర్జునుని యందు కాముకత్వము లేదనిచెప్పుటకు వీలులేదు. ఆతఁడు కంటికిఁ గానవచ్చిన కాంతను కామింపక విడువఁడు. నాయికలు ముబ్బురు మూఁడు రకములకుఁ జెందినవారు. వారి లక్షణములు ముందే తెల్పఁబడినవి. విశారదుఁడు సకలధర్మవిశారదుఁడని కవి చెప్పెను. ఇతఁడొక్క ధర్మ విశారదుఁడేగాక నర్మ విశారదుఁడు కూడను. ఇతనికిని వసుచరిత్రయందలి గౌతమునికిని గొంత సామ్యమున్నది. అర్జునునికి 'చింత్రాంగదా' సమాగమము సమకూర్చుటలో నితఁడు చాల తోడ్పడెను. ఇతఁడు కుక్షింభరిత్వమును, వాచాలతయులేని విదూషకుఁడు. బలరాముఁడిందు చాల అమాయకుఁడుగా చిత్రింపఁబడినాఁడు. యతులయందాతనికిఁ గల భక్తి యపారమైనట్టిది. అర్జునుఁడు సుభద్రతో నరిగెనని విన్నప్పు డాతఁడు మొదట నుగ్రుఁడైనను దరువాత కృష్ణుని మాటలువిని శాంతించెను. అందుచేతనే వేంకటకవి యాతని "తమ్ముని మాట యన్న జవదాటని యన్న" యని వర్ణించెను. నందాదులు వయసుక్రొవ్వున

మునితపమునకు విఘ్నమాచరింపఁ బోయి యాతని శాపమునకు గుఱియైరి. అర్జుననిచేఁ దనచెలులకుఁ గూడ శాపమోక్షము కలిగించుటవలన నందకుఁగల సఖీప్రీతి వెల్లడి యగుచున్నది.

విజయ విలాసమునందలి నిజమైన యౌదాత్త్యము వస్తువిన్యాసము నందుఁగాక రచనావిధానమునందెక్కువగాఁ గాననగును. ఇందలి రచనామార్గ మనన్య సామాన్య మద్వితీయ సౌందర్యముతో నలరారు చున్నది. ఇది బహుకాల సాధనకు ఫలితముగానబ్బి వేంకటకవిచేత సమగ్రత్వసిద్ధి నొందినట్టిది. ఇది బాగుగా నెఱింగినవాఁరు కావుననే యతఁడు కావ్యారంభమున రఘునాథనాయకుఁడు తన్ను గూర్చి

**ప్రతి పద్యమునందుఁ జమ**
**త్కృతి గలుగంజెప్పనేర్తు వెల్లెడ బెళుకౌ**
**కృతి వింటి మపారముగా**
**క్షితిలో నీమార్గ మెవరికిన్ రాదుసుమా!** అవతారిక – 50

యని పలికినట్లు వ్రాసియుండెను. ఈ పద్యములో నహంకారముగాని యతిశయోక్తిగాని యిసుమంతయు లేదు. ఈ కావ్యమునందలి పద్యములను నిశితముగాఁ బరిశీలించినచో ప్రతిపద్యమునను మనోరంజకమైన చమత్కారము కనిపించును. ఈ చమత్కారము శబ్దార్థగతమై శ్రీకృష్ణుని విశ్వరూపమువలె బహుముఖముల విరాజిల్లుచున్నది. ఇందే చేమకూర వేంకటకవిరాజు ప్రత్యేకతయుఁ, బ్రతిభావిశేషమును నిండారి తొణికిసలాడుచుండును.

మనము పదార్థములను సూచించుటకై పదములను వాడు చుందుము. నిఘంటువు లలోని పదములకుఁ బర్యాయపదములెన్నో సూచింపబడియుండును. స్థూలముగా జూచున ప్పుడీపర్యాయపదము లన్నియు సమానార్థద్యోతకములుగానే కానఁబడును. కాని వ్యుత్పత్తులను బట్టి చూచినచో వాని యర్థములం దొకానొక ప్రత్యేకత చూపట్టుచుండును. దానిని గుర్తించి వానిని ఔచిత్యభాసురములుగా వాడినచో నవి కలిగించునర్థస్ఫూర్తి యతిరంజకమై చమత్కార సంజనకమగును. ఏ పదమునెప్పుడెట్లు వాడవలెనో లెస్సగాగుర్తించి దానినట్లు సాభిప్రాయముగా వాడుటలో నాంధ్రవాఙ్మయమున వేంకటకవి కీడుకాఁగల కవులెవ్వరును లేరు. ఇట్టి సాభిప్రాయపద ప్రయోగము విజయవిలాసమున నిందుఁగల దందు లేదను సందేహము లేక సర్వత్ర గోచరించుచుండును.

**శ్రీ కలకంఠ కంఠియు ధరిత్రియు దక్షిణ వామభాగముల్**
**గైకొని కొల్వవారికఁదకన్ గడకన్నులకాంతిఁ దేల్చి తా**
**నా కమలాప్తతన్ గువలయాప్తతఁ దెల్పెడు రంగభర్త లో**
**కైకవిభుత్వమిచ్చు దయ నచ్యుతఁ శ్రీరఘునాథ శౌరికిన్** అవతారిక – 2

లోకైకవిభుత్వము శ్రీధరిత్రులకు సంబంధించినది. దాని నీఁగల్గు నర్హత రంగభర్తకు

శ్రీధరిత్రీ సేవితుడై యుండుటచేతనే చేకూరుచున్నది. అతని దక్షిణవామనేత్రములు సూర్యచంద్ర రూపములు. సూర్యుఁడు కమలాప్తుఁడు. చంద్రుఁడు కువలయాప్తుఁడు. ఈ కమలాప్తతా కువలయాప్తతలు రెండును నింకొక విధముగా శ్రీ రంగేశ్వరునందున్నవి. కమలా కువలయాంగనల గడ కన్నుల కాంతిఁదేల్పు నాదేవుఁడు కమలాప్తతా కువలయాప్తతలఁ దెల్పుచుండెననుట యెంతో సాభిప్రాయముగా నున్నది.

**అడుగు మాత్రమెకాక యంత కెక్కుడుగ నీఁ**
**జాలెనే యల బలిచక్రవర్తి** అవతారిక – 25

ఇచ్చటి యడుగుశబ్దము నౌచిత్యము వర్ణనాతీతమై యున్నది. అది తప్ప నింకేశబ్దము వాడినను ఇచ్చట నాచమత్కార ముప్పతిల్లదు. బలిచక్రవర్తి వామనున కిచ్చిన దడుగుమాత్రమే యను విషయమును బురస్కరించుకొని చూచినచో నిచ్చటి చమత్కృతి స్పష్టమగును.

**ప్రాయపు గాయకుల్ వెలనెపాన నెగాదిగఁ జూడనేర్చు లౌ**
**రాయివి దండమీఁదగొసరం దొరకొంటిరి మంచిసాములే**
**పోయటులై నచో సరసముల్ గద మీకిపుడంచు నప్పురిన్**
**గాయజు తూపులమ్ముదురు కందువమాటలఁ బుష్పలావికల్** 1– 14

కాయజుతూపులు పువ్వులు, పుష్పలావికలు పువ్వులుకాక కాయజుతూ పులమ్ముదు రనుట యెంత సాభిప్రాయముగా నున్నదో రసజ్ఞులకు వేఱేచెప్పనక్కఱ లేదు.

**అతని నుతింపశక్యమె జయంతుని తమ్ముఁడు సోయగమ్మునన్**
**బతగ కులాధిపధ్వజుని ప్రాణసఖుండు కృపారసంబునన్**
**క్షితిధర కన్యకాధిపతికిం బ్రతిజోదు సమిజ్జయంబునం**
**దతని కతండెసాటి చతురబ్ధి పరీత మహీతలమ్మునన్** 1– 28

ఇందలి జయంతుని తమ్ముఁడు మున్నగు పదములు సార్థకములైనట్టివి. అర్జునుఁడు సోయగమునందేకాక యదార్థమునఁగూడ జయంతుని తమ్ముఁడే యగుట తలంచిచూచినచో నిచ్చటి పదప్రయోగౌచిత్యము స్పష్టమగును. జయంతుడు సోయగము నందును, బతగకులాధిపధ్వజుఁడు కృపారసమునందును, క్షితిధరకన్యకాధిపతి సమిజ్జయమునందును బ్రఖ్యాతినొందిన వారు. ఆ మూడు లక్షణములు నర్జుననందున్నవి. అందుచేతనే చతురబ్ధిపరీత మహీతలమున నతనికతండె సాటియని చెప్పఁబడినది.

**కానుక గాఁగ నిత్తుబిగి కౌగిలి పల్కవె కీరవాణి, నీ**
**దౌ నుడితేనె నాచెవులనాన, గృపారసధార నాన న**
**న్నాననమెత్తి చూడు నలినానన!** 2 – 28

**ఎవ్వనిఁ జూచి మేలుపడితే యరవింద దళాక్షి! నీ మనం**
**బెవ్వఁడు చొచ్చెఁ జెప్పఁగదవే మదకోకిలవాణి, నిన్న నేఁ**
**డెవ్వని చెల్వు నీయెదుట నెన్నబడెన్ వినతాంగి!** 3 – 31

పల్కవలసివచ్చినప్పుడు కీరవాణి, మదకోకిలవాణి యని సంబోధించుటయుఁ జూచు సందర్భమున నరవిందదళాక్షి, నలినానన! అని సంబోధించుటయు మిక్కిలి యర్థ గంభీరములై యున్నవి.

**అతి వినోదముగాఁగ రతులఁ దేలించు నీ**
**పచ్చల కడియాల పద్మగంధి**
**.........................................**
**తృణముగా లోఁజేయు నెంతటివాని నీ**
**నీలాలముంగర నీలవేణి** 1 – 16

ఈ పై పాదములఁ 'బచ్చలకడియాల' 'నీలాలముంగర' యను విశేషణము లభిప్రాయ గర్భితము లైనవి. ఈ విశేషణములే లేనిచో నీ పద్యమున సాధారణార్థమే కాని విశేషార్థము స్ఫురింపదు. పచ్చలను రతులను మానముతోఁ దూచుచుందురు. పచ్చలుబరువైనచో రతులఁ దేలించును. నీలమునకుఁ దృణగ్రాహిత్వము లక్షణము. పచ్చల కడియాల పద్మగంధికావుననే రతులఁదేలించుటయు, నీలాలముంగర నీలవేణి కావుననే యెంతటి వానినైనఁ దృణముగా లోఁజేయఁజాలుటయు సాధ్యము లగుచున్నవి.

సరసగంభీరమైన విశేషార్థము ధ్వనించునట్లుగాఁ గ్రియాది పదముల నుపయోగించుట వేంకటకవి కల్పించు చమత్కారపద్ధతులలో నొక్కటి. ఈ విధానమువలనఁ బాఠకులనుభవించు నానందమమందముగా నుండును.

**కలదు లేదన నసియాడు కౌనుతీరు**
**దళుకు మొగమున నెగయు గుబ్బల బెడంగుఁ**
**జూచియాతని నిడువాలుఁ జూపులపుడు**
**నిండువేడుక మిన్నంది కొండదాఁకె** 2 – 20

మిన్నందుట, కొండదాఁకుఁట యను క్రియలకు సంతోషించుటయని యర్థము. ఈ యర్థమును సూచించుపదములెన్నో యున్నవి. వానిని వాడక వీనినే యిట నుపయోగించుటలోఁ జమత్కారమున్నది. కౌనునుమింటితోడను, స్తనములను గిరులతోడను బోల్చుటకవి సమయము. ఇందొకటి శూన్యత్వమును వేఱొకటి యౌన్నత్యమును సూచించును. అర్జునుడు చిత్రాంగద కౌనుఁజూచి మిన్నందుటయు గుబ్బలబెడంగుచూచి కొండఁదాఁకుటయు ధ్వనిగంభీరములైన ప్రయోగములు.

**ధారాధరమువెన్నుఁ దన్నిపుట్టినచాయ**
**నున్నదీ బింబాధరోష్ఠి వేణి**
**జక్కవకవఁఱొమ్ము ద్రొక్కినిల్చినజాడ**
**నున్నవీ నవలా పయోధరములు** 2 – 106

పద్యమంతయు నీవిధముగానే నడిచినది. ఇందలి వెన్నుదన్ని ఱొమ్ముద్రొక్కి యను

పదములు సామాన్యముగా నోడించి యను నర్థము నిచ్చుచున్నవి. ఈ వాక్యములందే కర్మలు కర్తలైన యర్థముకూడఁ బొసఁగుచున్నది. మొయిలే వెన్నుదన్ని పుట్టినవిధమున నున్నదీమెజడ మొదలగు నర్థము లప్పుడు స్ఫురించును.

**చెలువ నేత్రవిలాసంబు చెవులుసోఁక**
**బాలకుచలీల యెదఁజాల బట్టిక్రాలఁ**
**గలికి నెఱివేణి చెలువంబు కాళ్ళఁబెనఁగ**
**నవలఁబోలేక నిల్చె నయ్యర్జునుండు** 2 – 106

ఈ పద్యమున నర్జునుఁడు ద్వారకనువిడిచి యవ్వలికిఁబోలేక పోవుటకుఁ గారణములు నుడువఁబడినవి. అందొకటి సుభద్రాసౌందర్యము, రెండవది దానిచే నాకర్షింపఁబడిన యర్జునుని చిత్తవృత్తి. ఈ రెండు కారణములు నిందొకదానినిమించి వేఱొకటి ధ్వనించుచున్నది. ఇట్టిదే మఱియొక పద్యము.

**భామమోమున వ్రేలురూపంబుఁ జూచి**
**ముదిత యెదఁబాయకుండెడు మూర్తిఁ దలఁచి**
**రమణి పై సగమైన విగ్రహమునెంచి**
**ప్రోవుమని వేఁడుకొను దేవపూజవేళ.** 2 – 136

ఇందర్జునుడు త్రిమూర్తులను సుభద్రను దలంచి తన్ను బ్రోవుమని వేడుట ధ్వనించు చున్నది. ఇందుఁ ద్రిమూర్తుల వేఁడుట బాహ్యము. సుభద్రను వేఁడుట యాంతరము.

**చిత్తజుఁడల్గి తూపుమొనచేసినఁ జేయగనిమ్ము పైధ్వజం**
**బెత్తిన నెత్తనిమ్ము వచియించెదఁ గల్గినమాట గట్టిగా**
**నత్తరళాయతేక్షణ కటాక్షవిలాస రసప్రవాహముల్**
**కుత్తుక బంటి తామరలకున్ దలమున్కలు గండుమీలకున్** 3 – 15

తామరలు మన్మథుని బాణములు. మీనము లాతని ధ్వజచిహ్నములు. సుభద్ర కటాక్షము లీరెంటినిగూడ దిరస్కరించునట్టివి. ఇది యున్న మాటయే యైనను ఉన్నదున్నట్లుచెప్పినచో నులికి మన్మథుఁడు తూపుమొన చేయుటకును, బైధ్వజంబెత్తుటకును బూనవచ్చును. ఈ పద్యము సుభద్రకటాక్షముల యందమును నర్జునునికిఁగల్గిన మదనతాపాతిశయమునుగూడ లెస్సగా జాటుచున్నది.

వేంకటకవి యొక్కక్కప్పుడు వస్తువులను వానికి సహజముగా నున్న నామములతోడనే సూచించుచు నాశబ్దములచే నపూర్వములైన యర్థముల ధ్వనింపఁజేయుచుండును.

**జలరుహగంధి వీనుల పసల్ నవసంఖ్య నదేమి లెక్కనున్**
**జెలియ నఖాంకురాళి నెలచేడియ సైతముఁ దాను జుక్కనున్**
**బొలుతుక గబ్బిచన్నుఁగవ పువ్వులచెండ్లను లేదు బంతనున్**
**గలికిముఖారవిందమల కల్వలరాయనిఁ ద్రోసిరాజనున్.** 1 – 37

సుభద్ర చెవులు తొమ్మిదిసంఖ్యను లెక్కచేయవు. అంతకంటెను సుందరములుగా

నుండును. అవి తొమ్మిది. అదేమి యంకెయని యాక్షేపించును అను నర్థము లందలి మొదటిపాదమున నున్నవి. అట్లే యామెగోళ్లు చుక్కలయందమును జుక్కఁ (రవంతబొట్టుఁ) అని యాక్షేపించును. వానిని దనకుఁ దరువాతివానిగా నొనర్చును. సామాన్య శబ్దముల నుండియే యిట్టిచమత్కృతితోఁగూడిన యర్థము బయల్పఱుచుట వేంకటకవికిఁ బరిపాటి.

విజయవిలాసమునందలి కొన్ని పద్యములు చివరివఱకు సాధారణమైన యర్థముతో సాగుచున్నట్లేతోఁచి యంత నిర్దిష్టములైన కొన్ని శబ్దములచేఁ బద్యమునకంతకును నపూర్వమైన గాంభీర్యము నొడఁగూర్చుచుండును. అట్టియెడ నా చివరఁజెప్పఁబడిన వాక్యములే గూఢముగాఁ బైపాదముల నిమిడియున్న యర్థమును బయల్పరుచుటకు సూచనలగును.

**ఊదుకపోవు శంఖము నహోగళరేఖ, శరాసనంబులన్**
**వాదుకుఁబట్టుఁగన్బొమలవైఖరి, వంకలుదీరుచున్ గటా**
**క్షోదయలీల సాయక సమూహములన్, విషమాస్త్రుగెల్చుఁబో**
**యేదొరసాటి యీ నరునకెన్నఁగ వీరవిలాస సంపదన్.** 1 – 69

ఇచ్చట వీరవిలాససంపద నను మాట చూచినంతనే గళాదుల విలాసమే కాక వీరముగూడ స్ఫురించును. శంఖము నూదుకపోవుట, శరాసనముల వాదుకుఁబట్టుట, సాయకముల వంకలుతీర్చుట, గెల్చుట యను నది వీరత్వలక్షణములు, గళము శంఖమును, కన్బొమలు శరాసనములను, కటాక్షములు సాయకములను దిరస్కరించుట విలాస లక్షణములు. ఇందలి యూదుకపోవు, వాదుకుఁబట్టు, వంకలు దీర్చు అను క్రియలు సాభిప్రాయముగా వాడఁబడినవి. అవి యీ పద్యమునకుఁ గలిగించు శోభను వివరించుటకంటె నూహించుట మంచిది. అది యనుభవైక వేద్యము.

వేంకటకవి యేపదమును వాడినను దానికి వైయర్థ్యము కలుగకుండఁ దగిన యావరణమును గలిగించును. శబ్ధప్రయోగమున నాతఁడు వహించు జాగరూకత యాశ్చర్యకరమైనది.

**అలకలు నీలము, లధరం**
**బల పగడము, గోళ్ళు ముత్తియంబు లటంచున్**
**దెలుప మునువిందుఁ జిలుకల**
**కొలికి తెఱంగెల్లఁ బూసగ్రుచ్చిన రీతిన్** 2 – 79

ఇటఁ బూసగ్రుచ్చినరీతి ననుటను సార్థకము చేయుటకై కవి చూపిన నేర్పు విదితమగుచునే యున్నది. నీల ప్రవాళ ముక్తాదులను బూస గ్రుచ్చిన విధమున గ్రుచ్చవచ్చును. అందుచేతనే యలకాధరనఖాదుల నాతఁడు వానితోఁ బోల్చియుండెను. ఈ ఉపమానమే లేనిచోఁ బూసగ్రుచ్చిన యనుమాట నిరర్థకమై యుండును.

**"కన్నులు దీర్ఘముల్, నగుమొగం బవురా తలకట్టు, తమ్మి పూ**
**పున్నమ చందమామలకు బొక్కిలి చక్కఁదనంబు చెప్పఁగా**
**నున్నదె, మేలుబంతులు పయోధరముల్, మఱి కౌను సున్నయౌ**
**నెన్నిక కెక్కు వ్రాతఫలఁ మవ్వరవర్ణినికి న్నిజంబుగన్** 2 – 104

సుభద్ర వరవర్ణిని. అనఁగా శ్రేష్ఠమైన వర్ణనములు కలది యను నర్థముకూడ నున్నది. దీర్ఘములు, తలకట్టు, పొక్కిలి, మేలుబంతులు, సున్న యనునవి వ్రాఁతయం దుపయోగింపఁ బడు పద్ధతులు. సుభద్ర వరవర్ణినీత్వము సార్ధకమగుటకును, నామె వ్రాఁతఫల మెన్నికకె క్కుటకును గవి పద్యమునఁ బైకల్పనము కావించెను.

పైని చూపబడిన యర్థచమత్కారములవలెనే వేంకటకవి పెక్కుచోట్ల శబ్దచమత్కారము లను కూడఁ బ్రదర్శించెను. ఇందీతఁడు చూపిన నేర్పు మిక్కిలి ప్రశంసనీయముగా నున్నది.

**విహరించున్ మలయానిలంబిచటఁ, దావింజిల్కి నెమ్మేని యా**
**విహరించున్ బికినాదముల్ చెవికిఁగావించుం జవుల్ పోదమా**
**సహకారాళి పదంబుఁజూడఁగ వయస్యా! హాళి వాటిల్లెడున్**
**సహకారాళి పదంబఁజూడగ వయస్యాహాళి యౌనేకదా!** 2 – 53

ఇందలి యైదువాక్యముల నైదుగు రచ్చరులును జెప్పినట్టివి. చివరి వాక్యమునఁగల చమత్కారము నాలుగవ వాక్యముపై నాధారపడి యున్నది. నాల్గవయచ్చర సహకారాళి పదంబుచూడ నాసక్తి కలుగుచున్న దని పల్కినది. అయిదవయామె దాని నర్థాంతరముచే సమర్థించుచున్నది. హకారముతోగూడిన ఆళిపదము చూడఁగా హాళి యౌను గదా యని దాని భావము. ఇట్లే చిత్రాంగదపై వలపుగొనిన యర్జునుఁడు విశారదునికి దుమ్మెదల ధ్వనులను వర్ణించిచెప్పు సందర్భమునఁ గూడను జక్కని చమత్కారము వ్యక్తము చేయఁబడినది.

**తనకుం గౌఁగిలి యీవొకప్పుడును నాథా నీ కరస్పర్శనం**
**బున గిల్గింతలె యంచుఁ బద్మిని కరాంభోజమ్మునన్ మంద మం**
**దనట ద్వాయుచలద్దళాంగులు కన్పట్టంగ నవ్వేల్గు రా**
**యని రారాయని పిల్చెనాఁ దగె ద్విరేఫాద్యంత దీర్ఘధ్వనుల్** 1 – 139

ఇందు పద్మిని ద్విరేఫధ్వని మిషమున సూర్యుని రారమ్మని పిల్చుచున్నది. ద్విరేఫ మనఁగా భ్రమరనామమున రెండు రేఫములుగల తుమ్మెద. దానికే రెండురేఫములను నర్థము కూడఁజెప్పవచ్చును. దీర్ఘాకారముతోఁగూడిన రెండు రేఫములధ్వనులే అనగా 'రారా' అనునవే యబ్జిని పిలుపునందలి రారా అను ధ్వనులైనట్లుండె నని యిందలి చమత్కారము.

వేంకటకవి శైలి యాలంకారికమైనది. ఈతని పద్యములన్నింట శాబ్దికమైనదో, యార్థికమైనదో, యేదో యొక యలంకారము చూపట్టుచునే యుండును. అనుప్రాస యమకాదులగు శబ్దాలంకారములవాడుట యందతనికిఁ బ్రీతిహెచ్చు. అవకాశము దొరికినచో నీతఁడు వానిని వాడక మానఁడు.

**హుటాహుటిన్ హలాయుధుండహో మహోగ్రుఁడై తనం**
**తటన్ దటాన నిప్పుడీవిధం బెఱింగి వచ్చెనో**
**ఘటా ఘటీల నెల్లఁ ద్రోవఁగట్టి పట్టఁబంచెనో**
**యటో యిటోయెటో భటోద్భటార్భటుల్ ఘటిల్లెడున్.** 3 – 142

అనునది వృత్త్యనుప్రాసమునకును.

**కనన్ సుభద్రకున్సమంబుగాఁగ నేమృగీవిలో**
**కనన్, నిజంబుగాఁగ నేజగంబునందుఁ జూచి కా**
**కనన్, దదీయ వర్ణనీయ హావభావధీవయః**
**కనన్మనోజ్ఞరేఖలెన్నఁగాఁదరంబె గ్రక్కనన్.** 1 - 32

అనునది ఛేకాను ప్రాసమునకు నిదర్శనములు. ఇట్టి వింకను ననేకములున్నవి. వేంకటకవి యమకము నెంతో చమత్కారముగా వాడును.

**పుట్టిన దాదిగాఁదనదు పుణ్యమెదాదిగ, వైరిభూమి భృ**
**ద్ఘట్ట మదంబుదాదిగ, సదా దిగధీశ సుతప్రతాపుడై**
**పట్ట మహాభిషేక బహుభాగ్యదురంధరుఁడై యయోధ్యయన్**
**పట్టణమేలు సామియె యనన్ రఘునాథవిభుండు వర్ధిలున్** అవతారిక - 17

**ఈ వెలంది యొడల్ పైడి లోవెలంది**
**యీనెలంత లలాటంబు లేనెలంత**
**ఈ సుపాణి రదశ్రేణియే సుపాణి**
**యీబిడారు మృగీమద శ్రీబిడారు** 1 - 30

అనునవి యమకమునకుఁ జక్కని దృష్టాంతములు.

వేంకటకవి శ్లేషాలంకారమును వాడినచోట్లెన్నియో కలవు. అందు రమణీయములైనవి రెండు మూఁడు మాత్రము సూచించెదను.

**భ్రమరకమనోహరంబౌటఁ బద్మమగును**
**దారకా హృద్యమగుట సుధా నిధియగు**
**రెంటిజగడాలు మోమున నంటియుంట**
**నబ్జముఖి యంట లెస్సయీా యలరు బోణి** 2 - 105

ఇందలి భ్రమరక తారకాబ్జ శబ్దములందలి శ్లేష సువ్యక్తముగనె యున్నది. 'రెంటి' 'జగడాలు' అనుపదములను రెంటి, జగఁడాలు అని విఱిచి యర్థాంతరము కల్పించవచ్చును. ఇట్లేపదముల వేఱు వేఱుగా విఱుచుట వలన రమణీయమైన యర్థాంతరము స్ఫురించుచోటిం కొకటికలదు.

**అపుడు నృపుడు ప్రఫుల్ల నవాంబుజ ప్ర**
**సన్న ముఖుఁడయి మలయధ్వజ క్షితీశ**
**కమల హితునకు మామకాగమనవార్త**
**తెలుపుమంచు విశారదుఁ బిలిచి పంపె** 1 - 52

ఇచ్చట మలయ ధ్వజక్షితీశ కమలహితునకు మామకఁఆగమనవార్త యనియు, కమల హితునకు, మామకు, ఆగమనవార్తయనియు నర్థము చెప్పవచ్చును. మలయధ్వజ క్షితీశకమల

హితునకు, మామ, కాగ, మనవార్తయని పదముల విఱిచి యర్థము చెప్పుట మరింత సొగసుగా నుండును.

**వెలఁది కెమ్మోవి గని జపావృత్తి మఱచెఁ**
**దరుణిలేఁగౌను గని హరిస్మరణమఱచెఁ**
**గడమ యననేల వేసమొక్కటియ తక్క**
**మఱచె నన్నియు నాకృత్రిమత్రిదండి** 2 - 148

ఇందలి మొదటి రెండు పాదములలో హృదయావర్జకమైన శ్లేషమున్నది.

వేంకటకవి కొన్ని పద్యములలో మొదటి మూఁడు పాదములందు విశేష విషయమును దెల్పి నాల్గవదాన సామాన్య విషయోద్ఘాటనముచేసి పై దానిని సమర్థించును. ఇట్టి యర్థాంతర న్యాసములన్ని కావ్యములందును గాననగును. కాని వేంకటకవి నాల్గవపాదమున నించుక శ్లేషను సూచించి పైని చెప్పబడిన విషయమున నపూర్వమైన చమత్కారము భాసింపజేయును.

**ప్రాయపుఁడెక్కునన్ జెలువపల్కులు చిల్కలగారవించుఁ గం**
**దోయి చకోరపాళిదయతోఁ బెనుచుం జనుకట్టు మచ్చికల్**
**చేయు సదా రథాంగయుగళిన్, నడలంచల బుజ్జగించు, నౌ**
**నేయెడనింపుగావు గణియింప నవీన వయోవిలాసముల్** 1 - 33

నవీన వయోవిలాసములనఁగా యౌవన విలాసములనియుఁ గ్రొత్తలయిన పక్షుల విలాసములనియు నర్థము. పైని జెప్పబడిన యంశములీ రెండు విషయములను గూడ సమర్థించుచున్నవి.

**ఇలగలవీళ్ళుసూడ మనమేటికిఁ బోవలెఁ బోయినన్ వనిన్**
**నిలువఁబనేమి? నిల్చిన మునింగని త్రుళ్ళఁగనేల? యంతలో**
**నలిగి శపింపనేమిటికి నాతఁడు? వ్రాతఫలంబుతప్పునే**
**కలిగినవే కదా మకరికల్ మనకెప్పుడు వ్రాసియుండుటల్** 2 - 59

మునిశాపహత లైన యచ్చరలు విలపించు ఘట్టము నందలిదీపద్యము. ముని వారిని మకరికలు గమ్మని శపించి వారిత్రుళ్ళడంగించెను. మకరికలనగా మకరికాది పత్రములు, మకరికలు వ్రాసియుండుట విలాసవతులైనవారికంతకుఁ బూర్వమున్నదియే. ఇప్పుడు భగవంతుడు వ్రాసినవ్రాతయు మకరికలు గమ్మనియే. అర్థమునందు మాత్రమే భేదమున్నది. మకరికాలిపి వారికున్నందున మకరికాత్వము కలిగినదని యిందలి చమత్కారము.

ప్రపంచమున నడుమంత్రపుసిరి వచ్చినవాడు నిక్కుటయు నీల్గుటయు విఱ్ఱవీగుటయు సహజము, గదుఁడు సుభద్రను వర్ణించు సందర్భమునఁ గవి యీ విషయమును బురస్కరించుకొని అద్భుతమైన యర్థాంతరన్యాసము సంఘటించెను.

**అతివకుచంబులున్ మెఱుఁగుటారును వేనలియున్ ధరాధిపో**
**న్నతియు నహీనభూతి కలనంబు ఘనాభ్యుదయంబు నిప్పుడొం**
**దితి మని మాటిమాటికిని నిక్కెడు నీల్గెడువిఱ్ఱవీగెడున్**
**క్షితినిటుగాదె యొక్కొకరికిన్ నడుమంత్రపుఁ గల్మికల్గినన్** 1 – 34

కుచంబులును, మెఱుఁగుటారును, వేనలియు యువతులకు యౌవన ప్రాదుర్భావము కలుగఁగానే యబ్బునభ్యుదయ విశేషములు. అవి క్రమముగా నిక్కి, నీల్గి విఱ్ఱవీగుచుండును. బాల్యమున నుండక యౌవనముతో వచ్చిన వగుటచే నవివారికి నడుమంత్రపు సంపదలు. ధరాధిపోన్నతి, అహీనభూతి విభవము, ఘనాభ్యుదయము అనువానియందలి శ్లేష యీయర్థాంతర న్యాసమునకు మఱింత మెఱుఁగు చేకూర్చుచున్నది.

కవులెంత రసవంతముగాఁ గావ్యములు రచించినను సమకాలము వారందలి రంధ్రములనె యన్వేషింతురు గాని గుణములగ్రహించి ప్రశంసింపరు. ఎవ్వరో మహాభాగ్యశాలులైన వారికి మాత్రమే సమకాలము వారిచేఁ గూడ మెప్పువడయు సుకృతము లభించును. అసాధారణరచనావిలాససంపన్నుడయ్యు వేంకటకవి కూడఁ దనకాలము వారిచే ననుకొన్నంత మెప్పునొందఁడాయెనుగాఁబోలును! మనస్సును వేధించు నావిషయమును సూచించుచుఁ జిత్రాంగదా విరహవేదనాదోదూయమానుఁడై ధనంజయుండు పొగులు సందర్భమున నతఁడు వసంత నిశావేళను వర్ణించు మిషతో నీ పద్యమును రచించెను.

**క్షితిపయి వట్టిమ్రాకులు చిగిర్చివసంతుఁడు తా రసోపగుం**
**భితపదవాసనల్ నెఱప మెచ్చక చంద్రుఁడు మిన్నునంబ్రస**
**న్నతయును సౌకుమార్యము కనంబడ ఱాల్గరగంగఁజేసె నే**
**గతిరచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా !** 1 – 145

ఇట వసంతుఁ డాచరించిన కార్యమును జూచి మెచ్చక చంద్రుడంతకంటెను మిన్నయైన పనినాచరించెనని తెలియుచున్నది. వసంతుఁడు వట్టిమ్రాకులఁ జిగురింప జేయఁగాఁ జంద్రుఁడు ఱాలనే కరగంగఁ జేసెను. రసోపగుంభిత పదవాసనల్ నెఱపుట, ప్రసన్నతా సౌకుమార్యములఁ గనంబఱచుట అనువానికి కవిపరమైన యర్థము కూడ వ్యక్తము చేయబడుచున్నది. వసంత చంద్రపదము లానాఁటి కవులకెవరికో సంకేతములై యుండును. పరిశోధన చేసిన వారెవ్వరో కనుఁగొనవలయును. అప్పుడీపద్యము వెల్వఱుచు చమత్కారము మఱింత విశిష్టమై యలరారును.

వేంకటకవి యుపమానములు చాలచోట్లఁ గడుంగడు మనోహరములై వర్ణ్యవస్తువును సంపూర్ణస్వరూపముతో సాక్షాత్కరింప జేయుచుండును. ఇట్టి చక్కనియుపమానములు విజయ విలాసమున నసంఖ్యాకములుగా నున్నవి.

**ఆ ఘనునిఁబాసి మంజీ**
**రాఘోషము మెరయ నరిగె నంతఃపురికిన్**
**వే ఘనజఘన తళుక్కున**
**మేఘము నెడబాసి చనెడి మెఱుపో యనఁగన్** 2 - 201

ఇటకఱ్ఱియైన యర్జునుని మేఘము తోడను సౌందర్య శోభితయైన సుభద్రను మెఱుపుతోడను బోల్చుట యెంతయు నౌచిత్యభాసురమై యొప్పారుచున్నది.

సుభద్రావివాహసందర్భమునఁ దెరవలు తెరవంపగా సుభద్ర నగుమొగము శరన్మేఘముఁనెడబాసి వెలుంగు చంద్రబింబమువోలెఁ గనఁబడె ననుటయుఁ బైదానివలెనే మిక్కిలి సుందరముగానున్నది. అర్జునుఁడును సుభద్రయు వివాహానంతరము బంగారు పీటమీదఁ గూర్చుండిన సందర్భమున వేంకటకవి సుభద్ర నిట్లు వర్ణించెను.

**మృగమదము చెంతఁగుంకుమ రేఖవోలె**
**నీలమణిపొంత నుదిరి పొన్రేకువోలె**
**మేఘము కుఱంగటను దీగమెఱుపు వోలె**
**నర్జునుని చెంగట సుభద్ర యలరెనపుడు** 3 - 118

ఇందు మృగమదాదులు మూఁడును నల్లనివి. కుంకుమరేఖాదులు మంచివన్నె కలవి. సుభద్రార్జునుల కిచ్చుట వాడఁబడిన యుపమానములు మిక్కిలి సహజములును సుందరములునై యలరారుచున్నవి.

సాధారణముగా గవులుపమాలంకారముల వాడునపుడు సమాన ధర్మములను బాఠకుల యూహలకు విడిచివేయుచుందురు. వేంకటకవియట్లుగాక కొన్నిచోట్ల నా సమానధర్మములను గూడఁబూర్తిగా వివరించి యుపమానములను సమగ్రమూర్తులుగా సంతరించును.

**ఆ దరహాసచంద్రికల యందము నాప్తులమీదఁ జిల్కు న**
**త్యాదర శీతలేక్షణ సుధారసధారయుఁ జూడఁజూడ నా**
**హ్లాదముగొల్పఁగాఁ గల కలామహిమంబుఁ దలంచి చూచినన్**
**మాదిరిసేయవచ్చు జననాథుమొగంబును జంద్రబింబమున్** 1 - 68

ఇందుఁ జంద్రబింబమునకును నర్జునుని మొగమునకును గల యౌపమ్యము పూర్తిగా వివరింపబడినది.

**అమృతమొలుకు నధరంబున**
**గుముదచకోరముల నేలుకొను శుభదృష్టిన్**
**గమలములు కళలు గైకొను**
**రమణీమణి ముఖము తెలిచి రాజనవలయున్** 3 - 114

ఇచ్చట నుపమానోపమేయములకుఁ దాత్పర్య భేదముచే సమానధర్మము నిరూపింపఁ బడినది. ఇట్టి సంపూర్ణోపమాలంకారములు విజయ విలాసమున నింకను బెక్కులుగలవు.

వేంకటకవి క్రమాలంకారమును వాడు పద్ధతి విచిత్రముగా నుండును. పద్యమున ముందు వస్తువులను వర్ణించి తరువాతఁ గ్రమముగా దత్క్రియలఁ దెల్పి పిమ్మటఁ దన్నిహిత ములైన విశేషములఁ బేర్కొనును. విస్తరభీతిచే నొక్కటే యుదాహరణ మొసంగెదను.

**తడబాటుగలదు వేదముల నాతనికంచు**
**పరమేష్ఠిమెచ్చరు ధరణి సురులు**
**కడమాటు పగవాఁనిగని చేమరచెనంచు**
**భార్గవుమెచ్చరు బాహుజనులు**
**పనికిరాకొక మూలఁబడియె నాతనివస్తు**
**వని కుబేరునిమెచ్చ రార్యజనులు**
**వీటిపాటైన నాగేటిపాటున నేమి**
**యని హలాయుధు మెచ్చరంఘ్రి భవులు**

**పాడిదప్పక, ధర్మంబు పట్టువిడక**
**లక్షలకు నమ్మజాలి, నల్గడలభూమి**
**వరులుమేలనఁదగి యిట్లుపురిబొలుతురు**
**చదువుసాముల ధనధాన్య సంపదలను** 1 - 4

గీతమునందలి మొదటి మూఁడు పాదములును బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రుల కందఱికిని సమానముగను బ్రత్యేకముగనుగూడ నన్వయించును. చివరిపాదము క్రమముగా వారికిఁగల సంపద్విశేషములఁ దెల్పును. ఇంక నద్భుతములైన భావకల్పనలతోఁ గూడిన యుత్ప్రేక్షలును నతిశయోక్తులును విజయవిలాసమున జాలగలవు. అవి యితర ప్రబంధ సామాన్యములగుటచే వాని నిక్కడ వివరింపఁబూనను. కాని వేంకటకవి భావౌన్నత్యమును సూచించుటకు రెండుపద్యము లుద్ధరించెదను. ఈతనిభావము లుదాత్తములును జమత్కార సంపూర్ణములు నైయుండి, యెంతో మెచ్చుగొల్పుచుండును.

**పున్నమరేలఁ దత్పురము పొంతనె పో శిఖరాళిదాఁకి వి**
**చ్ఛిన్నగతిన్ సుధారసముచింది పయిం దిగువార సంతనుం**
**డిన్నెల సన్నగిల్లు నది నిక్కము గాదనిరేని యాపదా**
**ర్వన్నె పసిండిమేడలకు రాఁబని యేమిల సౌధనామముల్** 1 - 7

**విరహిణులంగలంపఁగల వీరులు వీరని తమ్ముఁజేర న**
**య్యురుకుచ వాలుఁజూపులకు నోడుట నంకముకాగ మీనమున్**

**హరిణము, నట్లచే తమశరాంశులునోడె నొ! గాకబాలికన్**
**గరఁపగరాదె యేలననుఁ గ్రాచెదరీ మకరైణలాంఛనుల్** 3 - 9

వేంకటకవి విజయవిలాసమునఁ దాను గల్పించిన చమత్కారమును రచించిన పద్యములందలి విశేషములను గొన్ని యెడలఁదానే దిఙ్మాత్రముగా సూచించుచుండును. ఆ సూచలను బట్టి వెనుకకుఁబోయి పరిశీలించినచో యందలి విశేషములు సువ్యక్తములగును. "సహకారాళి పదంబుజూడగ వయస్యాహాళి యౌనేకదా" యను పద్యమునకు తరువాత వేంకటకవి యా యచ్చరలు "అవియితరేతర చతురోక్తిని గుంభనమెఱయనరిగి"రని సూచించెను. ఇది చూచిన పిమ్మటనే పై పద్యమునందలి యితరేతర చమత్కారోక్తి నిగుంభన తేటతెల్లమగును. చెలికత్తెలు సుభద్రకు శిశిరోపచారములొనర్చి మదనమలయానిల చంద్రకోకిలాదుల నుపాలంభింపఁ దొడంగిరి. ఈయుపాలంభమున బహూకార, వికార, మమకార, చమత్కారములు కలవని వేంకటకవియే సూచించెను. అచ్చుటఁగల పదునారు పద్యములను బరిశీలించి చూచినచో నందలి బహూకారాదులు వ్యక్తములగును.

**చక్కనివారిలో మిగులఁ జక్కనివాఁడవుగాన నీకెనౌ**
**చక్కని వారిఁజంద్రుని వసంతునిఁ గూరుచుకొంటి వందమౌ**
**జక్కెరవింటిరాజ! యెకసక్కెమదేమని కూర్చుకొంటివ**
**మ్మక్క! యరూపకంబయిన యాయెలదెమ్మర నాలిబూతమున్** 3 - 45

ఇందు బహూకార వికారములు నిండియున్నవి.

**చక్కెరవింటిరాజు నగచాపునితో నెదిరించి పడ్డనాఁ**
**డెక్కడనుంటివీవు? మధుఁడెక్కడనుండెను? మందమారుతం**
**బెక్కడనుండె? సిగ్గుపడరే? మిపుడాతఁ దదృష్టరేఖచే**
**రక్కొని క్రమ్మఱన్ బ్రతికిరాఁగ వజీర్లయినారుగా శశీ!** 3 - 54

ఇందలి వికారము సువ్యక్తమే.

**మాకలకంఠియు నీవును**
**నేకగ్రీవముగ నుందురిన్నాళ్ళు నయో!**
**కోకిల! యిపుడేలలఁచెదు?**
**నీకగునే యిగురుఁబోఁడి నెత్తురుద్రావన్?** 3 - 55

**రాచిలుకా! కోమలిదెసఁ**
**జూచితె! శ్రుతికటువులనెడు శుకనామము మీ**

**కేచాడ్పునఁదగు? వల; దిక**
**మాచెలి గెరలించితేని మాటలువచ్చున్** 3 – 58

ఈ రెండు పద్యములలో మమకార చమత్కారములు కానవచ్చుచున్నవి. అసలు విజయవిలాసమునందలి పద్యములలోఁ జమత్కారములేనిదే లేదుగదా!

శ్రవ్యకావ్యములందు సైత మొక్కొక్కప్పుడు దృశ్యకావ్యోచితములైన సరణులు కానవచ్చుచుండును. ఇరువురు పాత్రలు సంభాషించు నప్పుడందొకరి మాటలు ధ్వని గర్భితములై యర్థద్వయమున కాకరములుగా నుండును. రెండవవారాయర్థద్వయము నందుఁగల సామాన్యార్థమును మాత్రమే గ్రహింప జాలియుండఁ బాఠకులకును సామాజికులకును విశేషార్థము స్ఫురించి చమత్కారము కలిగించుచుండును. ఇట్టి చమత్కారమును నాటకీయ చమత్కృతియందురు(Dramatic Irony). ద్వితీయాశ్వా సాంతమున సుభద్ర యతిరూపుఁడైన యర్జునుని నర్జునుని గూర్చియడుగ నాతఁడిచ్చు ప్రతి వచనములందిట్టి చమత్కృతి పుష్కలముగాఁ గానవచ్చుచున్నది.

**కోమలియాగతిన్ మదిఁదగుల్వడఁ బల్కిన నవ్వి నిర్జర**
**గ్రామణిసూను మీరెచటఁగంటిరొ యంటివి కన్నమాత్రమే**
**యేమనిచెప్పవచ్చు నొకయించుక భేదములేక యాయనే**
**మేమయి యున్నవారము సుమీ వికచాంబుజపత్రలోచనా!** 2 – 168

ఆయనయే మేమయియున్నవారము సుమీ యన్న వాక్యము నందలి యాథార్థ్యము నెఱింగిన వారగుటచే నీ పద్యమును జదువునప్పుడు పాఠకులు పొందు చమత్కార జనితానందమునకు మేరయుండదు. సంస్కృతనాటకము లందుఁగవులు తఱుచుగాఁ బాత్రలసంభాషణముద్వారా భావ్యర్థములను సూచించుచుందురు. ఆ సంభాషణమప్పటికి సామాన్యముగానే గోచరించినను గ్రమక్రమముగా నందలి భావ్యర్థతత్వము వ్యక్తమగుచుండును. వేంకటకవియు విజయవిలాసఁమున నుపమానాదులచే భావ్యర్థములనుఁ జక్కగా సూచించు చుండును. అర్జునుఁడు విశారదాదులచే ననుగతుఁడై తీర్థయాత్ర కరుగ, బోవునప్పుడాతడు పరిణయమౌట కేగుగతి నరిగె నని కవి సూచించి యుండెను. కావ్యాంతమున నొక్కసారి సింహావలోకమునచేసి చూచినచో నాతఁడు తీర్థయాత్రాచరణము నెపమునఁ బరిణయమౌటకే యేగెనని తెలియవచ్చును. శాపవిముక్తులైన నందాదు లర్జునునిఁ బొగడి

**నీకుఁ గళ్యాణమౌ రమణీయరూప**
**నీకు వంశాభివృద్ధియౌ నృపకలాప**
**నీకు జయమగు సాహస నీతిభరిత**
**నీకు సామ్రాజ్యమౌ మహనీయరూప** 2 – 75

యని శుభోదర్కంబు గాన్పింప దీవించిరి. ఇది ఇప్పటికి సామాన్యాశీర్వచనము వలెనే గోచరించును. కాని యిది భావ్యర్థనిర్భరమైన యథార్థవచనము. ఏలయన నర్జునుఁడు ముందు సుభద్రను పెండ్లియాడి యాదవులనోడించి వంశవీరుఁడైన కుమారునిఁబడసి, సామ్రాజ్య సౌఖ్యములనంది యలరారుచున్నాఁడు. ముందుకాఁబోవు నీవిషయములనే వారి యాశీర్వచ నము సూచించుచున్నది.

ఇంద్రప్రస్థమున వివాహమహోత్సవము ముగిసినపిమ్మట సుభద్రార్జునులు కృష్ణుఁ నకు నమస్కరింపఁగా నాతఁడు లేనగవు గ్రమ్మ "మీరిటు లెల్ల కాలమున్ మింతురుగాక శోభనముమీదనె శోభనమై ముదంబుగన్" అని దీవించెను. ఇది ద్వారక నంతకుముందుజరిగిన వివాహమంగళములేకాక ముందుజరుగఁబోవు శోభనమును గూఁడ చక్కగా సూచించుచున్నది.

వేంకటకవి సుభద్రముఖసౌందర్యమును వర్ణించుచు

**స్వకపోలకల్పిత మనో**
**జ్ఞకళాగతి కెట్టులౌను సరిఛాయా చో**
**రకరుచి సందర్భంబని**
**ముకురమునగుఁ కరణి నవ్వుమోము చెలంగన్** 3 - 91

అని వర్ణించెను. ఇందలి యొకయర్థము సుభద్ర ముఖసౌందర్యమునకు సంబంధించినది. రెండవది కావ్యమునకు సంబంధించినది. స్వబుద్ధిచే కల్పింపఁబడిన సుందరమైన కళా సరణిగల కావ్యమునకుఁ బరకావ్య భావాదికములను దొలంగించి మెఱుఁ గు కూర్చుకొనుపద్ధతి యెట్టులీడగునని యీసందర్భమున స్ఫురించునర్థము. దీనిని బట్టి వేంకటకవికిఁ గావ్యభావాదిక ములయెడఁగల నభిప్రాయము వ్యక్తమగుచున్నది.

వేంకటకవి సంస్కృతాంధ్రపదములను రెంటిని సమముగానే వాడెను. ఎచ్చటనోకాని యతి దీర్ఘ సమాసఘటనమునకుఁ బూనఁడు. తెలుగుపదముల కూర్పులో నింతనైపుణ్యమును, జమత్కారమును బ్రదర్శించినకవి యింకొకఁడు లేఁడు. లలితమధురములు, సాభిప్రాయములు నైన యలఁతి పదములతోడనే యాతడు గంభీరములైన యర్థముల వివరించుచుండును. పద్యముల నడక యెచ్చటను గుంటక మకరందప్రవాహమువలె సాగిపోవును. ఒక్క చోటఁ గూడ శ్రుతికటువైనశబ్దము కనఁబడదు. భాషయెల్లెడ సరసమై జాతీయమై సుబోధమై యలరారుచుండును. పద్యములలో మచ్చునకైన వ్యర్థపదమొక్కటియు గానరాదు. పద్యరచన విషయమున నాతఁడు చేసిన సాధన ప్రశంసనీయమును ననన్యసాధ్యమునై యెంతో మెచ్చుగొల్పుచుండును.

వేంకటకవి విజయవిలాసమున సుందరములైన జాతీయములను, సామెతలను సందర్భోచితముగా, బెక్కుచోట్ల వాడియుండెను. అవి యాతని లోకజ్ఞతను నౌచిత్యపరిజ్ఞాన మును లెస్సఁగాఁ బ్రకటించుచున్నవి.

**శివుడిటు రమ్మటంచు దయచేసినచోఁ దలకెక్కి తుగ్రవై**
**భవమునఁ జూచుచో నడుగువట్టితి వేమనవచ్చు నీ గుణం**
**బవునవు నందినన్ సిగయు నందకయున్నను గాళ్లు పట్టుకొం**
**దువు హరిణాంక! వేలకొలఁదుల్గద నీనడకల్ దలంపఁగన్.** 3 – 51

**వేగునంతకు వలవంత వేగునంత**
**నంతిపురమునఁ బ్రమద వనాంతరమునఁ**
**గృష్ణ కృష్ణా యటంచు నా కీరవాణి**
**రామ రామా! యటంచు నా రాజసుతుఁడు.** 3 – 25

**చేసె జప మతఁడు కడు వి**
**శ్వాసము చెలిచూపు బేడిసలపై నిగుడన్**
**జేసిన యదిజపమున్ మఱి**
**వేసినయది గాల మనుట వృథ గాకుండన్** 2 – 135

మున్నగునవిందుకు దృష్టాంతములు. పైవానియందలి శ్లేష ధ్వని చమత్కారముల బరిశీలించినచో సామాన్యములైన సామెతలనే యాత డెంతభావగర్భితములైన వానిఁగా సంతరించెనో తెలియవచ్చును. "న దుఃఖం పంచభిస్సహ" యను సంస్కృత లోకోక్తినిగూడ నీతఁడు నందాదుల వృత్తాంతములో నొక్కచోఁ జక్కగా నిమిడించియుండెను. దిసంతులడఁచు, వలపు వడ్డికిఁబాఱు, తెఱచిరాజను మున్నగు జాతీయప్రయోగములు విజయ విలాసమున నంతటను లెక్కకు మిక్కిలిగాఁ గనవచ్చును. కావ్యమునందలి యేపద్యము నెత్తి చూపినను సందర్భోచితముగాఁ జేయఁబడి యిట్టి జాతీయ ప్రయోగములొండో రెండో యెదురుపడుచునే యుండును.

వేంకటకవి చెప్పఁదగిన వచనములను మూఁడాశ్వాసములలో మూఁడింటిని రచించెను. ఇవి యనుప్రాస యమకాదులతోడను దీర్ఘ సంస్కృత సమాసములతోడను గూడి ప్రౌఢములై సర్వప్రబంధ వచనసామాన్యములుగా నున్నవి. ఇందు రెండు కొంచెము దీర్ఘతరములైనవి. ఈ రెండును వర్ణన కొఱకుపయోగింపఁబడినవే. మొదటిది యర్జునుఁడు దర్శించిన పుణ్యక్షేత్రములను, రెండవది యాదవ పరాజయానంతరము సుభద్రార్జునులు కావించిన ప్రయాణమును వర్ణించుచున్నవి. మూఁడవది ద్వితీయాశ్వాసమున నున్నది. యతి యర్జునుఁడేయని యెఱింగినపిమ్మట సుభద్ర వ్రీడాపరవశయై యాతని విడిచిపోయిన సందర్భమున నిది వ్రాయబడినది. ఇందుఁ గవి సుభద్ర సిగ్గుతోఁ జెలులనరయు నెపంబునఁ బరాకు చేసికొని సవిలాసముగా నరిగిన వైఖరిని జక్కఁగా వర్ణించియుండెను.

విజయవిలాసమున వ్యాకరణవిశేషములు కొన్ని కానవచ్చుచున్నవి. వానిలోఁ గ్వార్థకీకారములకు సంధిచేయుటఁ అడిగిచ్చునొ, అటుచూపిటుచూపటు అనవలసంటి,

పట్టాడించు, షష్ఠీసమాసమున నుత్తున కచ్చు పరమైనపుడు నుగాగమము చేయకుండుటఁ మొగమందము, స్త్రీవాచకముల యత్తునకు సంధిచేయుటఁ ఈ బిడౌరు మున్నగునవి ముఖ్యములైనవి. ఇందుఁ గొన్ని యమకాదుల నిమిత్తమై యేర్పడినట్టివి. ఇవికాక సిగ్గుకుఁ వాదుకు మున్నగు నుగాగమమురాని ప్రయోగములును, ఆత్మనే పదార్థకమైన కొను నకు క యని, పాడిన (ఊదుక పోవు) వంటి ప్రయోగములును, అచ్చునకు లోపముకలిగించి సంశ్లేషము సంఘటించిన చాల్నిలు వంటి ప్రయోగములును గలవు. కవిత్రయేతర కావ్యములందిట్టి ప్రయోగములు లేకపోలేదు. మఱియు జీవద్భాషలందుఁ గాలక్రమమున నిట్టి మార్పులువచ్చుటలో నాశ్చర్యమును లేదు. ఇట్టివైనను విజయవిలాసమున మొత్తము పది పండ్రెండుకంటె హెచ్చు లేవు. సుకవి ప్రయుక్తములైన యిట్టిప్రయోగముల నారసి యట్టివానికి సూత్రములు కల్పింపకపోవుట వ్యాకరణకారుల లోపమేకాని కవుల లోపముకాదు.

వేంకటకవి శబ్దాలంకార ప్రీతికలఁవాఁడని మొదలే విన్నవించితిని. మన పూర్వ లాక్షణికులు కొందఱును, గొందఱు పాశ్చాత్య విమర్శకులును శబ్ద చిత్రములతోఁగూడిన కావ్యముల నుత్తమ కావ్యములుగాఁ బరిగణించియుండలేదు. కావ్యములు రసధ్వని ప్రధానములైనవి. శబ్దాలంకారములను ఆమాత్రముగా వాడినచో నొక్కొక్కప్పుడు రసపోషణమున కంతరాయము సంభవించును. ఇట్లుగాక వాడినశబ్దాలంకారములచే రసమునకుఁగాని యౌచిత్యమునకుఁగాని యెయ్యెడను భంగము వాటిల్లకుండ నొక్కొక్కచోట మెఱుఁగెక్కించు కవుల నుత్తములుగాఁ బరిగణించుచో దోషముండదు. శబ్దాలంకారముల వాడినంత మాత్రమున నేకవియైన నధముఁడగుననుటలో సామంజస్యములేదు. అతఁడా యలంకారమునకు రసాదులను బలియొసంగుచో నప్పుడాతని కావ్యమును నిరసింపవచ్చును. రసాదిపోషణముతోపాటు శబ్దాలంకార ప్రయోగమునుగూడఁ జక్కఁగాఁజేయ నేర్చు కవిశేముషీవిభవమును మఱింత మెచ్చుకొనవలయును. ఆంధ్రవాఙ్మయమున నిట్టి మహాకవులిర్వురు కలరు. ఒక్కడు రామరాజభూషణుఁడు, రెండవవాఁడు వేంకటరాజు.

